# మన లిపి
# పుట్టు పూర్వోత్తరాలు



తిరుమల రామచంద్ర

# మన లిపి
# పుట్టు పూర్వోత్తరాలు

డా॥ తిరుమల రామచంద్ర, డి.లిట్.,



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1388

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబరు, 1957

పరివర్ధిత ద్వితీయ ముద్రణ : ఏప్రిల్, 1990



టైటిల్ డిజైను : గోపి

వెల : రూ॥ 35/-

ప్రతులకు : *విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్*
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

*విశాలాంధ్ర బుక్ హౌస్*
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

**ISBN** : 81-7098-167-0

---

ముద్రణ : హైదరాబాద్ ప్రింటర్స్,
హబ్సిగూడ, హైదరాబాద్ - 500 007.
ఫోన్ : 852228

అంకితం

శాసన పరిశోధనే జీవితమైన

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారికి

ఆగ్నేయ ఆసియా ప్రజలకు అక్షరభిక్ష పెట్టిన

విశాలాంధ్ర ప్రజాశక్తికి

# ద్వితీయ ముద్రణ

## మనవి మాటలు

మన లిపి పుట్టు పూర్వోత్తరాలు ద్వితీయ ముద్రణ పొందుతున్నందుకు విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి, ముఖ్యంగా ఆ సంస్థ నిర్వాహకులు శ్రీ పి. రాజేశ్వరరావుగారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ఈ ముద్రణలో ఆయా అధ్యాయాలలో కొన్ని విషయాలు చేర్చాను. ఈ ముప్పైయేండ్లలోను భారతీయ భాషలలో లిపిని గురించిన గొప్ప గ్రంథం ఏదీ ప్రచురితం కాలేదు. కనుక ఈ గ్రంథం విషయంలో గర్వపడుతున్నాను. అప్పటికీ ఇప్పటికీ ఇదే నిర్దుంద్వం.

మొహంజొదడో, హరప్పా లిపులపై డాక్టర్ ఎస్.ఆర్. రావు మున్నగు వారు పరిశోధనలు జరిపినా, హరప్పా సంస్కృతి క్షేత్రాలు మరికొన్ని, తవ్వకాలలో వెలువడినా ఈ లిపికి, బ్రాహ్మీలిపికి గల సంబంధం ఎవరూ స్పష్టంగా నిర్ణయించలేదు. కనుక ఆవాదాలు ఈ ముద్రణలో చేర్చలేదు. నేను దానిని ప్రాకృత సంస్కృతి లిపిగా భావిస్తున్నాను.

రాష్ట్ర పురాతత్త్వ శాఖ నిర్దేశకులు, మహావిద్వాంసులు డాక్టర్ పి.వి. కృష్ణశాస్త్రిగారు నా కోరికను మన్నించి దీనికి ముందుమాట దయచేసి నందుకు కృతజ్ఞత తెలియజేస్తున్నాను.

మరొకమారు విశాలాంధ్రకు కృతజ్ఞతతో:

1-4-880/19,
బరోడా బ్యాంక్ కాలనీ,
గాంధీనగర్,
హైదరాబాద్ - 380

భాషా సేవకుడు
**తిరుమల రామచంద్ర**

# ముందు మాట

ప్రపంచములో ఏదైన ఒక భాషకు స్వరూపము ఏర్పడటము మానవ చరిత్రలో ఎంత ముందంజ అనుకుంటున్నామో, దానికి లిపి తయారుచేయటము అంతకంటే ముఖ్యమైనది. తిరుమల రామచంద్రగారు చెప్పినట్లుగా వివిధ దేశాల లోని లిపులు వివిధ పరిస్థితులలో రూపము చెందాయి. అతి ప్రాచీన నాగరికత లయిన ఈజిప్టు, మెసపటోమియా, బాబిలోనియా, ఆస్ట్రేలియా మొదలయిన ప్రాంతాలలో వుపయోగించబడ్డ లిపులను విడదీసి చదవడము జరిగింది. దురదృష్టవశాత్తు అంతే ప్రాచీనమైన లేక అంతకంటే ప్రాచీనమైన సింధు నాగరికతలో వాడబడిన లిపికి నేటివరకు ముడివిప్పలేకపోయారు. గతంలో అనేక ప్రయత్నాలు జరిగినవి. అనేకమంది లిపివేత్తలు అహోరాత్రులు ప్రయత్నము చేశారు. తమకు తోచిన విధముగా వ్యాసాలు వ్రాశారు. పుస్తకాలు అచ్చొత్తించారు. కాని నేటివరకు అది అంధకారము నుంచి వెలుగులోకి రాలేదు.

సింధు నాగరికత రమారమి క్రీ. పూ. 3000 సంవత్సరముల నుండి క్రీ.పూ. 1700 మధ్యకాలంలో పరిఢవిల్లినదని మనకు తెలుసు. అంటే 13-14 వందల సంవత్సరముల కాలము సింధు లిపి వాడుకలో నున్నది. సింధు నాగరికత అవసానదశలో రమారమి క్రీ పూ. 2000-1500 సంవత్సరముల ప్రాంతములో ఆర్య నాగరికత విస్తరించింది సింధునాగరికతనాటి ఆచార వ్యవహారాలకు, ఆర్యుల సాంఘిక మతాచారాలకు చాలా తేడా వుంది. సింధు నాగరికతతో పోలిస్తే, ఆర్య నాగరికత సాకార వస్తుతత్త్వములో (materialistic) చాలా హీనంగా కనిపిస్తుంది సింధు నాగరికత నాటి భవనాలు, ఇటుక కట్టడాలు, విశాలమైన రహదారులు, భూగర్భపు మురుగుపారుదల కాలువలు, స్నానఘట్టాలు, వాపీకూపతటాకాలు, ఆర్యనాగరికతలో లేవు. అది ఒక పట్టణ వ్యవస్థయితే ఇది గ్రామ వ్యవస్థ. కాని సింధు నాగరికతనాటి వస్తు సంస్కృతి (material culture) నేటి వరకు ఎలా నిలిచిందో ఆర్యనాగరికత నాటి వాఙ్మయ సంస్కృతి అంతకంటే పటిష్ఠంగా నేటివరకు నిలిచింది. వేదాలు, ఉపనిషత్తుల కంటే పటిష్ఠమైన కట్టడాలు ఏమున్నవి!

ఈ రెండు వైవిధ్యంగల సంస్కృతులను పరిశీలించినట్లయితే ఒక విషయము తేటతెల్లమవుతుంది. అనాదినుంచి ఆర్యులకు లిపి నిషేధము కావచ్చు. వాఙ్మయంలో మహోన్నత శిఖరాలకు చేరిన ఆర్యులకు, ఒకలిపిని ఏర్పరచటము

కష్టమైనపని కాదు. పైగా సమకాలీనమయిన సింధులిపి ఉండనే వుంది. ఆ లిపిని ఆర్యులు ఎందుకు వుపయోగించలేదు? దీనికి కారణాలుఏమయివుంటాయో ఇప్పుడు ఆలోచిద్దాము. సింధు నాగరికత అంతరించిన చాలాకాలము వరకు ఆర్య నాగరికత ప్రారంభము కాలేదని అనుకుందాము. అప్పటికి ప్రజలలో సింధులిపి వాడుకలో అంతరించిపోయి వుండవచ్చు. ఒకవేళ సింధు నాగరికతను ఆర్యులే ధ్వంసము చేసి వుండవచ్చని "మార్టిమర్ వీలర్" అభిప్రాయాన్ని అంగీకరించి నట్లయితే ఈ రెండు సంస్కృతులు ఒకదానితో మరొకటి కొంతకాలము కలిసి వుండవచ్చు. ఋగ్వేదములోని ఒక శాఖ అయిన వశిష్ఠ ధర్మసూత్రాలను బట్టి వేదకాలములో లిపి వాడబడినట్లుగా తెలియుచున్నది. పాణిని అష్టాధ్యాయిలో కూడా లిపికార (వ్రాతకాడు) అనే పదము వున్నది. వేదాలలో అక్షర, కాండ, పటల, గ్రంథ అనే పదాలున్నవి. మనదేశములో రమారమి లిపికి 2500 సంవత్సరముల చరిత్ర వున్నప్పటికీ, నోటి మాటకున్న ప్రాధన్యం వ్రాతకు లేదు. మతపరమైన గ్రంథాలలో ఉచ్చారణకే ప్రాధాన్యముగాని వ్రాతకు ప్రాధాన్యం లేదు. వేదాలు, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు,అనాదిగా వస్తున్న గురు శిష్య పరంపరాగతంగా మనవరకు వచ్చాయి. వేదవాఙ్మయాన్ని వ్రాస్తే తప్పులు వస్తాయని మన ప్రాచీనులకు భయము ఉచ్చారణలో తప్పులు వస్తే గురువుగారు శిష్యుని తిట్టో, కొట్టో, మందలించో స్వచ్ఛమైన ఉచ్చారణ చేయించేవాడు. కాని వ్రాసిన పుస్తకములో తప్పుంటే తరతరాలుగా ఆ తప్పునే చదువుతారు. ఉచ్చారణలో స్వచ్ఛత, పవిత్రత లేకపోతే మన దేవుళ్ళు పలకరు. అందుకే కాబోలు బ్రాహ్మణులు కాక వేదాలు మరెవరయినా పల్లిస్తే నోట్లో సీసము కరిగించి పోయమని మనువు ఆదేశించాడు. ఇది కులద్వేషంతో అన్నమాటకాదు. అంతేకాని తప్పుగా వ్రాసినవాడిచేయి నిప్పులో పెట్టమనో, నరకమనో చెప్ప లేదు. ఇంగ్లీషులో లిటరేచర్ అనే పదం అక్షరాస్యతను సూచిస్తుంది. అంటే వాళ్ళు అక్షరాలకు ప్రాధాన్యం ఇస్తే మనవాళ్లు. వాఙ్మయానికి ప్రాధాన్యం ఇచ్చారు. వాఙ్మయం అంటే వాక్కుమయం, కాని అక్షరమయం కాదు. మన వాఙ్మయం అంతా సరస్వతీ ముఖంగా వెలువడింది. ముఖస్థ విద్యకే ప్రాధాన్యం వుంది కాని, వ్రాతవిద్యకు లేదు. మనవారు వ్రాసేపద్యాలు, గద్యాలు కంఠభూషణాలుగా చెప్పబడ్డాయి. ఈ పరిస్థితి చూసి 'బూలర్' మహాశయుడు హైందవ శాస్త్రాలు, కవిత్వము వ్రాత తెలిసిన కాలమునుంచి వస్తున్నాయని అభిప్రాయము వెలి బుచ్చాడు. బౌద్ధ వాఙ్మయంలో అనేకచోట్ల లిపికి నిదర్శనాలున్నాయి. లేఖ

అంటే వ్రాత, లేఖక అంటే వ్రాతగాడు అనే పదాలు బిక్కు పాచిత్య అనే గ్రంథములో కనిపిస్తాయి. బౌద్ధంలో విద్యలో లిపి ఒక భాగముగా వర్ణింప బడినది. జాతక కథలలో ఆంతరంగిక, అధికారిక అను రెండురకాల ఉత్తరాలు చెప్పబడ్డాయి. వినయ పిటకంలోనూ, మధ్యమ నికాయంలోనూ ఆక్షరిక అనే ఆట వున్నది. ఈ ఆటలో ఆకాశంలో అక్షరాలు చదివించేవారు. మహా వగ్గ జాతకములో చెక్కతో చేయబడ్డ పలకను వాడినట్లుగా తెలుస్తుంది. చెక్కకలాన్ని వర్ణక అని వాడారు. అంటే వర్ణాలు వ్రాయడానికి ఉపయోగించిన సూదిమొన కలిగిన కలము. ఆ కాలమునాడు ప్రైమరి పాఠశాలలో లేఖన అంటే వ్రాయడము, గణన అంటే లెక్కించడము, రూపన అంటే బొమ్మలు వేయడము నేర్పేవారు.

సింధు నాగరికతకు సమకాలీనంగానీ లేక అవసానదశలోనో ఆర్య నాగరికత విలసిల్లినదని పైన చెప్పుకున్నాము. ఈ రెంటికి సమకాలీనముగా కొత్త రాతియుగము నాగరికత వుండేది. ఈ కాలములో చక్కగా అరగదీసిన నల్లరాతి గొడ్డళ్లు చేయడము, వీటితో అడవులను నరికి తగులబెట్టి వ్యవసాయము చేయడము వీరి ఆచారము. మానవచరిత్రలో ఈ సంస్కృతి ఒక మైలురాయి. ఎందుకంటే అంతకు ముందున్న ఆహారం పోగుచేసే స్థితి నుంచి పండించే స్థితికి మానవుడు వచ్చాడు. వ్యవసాయానికి కావలసిన పశుసంపదను పెంచడము కూడా ఆచారమయినది.

రమారమి క్రీ.పూ. 1500 సంవత్సరము ప్రాంతములో బంగారాన్ని, రాగిని కరిగించి ఆభరణాలు చేసుకోవడము మొదలయింది. ఈ కొత్త రాతి యుగములో ఎక్కడా లిపికి ఆధారాలు లేవు. అలాగే క్రీ.పూ. 11 వ శతాబ్దము నుండి ప్రారంభమయిన లోహయుగమునాటి అనేక వందల సమాధులు దక్షిణ భారతదేశములో కనిపిస్తాయి. ముఖ్యంగా తెలంగాణాలోని ప్రతి జిల్లాలోనూ ఈ సమాధులున్నాయి. ఉత్తర భారతంలో ఇన్ని సమాధులు లేనప్పటికి ఇంచు మించుగా క్రీ.పూ. 11 వ శతాబ్దమునాటికి ఇనుముతో ఆయుధాలు తయారు చేయడము ప్రారంభమయినది. కొంతమంది పాశ్చాత్య చరిత్రకారులు ఈ సమాధులు ద్రావిడులు నిర్మించినవని వ్రాయడము చేత భారతీయ చరిత్రకారులు నేటికీ అదే నమ్ముతున్నారు.

ఈ ఇనుప యుగములో మనిషి చనిపోయిన తరువాత శవాన్ని ఎత్తైన వేదికమీద వుంచి కొన్ని రోజుల తరువాత కాకులు, గద్దలు తినగా మిగిలిన

ఎముకలను పోగుచేసి ఈ సమాధులలో పెట్టి ఖననము చేసేవారు.

ఋగ్వేదమునాటి ఆర్యులలో అనగ్నిదగ్ధ, అగ్నిదగ్ధ అను రెండు రకాల ఆచారాలుండేవి. అంటే మనిషి చనిపోయిన తరువాత ఖననము చేయడం లేక దహనము చేయడము. ఆర్యులకు ఖననము చేయడమే ముఖ్యమయిన ఆచారముగా కనిపిస్తుంది. తరువాత ఏ కారణముచేతనో దహనము చేయడము అలవాటయింది. ఋగ్వేదము 10వ మండలంలో యాగముచేసిన వ్యక్తి చనిపోతే ఆ యాగమునకు ఏ ఏ వస్తువులు వాడాడో అవన్నీ సమాధిలో వుంచి ఖననము చేసే ఆచారం ఉన్నట్లుగా తెలుస్తుంది.

ఈ లోహయుగమునాటి సమాధులు చాలాచోట్ల త్రవ్వడము జరిగింది. ఈ సమాధులలో చనిపోయినవాడు తాను బ్రతికున్న కాలములో వాడిన వస్తువు లన్నీ సమాధిలో పారవేయడము కనిపిస్తుంది. వ్రడంగి చనిపోతే అతడి పని ముట్లు, వ్యవసాయదారుడు పోతే అతడు వాడిన వ్యవసాయపు పనిముట్లు,యోధుడు పోతే యుద్ధంలో వాడిన శస్త్రాలు అంటే బాణాలు, శూలాలు, బరిసెలు వంటివి నిక్షిప్తము చేయడము వీరి అలవాటు. పైగా సమాధుల నిర్మాణము బట్టి తూర్పు పడమర, ఉత్తర దక్షిణ దిక్కులకు వీరు ప్రాధాన్యం ఇచ్చినట్లుగా తెలుస్తుంది.

నేటికి మనవాళ్ళు అపరకర్మతో చనిపోయినవాని ఆత్మకు, పితృ దేవత లకు ఆకలి దప్పులుంటాయని నమ్మకముతో పిండ ప్రదానాలు, తర్పణాలు ఎలా వదులుతున్నారో అదే విధంగా బృహచ్ఛిలాయుగంనాటివారు అనేక రకాల కుండలలో నీళ్లను, ఆహార పదార్థములను సమాధులలో వుంచేవారు. పైన చెప్పిన ఆధారాలనుబట్టి ఈ సమాధులు నిస్సందేహముగా ఆర్య నాగరికతకు చెందినవని చెప్పవచ్చు. సమాధుల చుట్టూ పెద్ద పెద్ద గుండ్రని బండరాళ్ళను చక్రాకార ముగా పెట్టడముచేత వీటిని బృహచ్ఛిలా యుగపు సమాధులని పిలుస్తారు. కొన్ని చోట్ల వీటిని రాక్షసి గుళ్ళు అని, వీరుల గుళ్ళని, పాండవుల గుళ్ళని అనడము కూడా పరిపాటి. ఆర్యుల నిత్యజీవితములో గుఱ్ఱానికి ఎంతో ప్రాధాన్యం వుండేది. దూర ప్రయాణము చేయడానికిగాని, వార్తలు పంపడానికి, రథాలు నడిపించడానికి, యుద్ధాలు చేయడానికి గుఱ్ఱము ఎంతగానో ఉపయోగపడేది. యుద్ధానికి వెళ్ళే సైన్యములో అశ్వబలానికి ప్రాముఖ్యమిచ్చేవారు. బ్రాహ్మణాల కాలమునాటికి (శతపథ, గోపథ) రాజులకు అశ్వమేధయాగము చేయడం ఆచార మైనది. అశ్వశాస్త్రాలు వ్రాయబడ్డాయి. అశ్వ శిక్షకులకు సంఘములో చాలా గౌరవముండేది. ఈ బృహచ్ఛిలా యుగమునాటి సమాధులలో అనేకచోట్ల రౌతుతో

పాటు గుఱ్ఱాలను కూడా ఖననముచేసినట్లు ఆధారాలున్నవి. గుఱ్ఱాలే కాదుగుఱ్ఱాలకు వాడిన కళ్లెములు, రౌతువాడిన రికాబులు (strirrup) చాలా దొరికినవి. చిన్న చిన్న నదులకు ఆనకట్టలు కట్టి పెద్దపెద్ద సరస్సులను నిర్మించారు. పంటలను పండించారు. దేశము సుభిక్షమయినది. అర్థబలము పెరిగినది. అంగబలము పెరిగినది. రానురాను వీరు నాణాలు ముద్రించడం ప్రారంభంచేశారు. అర్థ బలముతోపాటు రాజకీయబలము చేకూరింది. చుట్టుపట్ల చిన్న చిన్న బలహీన రాజ్యాలను కబళించి పెద్ద రాజ్యములు సమకూర్చుకున్నారు. అందే జనపదాలు పోయి రాజపదాలు ఏర్పడ్డాయి. ఉత్తరాదిన మగధ సామ్రాజ్యము, దక్షిణాదిన శాతవాహన సామ్రాజ్యము ఏర్పడ్డాయి. ఇది లోహయుగము నాటి అవసానదశ. మరి లోహయుగములో ఎక్కడా లిపివాడినట్లుగా ఇంతవరకు నిదర్శనాలు దొరకలేదు.

క్రీ. పూ. 4వ, శతాబ్దమువరకు అందే మౌర్య చక్రవర్తి, అశోకుడి కాలము వరకు లిపికి నిషేధమున్నట్లుగా తోస్తున్నది. ఈ నిషేధము ఎందుకున్నదని ప్రశ్న. అశోకుని శాసనాలు దేశమంతా వేయబడ్డాయి. ఈ శాసనాలలో ప్రాంతీయముగా వాడే అక్షరాలు కోకొల్లలుగా చేర్చబడ్డాయి. అందే అశోకుని ముందు కాలములో అనేక ప్రాంతములలో లిపి వున్నట్లే కదా! అశోకుడు భారతీయులకు అక్షర జ్ఞానము కలిగించాడని చెప్పడము సమంజసము కాదు. క్రీ.పూ. 6వ శతాబ్దమునాటి గౌతమబుద్ధుని కాలమునాటికి 64 లిపులు వున్నట్లుగా "లలిత విస్తర" గ్రంథముద్వారా తెలుస్తుంది. ఇవన్నీ ప్రాంతీయ లిపులై వుంటాయి. ఇక్కడ ఒక విషయాన్ని చెప్పుకోవాలి. వైదిక సంప్రదాయములోని అక్షర నిషేధాన్ని బౌద్ధులు తొలగించినట్లుగా తోస్తుంది. ఆర్యులు వైదిక మతాన్ని సంస్కృత భాషలో ప్రచారము చేస్తే, బౌద్ధులు ప్రాకృతములో చేశారు. సంస్కృతము దేవభాష. ప్రాకృతము ప్రజాభాష. ఈ కారణముచేతనే మౌర్య అశోకుడు బౌద్ధాన్ని లిపి ద్వారా ప్రచారము చేసివుండవచ్చు. మద్య నిషేధము తరువాత, ఊరూర, వీధివీధిలో పానశాలలు ఎలా వెలుస్తాయో అలాగే దేశమంతా అశోకుని శాసనాలు ప్రాకృత భాషలో వెలిశాయి. విపరీతమైన ప్రజాదరణ దొరికినది. ఒకప్రక్క వైదిక యజ్ఞయాగాదులతోనూ, ఒకప్రక్క ఆటవిక దేవతారాధనతోనూ, మరొకప్రక్క ఉపనిషదుద్యానంలో సాగే ఆత్మ పరమాత్మ చర్చలతోనూ సతమతమౌతున్న సంఘానికి బౌద్ధము ఒక కొత్త ఆకర్షణ అయింది ఇది ప్రజలయొక్క, ప్రజల కొరకు ప్రజలచేత ప్రవచించబడిన

మతము. బుద్ధుడు మానవ ఆకారంలోని మహాప్రవక్త. ఆయన ప్రవచనాలు సూటిగా ప్రజలకు తాకేవి. దీని తరువాత లిపి కథ తెలిసినదే.

శ్రీ తిరుమల రామచంద్రగారు సంస్కృతము, ప్రాకృత భాషలను మథనముచేసిన మహామనీషి. వైదిక బౌద్ధ వాఙ్మయాలని అధ్యయనము చేసి, లోతుపాతులు తెలుసుకున్న పండితుడు. వీటన్నిటికీమించి ఉదారులు, సహృదయులు, మానవతావాది. లిపి పుట్టు పూర్వోత్తరాలు వీరి కలంద్వారా చెప్పించడము ఎంతో సమంజసముగా వుంది. ఈ గ్రంథాన్ని గ్రాంథికములో వ్రాయకుండా వాడుక భాషలో వ్రాయడము మరొక విశేషము. ఈ గ్రంథములో విషయాలన్నీ రత్నాలవంటివి. ఎంతో శ్రమకోర్చి పోగుచేసిన సత్యాలు. ఇంతగా విషయసేకరణ చేయడం అందరికి సాధ్యపడదు. ఒక బరువైన, లోతైన, గంభీరమైన విషయాన్ని తేలిక భాషలో అందరికి అందుబాటులో చేయగలిగిన సామర్థ్యము శ్రీ రామచంద్రగారికే వున్నది బహుశ ఇది విశాలాంధ్ర ప్రచురణ కర్తల ప్రోద్బలము కావచ్చు. ఏదైన పుస్తకము వ్రాసినపుడు తీసుకున్న వస్తువు ఉదాత్తంగా వుండాలి. క్రమం తప్పకుండా వుండాలి. చదువరులకు ఆకర్షణీయంగా వుండాలి. ఈ లక్షణాలన్నీ ఈ పుస్తకంలో నెరవేరినవి. గ్రంథ కర్తలు శ్రీ తిరుమల రామచంద్రగారికి, ప్రచురణ కర్తలు విశాలాంధ్ర ప్రచురణాలయమునకు నా అభినందనలు.

వి. వి. కృష్ణశాస్త్రి
సంచాలకులు
పురావస్తు పరిశోధన మరియు ప్రదర్శన
శాలల శాఖ, గన్‌ఫౌండ్రి, హైద్రాబాదు.

# రెండు ప్రశంసలు

మన లిపి పుట్టు పూర్వోత్తరాలు ప్రథమ ముద్రణ చదివిన వెంటనే పలువురు హితులు తమ అభినందనలు తెలుపుతూ ఉత్తరాలు వ్రాశారు. వాటిలో రెండు మాత్రం ప్రచురిస్తున్నాను; వారు సమగ్రంగా చదివి సూచనలు చేశారు గనుక. ఈ రెండు ఉత్తరాలు రెండవ ముద్రణ పూర్తయిన పిదప దొరికాయి వెదకగా, వెదకగా. కనుక వాటిలోని సూచనలను పొందుపరచుకోలేకపోయాను.

**తి. రామచంద్ర**

1. **తిరుపతి**

**7-11-1957**

రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ

**చిరాయువు శ్రీమాన్** రామచంద్రునికి **చేయు** మంగళా **శాసనములు. ఉభయకుశలోపరి.**

నీవు విశ్వాసంతో పంపిన "మన లిపి పుట్టు పూర్వోత్తరాలు" చేరింది. ఒక ఊర్ధ్వంగా సాంతం చదివినాను. శ్రీ అన్న గారు కూడ[1] చదివిరి. ఎంతో ఆత్రంగా చదవవలెనని ఉండిన నా ఆశ పూర్ణంగా ఫలించింది. ఆదిమధ్యాంతంగా చదవవలెనని పురికొల్పిన గ్రంథం ఈ కొన్ని యేండ్లలో నా పాలికి ఇదొక్కటే. నీ ప్రయత్నంలోని లోతు, బుద్ధిలోని అర్జనం, విసుగులేని సంకల్ప శుద్ధి-ఇవి ఈ రచనలో పూర్తిగా ప్రతిఫలించినవి-ఫలించినవి. నీకు నా అనేక మంగళా శాసనములు.

చదువూ, వ్రాతా నేర్చిన వారికంతా అర్థం కావలెనన్న ఉద్దేశం గొప్పదే. కాని శైలి ఇంకా కొంత గంభీరంగా - శాస్త్రానికి తగినట్టుగా - ఉండి వుంటే మేలుగా ఉండేదనిపిస్తుంది.

మఱి కొన్ని సందేహాలు :

1) 154 (148) పు. 'సిద్ధం నమః' అంటే - సిద్ధునికి నమస్కారం- అని అర్థమెట్లు వస్తుంది? దీనికి రూపాంతరమో, అర్థాంతరమో ఏదో వుండ వలెనేమో!

---

1. శ్రీమాన్ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు, డిప్యూటీ కలెక్టర్, సుప్రసిద్ధ జ్యోతిర్వేత్త.

2) 157 (151) తెలుగు 'వడి'కి మూల రూపం అరవం 'వళి' అనుకుంటాను. మార్గమన్నమాట. లిఖించు అని అర్థమిచ్చే 'వరి' వ్రా గా తెలుగులో, వరి-బరి గా కన్నడంలోను మారింది.

3) 178 (170) అరబ్బులు అంకెలు మాత్రం ఎడమనుంచి కుడికే వ్రాస్తారన్నది వింతయే. కాని "అంకానాం వామతో గతిః" అన్న మన సనాతన సంప్రదాయమూ అంతే వింత గదా! అదెట్లు వచ్చింది?

4) 181 (173) హుళ్ళి, హుళక్కి - వీనితో పంక్తికేమైన సంబంధము కలదా? అసత్యము - శూన్యము అనే అర్థంలో.

5) 197 (189) పుస్తక భాండాగారాలలో 'సర్గ' అనునది వృక్ష సంబంధమైన దెట్లు?

పై వన్నీ చిల్లర విషయాలు. నీ పని చాలా గొప్పదనేది పునరుక్తి. ఐనా 'ప్రియే జనే నాస్తి పునరుక్తం' అన్న మాట జ్ఞప్తికి వస్తుంది.

నా సంతోషాన్ని, ఈతూరి సాహిత్య ఎకాడెమి వాళ్ళ 5000 బహుమతికి తగిన గ్రంథమిది యని సిఫారసు చేయడం మూలాన తృప్తి పరచుకొన్నాను. కాని, అది లభిస్తుందన్న నమ్మకం చాలదు. ఐనా నా హృదయానికి తృప్తి. కలిగిందంతే.

అంతా కుశలం. నీ ఆరోగ్యము చిరాయువుల ఆరోగ్యమును తెల్పుము.

ఇత్యాశిః.

2. రా. అ. కృ.

రాంభట్ల కృష్ణమూర్తి

బెజవాడ,
నవంబరు 3, 1957

శ్రీ బావగారికి

నమస్సులు.

మన లిపి పుట్టు పూర్వోత్తరాలును ఆమూలాగ్రం చదివాను. అడుగడుక్కి నాలో నేనే "వాహ్వా, మర్హబా" అనుకొన్నాను. దాన్ని గురించి ఈ పారశీక పదాలకన్నా మించిన మంచి తెలుగుపదాలేమున్నాయి చెప్పండి?

పోతే, గవ్వ మెరుగు పెట్టడం కోసం ఒకటి రెండు ఓన్న సూచనలున్నాయి.

ఒకటి : హిట్టైట్ భాషను ఇంతవరకు లిపి చదివారు కాని భాషనెవరూ కనిపెట్టలేదన్నారు. [41 (37) పు] అది సరికాదు. జెక్ ఆచార్యుడు ప్రొఫెసర్

చెం(డిక్ (హోజినీ హిట్టైటాలజీలో చాలా కృషి చేశాడు. కొన్ని శాసనాలను చదివి హిట్టైట్ వ్యాకరణాన్ని రాశాడు.

హిట్టైట్ భాష ఇండో-యూరోపియన్ కూటానికి చెందినదొకటి, సెమెటిక్ కూటానికి చెందిన దొకటి వున్నదని కనిపెట్టాడు. ఈయన తూర్పు యూరపు దేశ పండితుడు కాబట్టి పశ్చిమ ఐరోపా పండితులు ఈయన వాదానికి విలువ ఇవ్వలేదు. తర్వాత తర్వాత ఒప్పుకొనక తప్పలేదు. అందుకని హిట్టైట్ భాషకు కూడ వ్యాకరణం తెలిసింది.

అదికాక ఇటీవల ఒక సోవియట్ యువకుడు మెక్సికోలోని మయశాసనాలను కూడ చదివాడు. ఈ మయ శాసనాలు కూడ చిత్రలిపి జాతికి సంబంధించినవి.

ఇలాగ ఇంతవరకు భాష తెలియకుండా మిగిలిన లిపి అంటూ నేడు ఏదీ లేదు. పోతే, సమగ్ర భాషా రూపం అర్థం కాకపోవచ్చును. పనసపండు విప్పి పళ్ళేన పెట్టినట్లున్న మన నన్నెచోడుని కుమార సంభవంలోనే ఇంకా కొరుకుడు పడని కొన్ని ప్రయోగాలున్నాయి కదా! అలాంటప్పుడు ఆ ప్రాచీన భాషలు సమగ్రంగా తెలియక పోవడంలో వింతకాని, విప్రతిపత్తి కాని లేదు.

గవ్వ మెరుగుపెట్టేటప్పుడు ఈ చిన్న చిన్న రేకలను సరిదిద్దితే మన లిపి పుట్టు పూర్వోత్తరాల చిత్రం అపూర్వంగా ఉండగలదు.

కొసకు మీరన్నట్లుగా చెప్పవలసింది ఓ పెద్ద సముద్రం అంత వుంది. ఎన్ని పుడిసిళ్ళు తాగిస్తే తనివి తీరేను?

మరొకమాట : మనరాతకు పనికివచ్చే తాటాకులను సిత్తాళపత్రాలు లేక శ్రీతాళ పత్రాలు అని అనేవారు. వీటికి ఇటూ అటూ ఈనెలు తీసేసిన తర్వాత నిఖార్సుగా రెండంగుళాలు అంతకు పైబడ్డ వెడల్పు గల ఆకులు మిగులుతాయి. సిత్తాళాలను మన వారు ప్రత్యేకంగా పెంచేవారు. ఆకులకు మెత్తదనం రావడం కోసం ముందు పేడనీళ్ళలో ఉడికించి, ఆ తర్వాత పసుపూ వసా కలిసిన నీళ్ళలో ఉడికించి చుట్టలు చుట్టి ఉంచేవారు (నీడనారించి). వాటికప్పుడు ఫ్లెక్సిబిలిటీ వచ్చేది. (198-190)

సరే ఇక వుంటా.

మీ వాడు

కృష్ణమూర్తి

# ప రి చ య ము

ముప్పయ్యేళ్ళ కిందట పురాతన నాగరికతలనదేపనిగా అవలోకనచేస్తూ ఉండేవాడను. అప్పుడు ఈజిప్టు, క్రీటు, మెసపొటోమియా, గ్రీసు, పర్షియా మొదలయిన నాగరికతలలో అక్షరాల గుర్తులు ఎలా పుట్టి, ఎలా పరిణమించాయో చూడడం సటస్థించింది. ఆ గ్రంథాలు వ్రాసినవారికి భారతీయ లిపి పరిణామ విషయాలు అంతగా తెలియవు. అందుచేత ఈ రెండు పరిణామాలను మేళవించి ప్రపంచ అక్షర వికాసం అని వ్రాస్తే బాగుండునని కుతూహలం కలిగింది. "ఓనమాలు" అన్న పేరుతో ఒక నలభై పుటలు వ్రాశాను గూడా! అప్పుడు నాకు కరతలామలకమయింది ఆ పనిలో ఉన్న విశేషశ్రమ. ఇంతలో శ్రీ శృంగేరీ శారదాపీఠ జగద్గురు శంకరాచార్యులవారి ఆదేశానుసారం నేను శారదాంబా పూజ చేయవలసి వచ్చింది. అప్పటికి నేను సేకరించిన అక్షర వికాస విషయాన్ని పొందుపరుస్తూ "అక్షర శారదా ప్రశంస" అని ఒక ఖండ కావ్యాన్ని 1927 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటించాను. ఆనాడు నేను చేసిన సాహసానికి ఫలితమే ఈనాడు శ్రీ తిరుమల రామచంద్రగారి "మన లిపి పుట్టు పూర్వోత్తరాలు" అన్న ఈ అమూల్య గ్రంథానికి పరిచయం వ్రాసే మహాభాగ్యం.

ఈలాంటి గ్రంథం వ్రాయడం సులభమయిన పనికాదు. అనేక గ్రంథావలోకనము, బహుభాషా పరిచయము, గట్టి జిజ్ఞాస, నిశితమైన విమర్శనము, మంచి ఊహాస్ఫూర్తి ఇన్నీ ఉంటేనేగాని కాదు. ఈ గుణాలన్నీ రామచంద్రగారికున్నాయని గ్రంథము ప్రతిభాగములోను ప్రత్యక్షంగా కనబడుతుంది. ఈ గుణాలకు తోడు వీరి కదృష్టవశాత్తు లభించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సాంగత్యము వ్యర్థము కాలేదని తేటపడుతుంది. దేశీయ విదేశీయ లిపి పరిణామాలను మేళవించి ఇంత సాకల్యంగా వ్రాసిన గ్రంథం, మన భాషలోనే కాదు ఇతర భాషలలోగూడా, ఇంకొక్కటి లేదనే నా నమ్మకము.

ఇటువంటి పొడి విషయాన్ని ఇంత సుబోధకంగా, ఏదో కథల పుస్తకం లాగ విడిచిపెట్టకుండా చదవాలన్న కుతూహలం కలిగే పద్ధతిని వ్రాయగలగడం

నిజంగా ప్రశంసాపాత్రము. శాస్త్ర విషయాలను గురించి వ్రాయదలచిన ఇతర రచయితలు గూడ ఈ పద్ధతినే అవలంబిస్తే ప్రజల విజ్ఞాన వికాసానికి మహోప కారం చేసినవారవుతారు.

గ్రంథములో రామచంద్రగారు చేసిన కొన్ని సిద్ధాంతాలను కొందరంగీక రించకపోవచ్చు. అది సహజమే. ఈలాంటి ప్రథమ ప్రయత్నాలలో, మరికొంత పరిశోధన జరిగిన తరువాతనే వీటి నిజానిజాలు నిర్ధారణవుతాయి. వత్తులు, అంకెలు మొదలైన కొన్ని గుర్తుల ఆకారాలను సమర్థించడంలో రామచంద్రగారు చూపిన ఊహాచాతురి మెచ్చుకోతగ్గది. మన లిపి ప్రాచీనతను గురించి వ్రాయడములో రామచంద్రగారికి గల గాఢ జాతీయాభిమానము స్ఫుటముగ కన బడుతుంది. ఇదిగూడ అవసరమేనేమో! ఎందుచేతనంటే, లిపి పరిణామాలను గురించి వ్రాసిన విదేశీయ పండితులు తమ సిద్ధాంతాలలో చాలచోట్ల పాశ్చాత్య విషయాభిమానం విడిచిపెట్టలేకపోయారు. అయినా ఋగ్వేదకాలమునాటికే అక్షరాలుండేవన్న సిద్ధాంతం వంటివానిని తజ్జ్ఞులు పరిశీలించవలసి వుంటుంది.

ఇన్ని విషయాలను సేకరించి ఇంత మనోహరంగా రచించినందుకు రామచంద్రగారికి నా ధన్యవాదాలు. గ్రంథములోని విషయాలను సువ్యక్తము చేసే పటములు సేకరించి ప్రకటించడమూ, అక్కడక్కడ ఉదాహరించిన శాసనాలకు తాత్పర్యము తెలియజేయడమూ పాఠకుల కెంతగానో ఉపకరిస్తాయి. ఈ గ్రంథము ఆంధ్ర శాసనపరిశోధకులలో అగ్రేసరులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి కంకితము చేయడం మహా సమంజసము. రామచంద్ర గారు తమ పరిశోధనలను కొనసాగిస్తూ ఇటువంటి అనన్య సులభ సాధ్యములైన గ్రంథాలు వ్రాసి ఆంధ్ర సరస్వతి నలంకరించాలని కోర్తాను.

ఇట్లు,

మద్రాసు.
17-4-57

తాపీ ధర్మారావు.

# మనవి మాటలు

ప్రాచ్య పాశ్చాత్య పండితులు లిపి పరిణామం గురించి చెప్పిన సంగతులు క్రోడీకరించి భారతీయ దృక్పథంలో చెప్పడమే నే నీ పుస్తకంలో చేసిన పని. చదువు వ్రాత నేర్చిన ప్రతివారూ లిపి సంగతి తెలుసుకోవడం అనేదే ఈ పుస్తకం పరమార్థం. కనుక, శాస్త్ర పరిభాష వదలి సరళంగా వ్రాయడానికి ప్రయత్నించాను. నాకు ఒరవడి రష్యా రచయిత శ్రీ ఎం. ఇలిన్ వ్రాతలు. నేను వాటిని విషయవివరణలో అనుసరించడమేకాక కొన్ని చోట్ల అనువదించుకొనడానికి కూడ జంకలేదు.

ఈ రచనలో నేను పలువురికి ఋణపడి ఉన్నాను. నన్ను ఈ రచనకు ప్రోత్సహించినవారు మిత్రులు రాంభట్ల కృష్ణమూర్తి, డి. వి. సుబ్బారావు, తాపీ మోహనరావు, కోరాడ మహాదేవశాస్త్రిగార్లు. కృష్ణమూర్తిగారు శ్రీ అడివి బాపిరాజుగారి మాటలలో "కవులను, కళాకారులను కలిపే అపరంజి కొలికి." సుబ్బారావుగారు తమ పూర్వభాషిత్వంతో, మధురతర వ్యక్తిత్వంతో సాహిత్యాన్ని, వాణిజ్యాన్ని సన్నిహితం చేస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం నిర్వాహకులు. మోహనరావుగారు త్యాగం, మైత్రి మూర్తీభవించినవారు. మహాదేవశాస్త్రిగారు తండ్రికి దీటురాగల భాషాతత్త్వవేత్తలు, పరిశోధన పరాయణులు.

ఈ పుస్తకంలోని పెక్కు బొమ్మలు గీచినవారు మిత్రులు మైలవరపు సూర్యనారాయణమూర్తిగారు; ప్రాచీన భారతీయ చిత్రకారుల స్థాయిని అందుకోగల ఉపజ్ఞ గలవారు.

పరిచయం వ్రాసి ప్రేమ చూపినవారు శ్రీ తాపీ ధర్మారావుగారు; ప్రాచ్య పాశ్చాత్యరీతులకు, పాత కొత్తలకు సువర్ణ సేతువు.

కృతిని స్వీకరించి గౌరవించినవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు; శాసన పరిశోధనలోనే జీవితం పండినవారు.

వీరందరికీ నా ప్రణామాలు.

దీనిని ఆమూలాగ్రం ప్రజాసామాన్య ప్రతినిధులుగా విని, పెక్కు సవరణలు చేసిన మా అమ్మ మాతృశ్రీ జానకమ్మగారికి, నా అర్ధాంగి సౌభాగ్యవతి అనంతలక్ష్మీదేవికి కృతజ్ఞత తెలుపడం నా విధ్యుక్త ధర్మం.

ఈ రచనకు పెక్కు గ్రంథాలు, వ్యాసాలు తోడ్పడ్డాయి. కొన్ని గ్రంథాలలోని చిత్రాల ప్రతి రూపాలను కూడా తీసుకున్నాను. ఆ రచయితల కందరికీ కృతజ్ఞుణ్ని. ఆ గ్రంథాలను, రచయితలను పక్కపుటలో పేర్కొన్నాను.

కన్నెమారా పబ్లిక్ లైబ్రరీ అధికారులకూ, ముఖ్యంగా అసిస్టెంట్ లైబ్రేరియన్ సోదరి రుక్మిణికి, తమ లిపిపరిణామ పట్టికలను, శాసనప్రతిరూపాలను ముద్రించుకొనడానికి అనుమతించిన మద్రాసు మ్యూజియం సూపరింటెండెంట్ డాక్టర్ ఎ. అయ్యప్పన్‌గారికి, ఆంధ్ర పత్రికాధిపతులకు, భారత ప్రభుత్వం ఎపిగ్రఫీశాఖవారికి నా ధన్యవాదాలు.

ప్రజాసామాన్యానికి లిపి పుట్టుపూర్వోత్తరాల జ్ఞానం కలిగించడానికి ఇలాటి ప్రయత్నం జరగడం భారతదేశంలోనే ఇదే మొదలని మాత్రం మనవి చేయగలను. కనుక, లోపాలను మన్నించి ఈజిప్టు చిత్రలిపి, గుణింతాలు, ఒత్తులు, అంకెలు మొదలయినవాటి వివరణలో స్వతంత్రించి చేసిన ఊహలను పండితులు, ప్రజాసామాన్యమూ హర్షిస్తారని నమ్మినాను. ప్రజలకు విజ్ఞానం పంచిపెట్టడమే పనిగా పెట్టుకున్న విశాలాంధ్ర ప్రచురణాలయంవారు దీనిని ముద్రించడంలో వింతేమీ లేదు.

మీ వాడు,

తిరువల్లిక్కేణి,
హేవిళంబి ఉగాది

తిరుమల రామచంద్ర

# ఈ రచనకు తోడ్పడిన గ్రంథాలు

| | |
|---|---|
| అక్షర శారదా ప్రశంస | శ్రీ తాపీ ధర్మారావుగారు |
| అన్నమాచార్య చరిత్ర | శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు |
| ఆంధ్ర కవి సప్తశతి | శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు |
| ఆంధ్రభాషా చరిత్ర | డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు |
| ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం | శ్రీ కె. వి. లక్ష్మణరావుగారు |
| ఆంధ్రుల చరిత్ర | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరంగారు |
| కర్ణాటక భాషాభూషణ | నాగవర్మ |
| చాటుపద్య మణిమంజరి | శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు |
| చాటుపద్య రత్నాకరము | శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు |
| దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము | శ్రీ నిడదవోలు వెంకటరావుగారు |
| పరిశోధన (ద్వైమాసపత్రిక) | మద్రాసు |
| బౌద్ధయుగము | శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు |
| భారతి (మాసపత్రిక) | మద్రాసు |
| భారతీయ గ్రంథాలయ చరిత్ర | శ్రీ కొడాలి లక్ష్మీనారాయణగారు |
| భారతీయ ప్రాచీన లిపిమాల (హిందీ) | శ్రీ గౌరీశంకర్ హీరాచంద్ ఓఝాగారు |
| మీగడ తఱకలు | శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు |
| లలిత విస్తరం | శ్రీ తిరుమల రామచంద్ర,<br>శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు |
| వినయాదిత్యుని పల్లెపాడు శాసనము | శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు |
| సామాన్య భాషావిజ్ఞాన్ (హిందీ) | శ్రీ బాబూరామ్ సక్సేనాగారు |
| ఱాయి మాట్లాడుతుందా? (వ్యాసాలు) | శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు |
| **Arya Vol I** | **Sri Orobindo** |
| **Black on White** | **Sri M. Ilin** |
| **Brahmi Script** | **Sri Buhler** |
| **Epigraphia Indica** | |
| **History of the Telugu Chodas** | **Dr. M. Venkataramayya** |
| **Indian Epigraphy And South Indian Script** | **Sri C. Sivaramamoorty** |
| **Prinsep Vol I, II** | |
| **Royal Asiatic Society Journal** | **Bombay Branch** |
| **South Indian Paleography** | **Sri Burnell** |
| **The Alphabet** | **Sri David Diringer** |
| **The Alphabet** | **Sri Isac Taylor** |
| **The Aryan Origin Of The Alphabet** | **Sri L. A. Waddel** |
| **The Holy Bible** | |

## మద్రాసు మ్యూజియంవారి సౌజన్యంతో ముద్రించిన చిత్రాలు



## ఆంధ్రపత్రిక సౌజన్యంతో ముద్రించిన చిత్రాలు



## తిరుమల - తిరుపతి దేవస్థానంవారి సౌజన్యంతో ముద్రించిన చిత్రాలు

# విషయసూచిక

## ప్రథమ భాగం



## ద్వితీయ భాగం

## తృతీయ భాగం

ప్రథమ భాగం

ప్రథమ ప్రకరణం

# ప్రాణాలతో ఉన్న పుస్తకం

మొట్టమొదటి పుస్తకం ఎలా ఉండేది! అచ్చు కొట్టిందా? చేత్తో వ్రాసిందా? కాయితాలదా? కాదా? అలాటిది ఇంకా ఉంటే, ఏ గ్రంథాలయంలో దొరుకుతుంది?

పూర్వం ఒక వెర్రివెంగళప్ప ఉండేవాడట! మొట్టమొదటి పుస్తకంకోసం ప్రపంచంలోని గ్రంథాలయాలన్నిటినీ గాలించాడట. ఏండ్లూ పూండ్లూ పుస్తకాల కట్టలు గాలించడంలోనే పండబారిపోయాడట. తుదకు పుస్తకాల సొరుగులకు ఆనించిన నిచ్చెననుంచి జారిపడి ప్రాణాలు విడిచాడట. ఆ వెంగళప్ప మరొక పందేండ్లేకాదు పదిపదులయేండ్లు బ్రతికివున్నా, ఫలితం వుండేదికాదు. మొదటి పుస్తకం అతడు పుట్టడానికి వేలసంవత్సరాల క్రితమే మట్టిలో కలిసి మాయమైపోయింది.

మొట్టమొదటి పుస్తకం ఇప్పటి పుస్తకాలవంటిది కాదు. దానికి కాళ్ళూ చేతులూ ఉండేవి. అది సొరుగుల్లో పడివుండేదికాదు. కదిలేది, కదిలించేది, మాట్లాడగలిగేది, పాట పాడగలిగేది. అది ప్రాణాలతో ఉన్న పుస్తకం—మానవ పుస్తకం. అంటే, మానవుడే!

ఆదికాలంలో ప్రజలకు వ్రాత తెలీదు. కాని, వారికి మనకంటే జ్ఞాపకశక్తి ఎక్కువగా ఉండేది. కొందరు సజీవ పుస్తకాలన్నప్పటికీ అబద్ధం కాదు. వారు పాతకాలాల అద్భుతగాథలను చెప్పేవారు. అవన్నీ చిన్ననాడు పెద్దలనుంచి విన్నవే. వారు పోయినా ఆ గాథలుమాత్రం పోలేదు - తండ్రి నుంచి కొడుకుకూ, తాతనుంచి మనుమనికీ చేరుతున్నాయి. ఆనోట ఆనోట ఆగాథలు మారుతూ ఉంటాయి. వాటిలో కొత్తసంగతులు చేరుతుంటాయి. పాత సంగతులు కొన్ని జారిపోతూ ఉంటాయి. నీరు పారి పారి రాళ్ళు నునుపుదేరినట్లు

ఆ గాథలు రానురాను నయంగానూ, నాజూకుగానూ, అవుతూ ఉంటాయి. పరాక్రమవంతుడైన ఒకానొక కులపెద్ద కథ కాలక్రమాన నీటికీ నిప్పుకూ, బాణానికీ బల్లేనికీ భయపడనివాడూ, సింహంలాగ అడవంతా పెత్తనం చెలాయించి డేగలాగ ఆకాశంలో ఎగిరిపోయేవాడూ అయిన ఏ మాయా మానవుని వీరగాథగానో మారుతుంది.

ఎప్పుడూ, ఎవరూ వ్రాయని అలాటి కట్టుకథలుచెప్పే ముసలయ్యలు, ముసలమ్మలు నేటికీ ప్రపంచంలో ప్రతిచోటా ఉన్నారు.

అతి ప్రాచీనకాలంలో మనదేశంలో రామాయణం, భారతం పాటలుగా పాడేవారు. రామాయణగాథను తొలుత కుశలవులు తమ తండ్రి అయిన రామచంద్రుని ఆస్థానంలో పాడి వినిపించినట్టు మనం విన్నసంగతే. అలాగే మన పూర్వులు తమకు తెలిసిన తక్కినగాథలనూ పాడుకొనేవారు. పగలల్లా పొట్టకూటికోసం శ్రమపడి సాయంకాలం ఇల్లు చేరుకున్న తర్వాత, తిండీ తిప్పలూ



ముగించుకొని పదిమందీ ఆరుబయట పోగయేవారు. తెలిసిన పెద్దలు కథలు చెబితేనో, గాత్రం బాగున్నవారు గానం చేస్తేనో విని ఆనందించేవారు. అలా పద్యాలు పాడేవారిని గమకి, గాయకుడు అనేవారు. రామాయణం, భారతం, వత్సరాజు చరితం ఈవిధంగా మొదట కర్ణాకర్ణికగా చెప్పుకొన్నవే; తర్వాత తర్వాత వ్రాతకెక్కినవి.

ప్రపంచంలోనే తొలిసాహిత్య సంపద అని మనం నమ్ముతున్న వేదానికి శ్రుతి అనే వ్యవహారం నేటికీ ఉంది. శ్రుతిఅంటే వినబడేది అన్నమాట. వేదమంటే మరేమీకాదు! మన ఆదిపురుషుల అనుభవాలు, ఆవేశాలు, ఆదరాలు, ఆశ్చర్యాలు మొదలయిన మనోవికారాలు, ఊహలు, జిజ్ఞాసలు, ఇంకా ఇలాటి తెలియదగిన వెన్నో గల సంపుటం - క్రోడీకరణం. ఇది నేటికి ప్రధానంగా గురుముఖతః నేర్వడం మన ప్రాచీన సంప్రదాయానికి తార్కాణం.

పూర్వం గ్రీసు దేశీయులు కూడ - పాశ్చాత్య దేశాలకు సభ్యతాభిక్ష పెట్టిన గ్రీసు దేశీయులు కూడ-తమ జాతీయగాథలైన "ఇల్లియడ్" "ఒడిస్సే" అనే ఇతిహాస కావ్యాలను పాడుకొనేవారట. తర్వాత ఎంతో కాలానికిగాని ఇవి వ్రాత కెక్కలేదు.

ఇలా పాడేవారిని "ఈడోస్" అని గ్రీకువారు అనేవారు. ఈ 'ఈడోస్' ఎక్కడికి వెళ్ళినా, స్వాగతమే. జనం గోష్ఠులుగా కూర్చునేవారు బల్లచుట్టూ. ఎదుట 'ఈడోస్' కూర్చునేవాడు. అతని 'లైర్' వాద్యంగోడకు తగిలించి



ఉంటుంది. విందు ముగియవస్తూ ఉంటుంది. భక్ష్యభోజ్యాలు ఎగిరిపోతూ ఉంటాయి, పానపాత్రలు వట్టివవుతూ ఉంటాయి. అప్పుడు వీనులను విందుగా సంగీతం కావాలి. 'ఈడోస్' గోడకు తగిలించిన 'లైర్'ను అందుకుంటాడు; వీరవరుల గాథలు గానం చేస్తాడు.

ఈ గాయకులకు- 'ఈడోస్'లకు జ్ఞాపకశక్తి అసాధారణం. కనుకనే పాతకాలపు రాజులు, మహారాజులు, ధనవంతులు తమ అస్థానాలలో ఈలాటి

వారికి ఆశ్రయ మిచ్చేవారు. వీరు-ఒకరు ఒకవేదాన్ని పుక్కిటబట్టితే, మరొకరు రెండు వేదాలను నమిలి మింగేవారు. తమ ఆశ్రయదాత వినోదంకోసం ఏకావ్యాన్ని బడితే ఆకావ్యాన్ని అప్పజెప్పేవారు. ఇందువల్ల వీరికి వేదులవారు, ద్వివేదులవారు, త్రివేదులవారు, చతుర్వేదులవారు, భారతంవారు, రామాయణం వారు, మహాభాష్యంవారు అనేపేర్లు వచ్చేవి. అవి క్రమంగా వంశపు పేర్ల యాయి. నేటికీ ఈ పేర్లతో కొన్ని వంశాలున్నాయి.

జ్ఞాపకశక్తి అంటే నాలుగువందల సంవత్సరాలనాటి జగన్నాథ పండిత రాయలకథ గుర్తుకు వస్తుంది. పండితరాయల పూర్వులు గోదావరిజిల్లా ముంగండ వారయినా, ఆయన తండ్రి వారణాసికి వలస వెళ్లాడు. పండితరాయలు వారణాసి లోనే జన్మించి విద్వాంసుడయ్యాడు. ఢిల్లీ పాదుషా షాజహానును దర్శించుకుందా మని ఊరుకదలి ఢిల్లీ చేరుకొని ఒక సత్రంలో బసచేశాడు. పాదుషావారి దీదార్ అంటే మాటలా మరి? పడిగాపులు కాచవలసి వచ్చింది, చాలనాళ్లు. ఇలా ఉండగా ఒకనాడు సత్రంలో ఒక తమాషా జరిగింది. ఇద్దరు ఆడవారు పోట్లాడుకున్నారు. పండితరాయలు ఇదంతా చూస్తున్నాడు. ఇంతలో సిపాయీలువచ్చి పోట్లాడు కుంటున్న ఇద్దరు స్త్రీలను "సంగతి సందర్భాలేమిటి? పోట్లాటకు కారణమేమిటి?" అని దర్యాప్తు చేశారు. దానిది తప్పంటే దానిది తప్పు. అదే కయ్యానికి కాలు దువ్విందంటే అదే దువ్వింది అని ఇద్దరు స్త్రీలూ ఒకరిపై ఒకరు ఫిర్యాదు చేశారు. "సాక్షులెవరైనా ఉన్నారా?" అని అడిగారు సిపాయిలు. "ఆఁ! లేకేమి ? అదో, ఆ నిలుచున్న పెద్దమనిషిని అడగండి." అంటూ యిద్దరూ జగన్నాథ పండితుని వైపుచూపించారు. సిపాయిలు ముగ్గురిని పాదుషావారి దీవానే ఆమ్‌కు లాక్కు పోయారు. పండిత రాయలకు తెలుగు, సంస్కృతం తప్ప మరొక భాష తెలియదు. పోట్లాట జరిగింది స్థానికభాషలో, కనుకవారు అన్నమాటలు, వంతుల వారీగా తిట్టుకున్నతిట్లు విన్నవి విన్నట్టుగా అప్పగించగలనని మాత్రం దివా ణంలో మనవి చేశాడు. పాదుషా వారు "తమాషాగానే ఉందే" అనుకుని తల పంకించారు అంగీకార సూచకంగా. పండితరాయలు వారిద్దరి వాద ప్రతివాదా లను తు.చ. తప్పకుండా అప్పగించాడట. పాదుషా పరమాశ్చర్యం పొందాడు. ఆ ధారణాశక్తే పండితరాయలను షాజహాను ఆస్థానకవిగా చేసింది.

ఇప్పటికి పన్నాలుగు వందల సంవత్సరాలనాటి మాట. సజీవగ్రంథాలయ మనదగిన ఒక మహాపండితుడు ఉండేవాడు. ఆయన పేరు జయసేనుడు. ఆయ

నకు సకలవేదాలు, వేదాంగాలు, వేదాంతాలు నాలుక చివర నాట్యమాడేవి. అప్పటి మగధరాజు పూర్ణవర్మ, కళింగరాజు శిలాదిత్యుడు అయనను తమఆస్థాన పండితునిగా చేసుకొనడానికి వేయివిధాల ప్రయత్నించారు. కాని జయసేనుడు తత్త్వజ్ఞుడూ, మానవ సేవాపరాయణుడూ గనుక ఆరాజుల మాటలను పెడచెవి పెట్టినాడు.

ధారణాశక్తి అంటే మరొక తమాషాకథ జ్ఞాపకం వస్తున్నది.

## సజీవ గ్రంథాలయం కథ

పూర్వం రోము నగరంలో కోటికి పడగయెత్తిన ఒక ధనవంతుడు ఉండేవాడు. ఆయన పేరు ఇటెల్లియన్. అతని సిరిసంపదలను గురించి కథలుగా చెప్పుకొనేవారు. అతని నగరు చాలా పెద్దది—నగరంలోని వారందరూ ఉండ దగినంత పెద్దది. దినమూ కనీసం మూడువందలమందైనా పండితులూ, ప్రముఖులూ ఆయన పంక్తిని భోజనం చేసేవారు.

ఇటెల్లియన్ అతిథులకు మృష్టాన్నాలు పెట్టేవాడు. ఆకాలంలో గృహస్థులు అతిథులకు భోజనంపెట్టడంమాత్రమే చాలదు. సరస సంకథావినోద గోష్ఠులు జరపాలి. పుస్తకాలు ఉండేవి. కాని, అవన్నీ చేతివ్రాతవి. పలువురు ఈవ్రాతపుస్తకాలను గంటల తరబడి చదివి, విందులలో వినోద కథలు సంభాషణలు వినిపించి అతిథులను సంతోషపెట్టేవారు.

ఇటెల్లియసుకు అంతా సమృద్ధిగా ఉంది. కాని, ఒక్కటే లోపం—. చదువు బండిసున్నా. మామూలు వ్రాతకోతలుకూడా రావు. ఆయన బంతిని గొంతు బంటిగా సాపాటుచేసేవారంతా వీపు వెనుక ఎగతాళిచేసేవారే. భోజన సమయంలో చమత్కారంగా మాట్లాడడం ఆయనకు చేతనయ్యేదికాదు. తను ఏదైనా మాట్లాడాడా అతిథుల ముఖాలపై ఎగతాళిగా నవ్వు తొలకడం తను చూడకపోలేదు.

ఈ ఎగతాళిని ఆయన సహించలేకపోయాడు, కష్టపడి పనిచేసేఅలవాటు లేదాయె ! చాలకాలం ఆలోచించగా, ఆలోచించగా ఒక మంచి పథకం తట్టింది. తన బానిసలలో మంచి తెలివితేటలూ, చదువూ వున్నవారిని రెండువందల మందిని ఏరుకొని హాజరుచేయవలసిందని బట్లరుకు ఉత్తరువు చేశాడు. వారిలో చెరిఒక పుస్తకం కంఠాపాఠం చేయాలి. అంటే ఒకడు ఇల్లియడ్, మరొకడు

ఒడిస్సీ, ఇంకొకడు ఇంకొకటి—ఈవిధంగానన్నమాట.

బట్లరుకు ఇది సులభమైన పనా ? యజమాని ఉత్తరువు నెరవేర్చడానికి బానిసలపై చెయిగూడ చేసుకోవలసి వచ్చేది. ఎలాగయితేనేం ఆ బానిసలంతా తలా ఒక్కొక పుస్తకం కంఠాపాఠం చేశారు. ఇటెల్లియసు పీడ విరగడైంది. సజీవ గ్రంథాలయమే తనవద్దఉంది గనుక తనిక శ్రమపడి ఏ పుస్తకమూ చదువనక్కరలేదు. భోజనాలప్పుడు సంభాషణ ఏదైన వచ్చిందా ఆయన చేయవలసిందల్లా బట్లరుకు ఉత్తరు చేయడంమాత్రమే. గోడకు ఆనుకొని నిలబడి ఉన్న బానిసలనుంచి ఒక్కడొకడే ముందుకు వచ్చి ఇటెల్లియసు కోరిన గీతాన్నో, వాక్యాన్నో గబగబా ఒప్పచెప్పేవాడు. ఆ బానిసలకు వారు కంఠాపాఠం చేసిన గ్రంథాన్నిబట్టే పేర్లు పడ్డాయి —ఇల్లియడ్, ఒడిస్సీ, ఈనీడ్ అని.

ఇటెల్లియసు సంతోషానికి పట్టపగ్గాలులేవు. రోము నగరంలో అంతా తన సజీవ గ్రంథాలయం గురించి చెప్పుకొనేవారే. అయితే అతని సంతోషం ఎంతోకాలం నిలవలేకపోయింది. ఒకనాడు ఒక దుర్ఘటన సంభవించి అతడు తలయెత్తుకోలేనంత నవ్వులపాలయాడు.



ఒకనాడు ఎప్పటిలాగే భోజనంతర్వాత సాహిత్యగోష్ఠి ప్రారంభమయింది. ప్రాచీనకాలంలో ప్రజలు విందు లెలా చేసుకొనేవారనేది ప్రసంగ వశాత్తు వచ్చింది.

"ఇల్లియడ్‌లో దీనినిగురించి చెప్పిన సూక్తి ఒకటుంది" అంటూ ఇటె ల్లియసు బట్లరువైపు తిరిగాడు.

బట్లరు బానిసలకు ఉత్తరువు చేయడానికిమారుగా యజమాని కాళ్ళపై పడి వణుకుతూ "దొరగారూ, మన్నించాలి. ఇల్లియడ్‌కు నేడు కడుపునొప్పి. హాజరుకాలేదు" అని మనవిచేశాడు.

అతిథులు విరగబడి నవ్వారు.

ధారణాశక్తి ఉత్తమమైందే. మన గమకి గాయకుల, గ్రీకు ఈడోసుల గానం మంచిదే. కాని మనపుస్తకాలు దానికన్నా మంచివి. రూపాయిపెడితే సులువుగా చొక్కాజేబులో ఇమిడే రామాయణం ప్రతినో, బైబులో, మరొక గ్రంథం ప్రతినో మనం కొనుక్కోవచ్చు. ఇవి తిండీ-తీర్థం అడుగవు, జబ్బు పడవు, చావవు.

కాని ఈ గ్రంథాలు, గ్రంథాలయాలు నేడు మనకు ఎన్నో ఉన్నా సజీవ గ్రంథాలు-మానవరూప గ్రంథాలు-లేనిదే గడవదు.

అన్నీ పుస్తకాలనుంచే నేర్చుకొనునేటట్టయితే మనం బడికే వెళ్ళనక్కర లేదు. పంతులూ అక్కరలేదు. విషయాలను వివరించేవారూ అవసరం లేదు. కాని, పుస్తకాలతో ఒక్కచిక్కుంది-మనకు సందేహం వస్తే పుస్తకాన్ని అడగ లేము. పంతులునయితే అడిగి తెలుసుకోవచ్చు.

సజీవ పుస్తకాలు మనకు నేటికీ ఉపయోగిస్తాయి. కాని "సజీవమైన వ్రాత"-వార్తాహరులు-మాత్రం అంతగా ఉపయోగపడదు. వ్రాత తెలియని కాలంలో ఉత్తరప్రత్యుత్తరాలకు తగిన కట్టుదిట్టాలు లేకపోవడం సహజమే. అతి ముఖ్యమైన వార్తలను ఇతరులకు పంపాలంటే దూతలతో పంపేవారు. వారు వెళ్ళి తమకు చెప్పి పంపిన వార్తలను చిలుక పలుకుల్లాగ అప్పజెప్పేవారు.



నేడు టపా బంట్రోతులకు బదులు దూతలే ఉంటారనుకోండి. ఎలా ఉంటుంది? రోజూ కొన్నివందల ఉత్తరాలను జ్ఞాపకం పెట్టుకొనే టపా బంట్రోతులే దొరకరు. ఒకవేళ దొరికినా వార్తలను అందివ్వడం సరిగ్గా జరుగదు. అలాటి టపా బంట్రోతొకడు ఫలానా

రామయ్యగారింటికి ఒకానొక పండుగనాడు వార్త తెస్తాడనుకోండి. అతిథుల కోసం ఎదురు చూస్తున్న రామయ్యగారే స్వయంగా వచ్చి తలుపుతీసి కొత్త మొగం చూచి, కొంచెం చిరాకుతో కంగారుతో "ఎవరండీ మీరు? ఏంకావాలి?" అంటా రనుకోండి.

టపా బంట్రోతు వెంటనే - తీరికఏదీ ? మరొకరియింటికి వెళ్ళ వద్దా మరి? "మీకొక ఉత్తరం వచ్చిందండీ. దానిలోని సంగతులివి.

"మహారాజరాజశ్రీ రామయ్యగారికి ఉభయకుశలోపరి. నన్ను మీరు మరచేపోయారు. నేడు మధ్యాహ్నం పన్నెండుగంటలకు కోర్టుకు హాజరుకండి. తప్పక మనవృత్తి సంగతి నిర్ణయించుకుందాం". అని ఎవేవో వార్తలు అప్ప గిస్తూ పోతాడనుకోండి.

రామయ్యగారు దిగాలు పడిపోతారు. పాపం ! వందలకొలదీ జాబులు తలలో గజిగజిగా గడ్డకట్టుకున్న టపా బంట్రోతు చెడిపోయిన యంత్రంవలె ఏదో వాగుతూ పోతాడు.



ద్వితీయ ప్రకరణం

# జ్ఞాపకానికి గుర్తులు

ఒక ముసలితాత ఉన్నాడు. చాల మంచివాడు, కలగలపు మనిషి. చూస్తే ఎనభైయేళ్ళవాడిలాగ కనిపించడు. చూపు ఎంతమాత్రమూ తగ్గలేదు. బుగ్గలు దిగిపోలేదు. పదహారు సంవత్సరాల కుర్రాడిలాగ నడుస్తాడు ఠీవితో. అంతా బాగానే వుంది....కాని మరపో! మరపు ముంచుకొని వస్తున్నది, ఎక్కడికైనా వెళ్లుతాడు, వెళ్ళిన పని మరచిపోతాడు. పరిచితులపేర్లు మరచి పోతాడు. నన్ను ఎన్నో సంవత్సరాలుగా ఎరుగును. తరచు తడుముకుంటూ తప్పుపేరుతోనే పిలుస్తాడు.



ఏదైనా పని చేసిపెట్టమంటామనుకోండి. పదేపదే అడిగి జ్ఞాపకం పెట్టుకోడానికి మననం చేస్తాడు. మరువకుండా ఉండడానికి తన జేబు రుమాలుతీసి, దాని కొనకు ముడివేసు కొంటాడు. ఇలా తాత జేబురుమాలునిండా ముళ్లే కనిపిస్తాయి. ఇంతచేసినా ఆముళ్లు ఆయన జ్ఞాపకానికి ఉపయోగపడవు. జేబురుమాలు పైకితీశాడా, పది పన్నెండు ముళ్ళయినా కనిపిస్తాయి. ఏ సంగతికి ఏముడి అనేదికూడా మరచిపోతాడు. ఎంతమంచి ధారణా శక్తి కలవాడైనా ఈ వింత పద్ధతిలో వ్రాసిన పుస్తకం చదివి తెలుసుకోలేడు!

మన ముసలితాత రకరకాల ముళ్ళు వేసుకుంటేనో, ఒక్కొక్క ముడీ ఒక్కొక్క అక్షరానికో, పదానికో సంకేతమైతేనో ఆసంగతి వేరు. అప్పుడు ఏ పుణ్యాత్ముడైనా ఈజ్ఞాపకం ముళ్ళను విప్పి చెప్పడంలో ఆదుకోగలడు.

వ్రాత తెలియకముందు ప్రజలు ఇలాంటి ముడులవ్రాతనే వాడేవారు. నేటికీ మనదేశంలోని కోయలు, లంబాడీలు మున్నగు ఆదిమజాతివారు గుర్తులకోసం ఇలాటి రకరకాల ముళ్ళు వేసుకొంటూ ఉంటారు. పాతకాలంలో చీనాదేశీయులు

ఈవిధంగానే వ్రాసేవారట. ప్రాచీన పారశీకులు, మెక్సికోవాసులు ఇదే రీతిగా వ్రాసేవారట. దక్షిణ అమెరికా ఖండంలోని పెరూ దేశీయులు ఈముళ్ళవ్రాతలో నేర్పు సంపాదించారు. నేటికి ఆదేశం గొర్రెలకాపర్లకు ఈ గ్రంథిభాష తెలుసు.



రంగు రంగు దారాలు కర్రకు చుట్టి ముడివేస్తారు. ఈ ముళ్ల దగ్గర దగ్గరగా ఉంటే అతి ముఖ్య విషయం. నల్లదారపు ముడి మరణానికి సూచన. తెల్లదారపు ముడి—పెండ్లి లేకపోతే శాంతి. ఎర్రదారపు ముడి యుద్ధం. పసుపు దారపుముడి బంగారు. ఆకుపచ్చ ముడి ధాన్యం. ముళ్ళకు రంగులు వేయకపోతే సంఖ్యలన్నమాట. ఒంటిముళ్లు పదులు, జంటముళ్ల వందలు, ముమ్ముడులు వేలు.

ఈ అక్షరాలను చదవడం సులభం కాదు. దారాలు సన్నవా, లావువా, ముడి వదులుగా ఉందా, బిర్రుగాఉందా, ఎలావేశారు, ఏ వరుసలో ఉన్నాయి— అనేవి చూడాలి. మనమంతా పిల్లతనంలో ఓనమాలు నేర్చుకున్నట్టే పెరూదేశపు పిల్లలుకూడా ఆకాలంలో ఈగ్రంథి వర్ణమాలను - ముళ్ళ అక్షరాలను - నేర్చుకొనేవారు. ఈవర్ణమాలను "క్విపా" అనేవారు.

హరోన్, ఇరోక్వోయి అనే మరికొన్ని అమెరికా ఆదిమవాసుల తెగలలో ముళ్ళకు మారు రంగురంగు పూసలు, గవ్వలు వాడేవారు. వారు గవ్వలను బిళ్ళలు బిళ్ళలుగా కోసి ఒకదారానికి దండగా గుచ్చేవారు. ఈలాటి పూసల దండలు కొన్నిటిని కలిపి పటకాలు (బెల్టులు) తయారు చేసేవారు.

ఈపటకాలలోనూ నలుపంటే ఏదో అశుభం - మరణం; దురదృష్టం; భయం. తెలుపు శాంతి; పసుపుపచ్చ బంగారు లేక కానుక; ఎరుపు యుద్ధం లేక

అపద. ఈరంగులకు నేటికీ—మనకాలంలోనూ—ఆ అర్థాలే ఉండడం వింతే కదా ! తెల్లజండా నేటికీ నాటిలాగా శాంతికి చిహ్నం. నలుపు దుఃఖసూచన. ఎరుపు విప్లవ చిహ్నం.

నౌకా సైన్యానికి జండాలే వర్ణమాల. ఓడలు చుక్కానికి తగిలించిన జండాలతోనే మాట్లాడుకుంటాయి.



రైలు స్టేషనులోని సిగ్నలు ఏమిటి? ఇక్కడ కూడా రంగులేగా! వాటి పాతకాలపు అర్థాలే నేటికీ వాడుకలో ఉన్నాయి.

అమెరికా ఆదిమవాసుల రంగుపూసల పటకాల అర్థం తెలుసుకొనడం సులభం. కులపెద్దల వద్ద సంచులనిండా ఈలాటి రంగుపూస లుంటాయి. ఇరోక్వోయి తెగ యువకులు ఆర్నెల్ల కొకమారు అడవుల్లో ఒకచోట చేరి, తెలిసిన పెద్దల వద్ద యీరంగు గవ్వల రహస్యం నేర్చుకునేవారు.

ఒక తెగవారు మరొక తెగవారికి వార్తలు పంపవలసి వస్తే దూతలతో యీరంగు పూసల పటకాలు పంపేవారు. వీటిపేరు "వామ్పమ్."

దూత రంగురంగు సరాలతో ఇంద్రధనుస్సులాగ మెరిసే ఈ వామ్పమ్ కొలికిపూసను ఒకచేత్తో పట్టుకొని, ఒక్కొక్కరంగు పూసనే రెండవచేతితో చూపుతూ అర్థం వివరిస్తాడు.

మరొకరు వివరించనిదే వామ్పమ్ అర్థంకాదు. ఒక దండలో నాలుగు పూసలు - తెల్లది, పసుపుది, ఎర్రది, నల్లది - ఉన్నాయనుకోండి. "మీరు మాకు కప్పం చెల్లిస్తే మీతో ఒడంబడిక చేసుకుంటాము. దీనికి ఒప్పుకోక పోతిరా యుద్ధం చేస్తాము." అని వ్యాఖ్యానం చేయవచ్చు. మరొక విధంగాను- ప్రత్యర్థుల పరంగా - వ్యాఖ్య చెప్పవచ్చు. "మీతో సమాధానం కోరుతున్నాము. బంగారు చెల్లిస్తాము. యుద్ధం కొనసాగితే, మేము నాశనమై పోవలసి వస్తుంది." అని.

వామ్పమ్ జాబులలో తప్పులు రాకుండా చేయడానికి వాటిని తయారు చేసినవారే స్వయంగా చదివి వినిపించవలసి వచ్చేది. ఈ జాబును దూతకు మారుగా పంపడానికి లేదు. దూత చెప్పదలచుకొన్న దానిని జ్ఞాపక పరచడం వరకే దీని ప్రయోజనం.

ఇలాటి జ్ఞాపక చిహ్నాలు ఇంకా ఎన్నోఉన్నాయి. పల్లెటూళ్ళలో పండ్లు గాని, మరేవైనాగాని ఎంచేటప్పుడు, కొంత అయిన తర్వాత గుర్తుగా గీతలు పెట్టడం నేటికీ చూస్తుంటాము. పెరుగు, పాలు అమ్మేవారు గోడలమీద, తలుపులమీద సుద్దముక్కతోనో, ఎర్రమట్టి (జాజు) ముక్కతోనో గీతలు గీచి, ఖరాబుచేయడం పట్టణాలలోను ఉంది. కొందరు ఇంటిదంతెలకో, ద్వారబంధాలకో గుర్తుకోసం కచ్చులు (గాట్లు) పెట్టడంకూడ కద్దు.



సెర్బియా దేశపు ప్రజలు ఇలా గాట్లుపెట్టిన కర్రముక్కలను రశీదులుగా వాడడం నేటికీ ఉన్న ఆచారం. ఒకరైతు ఒక వర్తకుని వద్ద నాలుగుబస్తాల ధాన్యం తెచ్చుకున్నా డనుకోండి. దానికి రశీదువ్రాసి యివ్వడానికి మారు ఒక కర్రముక్కనుచెక్కి దానిమీద పెద్దకచ్చులు నాలుగు, చిన్నకచ్చు ఒకటి చెక్కుతాడు. ఆ కర్రముక్కను నిలువునా రెండుగా చీల్చి, ఒకటి వర్తకునికి ఇచ్చి, మరొకటి తనవద్ద ఉంచుకుంటాడు, ధాన్యం తిరిగి చెల్లించేటప్పుడు రెండు కర్రముక్కలనూ జోడించిచూస్తారు. మోసానికి అవకాశం ఉండదు. కచ్చులు సరిగా అప్పును సూచిస్తాయి.

దారిని చూపడానికీ, రోజులు చూపడానికీ పాతకాలంలో కర్రలపై ఇలాటి గుర్తులు చెక్కేవారు. ఒకావిడ దేశాంతరం వెళ్ళిన తన పతి పెట్టిన గడువును తలుచుకుంటూ, అప్పుడు వస్తాడు - ఇప్పుడు వస్తాడు - ఇదిగో ఇప్పుడే వస్తాడు - అని అనుకుంటూ ఇంటి గోడలనిండా గుర్తులు పెడుతూ వెళ్ళిందని గాథాసప్తశతిలో చక్కని వర్ణన ఉంది. ఈ పుస్తకం రెండువేల ఏళ్ళనాటిది. నిర్జనమైన దీవిలో చిక్కుకున్న రాబిన్‌సన్‌క్రూసో, రోజులు తెలియడానికి ఈలాటి క్యాలెండరునే వాడాడని మనం చిన్నప్పుడు ఇంగ్లీషు పాఠ్య పుస్తకాలలో చదువుకున్నాము. పూర్వకాలంలో దుర్మార్గులు, హంతకులు, వీరులు, కొన్ని అనాది జాతులవారూ కూడ - తాము ఇందరిని చంపామనే సంఖ్యను తెలుపడానికి బల్లెంమీద, కత్తి పిడులమీద గీతలు గీచుకొనేవారట. ఇలాటి కథలు ఏ కాశీమజిలీ కథలలోనో మీరు వినే ఉంటారు.

తృతీయ ప్రకరణం

# మాట్లాడే వస్తువులు

ముడులను, పూసలను, గవ్వలను వివరించడానికి కొంత వివేకం కావాలి. వార్తలను పంపడానికో, జరిగిన సంగతులను గుర్తుపెట్టుకొనడానికో అంతకన్నా సులభమైన పద్ధతులున్నాయి. పూర్వం ప్రజలు వస్తువుల ద్వారా తమభావాలు తెలుపడం ఉండేది. శ్రీరామచంద్రుడు సీతాదేవికి పంపిందేమిటి ? ఉంగరం కదూ ! ఒక ఉత్తరం ముక్క వ్రాసి పంపలేకపోయాడా? కాశీమజిలీ కథలలోనో, కథారత్నావళిలోనో, కథాకల్లోలినిలోనో, వినోదకథా కల్పవల్లి లోనో మీరు చదివే ఉంటారు. ఒక రాజకూమరి తను వలచిన రాజకుమారునికి తన అభిప్రాయాలు తెలిపే సంకేతాలు వస్తువులతో చేయడం. అప్రబుద్ధుడు అవి తెలుసుకోలేక మంత్రి కుమారునితో చెప్పడం, అతడు వాటిని వివరించడం- ఆదిగా కథలు. ఇలాటికథలన్నిటికీ పాతర అయిన బృహత్కథామంజరి లోని రెండు తమాషా కథలు చెబుతాను.

పాటలీపుత్రంలో దేవదత్తుడనే విద్యార్థి ఉండేవాడు. ఒకానొకనాడు అతడు మిత్రులతో కలసి రాజవీధిని వెళ్లుతున్నాడు. ఆపట్టణంరాజు సుశర్మ కుమార్తె అతనిని చూచింది. సరే! అతనిని పెండ్లాడదామని ఆమెకు బుద్ధి పుట్టక ఏమౌతుంది? తన ఇంగితం తెలియడానికి ఆమె పూలు పళ్ళతోకొరికి అతనివైపు విసిరి వేసింది. దాని ఆంతర్య మేమిటంటే, ఆపట్టణంలోని పుష్పదంతాలయానికి రమ్మనమని.

వారణాసి రాజు ప్రతాప ముకుటునికి వజ్రముకుటుడనే కుమారుడుండే వాడు. అతడు మంత్రి కుమారునితోపాటు ఒకనాడు వేటకు వెళ్లాడు. వేటలో అలసి సొలసి పోయారు ఇద్దరూ. నీటికోసం వెదుక్కుంటూ పోగా, అడవిలో ఒక సరోవరం కనిపించింది. ఇద్దరూ అక్కడికి చేరుకున్నారు. ఆ సరస్సులో ఒక రాజకుమారి జలక్రీడ లాడుతున్నది. వజ్రముకుటుని వజ్రకాయం చూచి మోహించింది. తన సంగతి యావత్తూ సంకేతాలతోనే చెప్పింది. సిగనుంచి కలువలు తీసి చెవిలో చెక్కుకుంది. నిదానంగా పళ్ళ తోముకుంది: కొలనిలోని తామరపూవును రెండు చేతులతోను తీసుకుని సిగలో ముడుచుకుంది. దీని

తాత్పర్యం : నాది కర్ణోత్సల రాజ్యం; నా తండ్రి దంతఘాటుడు, పేరు పద్మావతి-అని.

ఆనాది జాతులలో నేటికీ ఈ అలవాట్లున్నాయి. ఒక తెగవారు మరొక తెగవారిపై కయ్యానికి కాలుదువ్వదలిస్తే, బల్లెమో, బాణమో పంపించేవారు. ఇవి రక్తదాహంతో పంపినవని ప్రతివారికీ అర్థమౌతుంది. ఒకప్పుడు నరికిన చేతులు కాళ్ళవంటి అంగాలు పంపడంకూడ కద్దు. 1882 లో కాలహండి



సంస్థానంలోని గోండులు ఉరియావారిపై తిరగబడి వందలకొలది ఉరియావారిని హత్యచేశారు. ఉరియావారి తలలు, కాళ్ళు, వేంట్రుకలు విశాఖపట్టణంజిల్లా కోయవారికి పంపి, తమకు ఒత్తాసుగా రమ్మని వారిని ఆహ్వానించారట. అవయవాలు పంపడం వారిని రెచ్చగొట్టడానికే.

బుద్ధుని సదుపదేశం విని సన్మార్గానికి వచ్చిన అంగుళిమాలుడనే వ్యాధ చోరునికథ వినేఉంటారు. అతడు ఎంతమందిని చంపాడో గుర్తు తెలియడానికి చంపినవారి ఒక్కొక్కవేలూ కోసి దండ గుచ్చి మెడలో వేసుకొన్నాడట. కనుకనే అతనికి అంగుళిమాలుడు అనే పేరు పడింది.

సమాధానం చేసుకోదలచుకుంటే తములపాకులు, వక్కలు, సోంపు పంపుతారు అనాదిజాతులవారు. అమెరికా ఆదిమజాతులవారు పొగాకు గొట్టం—చిలుమ్—పంపడం ఆచారం. చిలుమ్ శాంతికి చిహ్నం. రెండు తెగలు పోట్లాడుకున్న తర్వాత సమాధానపడదలచుకున్నప్పుడు ఆ తెగల నాయకులు నెగడుచుట్టూ కూచుని చర్చలు ప్రారంభించేవారు. ఒకడు చిలుముగొట్టంలో పొగాకు వేసుకొని తాగడం ప్రారంభిస్తాడు. తాగి ప్రక్కవానికి అందిస్తాడు. అతడు తన పక్కవానికి, ఇలా చిలుముగొట్టం ప్రదక్షిణం చేస్తూ ఉంటుంది.

ప్రజలు వ్రాత నేర్చుకొనడానికి ముందు వస్తువులతోనే జాబులు వ్రాసుకొనేవారు. దక్షిణరష్యా ఆదివాసులైన సిథియనులు పర్షియావాసులకు ఒక

విచిత్రమైన లేఖ పంపారు ఒకప్పుడు. ఈ జాబులో పైవరుసలో చచ్చిన ఒక పక్షి, ఎలుక, కప్ప, కిందివరుసలో ఐదు బాణాలు ఉన్నాయి. ఈ జాబు అర్థ మేమిటంటే- "మీరు పక్షిలాగ ఎగురగలిగితే, ఎలుకలాగ భూమిలో దాగుకో గలిగితే, కప్పలాగ దాటగలిగితే, మాతో పోరాటానికి తలపడండి. అలా చేయలేకపోతే మాతో పోరాటానికి దిగవద్దు. మాదేశంలో మీరు అడుగుపెట్టిన తక్షణం బాణాలతో ముంచివేస్తాము"అని.



ఇప్పటి మన జాబు లెంత సరళంగా ఉన్నాయి? సులువుగా చదువుకో వచ్చునుగదా! మీకు ఒక రోజు టపాలో ఏదోబంగీ వస్తుందనుకోండి. దానిలో ఏదో మంచి వస్తువున్నదని కుతూహలపడుతూ తెరుస్తూ ఉంటే, చచ్చిన కప్పో మరొకటో కనిపిస్తే ఎలా ఉంటుంది? ఎవరో మిమ్మల్ని ఉడికించడంకోసమో, తమాషాకో దానిని పంపారనుకుంటారుగాని అదొక ఉత్తరమని అనుకోరు.

మన అల్లూరి సీతారామరాజు మిరపకాయటపా సంగతి మీకు తెలుసు కదూ! తాను ఫలానా అప్పుడు దాడిచేయబోతున్నట్లు చీటీవ్రాసి, ఒక మిరప కాయను జతచేసి, బాణానికి గుచ్చి పోలీసు స్టేషన్లకు విసిరేవాడు. ఈ మిరప కాయటపా ఆరోజులలో ప్రభుత్వానికి కారం రాచినట్లుండేది.

రాణీ కర్ణావతిపేరు వినే ఉంటారు. శత్రురాజులు తన రాజ్యంమీద దాడి చేయగా సహాయన్ని కోరుతూ ఆమె అక్బరుపాదుషాకు వింతలేఖ పంపింది. అది రాఖీ. రాఖీ పున్నమినాడు - శ్రావణ పౌర్ణమినాడు - చెల్లెలు అన్నచేతికి రాఖీ కట్టడం నేటికీ ఉత్తరదేశంలోను, మనరాజధానిలోను ఉన్న ఆచారం. చెల్లెలి మానప్రాణరక్షణకు అన్నలు కట్టుకునే వీరకంకణం రాఖీ. ఆరాఖీ లేఖను చూసుకొని అక్బరు సేనలతో వచ్చి కర్ణావతికి తోడ్పడ్డాని మనం చరిత్ర పుస్త కాలలో చదువుకున్నాము.

సత్యాగ్రహం సమయంలో జరిగిన తమషాలు మీకూ తెలిసే ఉంటాయి. సత్యాగ్రహంలో చేరని పెద్దలకు కొంటె కోణంగులు గాజులు, కుంకుమా

పసుపూ, బంగీలు పంపేవారు. ఇవీ ఒకరకమైన జాబులేకదా !

వస్తువుల ఉత్తరం మనకు వింతగా ఉన్నట్లే మూర్ఖునికి కాయితంపై వ్రాసిన ఉత్తరం వింత. అలాటి కథ ఒకటి చెబుతాను.

## కథచెప్పే కాయితం

పూర్వం ఒక ఊళ్లో సాంబన్న అనిఒకడు ఉండేవాడు. జీవితంలో ఒక్కమారైనా పట్టణాలవైపు చూచినవాడుకాడు. వట్టి అమాయకుడు. పొట్టకూటికోసం నానాపాట్లుపడి ఆఖరుకు పట్టణం చేరుకుని ఒకరి ఇంట్లో నౌకరుగా కుదిరాడు. ఇంటి యజమాని చాల చిరాకు మనిషి. పొద్దు పొడిచింది మొదలు పొద్దు గూకేవరకూ ఒకేచాకిరీ. అయ్యగారికి అన్ని సేవలూ చేయాలి; చిన్నయ్యగారిని ఆడించాలి; తోటపనులుకూడా చేయాలి.

ఒకనాడు యజమాని భార్య సాంబయ్యను పిలిచి "అబ్బీ: ఇదిగో అయ్యగారు తోటకు వెళ్లారు. ఇది వారివద్దకు తీసుకొని వెళ్ళు" అని ఒక బుట్ట, ఒక తెల్లకాయితంముక్క అందించింది.

ఆబుట్టలో ఏముందో ? సాంబయ్య నిబ్బరం పట్టలేకపోయాడు. బుట్ట తెరిచి చూచాడు. నోట్లో నీరూరింది. కమ్మని వాసన. తన్ను తినమన్నట్టు పెద్ద కళ్లతో చూస్తున్నాయి లడ్లు. ఎన్నో ఉన్నాయికదా; అయ్యగారు అన్నీ తింటారా ? ఒకటి తగ్గినా వచ్చే నష్టమేమిటి ? సాంబయ్య అక్కడే కూచుని చక్కగా ఒక లడ్డు ఆరగించాడు.

తర్వాత సరదాగా కూనిరాగాలు తీసుకుంటూ తోట చేరుకున్నాడు. యజమాని తెల్లకాయితంముక్క చూచాడు; బుట్టలోని లడ్లు చూసుకున్నాడు, మరల కాయితంముక్క చూచాడు.

"ఏదీ ? మరొక లడ్డు ఉండాలే ! ఏదీ ? ఇక్కడ ఐదే ఉన్నాయి. ఆరోది ఏదీ ?" అని అడిగాడు సాంబయ్యను.

సాంబయ్య విస్తుపోయాడు. ఆ మాయలమారి కాయితంముక్క చూచిందా ఏమిటి తను లడ్డు తింటుండగా ; కాయితం మాట్లాడుతుందా ;

తను లడ్డు తిన్నట్టు కొండెం చెప్పింది అదే, కనుక మరొకసారి యజమానికి ఫలాహారాలు తీసుకు వెళ్ళేటప్పుడు మరింత జాగ్రతగా ఉండాలని నిశ్చయించుకున్నాడు సాంబయ్య. తను బుట్టలోని పదార్థాలు తినడానికి ముందు

కాయితంముక్కనునేలమీద పడేసి, మీద ఒక పెద్దరాయిపెట్టేవాడు. "ఈరాతి కింద ఇది పడి ఉండనీ. అక్కడనుంచి ఏమీ చూడడం పడదులే." ఇలా సాంబయ్య ఫలాహారాలలో ఒకటి తిని సంతోషంతో బయలు దేరాడు. ఈసారి కూడా సాంబయ్య ఎత్తు సాగలేదు. యజమానికి తెలిసిపోయింది.



ఏమిటి ఈపాడుకాయితంముక్కలో దయ్యమో, భూతమో ఉందా ? రాతికిందనుంచికూడ తన తప్పిదాన్ని చూచి యజమానికి చెప్పిందే ; అందరూ అతన్ని తిట్టారు—యజమాని, యజమాని భార్య, వంటవాడుకూడ. తిట్టని వాడు ఒక్క చిన్నయ్యగారు మాత్రమే. చిన్నయ్యగారు సాంబయ్య వీపుపై, ఎక్కి ఎప్పటిలాగే నవ్వుకుంటూ సవారీ చేశాడు.

మన పూర్వులు ఇలాటి కథలుచెప్పే కాయితం కనుక్కోడానికి ఎంతోకాలం పట్టింది. అంతకు చాలా పూర్వం వస్తువులే ఉత్తరాలుగా ఉండేవి. వక్కలూ, చిలుముగొట్టమూ వారికి శాంతిని చేప్పేవి; బల్లెం,బాణం యుద్ధాన్నిచెప్పేవి; ఎక్కు



పెట్టినవిల్లు ముట్టడిని చెప్పేది. వస్తువులతో పలకరించుకొనేకాలం మారి, కాయితాలతో పలకరించుకొనేకాలం రావడానికి కొన్నివేల సంవత్సరాలు పట్టింది.

చతుర్థ ప్రకరణం

# బొమ్మల జాబు

కాయితం కలం ఉంటే ఉత్తరం వ్రాయడం సులువు. కలంగాని కాయితంగాని లేకపోగా, యాభైనాలుగు అక్షరాలకు మారు బాణాలు, చిలుముగొట్టాలువంటి వస్తువులు కుప్పలుతిప్పలుగా ఉన్నా ఉత్తరం వ్రాయడం సులువు కాదు. అడవిలో ఒక పులి ముగ్గురు వేటగాళ్లను చంపివేసిందని ఎవరికైనా చెప్పదలచామనుకోండి. ఎలా చెప్పడం ?

మనదగ్గరున్న జంతువులలో బతికున్న పులి ఉండదు. ఇక మరణించిన వారి కళేబరాలు అసలే ఉండవుగదా ; ఇంతకూ అవి మనదగ్గరవున్నా అలాటి సర్వసామాన్యంకాని ఉత్తరం పంపడంకూడ కష్టం. అయితే, నిజంగా ప్రాణాలతోవున్న పులిని మనం ఉత్తరంలో పంపలేకపోయినా పులి బొమ్మను వ్రాసి పంపడం కష్టంగాదు. కనుక పాతకాలపు జనం వస్తువుల బంగీల ఉత్తరాలకు మారుగా బొమ్మల జాబు పంపేవారు. జనానికి చాలకాలంనుంచే బొమ్మలు గీయడం తెలుసు. నేడు మహాపట్టణాలయిన ప్రాంతాలు కీకారణ్యాలై పెద్ద పెద్ద రోమాలున్న మహాకాయమైన ఏనుగులు, ఆర్కిటిక్ ప్రాంతపు దుప్పలు తిరుగుతున్నప్పుడు మానవులింకా మృగాలలాగ గుహలలోనే నివసిస్తున్నప్పుడుకూడ మానవులకు బొమ్మలు గీయడం తెలుసు. వారు తాము చంపిన మృగాల యెముకలపైన, దంతాలపైన రకరకాల బొమ్మలు గీచారు. ఈ బొమ్మలేకాక బొమ్మల జాబులనదగిన బొమ్మల వరుసలు, సముదాయంకూడ అనాదికాలంనుంచి మనకు ఉన్నాయి. ఈలాటి బొమ్మల జాబులు కొన్ని వెడల్పైన ఎముకలమీద చెక్కి ఉన్నాయి. మరికొన్ని చెట్ల పట్టలమీద తొలిచి ఉన్నాయి. ఈ పాతకాలపు చిత్రాలలో కొన్ని రంగుచిత్రాలుకూడ ఉన్నాయి. ఈ రంగుచిత్రాలు దుప్పితోలుపైనాఉన్నాయి.

ఈవిధంగా సులువు, విజ్ఞానం కనిపెట్టిన మానవజాతి అప్పటమైన వస్తువులను - చిలుముగొట్టానో, మరొకటినో లేఖగా పంపడానికి మారు చిలుముగొట్టం బొమ్మను పంపేది, విల్లుకు మారుగా వింటి బొమ్మను; ఇట్లే పెక్కు

వస్తువులను పంపేది; కాని అన్నీ సాధ్యమయ్యేదికాదు. మనం గాలినో, జీవితాన్నో, ధైర్యాన్నో, సంతోషాన్నో ఎలా చిత్రించగలం ?

మనం ఈలాటి పాత బొమ్మల జాబులను పరిశీలిస్తే అప్పటివారు ఈ చిక్కులను చాల తెలివితో తప్పించుకొన్నట్లు తెలుసుకోగలం. వారు ఉబ్బిన తెరచాప బొమ్మలతో గాలిని సూచించేవారు. ప్రాణం ఉందని చెప్పడానికి పాము బొమ్మను గీసేవారు. వారికి పాము దీర్ఘజీవి, చిరంజీవి అనే నమ్మకం ఉండేది. "పడియుండదె పేర్మి పాము పదినూరేండ్లున్" అని మనవారి నమ్మకం. ధైర్యం సింహం బొమ్మతోనో, గరుడపక్షి బొమ్మతోనో తెలిపేవారు. అమెరికా ఆదిమవాసులు మనిషి సంతోషంతో వున్నాడని తెలుపడానికి మనిషిబొమ్మపక్కన తాబేటిజాతిబొమ్మవేసేవారు. అది అదృష్టసూచకమని వారి నమ్మకం. నేటికీ మూఢవిశ్వాసాలున్నవారు ఉత్తరాలలోను, ఇతరత్రాను ఇలాటి బొమ్మలు వ్రాస్తూఉంటారు. పాశ్చాత్యులలో గుర్రపులాడం గుర్తు శుభదాయకం. మనవారు మతచిహ్నాలయిన శంఖచక్రాద్యాయుధాలను, దేవతామూర్తులను ముద్రిస్తారు.

అమెరికాలో లేక్ సుపీరియర్ (మహా సరస్సు) సమీపంలోని ఒక పర్వతశిఖరంపై ఆదిమవాసులు చెక్కిన ఇలాటి అపురూపమైన జాబొకటివుంది.



దానిని-చదవడం చాల కష్టం. పైవరుసలో ఐదు పొడుగాటి నావల బొమ్మలున్నాయి. వాటిలో యాభైయొక్కరు ప్రయాణీకులున్నారు. ఇది ఈసరోవరం దాటి ఆదిమవాసులు ఆవలికి దండయాత్ర వెళ్ళినందుకు గుర్తు. గుర్రంమీద స్వారీచేస్తున్న వ్యక్తి ఆ జట్టు పెద్ద. దండయాత్ర మూడురోజులపాటు సాగి

ఉండాలి. ఎందుకంటే మూడు సూర్యబింబాల బొమ్మలున్నాయి. ఆ బింబాలపై ఉన్న మూడు కమానులు (ఆర్చిలు) ఆకాశానికి చిహ్నం. తాబేటిజాతి జంతువు బొమ్మ. గద్దబొమ్మ దండయాత్ర విజయవంతంగా జరిగిందనడానికి; ఆదిమ వాసులు మహాసాహసం చేశారనడానికి గుర్తులు. దాని తర్వాత కనిపించే వింత మృగం చిరుతపులి అని కొందరు భావిస్తున్నారు. ఇది జట్టుపెద్ద పేరయి వుంటుంది. అతనిని 'చిరుతపులి' ("పాంథర్") అనేవారు కాబోలు : అట్టడుగున వుండే పాము బొమ్మకు అర్థం-యుద్ధంలో ఎవరూ మరణించలేదని, అందరూ చెక్కుచెదరకుండా తిరిగి వచ్చారని.

ఈ బొమ్మల జాబును మాటలలో ఎలా మార్చుకున్నామో చూచారుగదా:

ఒక ఇంగ్లీషు రచయిత తన పుస్తకంలో చెప్పిన ఒక బొమ్మలజాబు కథ చెబుతాను. ఆ కథంతా బొమ్మలజాబుపైనే ఎలా నడిచిందో మీకు తెలుస్తుంది.

## దారి తప్పినదండు

"1837 నాటిమాట." అంటూ ఓడకప్తాన్ తన పాత కథకు ప్రారంభించాడు. "నేను అప్పటికి చాల చిన్నవాణ్ని. మిస్సిసిపి నదిలో 'జార్జి వాషింగ్టన్' అనే ఓడలో ప్రయాణం చేస్తున్నాను - ఆ ఓడ తర్వాత బాయిలరు ప్రేలి మునిగిపోయిందిలెండి. న్యూఆర్‌లియన్స్‌వద్ద కొందరు మా ఓడ ఎక్కారు. అడవులు, చిత్తడినేలలు కనిపెట్టడానికి బయలుదేరుతున్న పరిశోధకులట వారు. నేడు వారి ఆనవాలయినా లేదులెండి. వారంతా మంచి ఉత్సాహం తొణికిసలాడే ప్రాయంవారు. వారికెప్టెన్ మాత్రం నడివయస్సు గలవాడు. గంభీర స్వభావుడు. ఆయనకు తమాషాలు, పరిహాసాలు పనికిరావు. ఒక పక్క కూచుని నోటుబుక్కులో ఏదో వ్రాసుకొంటూ ఉండేవాడు. బాగా చదువుకున్నవాడని ఆయనను చూడగానే తెలుస్తుంది. తక్కినవారంతా తమాషాలు, తాగడం, ఆడడంలో మునిగి ఉండేవారు. వారి సహాయంకోసం వచ్చిన సైనికులైతే మరీను.

"ఆడుతూ, పాడుతూ, ఉన్నవారంతా ఓడ దిగిపోగానే, ఓడ వట్టిఎడారైనట్టు అనిపించింది. మొదట మొదట మేమంతా వారిసంగతే తరచు అనుకునేవారం. కాని, క్రమంగా వారి సంగతే మరచిపోయాము. మూడు నాలుగు

నెలలు గడిచాయి-ఎన్ని నెల్లు గడిచాయో కచ్చితంగా చెప్పలేను. నేను అప్పుడు మరొక స్టీమ్‌బోటులో పని చేస్తున్నాను. ఒకనాడు ఒక ప్రయాణికుడు నావద్దకు వచ్చాడు - బాగా తల పండిపోయిన ముసలాయన.

'మీరేనా జార్జికిప్స్?' అని అడిగాడు.

'అవునండి, నేనే' అన్నాను.

'మీరు జార్జివాషింగ్టన్ అనే ఓడలో పని చేసేవారని విన్నానే !'

'చిత్తం. నేనేనండి. అయితే, ఇప్పుడా సంగతి ఎందుకడుగుతున్నారు?'

'ఎందుకంటారా ? మా అబ్బాయి టామ్ ఆ ఓడలో పరిశోధకుల జట్టుతోపాటు వెళ్లాడు. అతనూ, ఆ జట్టువారూ దారి తప్పారు; కనిపించడం లేదు. ఆనవాళ్లుకూడ దొరకలేదు. వారిని వెదకడానికి నేనే బయలుదేరాను. మా అబ్బాయి జబ్బుపడి ఎక్కడైనా ఉండిపోయాడేమో!'

"నేనా ముసలాయన వైపు చూచాను. పాపమనిపించింది. ఆయన ఆ అడవుల్లోకి వెళ్లితే జ్వరమో, మరొక జబ్బో పట్టుకోవచ్చు. అనాదివాసులు కాల్చివేసినా వేయవచ్చు.

'ఏమిటి మీరు ఒంటరిగానే మీ అబ్బాయిని వెదకడానికి వెళ్లుతారా?' అని ప్రశ్నించాను.

'లేదు, ఎవరైనా నాకు తోడు రావాలి. నాతో వచ్చేవారిని ఎవరినైనా చూపలేరా ? బాగా డబ్బిస్తాను. అవసరమైతే నా భూమీ పుట్రాకూడ తెగనమ్మి వేస్తాను' అన్నాడు ముసలాయన.

'నేను కొంతసేపు ఆలోచించి, నేనే వస్తానులెండి వెళ్లుదాం' అన్నాను.

"మరుసటిదినం మేము ఒడ్డు చేరాము. అవసరమైన సరకులు జాగ్రగత చేసుకున్నాము. దారిచూపడానికి ఒక ఆదిమజాతివానిని కూడ కుదుర్చుకున్నాము. ఆ ప్రాంతంలోని ఇరుగుపొరుగును కనుక్కొని బయలుదేరాము.

"ఎన్నిమైళ్లు నడిచామో చెప్పలేను. నేను చాల బలమైన్నవాణ్ని; చాల అలసిపోయాను. ఆ ప్రాంతమంతా చిత్తడి, బురద. తిరిగి వెళ్ళిపోదామని ముసలాయనను బలవంతంచేశాను. 'మనం దారితప్పినట్టున్నామండీ'. అన్నాను. 'పరిశోధకులు ఈదారిని వెళ్ళిఉంటే ఏవైనా గుర్తులు ఉండేవికదా! మనం వచ్చి ఎన్నోరోజులయాయి. ఒక్కచోటన్నా గుడారాలు వేసినట్టుగాని. నెగళ్లు రాజ వేసినట్టుగాని కనిపించదే!' అన్నాను. దారిచూపడానికి వచ్చిన అనాదిజాతివాడు కూడ నామాటతో మాట కలిపాడు. దీనితో ముసలాయన తన ప్రయత్నం

మానుకొనేవాడే కాని ఇంతలో ఒక షామూలు ఇత్తడిగుండీ దొరికింది-దానితో ముసలాయన మనసు మార్చుకున్నాడు. ఆ ఇత్తడిగుండీయే ముసలాయన పాలిటి మృత్యువయింది.

"మేము అలసిపోయాము గనుక అడవిలోని ఒకచిన్న మైదానంలో కొంతసేపు మకాంవేశాము. నేను, దారిచూపడానికి వచ్చిన అనాధిజాతి వ్యక్తి నెగడు రాజవేసి, గుడారంవేసే ప్రయత్నంలో వున్నాము. ముసలాయన ఒక మాను మొరడుపై కూర్చున్నాడు. కూచున్నవాడల్లా అకస్మాత్తుగా కేకవేశాడు, 'జాన్! చూచారా! గుండీ!!'

"నేను తిరిగి చూచాను. అది ఆనాటి సైనికులు ధరించే గుండీలాంటి గుండీ. ముసలాయన ఆవేశంతో వెర్రెత్తిపోయాడు. గుండీని చూచి ఏడ్వడం మొదలుపెట్టాడు.

"ఇది నా టామ్ గుండీ. అబ్బాయి ఇలాటివే వేసుకొనేవాడు ఇకతప్పక దొరుకుతాడు."

"నేను అన్నానుగదా 'ఇది మీ టామ్ గుండీయే అని ఎలా అంటారు ? ఆయనవెంట మరి ఎనమండుగురు సైనికులు వెళ్లారుగదా !' అని.

'ముసలాయన కొంచెం నొచ్చుకున్నాడు. నాతో వాదించకండి. నేను దీనిని చూచిన తక్షణం ఇది మా అబ్బాయిదని పోల్చుకున్నాను' అని అన్నాడు.

"మరి మూడురోజులు నడిచాము. ముసలాయన ఏమైనా వెనక్కువెళ్ళడు. తిరిగి వెళ్లిపోదామని ఆయనను నిర్బంధించే ప్రయత్నంకూడ మానుకున్నాను. ఏమైనా ఈ గుండీ తప్పిపోయిన దండు ఆచోకీ తెలుసుకొనడానికి ఒక కిటుకే.

"మరుసటి రోజే ముసలాయనకు జ్వరం తగిలింది. పళ్లు పెట్లిపోతున్నది! వడవడ వణకిపోతున్నాడు. అయినా పడుకోనంటాడు.

"తొందరపడాలి టామ్ నాకోసం ఎదురు చూస్తున్నాడు ? అని పలవరించడం ప్రారంభించాడు.

"ఆఖరుకు ఎంతోసేపు లేవు ఈ పలవరింతలుకూడ. స్పృహ తప్పింది. నేను ముసలాయనకు మా నాయనగారికి చేసినంతగా రెండుమూడు రోజులు శుశ్రూష చేశాను. ఇన్నాళ్ల పరిచయంతో ఆయనంటే నాకు అభిమానం ఏర్పడింది. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఆ గుండీని పిడికిట పట్టుకొనే ముసలాయన ప్రాణాలు వదిలాడు. ఆయనకు అక్కడే ఖననాది సంస్కారాలు చేసి తిరిగి వెళ్ళాము - వచ్చినదారినికాదు; మరొకదారిని

వెళ్లాము. అప్పుడు ఆ దారిని సైనికులు విడిసిన నిజమైన గుర్తులు కనిపించాయి: మొదట నెగళ్లు వేసిన గుర్తులు, తర్వాత ఒక చిన్న ఘుండా. అటుతర్వాత కనిపించిన ముచ్చటైన వస్తు వేమిటంటే, ఒక చెట్టుపట్ట. దానిని నావద్దే ఇన్ని సంవత్సరాలుగా దాచాను."

తర్వాత కేప్టెన్ ఒక చిన్న పెట్టెను పైకి తీశాడు. దానిమీద మూడు చుక్కానుల ఓడ బొమ్మ ఉంది. కేప్టెన్ పెట్టె మూత తెరిచి భూర్జపత్రంవంటి దానిని పైకితీసి చూపాడు. భూర్జపత్రంలో ఈ బొమ్మ వ్రాసి ఉంది. కెప్టెన్ తన కథసాగించాడు.



"దీనిని ఆ జట్టులోని ఆదిమజాతివారిలో ఎవరో ఒకరు గీచి ఉంటారు. వారంతా దారితప్పి అడవి తిరుగుతూ ఉండినట్టు ఈ బొమ్మ చెబుతున్నది. దారిచూపడానికి వెళ్ళిన ఆదిమజాతివారు తమ ఆచారం ప్రకారం భూర్జపత్రంపై తమ సంగతి వ్రాశారు. ఆ భూర్జపత్రం అడవిలో అందరికీ కనిపించే అతి ముఖ్యమైనచోట చెట్టు కొమ్మకు దారంతో కట్టిపెట్టారు. నా వెంట వచ్చిన ఆదిమ జాతి వ్యక్తి ఆ బొమ్మలజాబు అర్థం విడదీసి చెప్పాడు. పైవరుసలో ఎనిమిదిమంది మనుషులున్నారు. వారి వరుసలోనే ఎనిమిది తుపాకులున్నాయి. వారు సైనికులన్నమాట. టామ్ వారిలో ఒకడు. రెండవ వరుసలోని చిన్న బొమ్మలు పరిశోధనలో పాల్గొన్న వారన్నమాట. వారి ముందు బల్లెం, పొగాకు చిలుముగొట్టం పట్టుకున్న వారు దారిచూపడానికి వచ్చిన అనాదిజాతివారు (రెడ్ ఇండియనులు). నెగళ్ళు వారు మకాంచేసిన గుర్తులు, అడుగున తలకిందుగా పడిన బీవరు (పందికొక్కువంటి జంతువు) బొమ్మకు అర్థం. ఆ పేరుగల అనాదిజాతివ్యక్తి మరణించాడని.

"ఈ ఉత్తరం చూచిన తర్వాత నేను మరల ఆ జట్టును వెదకాలని నిశ్చయించుకున్నాను. ఆదారిని అలాగే ముందుకు సాగివెళ్ళాము. వారంలోగా దారితప్పిన దండు కనిపించింది.

"ఎన్నోఏండ్లు గడిచిపోయాయి. ఈ భూర్జపత్రాన్ని చూచినప్పుడల్లా నాకు ఆ ముసలాయన పాట్లు, ఆయన గుండె జ్ఞాపకం వస్తాయి".

ఈ కేప్టెన్ చూపిన భూర్జపత్రంలో తలకిందుగా పడిన బీవరు బొమ్మ ఉంది కదూ! అమెరికాలోని ఆదిమవాసుల సమాధులపై నాటిన బండల మీద రాళ్లమీద ఇలాటి మృగాల బొమ్మలు తరచు కనిపిస్తాయి. ఇది మరణించిన వ్యక్తిపేరయినా అయి ఉంటుంది. తెగపేరయినా అయివుంటుంది. ఇదిగో! ఇక్కడొక రాయి ఉంది చూడండి. దీనిమీద పైవరుసలో కణితిబొమ్మ వుంది. దీనిపైన చెక్కిన బొమ్మలనుబట్టి ఆ సమాధిలో ఖననం చేయబడిన వ్యక్తి చరిత్ర యావత్తు తెలుసుకోవచ్చు. అతని పేరు వడిగా పరిగెత్తే కణితి, అలాటిదే మరొకటి అయిఉంటుంది. అతడు దుప్పుల వేటలో చాల దిట్ట. కణితి బొమ్మకింద చెక్కిన దుప్పిబొమ్మ దానికి గుర్తు. అతడు పెక్కు పోరాటాలు నడిపించినవాడు. కింద నిలువునా ఉన్న రెండు చుక్కల వరుసలు దానికి సూచన. ఆఖరు పోరాటం రెండు నెలలపాటు జరిగింది. గండ్రగొడ్డలి బొమ్మ, దానికిందఉండే రెండు చంద్రులు పోరాటాన్ని తెలుపుతున్నాయి. పోరాటంలో అతడు మరణించాడు. దీనిని చంద్రుల క్రిందుగా చెక్కిన బీవరు బొమ్మ చెబుతున్నది. ఇదంతా పగలు జరిగినదనడానికి మధ్యనవున్న సూర్య బింబం బొమ్మ గుర్తు.



ఇలాటి ఆచారాలే మనదేశంలోను వుండేవి. మన గ్రామాల పొలిమేరల లోనో, చెరువుగట్లమీదనో, కోటగవనులముందో లు బొమ్మున్న రాతిబండలు నాటి వుండడం చూచేవుంటారు. వాటిని వీరగల్లులంటారు. అవి ఆ ప్రాంతపు వీరుల సంస్మరణార్థం వేసినవన్నమాట. బల్లెమో, ఖడ్గమో పట్టుకుని యుద్ధానికి వెళుతున్నట్టు, క్రూరమృగాలతో కలియబడి పోరాడుతున్నట్టు బొమ్మలుచెక్కి ఉంటాయి. కొన్ని వీరగల్లులలో అస్పష్టమైన శాసనాలు ఉంటాయి; కొన్నిటిలో

1485

ఉండవు. స్థానిక చరిత్రలను, జనంనాలుకలపై ఉన్న కథలనుబట్టి వాటి వివరాలకు ప్రయత్నించవలసి ఉంటుంది.



ఒకొక్కప్పుడు కొందరు అనాదిజాతుల వారి ఒంటిని చూస్తే వారి జీవిత చరిత్ర యావత్తు తెలుసుకోవచ్చు.

ప్రియులు ప్రియురాండ్ర చెక్కులమీద ముఖాల మీద మకరికాపత్రాలు వ్రాసేవారని మన కావ్యాల్లో చదివాము. ఈ లాగే పచ్చబొట్టు పొడిపించుకొనే ఆచారం అనాదిగా ఉంది. మనదేశంలోను - మనదేశంలోనే కాదు; ఇతర దేశాల్లోను - అనాదిజాతుల వారు ఒళ్లంతా పచ్చ పొడిపించుకొనడం వ్యసనమైపోయింది. ఇలాంటి పచ్చ బొమ్మలు పొడిపించుకొనడం చిన్నతనంలోనే ప్రారంభిస్తారు. వయస్సు ముదిరిన మీదట వారు మనుష్యులులాగ కాక రంగు రంగుల రజాయిలాగ కనిపిస్తారు. లంబాడీలు, ఇతర అనాదిజాతులవారూ సహజ సుందరమైన తమ ఒంటిని పచ్చపులిమి ఎంతవికారం చేసుకొంటారో మనం ప్రత్యక్షంగానే చూడవచ్చు. వీటిలో కళాకౌశలం కూడ లేకపోలేదు.

వారు పచ్చ పొడిపించుకొనే పద్ధతి మరీ ఘోరంగా కనిపిస్తుంది. వాడి దువ్వెనవంటి వాటితో ఒళ్లు పొడుచుకొని, తర్వాత రంగులు నింపుకుంటారు.

కొన్ని ఆటవిక జాతులలో ఈ పచ్చబొట్టుకు ప్రత్యేకార్థాలు ఉన్నాయి. కులపెద్దలు మాత్రమే కొన్ని గుర్తులు పొడిపించుకోవచ్చు. కులపెద్ద తన విజయాలను సూచించే గుర్తులు వంటిమీద పొడిపించుకుంటాడు. పోలినీషియా దీవులలోని ఆదిమజాతులలో కులపెద్దకు తప్ప మరొకరికి భగవంతుని ముఖం పొడిపించుకునే హక్కులేదు. ఈ భగవంతుని ముఖారవిందం మనవారు భావించే దివ్యమంగళవిగ్రహంసి ముఖంకాదు; అతి భయంకరంగా ఉంటుంది. కులపెద్ద ఒంటిపైని పచ్చబొట్టు గీతలు, చదరాలు పోరాటాలకు గుర్తులు. తెల్లటి ధనుస్సు, నల్లని రెమ్మలు విజయానికి చిహ్నాలు.

ఆటవికులు, అనాగరికులు ఒంటిమీద బొమ్మలు పొడిపించుకొనడం మనకు అసహ్యంగా కనిపిస్తుంది. వారిసంగతే ఎందుకు? నాగరికులూ, చదువు కున్నవారూ నేటికీ రకరకాల పచ్చబొట్లు పొడిపించుకుంటారు. కాని ఆటవి కులులాగ ఒంటినిండా బొమ్మలు పొడిపించుకొనకపోయినా, పతకాలు, నక్ష



త్రాలు, పక్షులు, పేర్లు, పేర్ల పుటాక్షరాలు పొడిపించుకుంటారు. ఇవన్నీ వారి పదవిని, బిరుదులను, అభిరుచులను తెలిపేవేకదా ! ఆ మధ్యన ఒక ఉత్తరాది రాధాకృష్ణ భక్తగణం మనప్రాంతానికి వచ్చింది. భక్తపరమాణువులు తమ ఒంటినిండా సూదిమోపేంత స్థలంకూడా విడువకుండా రాధేశ్యామనామం పొడి పించుకున్నారు. తమను చూచినవారు రాధేశ్యామ నామం పఠించి తరించాలని వారి ఆశయమట.

కాళ్ళకు పారాణి పూసుకొనడం, గోళ్ళకు గోరింటాకు అంటించుకొనడం కూడా ఆ అనాగరికుల ఆచారభాగమేకదా !

పంచమ ప్రకరణం

# ససేమిరా వ్రాతలు

'ససేమిరా' కథ మీరు విన్నారా! చెబుతాను వినండి. పూర్వం విశాల అనే నగరం ఉండేది. దానిని నందుడనే రాజు పాలించేవాడు. అతనికి బహు శ్రుతుడనే మంత్రి, శారదాతనయుడనే గురువు వుండేవాడు. నందునికి ఒక కుమారుడు ఉండేవాడు. అతని పేరు విజయపాలుడు. మహాదుర్మార్గుడు. అతడొకనాడు వేటకుపోయి అడవిపందిని తరుముకుంటూ ఒక కారడవిలో ప్రవేశిస్తాడు. వేటాడుతూ అలసిపోయి, ఒక సరోవరం గట్టువద్ద గుర్రం దిగి, గుర్రాన్ని చెట్టుకు కట్టివేసి విశ్రమిస్తాడు. ఇంతలో ఒక బెబ్బులి అతనిపైకి దూకుతుంది. రాజకుమారుడు ప్రాణభీతితో పరిగెత్తి ఒక చెట్టు ఎక్కుతాడు. గుర్రం భయంతో తెంచుకుని పారిపోతుంది.

రాజకుమారుడు చెట్టేమో ఎక్కాడుగాని, అపాయం తప్పిందా? అక్కడ ఒక ఎలుగ్గొడ్డు అంతకుముందే ఎక్కికూచుంది. క్రిందికి దిగిపోదామంటె చెట్టుకింద పులి పొంచి కూచుంది. ఏమిచేయడానికీ తోచలేదు. ఎలుగ్గొడ్డు చాల మంచిది. ప్రాణభయంతో తన పంచకు వచ్చినవానిని చంపరాదని కరుణిస్తుంది. "నీవేమీ దిగులుపడవద్దు. నిన్ను చంపను" అని రాజుకుమారుని భయం పోగొడుతుంది. రాజకుమారుడు అసలే అలిసి వున్నాడు, ప్రాణభీతితో పరుగుతీశాడాయెను. ఎలుగ్గొడ్డు మాటల్లో నమ్మకం కలుగగానే కొమ్మలమీద ఒరిగి నిద్రపోతాడు. ఎలుగ్గొడ్డు అతడు పడిపోకుండా జాగ్రతగా కాపలా కాస్తూ ఉంటుంది.

రాజకుమారుడు నిద్రపోయిన తర్వాత పులి ఎలుగ్గొడ్డుతో అంటుందికదా, "ఎలుగ్గొడ్డా ఏలుగ్గొడ్డా మనుష్యులను నమ్మవచ్చా? అందులోను ఈ మనిషి మహా మోసగాడులా వున్నాడు; నీకు ద్రోహం చేస్తాడు; మనమిద్దరం అడవిలోనివారం. నాకెందుకు నష్టపరుస్తావు? అతడ్ని కిందికి తోసివేయి; చంపి యిద్దరం చెరిసగం పంచుకుందాం" అని విధవిధాలుగా బతిమాలుతుంది. ఎలుగ్గొడ్డు ఒప్పుకోదు. పులి చేసేదేమీలేక కిందనే పడివుంటుంది.

కొంతసేపటికి రాజకుమారునికి మెలకువ వస్తుంది. రాజకుమారుని మనసు పరీక్షిద్దామని ఎలుగ్గొడ్డుకు బుద్ధిపుడుతుంది. "నేను ఇంతవరకు నీ కోసం కాపలాకాచాను. ఇప్పుడు నాకు నిద్రవస్తున్నది. నీ తొడమీద పడుకుంటాను" అంటుంది. రాజకుమారుడు సరేనంటాడు. ఎలుగ్గొడ్డు నిద్రపోయినట్టు నటిస్తుంది. పులి రాజకుమారునిపై తన భేదోపాయం ప్రయోగిస్తుంది. "దొరా! చూచావా ! ఎలుగ్గొడ్డును ఎవరైనా నమ్ముతారా ? ఇది అనుకూల శత్రువు. నేను వెళ్ళినతర్వాత నిన్ను చంపుతుంది. కనుక దానిని కిందికి తోసివేయి. దానిని చంపి తిని నేను వెళ్ళిపోతాను" అంటుంది. పులి భేదోపాయం ఫలిస్తుంది. కృతఘ్నుడైన రాజకుమారుడు ఎలుగ్గొడ్డును కిందికి తోస్తాడు. ఎలుగ్గొడ్డు నిద్ర నటిస్తున్నదేగాని, నిద్రపోవడంలేదుగదా ! కనుక వెంటనే మరొక కొమ్మను పట్టుకొని ప్రాణాలు దక్కించుకుంటుంది. ఇంతలో తెల్లవారుతుంది. పులి నిరాశతో వెళ్ళిపోతుంది.

రాజకుమారుడు తనకిక చావు తప్పదని నిశ్చయించుకుంటాడు. ఎలుగొడ్డు అతనిని ఏమీ అనదు. "నమ్మకద్రోహం తలపెట్టినావు కనుక 'ససేమిరా ససేమిరా' అంటూ అడవిలో పిచ్చివాడిలాగ తిరుగుతూ ఉండు. నీ ద్రోహబుద్ధిని ఎవరైనా బట్టబయలు చేసేవరకు ఇదే నీకు శాస్తి" అని శపించి వెళ్లిపోతుంది. శాపప్రభావంవల్ల రాజకుమారుడు అడవిలో 'ససేమిరా ససేమిరా' అంటూ తిరుగుతూ ఉంటాడు.

బెదిరిపోయిన రాజకుమారుని గుర్రం పట్టి జీనుతో విశాల నగరం చేరుతుంది. రాజు గాభరాపడుతాడు. కుమారుని వెదకడానికి స్వయంగా బయలుదేరి కొన్నాళ్లకు అడవిలో పిశాచంలాగా 'ససేమిరా ససేమిరా' అంటూ తిరుగుతున్న కుమారుని చూస్తాడు. ఊరికి పిలుచుకొనివెళ్లి వైద్యాలు, భూతవైద్యాలు చేయిస్తాడు; కుదరలేదు. కొడుకుజబ్బు కుదిర్చినవారికి అర్ధరాజ్యం ఇస్తానని చాటిస్తాడు. రాజకుమారుని పిచ్చికి విరుగుడు చేయగలవాడొక శారదా తనయుడేనని మంత్రి నమ్మకం. కనుక రాజకుమారుని దయదలచవలసిందిగా అతను శారదా తనయుని కోరుతాడు. శారదాతనయుడు దివ్యదృష్టితో అడవిలో జరిగినదంతా గ్రహించాడు. 'ససేమిరా' అనేవి అడవిలో జరిగిన సంగతులు తెలిపే మాటల మొదటి అక్షరాలని తెలుసుకుంటాడు. రాజకుమారుని పిచ్చి కుదర్చడానికి ఒప్పుకుంటాడు.

రాజు కొలువు తీరుస్తాడు. శారదాతనయుడు తెరలోపల ఉండి రాజకుమారుని విపిన వృత్తాంతం సూచించే పద్యాలు చెబుతాడు. ఒక్కొక్క

పద్యమే చెబుతూఉంటే, రాజకుమారుడు ఒక్కొక్క అక్షరంమాని, తుదకు పూర్వజ్ఞానంలో యధాస్థితికి వస్తాడు. శారదా తనయుడు మొదట:

"సజ్జనభావము కల్గు సు
హృజ్జనులను మోసపుచ్చు టది నేరుపె నీ
పజ్జం దొడపై గూర్చిన
యజ్జంతువు జంప జూచుటది పౌరుషమే."

అని అనగానే రాజకుమారుడు 'ససేమిరా' అనే నాలుగక్షరాలలో మొదటి అక్షరమైన 'స'మాని 'సేమిరా సేమిరా' అంటుంటాడు. తర్వాత శారదాతనయుడు.

"సేతువు దర్శింప మహా
పాతకములు బాసిపోవు బ్రాణసఖునకున్
ఘాతుక మతి నొనరించిన
పాతక మేతీర్థసేవ బాయునె నరునిన్ ?"

అని మరొక పద్యం చదివాడు. రాజకుమారుడు 'సేమిరా'లో సేవర్ణం మానివేసి 'మిరా మిరా' అనడం ప్రారంభించాడు. తర్వాత రాజగురువు

"మిత్రద్రోహి కృతఘ్నుడు
ధాత్రీసురహంత హేమతస్కరుడు సురా
పాత్రీభూతుడు నిందా
పాత్రులు వీరెల్ల నరకభవనావాసుల్"

అనగానే రాజకుమారుడు 'మిరా'లో 'మి' వదలి 'రా రా' అంటుంటాడు. రాజ గురువు

"రాజేంద్ర విజయపాలుని
రాజితశుభమూర్తి జేయ రతిగలదేనిన్
పూజార్హుల వీరెల్లర
బూజింపు మనూన దానభోజన విధులన్"

అని మరొక పద్యం చదవగానే రాజకుమారుడు శాపం తొలగి పూర్వ స్మృతి పొందుతాడు. తన అరణ్య వృత్తాంతం అందరికీ వినిపిస్తాడు.

విన్నారు కదూ ఈ కథ! ఇది జక్కన విక్రమార్క కథలోనిది. ఇక్కడ ముఖ్యం గనుక చెప్పవలసి వచ్చింది.

'ససేమిరా' అనేమాట కొన్ని పదాలు మొదటి అక్షరాలు కలవడంవల్ల కదా అయింది! అలాగే కొన్ని వస్తువులపేర్ల మొదటి అక్షరాలు, కొన్నిపదాల

మొదటి అక్షరాలు కలిపి మరొకపదమయ్యే చిత్రమైన ముగ్గులు, లిపులు, బొమ్మలు ఈజిప్టు దేశంలోని దేవాలయాల గోడలమీద, పిరమిడ్ల గోడలమీద కనిపించాయి. పిరమిడ్లంటే కూచిగా ఎత్తుగా కట్టిన స్తూపాలు. ఈ చిత్రా లేమిటో తెలుసుకొన డానికి పండితు లెన్నో సంవత్సరాలు శ్రమపడ్డారు. వాటిలో కొన్ని సులభంగా అర్థమయాయి. ఈ బొమ్మలన్నీ అప్పటి వారి జీవితానికి ప్రతిబింబాలే. చేతులలో



ఏ కాయితాలచుట్టలవంటివో పట్టుకుని కాకివెదురు కలాలు చెవుల వెనుక దోపుకుని కూర్చున్న వ్రాయసంవారు; హారాలు, సుగంధ ద్రవ్యాలు, చేపలు, తెలకపిండి అమ్ముతున్న వ్యాపారస్తులు; గాజుపాత్రలు చేస్తున్న కార్మికులు, బంగారు గాజులు, ఉంగరాలు చేస్తున్న స్వర్ణకారులు; తోలుకప్పిన ఢాలు పట్టుకొని బారులుతీరి పరుగులుతీస్తున్న ఫేరోవారాజుల పదాతులు—ఇలాటి దృశ్యాల వల్ల అప్పటి ఈజిప్టు కార్ఖానాలు ఎలాఉండేవో, అప్పటి దుకాణాలలో వ్యాపారం ఎలా సాగేదో, రాజుల సబరు ఎలాటిదో తెలుసుకోవచ్చు.

కొన్నివేల సంవత్సరాలక్రితం ప్రజల జీవితాలను తెలిపే ఈ సరళమైన బొమ్మలచుట్టూ అర్థంకాని ఏవో ముగ్గులూ, గుర్తులూ ఉన్నాయి.

ఈ గోడలపై పాములు, గుడ్లగూబలు, డేగలు, బాతులు, పక్షితలలున్న సింహాలు, కమలాలు, చేతులు, తలలు, పద్మాసనంలో కూర్చున్నమనుషులు తలపైకిచేతులెత్తి నిలబడి ఉన్న మనుష్యులు, కుమ్మరి పురుగులు, తాటాకులు-ఇంకా ఇలాటి బొమ్మలెన్నో చెక్కి ఉన్నాయి. ఇవన్నీ పుస్తకాలలో అక్షరాల లాగ వరుసలు వరుసలుగా చెక్కి ఉన్నాయి. ఈ బొమ్మలలో లెక్కలేనన్ని రేఖా గణితాకారాలు, చతురస్రాలు, త్రికోణాలు, వృత్తాలు, కొలుకులు - ఉన్నాయి.



ఇవి ఎన్ని ఉన్నాయో లెక్కపెట్టడంకూడ కష్టం.

ఈ వింత గుర్తులలో-గూఢచిత్రలిపులలో-ఈజిప్టు ప్రజల చరిత్ర, జీవిత విధానం దాగిఉన్నాయి. కాని, ఈరహస్యాన్ని తెలుసుకొనడానికి పండితులుఎంత శ్రమపడినా ఈ గూఢ చిత్రలిపి చదవడం సాధ్యం కాలేదు. ప్రాచీన ఈజిప్టు దేశీయుల సంతతివారైన 'కోప్టులు' తమ తాత ముత్తాతల ఈ బొమ్మల వ్రాతలను ఏనాడో మరచిపోయారు గనుక, వాటిని చదవడంలో ఎంతమాత్రమూ తోడ్పడలేకపోయారు. కాని, పండితులు ఎంతో శ్రమపడగా పడగా ఈ గూఢ చిత్రలిపి రహస్యం బయటపడింది.

అవి నెపోలియన్ బోనపార్టీ విజయయాత్ర రోజులు. అయన సేనాపతిత్వంలో కొందరు ఫ్రెంచి సైనికులు 1799 లో ఈజిప్టు కోస్తాలో దిగారు. రోసెట్టీ అనే నగర పరిసరాలలో ఆ సైనికులు కందకాలు తవ్వుతుండగా, ఒక పెద్ద బండరాయి కనిపించింది. దానిమీద గ్రీకు భాషలోను, ఈజిప్టు భాషలోను శాసనాలున్నాయి. ఈ ద్విభాషా శిలా శాసనం దొరికినందుకు పండితులు సంతోషసంభ్రమాలతో ఉప్పొంగిపోయారు. ఇకనేముంది! ఈ గూఢచిత్ర లిపికి సులుసూత్రం దొరికింది. వారిక చేయవలసిందల్లా గ్రీకు ఈజిప్టు వ్రాతలను తైపారు చేయడమే. దానితో గూఢచిత్రలిపి రహస్యం విస్పష్టమౌతుంది— అన్నట్టు తోచింది. కాని ఏమిటి ప్రయోజనం? వారికి నిరాశ తప్పలేదు.

శాసనంలోని వ్రాత మామూలు బొమ్మలవ్రాత-చిత్ర లిపి-అని పదానికొక బొమ్మచొప్పున ఉంటుందని పండితులు మొదట భావించారు. కనుక ప్రతి బొమ్మను ఆ అర్థమిచ్చే పదంతో పోల్చి చూచారు. కాని అర్థం కుదరలేదు.

ఇరవయ్యేండ్లు గడిచాయి. షాంపోలియన్ అనే ఫ్రెంచి పండితుడు ఈ రహస్యం కనిపెట్టకపోయిఉంటే నేటికీ ఈ గూఢచిత్రలిపి చదవడం అయ్యేదికాదు. ఈ చిత్రలిపులలో కొన్ని చిత్రాలలో బిగించినట్టు చెక్కివుండడం షాంపోలియన్ గుర్తించాడు. ఈ పక్కన చట్రంలో ఉన్న గ్రీకు శాసనంలోనిది ఈజిప్టు పాలకుడైన ఫెరోదాటాలమీ పేరు.

"ఈ చట్రంలోని పదం టాలమీ అనే పేరయి ఉంటుంది" అని షాంపోలియన్‌కు తోచింది. తన ఊహే నిజమైతే, ఈ గుర్తులు అక్షరాలయి ఉంటాయి అని అతడు అనుకున్నాడు.

ఈ అక్షరాల వివరణ చూడండి :

Π Τ Ο Λ Μ Ε Ε C

P T O L M E E S

కాని ఇది కేవలం ఊహే. ఈ గుర్తులకు నిజంగా మరొక అర్థం ఉందేమో! తన ఊహే నిజమనడానికి మరొక నిదర్శనం కావాలి. షాంపోలియన్ అదృష్టం కలిసివచ్చింది. కొందరు పండితులు ఫైల్ దీవిలో పరిశోధనలు జరుపుతూఉండగా, రెండుభాషలలో శాసనమున్న ఒక స్తంభం కనిపించింది. ఈ శాసనంలో క్రింది చట్రంలో చెక్కిన ఒక పదం తరచు కనిపించింది. షాంపోలియన్ ఈ ద్విభాషా శాసనం పరిశీలించాడు. తను ముందు చూచిన శాసనంలోని అక్షరాలు కొన్ని ఈ శాసనంలోను ఉండడం వెంటనే గుర్తించాడు.

ఆ బొమ్మలకింద ఆ బొమ్మలను తెలిపే పదాల మొదటి అక్షరాలు పెట్టాడు. తర్వాత ఆ అక్షరాలను పక్కనే వున్న గ్రీకు శాసనంతో పోల్చిచూచాడు. అక్కడ ఆ స్థలంలో క్లియోపాట్రా అనే పేరుంది. చాల ఆశ్చర్యపడ్డాడు.

· Λ Ε Ο Π · · · ·

L E O P

అంటే తన ఊహ సరైందేనన్నమాట. అంటే దీర్ఘ చతురస్రాకారంగా ఉన్న చట్రాలలోని బొమ్మలు పదాలకు సంకేతాలు కావు. విడివిడి అక్షరాలకు సంకేతమన్నమాట. ఇప్పుడు షాంపోలియనుకు అలాటి గూఢ చిత్రాక్షరాలు పదకొండు తెలిశాయి—**P, T, O, L, M, E, S, K, A, T, R.**

షాంపోలియన్ క్లియోపాట్రా అనే పేరును కనుగొన్న పద్ధతిని చూడండి : ఈ పదంలో క్, ల్, ఏ, ఓ, ప్, ఆ, ట్,ర్, ఆ-అనే అక్షరాలున్నాయి. మొదటిది మోకాలిబొమ్మ. కాప్టిక్ (ఈజిప్టు) భాషలో క్నే లేక క్లే

అంటే మోకాలు. కనుక మోకాలి పదం కకారానికి గుర్తు. అంటే క్నే పదం లోని ప్రథమాక్షరం మాత్రమే మనం ఉచ్చరించాలన్నమాట. రెండవది సింహం. ఆ భాషలో లెబాయ్ లేక లెబూ అంటే సింహం; కనుక లకారానికి గుర్తు. మూడవది రెల్లు, దాని నాభాషలో ఏకే అని, పాత ఈజిప్టుభాషలో అక్ అని అంటారు. కనుక రెల్లు-ఏ కే-ఇకారానికి గుర్తు. ఇవి మూడూకలిసి క్లే అయింది. నాల్గవది ఉచ్చు. ఇది ఓకారం గుర్తు. ఐదవది చాప. ఇది పకారం గుర్తు. ఆర వది గద్ద. దీనిని అఖూమ్ అంటారు. కనుక ఇది అకారానికి గుర్తు, ఏడవది చేయి. దీనిని టూట్ అంటారు. అంటే టకారం. ఎనిమిదవది నోటి బొమ్మ. దీనిని రు లేక రో అంటారు. కనుక రేఫం. తొమ్మిదవది మరల గద్ద. అంటే అకారం. ఈ తొమ్మిది అక్షరాలూ కలిసి క్లియోపాత్రా అనే పేరయింది, ఆఖరులో వున్న అర్ధ చంద్రాకారం బొమ్మ ఆడవారి పేరుకు గుర్తు.

ఈ పద్ధతినిబట్టి మనం పాప అని వ్రాయదలచుకుంటే పండు, ఆకు, పండు, అప్పడం బొమ్మలు వ్రాయవలసి ఉంటుంది.

షాంపోలియన్ తను కనిపెట్టిన పదకొండు అక్షరాలతో చిత్రాలలో లేని తక్కిన పదాలను కనుగొనడానికి ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. తర్వాత ఎన్నో సంవత్సరాలకుగాని ఈ రహస్యం తెలియలేదు. అసలు విషయమేమిటంటే, ఈజిప్టువారు పేర్లుమాత్రమే ఈ విధంగా వ్రాసే వారు. తక్కిన పదాలను వివిధవిధాలుగా వ్రాసేవారు. వారి వ్రాతలలోని గుర్తులు-చిత్రాలు-పూర్తి పదాలను, కొన్ని పదభాగాలను, మరికొన్ని కేవలం అక్షరాలను సూచించేవి. అంటే నిర్దిష్టమైన పద్ధతి ఏదీలేక కలగాపులగంగా ఉండేవి.

ఈజిప్టువారుకూడ అమెరికా ఆదిమజాతి వారివలె చిత్రాలతోనే తమ భావాలు తెలిపేవారు. కాని ఇది చాల పాతకాలంమాట. క్రమక్రమంగా ఆ చిత్రాలు-భావాలకు, పదార్థాలకు ఏర్పడిన చిత్రాలు-ఆయా చిత్రాల ప్రథమాక్షరాలను తెలిపేవిగను, ప్రథమాక్షరాన్ని తెలిపేవిగాను, తుదకు ధ్వనిని మాత్రమే తెలిపే అక్షరాలుగాను పరిణమించాయి. ఉదాహరణకు: ఈజిప్టు భాషలో గూబను "ములక్" అంటారు. దీనిని తెలుపడానికి మొదట గూబ బొమ్మనే వ్రాసేవారు. ఈ బొమ్మ తర్వాత 'ము' అనే మొదటి రెండక్షరాలను తెలుపడానికి గుర్తయింది. అప్పటికి గూబ బొమ్మ వ్రాయడం పోయి, గూబ ఆకారంతో పోలే మామూలు గుర్తు వ్రాసేవారు. ఈ గూబ బొమ్మ సంకేతరూపం నుంచి మకారం (మీమ్) పరిణమించింది. ఇది కొన్నివేల సంవత్సరాల పరిణామం. అంటే చిత్ర లిపి-బొమ్మలవ్రాత-క్రమంగా గూఢ సంకేతలిపి అయి, తర్వాత వంకరగీటుల లిపిగా మారి, పిదప ప్రజల కైవాడంతో నలిగి నలిగి

గొలుసుకత్తు వ్రాతగా మారి, ఆపిమ్మట ఒక స్థిరమైన ఆకారంలో అక్షరాల రూపం పొందింది.

ఈ చిత్ర లిపులు వేల సంవత్సరాలు గడువగా, నైల్ మహానదీ తీరం నుంచి పాశ్చాత్య దేశాలకు వ్యాపించి, పెక్కు మార్పులతో వివిధ వర్ణ మాలలు అయాయి.

ప్రాచీన పారశీకుల వ్రాతను కనుగొనడం ఈజిప్టు చిత్రలిపిని కనుగొన డంకన్నా తమాషాగా జరిగింది. పారశీకులు తమ పొరుగున ఉన్న బాబిలోనియా వారివలె తమ వ్రాతలను బంకమట్టి పలకలపై కర్రముక్కలతో వ్రాసేవారు. ఈ కర్రముక్కలను స్టైలస్ అనేవారు. ఈ లిపి బాణాలవలె ఉంటుంది. కనుక 'బాణలిపి' (క్యూనిఫారం) అన్నారు. ఈ బాణాలనే అరబ్బులు మేకులనుకొని 'మిస్‌మారి' (కీలలిపి) అన్నారు. బాణాకారంలో ఉన్న ఈ లిపి కొనలు కుడి వైపునకుగాని, కిందవైపునకుగాని, ఏటవాలుగా కుడివైపునకుగాని ఉంటాయి. మీదికిగాని, ఎడమకుగాని ఉండవు. రెండు బాణాలు కలిసినప్పుడు మాత్రం రెండు మొనలూ ఏటవాలుగా ఉంటాయి.

ఈ కీల లిపిని మొదట కనిపెట్టినవారు సుమేరియనులు. వీరు మెసపొటేమియాదేశ వాస్తవ్యులు. ఈ లిపిని తెలుసుకొనడానికి కూడా విద్వాంసులు పెక్కు సంవత్సరాలు పరిశ్రమించవలసి వచ్చింది. బంకమట్టి పలకలలో గుంతలు గుంతలుగాను, గట్లుగట్లుగాను ఉన్న ఈ అపూర్వ లిపిని చదివే ఆశ వదలుకునిఉన్నప్పుడు అకస్మాత్తుగా కిటుకు దొరికింది. గ్రాట్‌ఫెండ్ అనే జర్మన్ విద్వాంసుడు ఈ లిపిని సాధించాడు. ఈజిప్టులో దొరికిన శాసనాలవలె ద్విభాషా శాసనాలు దొరికిఉంటే, ఒకదానితో మరొకటి పోల్చి చూచి లిపిని కనుగొనడానికి అవకాశం ఉండేది. కాని ఇక్కడ అలాటి ద్విభాషా శాసనాలు దొరకనందున ఈయన పని మరీ కష్టమైంది.

ఈయన పారశీకరాజుల శాసనాలు పరిశీలుస్తుండగా కొన్ని పదాలు తరచు కనిపించాయి. ఈ పదాలు బహుశ "పారశీకులరాజు" అనేవో, అలాటివే మరి రెండు పదాలో అయిఉంటాయని ఆయన ఊహించాడు. ఈ ఊహ నిజమైతే ఈ రెండు పదాల వెనుక ఉన్న పదం రాజుపేరయి ఉండాలి. ఉదాహరణకు "కిర్, పారశీకులరాజు" (Kir, King of the Persians).

ఒక శాసనంలో ఈ పదం ఏడు కీలలిపి చిహ్నాలతో ఉంది. గ్రాట్‌ఫెండ్ ప్రాచీన పారశీకరాజుల పేర్లన్నిటినీ - డేరియస్, కిర్, జరజస్, అర్త, జరజస్-జ్ఞాపకపరచుకొని, వాటిని కీలలిపులతో అన్వయించడం ప్రారంభించాడు. డేరియస్ అనేదానిని ప్రాచీన పారశీక భాషలో "ద్ అర్ ఇవ్ ఉష్" అని వ్రాసే



వారు. ఈ అక్షరాలు డేరియస్ పేరుతో పోల్చగా అక్షర సంఖ్య సరిపోయింది.

D A R I V U SH

గ్రాంట్ ఫెండ్‌కు ఇప్పుడు ఏడక్షరాలు తెలిశాయి. మరొక పదంలో తనకు తెలిసిన అక్షరాలు కనిపించాయి. ఒక్క మొదటి అక్షరం మాత్రం కొత్తది. ఇది క్ అయిఉంటుందని ఊహించడం అంత కష్టంకాలేదు. దీనితో క్ ష్ ఇ అర్ ష్ ఆ- జరజస్ అనే పదమైంది.

SH I A R SH A

కిటుకు ఇక తెలిసిపోయింది. మనకు ఆశ్చర్యం కలిగించే దేమిటంటే ఈజిప్టు శాసనాల లిపిని కనుగొన్న షాంపోలియనుకు, పారశీక కీలలిపిని గుర్తిం

చిన గ్రాట్‌ఫెండ్‌కు రాజులపేర్లే అక్షరాలను తెలుసుకొనడంలో సాధనం కావడం. దీనితో ప్రాచీన పారశీకపు వ్రాతలన్నీ సులువుగా తెలిసిపోయాయి.

ప్రాచీన పారశీకులే ఈ లిపిని కనిపెట్టలేదు, వారు బాబిలోనియనులనుంచి గ్రహించారు. బాబిలోనియనులు సుమేరియనులనే తెగవారినుంచి. సుమేరియనులుకూడ ఇతర ప్రాచీన జాతులలాగే మొదట చిత్రాలతోనే భావ ప్రకటన చేసేవారు. ఈ చిత్రాలు వృత్తాకారంలో-అంటే గుండుగా-కాక చతురస్రాకారంగా గీచేవారు; ఈ లిపిని బాబిలోనియనులు కొంత మార్పులతో ప్రచారానికి తెచ్చారు. వేల సంవత్సరాలు గడువగా ఈ చిత్రాలు పూర్తిపదాలను సూచించడానికి మారు పదాల ప్రథమాక్షరాలను తెలిపేవిగా మిగిలాయి.

పారశీకులు ఈ కీలలిపిని మరింత సరళంచేసి, ప్రతి గుర్తు ఒక ధ్వనిని తెలిపే అక్షరంగా నిర్ణయించారు.

ఇది ప్రాచీన పారశీక లిపి. ఇప్పటి ఈరానీలిపి ఈ లిపినుంచి పుట్టలేదు.

ఈ రెండు గూఢలిపులు ఎన్నోవేల సంవత్సరాల తర్వాత, షాంపోలియన్, గ్రాట్‌ఫెండ్ గ్రహించి, వాటి స్వరూపాన్ని ప్రపంచానికి తెలిసిన తర్వాత ఎందరో కొత్తవారు వాటిని చదివి నేర్చుకొనడానికి సాధ్యమైంది. కాని అంతమాత్రాన చిక్కులు తీరలేదు. హిట్టైట్స్ అనబడే తెగవారి అపూర్వ పరిపాలన కొనసాగిన సిరియాలోను ఆసియా మైనరులోను కనిపించిన సింహ ప్రతిమలమీద, స్ఫింక్షక్స్ (స్త్రీ ముఖం,సింహశరీరంగల రాక్షస) ప్రతిమలమీద చెక్కిన అక్షరాలను ఇంతవరకూ ఎవరూ చదవలేకపోతున్నారు. ఈ గొప్ప జాతిని గురించి మనకు తెలిసినదెల్లా ఈజిప్టువారు తెలిపినదానినిబట్టి మాత్రమే. వీరి వ్రాతలను చదువగలిగినప్పుడే ఈ విస్మృత జాతి విస్మృత చరిత్రను తెలుసుకోగలం.

ఇంతకూ వట్టి అక్షరాలు చదివినంతమాత్రాన ప్రయోజన మేమీలేదు. షాంపోలియన్ కోప్ట్ తెగవారి భాషను తెలుసుకోక పోయివుంటే, ఈజిప్టు శాసనాలను అర్థంచేసుకోగలిగేవాడు కాదు. (కోప్టులనేవారు ప్రాచీన ఈజిప్టు దేశీయుల సంతతివారు. వారి భాషనుంచి ప్రాచీన ఈజిప్టు ప్రజల బాష ఇలాటిదని ఊహించుకోవచ్చు.)

లిపి విజ్ఞానం సంగతి వస్తే మన అజ్ఞానం ఇంకా అధ్వాన్నమని తేలుతుంది. ఇంకా ఎన్నో లిపులు మనబుద్ధి చొరనంత గహనంగా ఉన్నవి. ఇటలీ ఆదిమవాసులైన ఇట్రుస్కన్‌లనే తెగవారి వ్రాత మనకు నేటికీ తెలియదు. వీరి లిపికి, గ్రీకులిపికి చాల పోలికలున్నాయి. కనుక వీరి శాసనాలనుంచి పదాలను

విడదీయడం అంతేమీ కష్టంకాదు. కాని ఇట్రుస్కనుల భాష ఎవరికీ తెలియదు. కనుక ఆ శాసనాల అర్థం ఎవరూ కనుక్కోలేక పోయారు.



ఎంతటి దురవస్థో చూడండి! ఈ ప్రాచీన శాసనాలు మనకు అందుబాటులో ఉన్నాయి. వాటిని చదవనూ గలుగుతున్నాము. అయినా వాటిలో ఏముందో తెలుసులేకపోతున్నాము. అబ్బ! మనమింకా ఎన్ని జటిలసమస్యలను విడదీయాలో! మనం ఒక్కొక్కరూ మన జీవితంలోనే ఎన్ని పాతవిషయాల రహస్యాలు భేదించాలో!



షష్ఠ ప్రకరణం

# ఈజిప్టు అక్షరాల యాత్ర

బొమ్మల తర్వాత - చిత్రలిపి - క్రమంగా అక్షరాలుగా పరిణమించింది. కాని కొన్ని ప్రాంతాలలో, నేటికీ, చిత్రలిపి వ్యవహారంలో ఉంది. ఉదాహరణకు చీనాదేశీయులనే తీసుకుందాము, వీరు ఎన్నోజాతులకన్నా ముందు నుంచి అతి ప్రాచీన కాలంనుంచి నేటివరకు చిత్రలిపితోనే వ్రాస్తున్నారు. కాయితం, మందుగుండు సామగ్రి, పింగాణీ, ముద్రణం (పేపరు, పౌడరు, పోర్సెలిన్, ప్రింటింగు) ఇతర దేశాలవారికి తెలియక ముందే, చాలకాలంక్రితమే చీనావారికి తెలుసు, కాని లిపి మారలేదు.

高

ఇంతకూ మనలో కూడ చిత్రలిపివాడకం వాసన పూర్తిగా పోలేదనే అనాలి. చూపుడువేలు మాత్రం చాచిన చేతిబొమ్మ, బాణం బొమ్మ, ఎలక్ట్రిక్ తంతులున్న స్తంభంపై ఎర్రటి వంకర వంకర కాంతిరేఖలు ఏమిటి ? "ఈ దారిని వెళ్లండి" "కరెంటు, జాగ్రత్త!" అనేకదా! అంటే ఈ బొమ్మలు-చిత్రలిపి-పూర్తివాక్యం తెలుపుతున్నవనే గదూ !

కొన్ని కొన్ని సందర్భాలలో చిత్రలిపులు అసలు వర్ణాలకన్నా ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటాయి. చీనావారికి ఇవి పూర్తిగా అవసరం. ఈచిత్ర లిపులకు మారు వారు అక్షరాలను వ్రాయదలచుకోక పోవడం మాత్రమేకాదు; అలా చేయడం వారితరం కాదుకూడా. ఎందుకంటే, చీనావారి భాష చాలా విచిత్రమైంది. దానిలో పదాలు చాలకొద్ది. ఈ పదాలయినా చాల చిన్నవి - ఒక అచ్చు మాత్రం కలవి. ఇంతేకాక ప్రతిపదానికి నానార్థాలుంటాయి. నానార్థాలున్న పదాలు మనకుకూడా నేడు లేకపోలేదు. కాని చీనావారి భాషలో ప్రతి పదానికీ నానార్థాలుంటాయి. ఈ నానార్థాలను వ్రాతలో తెలుపడం ఎలా ! ఇది మొదట మొదట చాల అసాధ్యంగానే తోచింది. కాని, వారీ చిక్కు తొలగించు కొనడానికి మంచి దారి కనిపెట్టారు. ఉదాహరణకు 'చూ' అనే పదం తీసు

కుందాము. దీనికి ఓడ, వాగుడు, చిచ్చు, గుంట, మెత్తని ఈక అనే అర్థాలున్నాయి. 'చూ' అన్నపదం తెలుపడానికి తెరచాప కట్టిన ఓడకొయ్య బొమ్మ వ్రాస్తారు. అంటే ఓడ అన్నమాట. వాగుడు అనే అర్థం ఇవ్వడానికి ఈ ఓడ బొమ్మ కుడిపక్కన నోరుబొమ్మ వ్రాస్తారు. చిచ్చు అనడానికి ఈ బొమ్మ పక్కనే నిప్పుబొమ్మ వ్రాస్తారు. తెరచాప, నీరు వ్రాస్తే గుంట, తెరచాప, ఈక వ్రాస్తే మెత్తని ఈకలు.

చీనావారు ఈ చిత్రలిపినే మరింత సరళంచేసి వ్రాత సులభంగా సాగడానికి అనువుగా చేశారు. చేతికివచ్చినట్టు చిందరవందరగా, ఎక్కడబడితే, అక్కడ కలిపినట్టు, నల్లటి చారలు పూసినట్టు కనిపించే చీనా అక్షరాలలో ఏవి మనుష్యుల బొమ్మలో, గుర్రాల బొమ్మలేవో, నక్షత్రాల బొమ్మలేవో, ఏవి సూర్యచంద్రుల బొమ్మలో గుర్తించడమే కష్టం. నేటి మన అక్షరాలలో వాటి పూర్వ స్వరూపాలయిన గూఢ చిత్రలిపులను, చిత్రాలను గుర్తుపట్టడం-ఏవి ఏ చిత్రాలనుంచి పరిణమించాయని తెలుసుకొనడం-మరీకష్టమనుకోండి !

నేడు మనం వ్రాసే అక్షరాలలో ప్రతిదీ మొదట్లో ఏదో ఒక వస్తువు చిత్రమంటే మీరు నమ్ముతారూ? పండితులు వేటగాళ్ళులాగ ఈ చిత్రలిపుల వెంటబడి అవి కాలక్రమాన నేటి అక్షరాలుగా పరిణమించిన దశలను కనుగొన్నారు. ప్రపంచమంతటా మొదట ఈ చిత్రాక్షరాలే ఉండేవి. నేడు యూరోపులో వాడుకలో ఉన్న లిపులన్నీ మొదట చిత్రాలుగా ఉన్నవే. ఈ చిత్రాల స్వస్థలం ఈజిప్టు. ఈజిప్టువారు తమ భావాలను అతి ప్రాచీనకాలంలోనే బొమ్మలతో తెలిపేవారని మీరు ఇదివరకే చదివారు. కాని అన్నిటినీ బొమ్మలతో తెలుపడం ఎలా సాధ్యం? పేర్లను బొమ్మలతో వ్రాయడం ఎలా? పేరుకూడా ఏదో వస్తువు పేరే అయితే ఆ వస్తువు వ్రాస్తే సరిపోతుంది. అమెరికా ఆదిమవాసులు ఇలాగే చేసేవారు : "పెద్ద బీవరు" అనే పేరు వ్రాయడానికి బీవరు బొమ్మ వ్రాసేవారు. "వుడ్ బెర్రీ" అనే పేరుందనుకోండి. దానిని వ్రాయడానికి పేరును విడదీసి-వుడ్, బెర్రీ అని రెండుగా చేసి మొదట వుడ్ పదం అర్థమైన అడవిని సూచించడానికి చెట్ల వరుస వ్రాసేవారు. తర్వాత బెర్రీ పదార్థమైన పండ్లను సూచించడానికి చిందరవందరగా పండ్ల చిత్రాలు

ఓడ

వాగుడు

చిచ్చు

గుంట

మెత్తని ఈక

వేసేవారు.

పేరు వస్తువవంటిది కాకపోతే ఏమిచేయాలి ? రాముడు, సీత అనే పేర్లు ఎలా వ్రాయడం ? ఈ దశలోనే అక్షరాలు ఆవిర్భవించాయి. పదానికో, పద ప్రథమభాగానికో సంకేతాలుగా ఉన్న నూరారు చిత్ర లిపులతోపాటు ఈజిప్టువారు ఇరవై అయిదు ధ్వనివాచక సంకేతాలను-అక్షరాలను-కూడా వాడడం మొదలుపెట్టారు. ఇది చాల సులువుగా జరిగింది. ఈజిప్టువారి భాషలో చాల చిన్న పదాలున్నాయి. ఉదాహరణకు "రు" అంటే నోరు. నోటి బొమ్మ నోరు అనేదానికేకాక, ఈ పదం మొదటి అక్షరమైన ర్ (R) అనేదానికి కూడా సంకేతమైంది. ఈ విధంగా పెక్కు చిత్ర లిపులు అక్షరాలుగా వాడుకకు వచ్చాయి.

ఒక బొమ్మ ఒక్క ధ్వనినే తెలిపేదిగా మారుతున్నప్పటికీ, ఈజిప్టువారు, ఈ కొత్త పద్ధతితోపాటు పాతపద్ధతైన చిత్ర లిపినికూడ వాడుతూ ఉండేవారు. వారు తరచు పదాలను అక్షరాలతో సూచిస్తూ, వాటి కుడిపక్కనే ఆ పదానికి అదివరకు అలవాటులోఉన్న చిత్రాన్నికూడ గీచేవారు. వారు పాత చిత్ర లిపి పద్ధతిని వెంటనే తోసిరాజని కొత్త పద్ధతి అయిన లిపి వ్రాతను అనుసరించలేదు. ఉదాహరణకు : "త్న్" అనే పదం తీసుకుందాము. ఈ పదానికి పుస్తకం అని అర్థం. వారు "త్న్" అని వ్రాసి దాని కుడిపక్కనే పుస్తకం బొమ్మకూడ వ్రాసేవారు. "అన్" అంటే చేప. ఈ రెండక్షరాలూ వ్రాసినా, దాని పక్కన చేపబొమ్మనూ వ్రాసేవారు.

| | |
|---|---|
| 日 | సూర్యుడు |
| 月 | చంద్రుడు |
| 山 | కొండ |
| 水 | నీరు |
| 火 | నిప్పు |
| 木 | చెట్టు |
| 犬 | కుక్క |
| 馬 | గుర్రం |
| 子 | శిశువు |
| 目 | తల |

అక్షరాలతో పదాలను సూచించే అలవాటు పడకపోవడంవల్ల మాత్రమే వారిలా చేసేవారనుకుంటారేమో ! కాదు. మరొక కారణం కూడ వుంది. చీనా భాషలోలాగ ఈజిప్టుభాషలోను పరస్పరం పోలికగల పదాలు పెక్కు ఉండేవి. అంటే ఒక పదం మరొక పదంతో చాల దగ్గర పోలికలతో వ్రాసేవారన్న

మాట. ఒక పదానికి మరొక పదమని భ్రాంతి పడకుండా చేయడానికి, అర్థం చిక్కులు తొలగించడానికి ఇది ఈ అర్థంలోనే వాడామని సులువుగా తెలుసుకొనడానికి గాను కుడిపక్కన బొమ్మలు వ్రాయడం అన్నమాట. ఈ బొమ్మలు పక్కన లేకపోతే చాల చిక్కులు వచ్చేవి. ఎందుకంటే ఈజిప్టువారికి ధ్వనులు తెలిపే సంకేతాలలో హల్లులు తోచాయిగాని, హల్లులకు ప్రాణమైన అచ్చులు తోచలేదు. ఉదాహరణకు ; "హ్ప్ర్" అనే పదం తీసుకుందాము. దీనికి కుమ్మరిపురుగు అని అర్థం. ఉచ్చారణేమో హ్ (ఇ) ప్ (అ) ర్ అనవలసి ఉంది. కాని వ్రాసేదేమో, 'హ్ ప్ ర్' అని అచ్చులు లేకనే. "క్త్బ్" అనే మరొక పదం చూడండి. దీనికి పుస్తకం అని అర్థం. అవసరమైనప్పుడు 'కుతుబ్' అని పలుకుతారు. కతబ్ అంటే వాడు వ్రాశాడు. కోతెబ్ వ్రాస్తాను. ఎక్తాబ్ నేను వ్రాస్తున్నాను. కాతిబ్ వ్రాయసకాడు. ఇలా ప్రసంగాన్నిబట్టి అర్థంచెప్పుకోవలసివస్తుంది. అందుకనే అచ్చులు ప్రాణాలు. మనం కూడా అచ్చులు లేకనే పదాలు వ్రాసేపక్షంలో ఇలాటి సులుసూత్రాలు వాటిపక్కనే వ్రాయవలసి ఉంటుందేమో ! కనుక ఈజిప్టువారు పదాలపక్కన బొమ్మలెందుకు వ్రాసేవారో ఇప్పుడు స్పష్టమైందికదా !

ఈ చిత్రలిపి-వంకరగీటుల సంకేత లిపులనుంచే నేటి పాశ్చాత్యవర్ణమాల రూపొందింది. అంటే, ఈ లిపులు వాడుకచేసిన ఈజిప్టువారే వర్ణమాలను కూడ కనిపెట్టారని భావిస్తారేమో ! కాదు. ఈజిప్టువారు ఈ లిపులను వాడుతున్నప్పటికీ వర్ణమాలను-అక్షరసమామ్నాయమును-కనిపెట్టలేదు. వారిపెపైరస్ పుస్తకాలలోను, వారి దేవాలయకుడ్యాలమీద లిపులతో సూచించిన పదాలపక్కనే అన్ని విధాల చిత్రలిపులూ వ్రాసి ఉండడమో, చెక్కి ఉండడమో మనం చూడవచ్చు. వీటిలో కొన్ని పూర్తి పదానికి, కొన్ని పదప్రథమ భాగానికి, కొన్ని పదప్రథమాక్షరాలకు గుర్తులన్న సంగతి మీకు ఇదివరకే తెలుసు.

అయితే, నేటి పాశ్చాత్యదేశాల వర్ణ సమామ్నాయానికి మాతృక అయిన తొలి వర్ణసమామ్నాయాన్ని కనిపెట్టినవారు ఎవరు ? ఈజిప్టు వారికి శత్రువులయిన 'సెమ్' తెగకు చెందిన 'హిక్కు'లనేవారు. వీరిని సెమెటిక్కులు సామీలు అని వ్యవహరిస్తారు. వీరు సుమారు నాలుగువేల సంవత్సరాలక్రితం ఈజిప్టుకు తూర్పుదిక్కునుంచి, అరేబియానుంచి, నైల్‌నదీ తీరప్రాంతంపై దండెత్తివచ్చి, ఈజిప్టువారిని గెలిచి, నాలుగువందల సంవత్సరాలపాటు ఈజిప్టును పరిపాలించారు. వీరు ఈజిప్టువారినుంచి వ్రాత నేర్చుకుని, బొమ్మలు గాని, చిత్రలిపిగాని అవసరం లేకుండా కేవలం అక్షరాలతోనే పదాలు వ్రాయడం కనిపెట్టారు. ఇది వీరి అమూల్యమైన, అపూర్వమైన కృషి, వీరిదే ప్రపంచం

లోని వర్ణమాలలలో మొదటిదని కొందరంటారు. వీరు ఈజిప్టువారి చిత్రలిపుల నుంచి ఇరవై యింటిని మాత్రం తీసుకొన్నారు; ఆ చిత్రలిపులను అతి సులభమైన పద్ధతిని అక్షరాలుగా మార్చుకున్నారు.

మనం ఇంగ్లీషు బాలశిక్షలలోను, మొదటి తరగతి పుస్తకాలలోనూ వర్ణమాల బొమ్మలతో వివరించి ఉండడం చూస్తూనే ఉన్నాము, A అనే అక్షరం పక్కన Axe (గండ్రగొడ్డలి) బొమ్మ, B అనే అక్షరం పక్కన Bee (తేనెటీగ) బొమ్మ ఉన్న బాలశిక్షలనుంచే మనం అక్షరాలు నేర్చుకున్నాము. కనుక అలాటి బాల శిక్షలు మనకు బాగా తెలుసు. కాని A, B, అనే అక్షరాలను



వట్టి ఏక్స్ బొమ్మతోనో, బీ బొమ్మతోనో చూపవచ్చునని మనకు ఎప్పుడైనా తట్టిందా? హిక్కులకు అది తట్టింది; వారు చేసినపనీ అదే. A అక్షర ధ్వనికి వారు ఎద్దు తలకాయ బొమ్మను వ్రాయడం మొదలుపెట్టారు. వారి భాషలో ఎద్దును 'అలెఫ్' అంటారు. B అనే అక్షరధ్వనికి వారు ఇంటి బొమ్మను వ్రాశారు. వారి భాషలో ఇంటిని "బేత్" అంటారు. R అనే అక్షరానికి మనిషితలకాయ బొమ్మను వ్రాశారు. వారి భాషలో మనిషి తలకాయను "రేష్" అంటారు. ఈ విధంగా వారు ఇరవై, ఇరవైయొక్క ధ్వనుల గుర్తుం బొమ్మలను పోగుచేసుకున్నారు. ఈ బొమ్మలన్నింటినీ వీరు ఈజిప్టువారి చిత్ర లిపు నుంచి గ్రహించినవే. ఈజిప్టువారి వ్రాతలలో కావలసినన్ని బొమ్మలు-తలలు, ఇండ్లు, ఎడ్లు, హిక్కులకు అవసరమైనవి మరెన్నో-ఉన్నాయి. వాటిని వీరు ధ్వనులకు అనుగుణంగా ఉపయోగించుకున్నారు.

ఈ సెమెటిక్ లిపిలో చెక్కిన ఒక శిలాశాసనం పాలస్తీనా ప్రాంతంలోని ఢీలాన్ అనేచోట 1868లో ఒక క్రైస్తవ పాదిరీకి దొరికింది. ఇది తమదంటే తమది అని టర్కీవారు, అరబ్బులు పోరాడి పగులగొట్టారు. తర్వాత దీనిని పురాతత్త్వ శాస్త్రజ్ఞులు అతికించారు. దీనిని ఇప్పుడు పారిస్ మ్యూజియంలో భద్ర పరచారు. దీనిలో మోయాబ్ తెగ రాజయిన మేష అనే వాని దిగ్విజయం వర్ణించివుంది. ఇతడు సోలమన్ సార్వభౌముని సామంతుదని, లక్ష గొఱ్ఱెలను, లక్ష పొట్టేళ్ళను అతనికి కప్పంగా చెల్లించేవాడని, తర్వాత అతనిపై తిరగబడ్డాడని బైబిలులో ఉదాహరించబడింది. స్పష్టమైన అక్షరాలతో, స్పష్టమైన అర్థంతో ఉన్న అతి ప్రాచీన శాసనాలలో మొదటిది ఇదేనని పలువురి అభిప్రాయం. అంటే క్రీస్తుకు వేయి సంవత్సరాలముందుది; ఇప్పటికి మూడువేల సంతవ్సరాలది. ఈ లిపి అంత ప్రాచీనం కాదని మరి

కొందరు పరిశోధకుల అభిప్రాయం. ఈ శాసనం 'మోబైట్' శాసనం అని ప్రసిద్ధి పొందింది. చిత్ర లిపి పూర్తిగా మాయమై విస్పష్టమైన వర్ణమాలకు దీనితో స్థిరత్వం ఏర్పడింది.

వంద సంవత్సరాలు గడిచాయి. ఈజిప్టు వారు హిక్కులనబడుతున్న ఈ సెమ్ తెగ (సెమెటిక్) విదేశి పరిపాలకులను తరిమివేసి, వారి పాలనను అంతం చేశారు. హిక్కుల ప్రభుత్వం నామరూపాలులేకుండా పోయింది. కాని వీరి అక్షర సమామ్నాయం మాత్రం ఈజిప్టునుంచి తూర్పుగా మధ్యధరాసముద్రతీర దేశాలకు వ్యాపించింది. ఈ దేశాలలో నివసించిన సెమెటిక్ తెగవారు-సముద్రాజీవులైన ఫినీషియనులు, పశుపాలన వృత్తిగాగల యూదులు-తమ మూలపురుషులయిన హిక్కుల వ్రాతలను భద్రపరచుకొన్నారు.

సిరియాదేశ సముద్రతీరభాగాన్ని ఫినీషియా అనేవారు. ఇక్కడివారు ఫినీషియనులు; వీరు యాత్రలలోను, వ్యాపారంలోను నిపుణులు. వీరు ఇప్పటికి ఐదువేల ఏళ్ల నుంచే చాల నాగరికులు. వీరి ఓడలు గ్రీసుదేశపు సముద్రతీరం వరకు, సైప్రస్ దీవి వరకు, దూరంలో ఉన్న జిబ్రాల్టర్ జలసంధివరకు కూడ ప్రయాణం చేసేవి. దూరదూర దేశాల సముద్ర వ్యాపారమంతా వీరి చేతిలోనే ఉండేది. వీరు విదేశాలలో దిగగానే తమ సరకును - పాత్రలు, అమూల్యమైన కంఠాభరణాలు, కత్తులు, గొడ్డళ్ళు గాజు గిన్నెలు మున్నగునవి-ముఖ్యంగా సముద్రపు నత్తగుల్లల నుండి తీసిన పసుపు, నీలంరంగులను, అమ్మకానికి పెట్టేవారు. వీటిని ఇచ్చి చర్మాలు, చేనేత వస్త్రాలు, దాసదాసీజనం మున్నగువానిని పుచ్చుకొనేవారు. వీరు తమ సరకులతోపాటు తమ వర్ణ సమామ్నాయం కూడ దేశదేశాలకు తీసుకొని వెళ్ళారు. ఫినీషియావారితో వ్యాపార సాపారాలు చేస్తున్న ప్రజలు వీరి వర్ణ సమమ్నాయంకూడ స్వీకరించి వాడుక చేసుకున్నారు. ఫినీషియావారు అలవాటు చేసిన అక్షరాలు కచ్చితంగా ఈజిప్టునుంచి వచ్చిన సెమెటిక్ అక్షరాలు కావు. వీరికి వ్యావృత్తి ఎక్కువ. కూచుని పాత అక్షరాల వలె బొమ్మలు గీయడానికి తీరిక యేది? ఎద్దు తలలు, పాములు, తలలు మొదలయిన బొమ్మలను రేఖామాత్రంగా, తొందరగా వ్రాయడానికి తగినట్టు మార్పులు చేసుకున్నారు. ఈ అక్షరాలుకూడ సెమెటిక్ లిపులలాగే కుడినుంచి ఎడమకు వ్రాసేవే.

ఈ ఫినీషియా అక్షరాలు సముద్రాలు దాటి గ్రీసు చేరాయి. అక్కడి నుంచి పడమరగా పయనించి ఇటలీ చేరాయి. ఉత్తరంగా ప్రయాణం చేసి రష్యా మున్నగుదేశాలు చేరాయి. ఇవి ఫినీషియా వదలి వెంటనే ప్రపంచ యాత్రకు బయలుదేరలేదు. గ్రీసులో దాదాపు రెండువేల సంవత్సరాలుండి

తర్వాత ఉత్తరంగా ప్రయాణం సాగించాయి. ఈ స్థల జలయాత్రలో ఇవి ఎంతో మారిపోతూ వచ్చాయి.

| | ఈజిప్టు | హిక్ | ఫినీషియా | పాత గ్రీకు | తర్వాతి గ్రీకు | స్లావ్ | ఇంగ్లీషు |
|---|---|---|---|---|---|---|---|
| అలఫ్-ఎద్దు | | | | A | a | a | A |
| బేత్-ఇల్లు | | | | B | B | B | B |
| గేమల్-మూల | Γ | L | | ᒣ | Γ | Γ | G |
| డేంట్-తలుపు | | | | Δ | Δ | Д | D |
| హోయ్-'హే'అని అరుస్తున్న మనిషి | | | ∃ | ∃ | Є | Є | E |
| జాయ్-ఆలివ్ రెమ్మ | | I | I | I | Z | Z | Z |
| కాఫ్-తాడి కొమ్మ | | | | K | K | K | K |
| లావ్-పగ్గం | | | | | λ | Л | L |
| మాయ్-నీరు | | | | M | M | M | M |
| నబస్-పాము | | | | N | N | N | N |
| వావ్-కన్ను | | | O | O | O | O | O |
| రో-నోరు | | | | | π | П | P |
| రీస్-తల | | | | | P | P | R |
| సాత్-కొండ | | | W | ϟ | C | C | S |
| టాయిట్-సిలువ | + | + | X | T | T | T | T |

ఈజిప్టు చిత్రలిపులు ఫినీషియా, గ్రీసు, రోము దేశాలమీదుగా తక్కిన పాశ్చాత్య దేశాలు చేరడానికి నాలుగువేల సంవత్సరాలు పట్టింది. ఈ మహా

ప్రయాణంలో ఎన్నో మార్పులు జరిగాయి. దూరం మారిపోయింది; దారి మారింది; గుండ్రంగా ప్రయాణం; నాగేటి చాలులాగ కుడినుండి ఎడమకు, మరల ఎడమనుంచి కుడికి ప్రయాణం, తలకిందులుగా ప్రయాణం చేశాయి. ఫినీషియనుల ఓడలలో ప్రయాణం చేశాయి; గులాములు మోసుకుపోయే పెపైరస్ చుట్టల బుట్టలలో ఊరేగాయి; దేశాలు తిరిగే సన్యాసుల వీపులసంచులలో విశ్రమించాయి. ఈ సప్తసముద్ర సంచారంలో కొన్ని పోవడంలో ఆశ్చర్యమేముంది? పోయినవి పోగా, పాతవాటికి కొత్త అక్షరాలు తోడయాయి. ఇంతగా తిరిగి తిరిగి పూర్వస్వరూపం గుర్తుపట్టనంతగా మారిపోయి నేటి పాశ్చాత్యలిపుల రూపం దాల్చాయి.

వీటి ఆది స్వరూపం తెలుసుకొనడానికి, పోల్చుకోడానికి ఈజిప్టు చిత్ర లిపిని (**Hieroglyphics**) సిరియా ద్వీపకల్పంలోని హెటోర్‌దేవత ఆలయంలో కనిపించే హిక్కుల వంకరగీతల లిపిని (**Hieratic**) ఫినీషియా, గ్రీకు, స్లావ్, ఇంగ్లీషు లిపులతో పక్క పక్కన పెట్టి పోల్చిచూద్దాము. (పుట-49.)

ఈ అక్షరాల పంక్తులను చూస్తే కొమ్ములున్న ఎద్దుతల **A** గా ఎలా మారిందో తెలుస్తుంది. ఎద్దుతల క్రమంగా తలకిందులైపోయి, కొమ్ముల పోలిక **A** కింది భాగంలో కనిపిస్తుంది.

మొదటి లిపులన్నీ ఇప్పటి లిపులకు పెడముఖంగా ఉండడం చూచారు గదా! ఆఖరు మూడు వరుసలు తప్ప తక్కినవన్నీ వెనక్కు చూస్తున్నవి. దీనికి కారణ మేమిటంటే పాత ఫినీషియావారు మనలాగ ఎడమనుంచి కుడికి వ్రాయడానికి మారు కుడినుంచి ఎడమకు వ్రాసేవారు. దాదాపు మూడువేల సంవత్సరాలనాడు గ్రీకులు ఫినీషియావారి అక్షరాలు గ్రహించినప్పుడు కుడినుంచి ఎడమకే వ్రాసేవారు. తర్వాత నాగేటిచాలువలె, కుడినుంచి ఎడమకు సాగించి, అక్కడినుంచి మరల కుడికి తిప్పి, ఇలాగే మరల కుడినుంచి ఎడమకు కొంతకాలం వ్రాసేవారు. కాని ఈ నాగేటిచాలు పద్ధతి అనుకూలంగా కనిపించలేదు కనుక తుదకు ఇప్పుడు మనం వ్రాసేలాగ ఎడమనుంచి కుడికి వ్రాయడం స్థిరపరచుకొన్నారు. ఇలా స్థిర పడటం రెండువేల అయిదువందల సంవత్సరాలకు ముందన్నమాట.

గ్రీకులు తమ ముందున్న వ్రాతపద్ధతిని మార్చడంతోపాటు అక్షరాలను కూడా ఇటువైపుకు తిప్పారు. తిప్పకముందు వ్రాతలు నేటి అరబ్బీ, ఫారసీ వ్రాతలలాగే వెనకచూపుతో ఉండేవి. ఇంతేకాదు ఫినీషియా అక్షరమాలలోని రెండక్షరాలను వదలి, నాలుగక్షరాలు చేర్చారు. ఈ వర్ణమాల ఇటలీ చేరినప్పుడు అక్కడివారు కొంత మార్పుచేసి, ఒక అక్షరం తగ్గించారు. రోమనులు

ఇంగ్లండును జయించినప్పుడు, ఆంగ్లేయులు ఈ వర్ణమాలను తీసుకున్నారు. అప్పుడు దానిలో ABCDEFGHIKLMNOPQRSTVXYZ మాత్రం ఉండేవి. ఆంగ్లేయులు JUW అనే మూడక్షరాలను కొత్తగా చేర్చుకోగా నేటి ఇంగ్లీషు వర్ణమాల ఇరవైయారు అక్షరాలతో స్థిరపడింది. ఈ వర్ణమాలకు అల్ఫా, బేటా అనే మొదటి రెండక్షరాల పాత పేర్లతో "అల్ఫబేట్" అనే వ్యవహారం వచ్చింది. సెమెటిక్ భాషలో - అంటే హిబ్రూల భాషలో ఎద్దు తలకు 'అలెఫ్' అని, ఇంటికి 'బేత్' అని పేర్లని ఇదివరకే మీరు చదివారు. లిపులను గ్రీకులు ఫినీషియనుల నుంచి తీసుకున్నప్పుడు AB మున్నగు అక్షరాలకు ఎద్దుతలకాయ, ఇల్లువంటి ఆకారంతో సంబంధంలేదు. అయినా, పాత వ్యవహారంలో అక్షరాలపేర్లయిన అలెప్ బేత్ అనేవి అల్ఫా, బేటా, గమ్మ అని కొంత భ్రష్ట రూపంతో గ్రీకువారి వ్యవహారంలోను వచ్చి రూఢమైంది. ఇది కేవలం రూఢేకాని ఈ పేర్లకు అక్షర స్వరూపానికి ఏమీ సంబంధంలేదు. అయినా, వర్ణ సమామ్నాయానికి మొదటి రెండక్షరాల పేర్లతో 'అలెఫ్-బేట్' 'అల్ఫా-బేటా' 'అల్ఫా బెట్' అనే పేరు వచ్చింది. ఈ వర్ణమాలకు 'ఏబీసీడెరియా' (ఏ. బి. సి. డి లు) అనే వ్యవహారం కూడ ఉండేది.

అయితే కుడినుంచి ఎడమకు వ్రాయడం కంటే ఎడమనుంచి కుడికి వ్రాయడం ఎందుకు అనుకూలంగా కనిపిస్తున్నది? నిజానికి, ఎడమనుంచి కుడికి వ్రాసినా, కుడినుంచి ఎడమకు వ్రాసినా, చీనావారిలాగ పై నుంచి కిందికి వ్రాసినా ఏమిటి వ్యత్యాసం?

ఆఁ ! వ్యత్యాసం ఉన్న మాట నిజమే. ఈజిప్టువారు కూడ మొదట్లో చీనా వారిలాగే పై నుంచి కిందికి వ్రాసేవారు. ఈ వ్రాయడంలో లేఖకులు ఎడమచేత్తో పెపైరస్‌చుట్ట పట్టుకొని, కుడిచేత్తో వ్రాసేవారు. ఎడమచేత్తో పెపైరస్ పట్టుకున్నప్పుడు కుడిచేత్తోనేకదా వ్రాయవలసి ఉంటుంది! పెపైరస్‌ను ఎడమచేత్తో గట్టిగా పట్టుకోవాలి. కొంచెం పట్టు సడలించారా, పెపైరస్ చుట్ట చుట్టుకొనిపోయేది. కుడిచేత్తో కుడివైపున పై నుంచి కిందికి వ్రాత ప్రారంభించడం తప్పనిసరి అయేది. ఎందుకంటే, ఎడమనుంచి ప్రారంభించడానికి పట్టుకొన్న ఎడమచేయి అడ్డు తగిలేది. ఈ పుస్తకం ఈ పద్ధతిలో వ్రాశామనుకోండి; ఒకదానికింద మరొక అక్షరం పేర్చినట్టుగా ఉంటుంది.

కాని ఈ పద్ధతి అంతగా అనుకూలంగా ఉండేదికాదు. లేఖకుడు పైనుంచి కిందికి మొదటి పంక్తిని ముగించి రెండవపంక్తిని మొదలుపెట్టేటప్పుడు ఆరీ ఆరని మొదటి పంక్తి చేయి తగిలి అలుక్కుపోయేది. చీనావారు ఇండియా కరక్కాయ సిరావంటి దానిని వాడేవారు గనుక త్వరగా ఆరిపోయేది. ఈజిప్టు

వారు పొగమసి, కూరగాయల సరి, నీళ్ళు కలిపి తయారుచేసిన సిరా వాడేవారు. ఇది చాల నిదానంగా ఆరేది. ఈ చిక్కు తొలగించుకొనడంకోసం వారు పై నుంచి కిందికి వ్రాయడానికి మారు కాగితంపై అడ్డంగా కుడినుంచి ఎడమకు వ్రాయసాగినారు. అప్పుడు కుడిచేయి ధారాళంగా వట్టి కాయితంపై ఆడేది. మొదట వ్రాసిన పంక్తులను చెరిపే అవకాశమే లేకపోయింది. ఈవిధంగా పైనుంచి కిందికివ్రాసే పద్ధతి పోయినా, కుడినుంచి ఎడమకు వ్రాసే అలవాటు మాత్రం పోలేదు.

ఈవిధంగానే చాలాకాలం సాగింది. క్రమంగా గ్రీకులు రెండువైపుల నుంచి వ్రాసేవారు, నాగేటిచాలులాగా. ఈ పద్ధతి చాలాకాలం ఉందని ఈవరకే తెలుసుకున్నాము. ఈ రెండు పద్ధతులలోను యూరోపియనులలో ఎడమనుంచి కుడికి వ్రాసే అలవాటు స్థిరపడింది. హీబ్రూ తెగవారు, అరబ్బులు, పారశీకులు, మరికొందరు కుడినుంచి ఎడమకే వ్రాస్తున్నారు నేటికీ.

ఈ అరబ్బీ, పారశీ, హీబ్రూ లిపులు అరమీనుల లిపినుంచి ఆవిర్భవించాయి. అరమీనులు ముందు మనకు తెలిసిన హిక్కులలాగ 'సెమ్' తెగవారు. వీరి పూర్వ నివాసస్థలం ఏదో తెలియదు. బైబిలులో వీరి ప్రస్తావన ఉంది. ఇప్పటికి నాలుగున్నర వేల సంవత్సరాలనాటి అక్కాడియన్ తెగవారి



శాసనాలలో వీరు 'అ-ర-అమ్' అని వ్యవహరించబడ్డారు. అస్సీరియావారు వీరిని ఆరుము, అరము అని అన్నారు. గ్రీకులు వీరిని సిరియనులని; వీరు పాలించిన, నివసించిన దేశాన్ని సిరియా అని అన్నారు. వీరు అరేబియా ఈశాన్య భాగంనుంచి ఒకవైపు సిరియాకు, మరొక వైపు మెసపొటేమియాకు వలస వెళ్ళారు. ఉత్తర సిరియాలో రాజ్యాలు స్థాపించుకున్నారు.

వీరి రాజ్యాలు ఇప్పటికి మూడువేలవంద సంవత్సరాల నాటివి. తర్వాత అవి నాలుగైదు వందల సంవత్సరాలపాటు ఉన్నాయి. పిదప అస్సీరియా సామ్రాజ్యంలో కలిసిపోయాయి. అరమీనుల లిపిని యూదు జాతివారు వాడేవారు.

ఇలా ఈజిప్టు చిత్రలిపి చిత్ర విచిత్ర యాత్రను మనం చూచాము. ఇది వివిధ వేషాలతో, ఆకారాలతో ప్రపంచమంతా ప్రయాణం చేసింది. గ్రీసుగుండా ఉత్తరానికే కాక పడమటకు ప్రయాణం చేసి ఇటలీ చేరింది. అక్కడ లాటిన్ వర్ణమాల అయింది. ఇతర దేశాలకు-పెర్షియా, అర్మేనియా, జార్జియా మున్నగు దేశాలకు వెళ్ళి వివిధాకారాలతో ఉండిపోయింది.

# ద్వితీయ భాగం

## ప్రథమ ప్రకరణం

# మనలిపి ఎంత పాతది!

మన లిపికూడ చిత్రలిపి నుంచి రూపొందిందే. దానిని తెలుపడానికి ముందు ఇది ఎంత ప్రాచీనమో తెలియచేసే కొన్ని ఎంత కథలు చెబుతాను. మన దేశంలో కొన్నివేల సంవత్సరాల క్రితమే వ్రాత ఉన్నట్టు మనకు ప్రాచీన గ్రంథాలలో నిదర్శనాలున్నాయి. ఇది మన అదృష్టం.

వేదాలు నాలుగని మీకు తెలుసు-ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదమని. వేదం ప్రపంచంలోకల్లా తొలిసారిగా సంకలనం చేయబడిన సాహిత్యమని మన విశ్వాసం. సంకలనమంటే మన ప్రాచీనులు ఆయాసందర్భాలలో చెప్పినవాటిని ఒకచోట చేర్చడమన్నమాట. ఇది ప్రపంచానికే తొలి సాహిత్యం కాకపోయినా మనకది ప్రాచీనం. ఈ నాలుగు వేదాలలోను ఋగ్వేదం ప్రాచీనతమమని పండితులంటారు. ప్రతివేదంలోను సంహిత, బ్రాహ్మణం అని రెండు భాగాలుంటాయి. సంహిత కేవలం స్తోత్రాలు, సూక్తాలు. బ్రాహ్మణం వివిధ విషయాల చర్చ. ఈ రెండింటిలోను సంహిత ప్రాచీనతరమని అంటారు. అంటే ఋగ్వేదసంహిత వేదాలు నాలుగింటిలోనూ ప్రాచీనతమమైనదన్నమాట. తర్వాతది యజుర్వేదసంహిత. ఇది కృష్ణయజుర్వేదమని, శుక్లయజుర్వేదమని రెండువిధాలు. కృష్ణయజుర్వేద సంహితను తైత్తిరీయ సంహిత అని; శుక్లయజుర్వేద సంహితను వాజసనేయ సంహిత అని కూడా అంటారు. అంతకన్న ఇవతలిది సామవేద సంహిత. అథర్వవేద సంహిత మరీ ఇవతలిది. తర్వాతవి వేదాన్ని అనుసరించి వ్రాసిన శ్రౌతసూత్రాలు, గృహ్య సూత్రాలు, ధర్మసూత్రాలు మొదలయినవి.

ఋగ్వేద సంహిత ఇప్పటికి ఐదువేలు మొదలు ఏడువేల సంవత్సరాల కింద అవతరించిందని, తైత్తిరీయ సంహిత, బ్రాహ్మణాలు, వేద వ్యాకరణాలయిన ప్రాతిశాఖ్యలు ఇప్పటికి నాలుగువేలు మొదలు ఐదువేలసంవత్సరాల క్రితమూ, తక్కిన సూత్రాలు మొదలయినవన్నీ ఇప్పటికి దాదాపు మూడువేలు

మొదలు నాలుగువేల ఐదువందల సంవత్సరాలలోను అవతరించినవని పండితుల నిర్ణయం.

ఋగ్వేదం అతి ప్రాచీనమైనదని తెలుసుకున్నాము గదా! దానిలో లిపి ప్రశంస ఉందేమో చూద్దాం. అన్ని ప్రాచీన జాతులలాగే భారతజాతి కూడ మొదట లిపిని ఎరుగనిదే. తర్వాత తర్వాత లిపిని రూపొందించుకుంది. ఈ లిపి ప్రశంస ఋగ్వేదంలో ఉంది. ఈ ఋక్కు వినండి:

"ఉతత్వః పశ్యన్ న దదర్శ వాచం ఉతత్వః శృణ్వన్ నశృణోత్యేనామ్" (10-71-4)- కొందరు మాటను - వేదవాక్కును - చూచీ చూడరు. కొందరు వినీ వినరు-అని ఈ ఋక్కు అర్థం. వాక్కును చూచీ చూడకపోవడం ఎప్పుడు సంభవిస్తుంది? లిపిరూపంలో ఉన్నప్పుడే కదా!

అక్షరాల ప్రసక్తి స్పష్టంగా ఉన్న మరొక ఋక్కు కూడ వింటే మీ అనుమానం దూరమైపోతుంది.

"గాయత్రేణ ప్రతి మిమీతే అర్కం. అర్కేణసామ, త్రైష్టుభేన వాకం. వాకేన వాకం, ద్విపదా చతుష్పదా, అక్షరేణ మిమతే సప్తవాణీః (1-164-24)

దీని తాత్పర్య మేమిటంటే-సప్త చ్ఛందస్సులు అక్షరాలతోనే రూపొందుతాయి. గాయత్రీ చ్ఛందస్సుకు ఎనిమిది అక్షరాలు. త్రిష్టుప్ ఛందస్సుకు పదకొండక్షరాలు. జగతీ ఛందస్సుకు పన్నెండక్షరాలు. ఇన్ని అక్షరాలైతే ఈ ఛందస్సు పాదమని, ఇన్ని పాదాలయితే ఈ ఛందస్సని అంటారు. కనుక పాదాలకు, ఛందస్సుకు అక్షరమే కొలత అని.

పూర్వం కూడ పశువులు తప్పిపోకుండా వాటికి గుర్తులు వేసేవారు. చెవులలో ఎనిమిదంకె గుర్తు వేసిన-"అష్టకర్ణీ"- గోవులను వేయింటిని సావర్ణి అనే రాజు దానం చేసినందుకు నాభానేదిష్టుడనే ఋషి స్తోత్రం చేశాడని ఋగ్వేదంలో ఒక కథ ఉంది.

ఈ ప్రమాణాలను బట్టి ఇప్పటికి దాదాపు ఏడువేల ఏళ్ళనాడే లిపి సంగతి మనదేశానికి తెలుసునని, అక్షరాల లెక్కలను బట్టి ఛందశ్శాస్త్రం కూడ అప్పుడప్పుడే తల ఎత్తిందని మనం గ్రహించుకోవచ్చు.

తర్వాతిదైన తైత్తిరీయ సంహితలో లిపి సంగతి స్పష్టంగా ఉంది. ఈ సంహితలో ఇంద్రుడు భాషకు వ్యాకరణం వ్రాశాడని ఒక గాథ ఉంది.

"తా మింద్రో మధ్యతో వక్రమ్య వ్యాకరోత్. తస్మా దియం వ్యాకృతా వాగుచ్యతే. తదేవ వ్యాకరణస్య వ్యాకరణత్వం."

పూర్వం భాషకు వ్యాకరణం లేక వాక్యమేదో, పదమేదో తెలియక అస్తవ్యస్తంగా ఉండేదట. పదమేదో, వాక్యమేదో తెలియకపోతే అర్థం తెలు

సుకొనడం ఎలా? కనుక దేవతలు భాషకు వ్యాకరణం చెప్పవలసిందిగా ఇంద్రుని ప్రార్థించారట. ఇంద్రుడు ఇది వర్ణం, ఇది ప్రకృతి, ఇది ప్రత్యయం, ఇది పదం, ఇది వాక్యం అని విడదీసి వ్యాకరణం చెప్పాడట. దీనితో వ్యాకరణం అన్న మాటకు సార్థక్యం ఏర్పడిందట. కనుకనే మనకు ఇంద్రుడు మొదటి వైయాకరణుడు.

"ఇంద్ర శ్చంద్రః కౌశ కృష్ణా పిశలీ శాకటాయనః
పాణిన్యమర జైనేంద్రాః అష్టా వాదిమ శాబ్దికాః"

అని తర్వాతివారుకూడా మన ప్రాచీన వ్యాకర్తలలో ఇంద్రుని పేరు మొదట పెట్టారు.

ఇక ఈ తైత్తిరీయ సంహితలో చెప్పిన పెద్ద సంఖ్యలు చూస్తే మరీ ఆశ్చర్యమవుతుంది. ఏక, దశ, శత, సహస్ర, అయుత (పదివేలు), నియుత (లక్ష), ప్రయుత (పది లక్షలు), అర్బుద (కోటి), న్యర్బుద (దశకోటి), సముద్ర (శతకోటి) మధ్య (సహస్రకోటి), అంత (దశసహస్రకోటి), పదార్థ (లక్షకోటి) ఆది సంఖ్యలు ఉన్నాయి. ఇతర సంహితలలోను ఇలాంటి సంఖ్యలు కొద్దిపాటి భేదాలతో కనిపిస్తాయి.

పంచవింశ బ్రాహ్మణమనే మరొక భాగంలో యజ్ఞదక్షిణగా ఇవ్వవలసిన బంగారు తూనిక చెప్పబడింది. ఆ తూనిక పేరు కృష్ణ. అలాటి పన్నెండు కృష్ణలు ఒక మాన మవుతుంది. దీనిని పన్నెండింట 12-24-48-96 అని హెచ్చవేస్తూపోగా 3, 93, 216 వరకు వచ్చే గుణోత్తర శ్రేణి వివరించబడింది.

శతపథ బ్రాహ్మణంలో సమయ చర్చ ఉంది. ఈ లెక్కన ఒక దినానికి 50, 625 భాగాలు. ఈ వరుస ఇది: 15 ప్రాణాలైతే ఒక్క ఇదాని. 15 ఇదానులు ఒక్క ఏతర్హి. 15 ఏతర్హులు ఒక క్షిప్ర. 15 క్షిప్రలు ఒక ముహూర్తం. 15 ముహూర్తాలు ఒక దినం.

వ్రాతలేకపోతే ఇంత సూక్ష్మాతి సూక్ష్మమైన లెక్కలు కట్టడం సాధ్యమౌతుందా? వ్యాకరణం పుడుతుందా? కనుక మనవారికి ఏవో కొన్ని కొండ గుర్తులన్నా ఉండాలి. అదే లిపి.

మరి కొంత ఇవతలి కాలానికి వద్దాం. గోపథ బ్రాహ్మణమనే మరొక భాగంలో ఓంకార చర్చ ఉంది. ఇంతవరకు అక్షరం అనే పదమే విన్నాము గాని వర్ణం అనే పదం వినలేదు. దీనిలో వర్ణమనేది కూడ ప్రయుక్తమైంది.

"ఓంకారం పృచ్ఛామః, కో ధాతుః? కిం ప్రాతిపదికం? కింనామాఖ్యాతం? కిం లింగం? కిం వచనం? కా విభక్తిః? కః ప్రత్యయః? క స్వరః? ఉపసర్గో నిపాతః? కిం వై వ్యాకరణం? కో వికారః? కో వికారీ? కతిమాత్రః?

కతివర్ణః కత్యక్షరః? కతిపదః? క స్సంయోగః? కిం స్థానానుప్రదానకిరణం? శిక్షుకాః కి ముచ్చారయంతి? కిం ఛందః? కో వర్ణ? ఇతి పూర్వే ప్రశ్నాః." (1-24)

"ఓంకారం గురించి అడుగుతున్నాము. దానికి ఏ ధాతువు? ఏ ప్రాతిపదిక? ఏది అఖ్యాతం? ఏమి లింగం? ఏమి వచనం? ఏమి విభక్తి? ఏమి ప్రత్యయం? ఏమి స్వరం? ఏది ఉపసర్గ? ఏది నిపాతం? ఏ వ్యాకరణం వల్ల అలాటి రూపమైంది? కలిగిన మార్పేమిటి? మార్పు పొందినదేది? దానికి ఎన్ని మాత్రలు? ఎన్ని వర్ణాలు? ఎన్ని అక్షరాలు? ఎన్ని పదాలు? స్థాన మేమిటి? అనుప్రదానకరణమేమిటి? శిక్షకులు ఎలా ఉచ్చరిస్తారు? దాని ఛందస్సేమిటి? వర్ణమేమిటి? అనేవి ప్రశ్నలు."

ఇంత చర్చ ఎప్పుడు జరుగుతుంది? లిపి భాష ఎంతో అభివృద్ధి చెందినప్పుడే గదా?

మరి కొంత ఇవతలి శుక్ల యజుర్వేద సంహిత అయిన వాజసనేయ సంహితలో అక్షర ప్రసక్తి, లేఖన సాధన ప్రసక్తి స్పష్టంగా ఉన్నాయి.

"అక్షరపంక్తి శ్ఛందః, పదపంక్తి శ్ఛందః, విష్టార పంక్తి శ్ఛందః, క్షురో భ్రజః ఛందః" - (15-4) నాశరహితమైనవి అక్షరాలు. వాటి పంక్తి అక్షర పంక్తి. క్షురమంటే గోకేది, తవ్వేది అని అర్థం. అంటే వ్రాయడం, చెక్కడం అన్నమాట. క్షురో భ్రజ అనే మాటకు వ్రాతతో ప్రకాశించేది. వ్యాప్తితో (చెక్కడంతో) ప్రకాశించేది అని వేదవ్యాఖ్యాతలు అర్థం చెప్పారు. తాత్పర్యమేమిటంటే! (నాశరహితమైన) అక్షర పంక్తి అక్షరాల వరస ఛందస్సవుతుంది. పదపంక్తి ఛందస్సవుతుంది. విలేఖన, ఖననాలతో ప్రకాశించే అక్షర పంక్తి ఛందస్సవుతుంది అని.

శుక్ల యజుర్వేద సంబంధమైన శతపథబ్రాహ్మణంలో లింగ, వచనాల ప్రస్తావన ఉంది.

ఋగ్వేదానికి సంబంధించిన ఐతరేయ బ్రాహ్మణంలో అక్షరచర్చ మరీ స్పష్టంగా ఉంది.

" (1) తతో వా అష్టాక్షరా గాయత్ర్యభవ దేకాదశాక్షరా త్రిష్టుప్, ద్వాదశాక్షరా జగతీ. (2) అష్టాకపాల ఆగ్నేయో. అష్టాక్షరా గాయత్రీ 3) అనుష్టుభౌ స్వర్గకామః కుర్వీత ద్వయోర్వా అనుష్టుభో శ్చతుష్షష్టిరక్షరాణి. (4) తేభ్యో భితప్తేభ్యః త్రయో వర్ణా అజాయంత అకారః ఉకారః మకారః ఇతి. తానే కదా సమభవత్ తదేతత్ ఓమితి."

తర్వాత ఎనిమిదక్షరాలది గాయత్రీ ఛందస్సయింది. పదకొండక్షరాలది

క్రిష్టుభయింది. పన్నెండక్షరాలది జగతి అయింది. ఎనిమిది కపాలాలలో సంస్కారం పొందిన పురోడాశం అగ్నిదేవతగా గలది. అలాగే గాయత్రికి ఎనిమిదక్షరాలు. స్వర్గం కోరేవాడు రెండనుష్టుభులు చేయాలి. రెండనుష్టుభు లంటే అరవై నాలుగక్షరాలు-వాటినుంచి ఆకార ఉకార మకారాలనే మూడు వర్ణాలు పుట్టాయి. ఈ మూడువర్ణాలు కలిసి ఓమ్ అయింది.

ఈ చర్చలో 'వర్ణ' అనేమాట స్పష్టంగా అక్షరాలకు ప్రయోగించడం గమనించారు గదూ!

ఈ ఐతరేయ బ్రాహ్మణంలోనే "ఇతిను పూర్వపటలమ్" (ఇది పూర్వ పటలం) అని పటల పదప్రయోగముంది. ఇది గ్రంథభాగం తెలిపేమాట కదా? శ్రుతిప్రోక్త యజ్ఞయాగాది కర్మలు తెలిపే శ్రౌతసూత్రాలలో పటలం అనే మాట పెక్కుసార్లు ప్రయోగించారు.

ఛాందోగ్యోపనిషత్తులో "హింకార ఇతి త్ర్యక్షరం.... ఆదితి ద్వ్యక్షరం.... ఈ ఊ ఏ ఈ కార ఊకార ఏకారాః"- హింకారమంటే మూడక్షరాలు ఆత్ అంటే రెండక్షరాలు. ఈ ఊ ఏ ఈకార ఉకార ఏకారాలు-అని వివరణ కనిపిస్తుంది.

దీనిలోనే మరొకచోట వర్ణసమామ్నాయంలో భాగాలయిన స్వరాలు. స్పర్శాలు వివరించబడ్డాయి.

ఋగ్వేదకాలంలో జూదం ఉంది. పాచికలపై ఏవో గుర్తులు వేసేవారు. వీటన్నిటికీ లిపి, వర్ణం అవసరం కదా!

ఇక మనం సూత్రకాలానికి వద్దాం. ఇది ఇప్పటికి మూడువేలు మొదలు నాలుగువేల ఐదువందల సంవత్సరాల కాలమని ఇదివరకే అనుకున్నాం కదా! ఈ కాలంలోనే వేదాంగ జ్యోతిషం, వేదవ్యాకరణాలైన ప్రాతిశాఖ్యలు, నిరుక్త మనే వేదనిఘంటువు, వేదవిహిత యజ్ఞయాగాదులు చెప్పే శ్రౌతసూత్రాలు, గృహస్థులు నిర్వహించవలసిన విధులుతెలిపే గృహ్యసూత్రాలు, ధర్మసూత్రాలు అవతరించాయి. వేదం లిఖితరూపంలో లేకపోతే ప్రాతిశాఖ్యలవంటి వ్యాకరణాలు వ్రాయడం అసంభమని రాథ్ అనే పండితుడన్నాడు.

ఇప్పటికి ఐదువేల సంవత్సరాలకు పూర్వమే మనకు జ్యోతిశ్శాస్త్రంలో పరిచయం ఉందని ప్రాచ్య పరిశోధకులైన పలువురు పాశ్చాత్యపండితుల అభి ప్రాయం. యజుర్వేద వాజసనేయ సంహితలోను, తైత్తిరీయ బ్రాహ్మణంలోను జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు నక్షత్రదర్శకులని. గణకులని పేర్లున్నాయి. ఋగ్వేదంలో అధికమాస చర్చ ఉంది. లెక్కలు వేయడానికి అంకెలు, పలక. బలపం లేక ఏదో వ్రాత సాధనమో, గుర్తులో ఉండాలి కదా! రేఖాగణితం మనదేశంలో అతి

ప్రాచీనకాలంలోనే పుట్టింది. లిపిలేనిదే గణితం అభివృద్ధి కాదు కదా!

మహాభారతం ఆదిపర్వంలో వ్యాసునికి విఘ్నేశ్వరుడు లేఖకుడని ఉదాహరించబడింది.

ఇక మరీ ఇవతలి కాలానికి వస్తే లిపుల ప్రసక్తి గ్రంథాల ప్రసక్తి వ్యాకరణం వ్రాసిన వారి ప్రసక్తి కొల్లలుగా కనిపిస్తుంది. ఇంతకుముందు మీరు చదివిన వేదనిఘంటువులో పలువురు వైయాకరణులు ఉదాహరించబడ్డారు. పాణిని పేరు ఇంతకు ముందు వినే ఉన్నారు. ప్రాచీన వైయాకరణులలో ఈయన ఒకడు. ఈయన వ్రాసిన సంస్కృత వ్యాకరణమే తర్వాత తర్వాత ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చింది. ఈయన క్రీస్తుకు ఎనిమిది శతాబ్దులకు పూర్వం, అంటే బుద్ధభగవానునికి దాదాపు రెండువందల సంవత్సరాలకు ముందు ఉన్నవాడని పలువురు పండితులు నిర్ణయించారు. ఈయన రచించిన వ్యాకరణం పేరు అష్టాధ్యాయి అంటే ఎనిమిది అధ్యాయాల గ్రంథమన్నమాట. దీనిలో అక్షర, వర్ణ శబ్దాలేకాక లిపి, లిఖి, లిపికర గ్రంథ పదాలు ప్రయోగించబడ్డాయి. లిపి ఆకాలంలో ఉండడం మాత్రమే కాక వ్రాయడం వృత్తిగా గలవారు కూడ ఉండిరని స్పష్టమౌతుంది. లిపికరుడంటే, వ్రాయసకాడు కావచ్చు. శాసనం చెక్కేశిల్పి కూడ కావచ్చు. పాణిని దేశీయలిపినే కాక విదేశిలిపిని కూడ తెలిపాడు. "యవనానీ" అనేది యవనలిపి అన్నాడు, యవనలిపిని యవనానీ అంటారన్నమాట. ఈయన తెలిపిన యవనలిపి ఏది- అన్న చర్చ జరిగింది. ఇంతకు ముందు మీరు చదివిన కీలలిపి అని పండితులు అన్నారు.

గ్రంథాల సంగతి కూడా పాణిని చెప్పాడన్నానుగదా! అతనికాలంలో వివిధ విషయాలపై గ్రంథాలుండేవి. శిశుక్రందీయం, యమసభీయం, ద్వంద్వీయం, ఇంద్ర జననీయం, మొదలయిన గ్రంథాలుండేవని "శిశుక్రంద యమసభ ద్వంద్వేంద్ర జననాదిభ్యశ్చ" అనే సూత్రంలో చెప్పాడు. సహ అనేది గ్రంథాల విషయంలో చెబితే ఈ గ్రంథం మొదలు పై గ్రంథం తుదివరకు, కొలతల విషయంలో అయితే దానికంటే పెద్దది అన్న అర్థంలోను వస్తుందని 'గ్రంథా దధికేచ' అనే సూత్రంలో అన్నాడు. అంటే సముహూర్తం జ్యోతిషం చదివాడు. అంటే ముహూర్త విధి మొదలు పరగ్రంథం వరకు పూర్తి శాస్త్రం అన్నమాట.

గ్రంథాలను గురించి 'కృతే గ్రంథే' "సముదాఙ్భ్యో యమో అగ్రంథే" మున్నగు పెక్కు సూత్రా లున్నాయి.

ఒక శబ్దరూపం చెప్పడానికి ఎన్నో సూత్రాలను అన్వయించి చెప్పవలసి ఉంటుంది. ఇదంతా నోటిమాటతోనే చెప్పడం సాధ్యంకానిపని కనుక పాణిని

కాలానికి ముందే లిపి బాగా అభివృద్ధి అయి ఉండాలి. అప్పటికే-అంటే మూడు వేల సంవత్సరాల క్రితమే మనదేశానికి సోలమన్ కాలంలో దక్షిణ అరేబియా మున్నగు పశ్చిమ దేశాలతో వ్యాపారసాపారాలు జరిగేవి. కనుక ఆ దేశపు లిపులు కూడ మనకు తెలిసిఉండాలి. పాణిని కాలం వాడే అయిన అస్సీరియా దేశపురాజు అసుర్బానిపాల్ మనదేశంనుంచి ప్రత్తిని తెప్పించుకొనేవాడట. అతడు కీలలిపిలో వ్రాసిన మట్టి పలకల గ్రంథాలయాన్నే నెలకొల్పాడు. కనుక పాణిని తన సమకాలమైన కీలలిపిని తెలిపాడంటే వింతేముంది?

అర్వాచీనమైన స్మృతులలోను, అర్థశాస్త్రంలోను, వాత్స్యాయనకామ సూత్రాలలోను లిపిజ్ఞానం, పుస్తకం వాచనం ప్రధాన విషయాలుగా చెప్పారు. వాత్స్యాయన కామ సూత్రాలలో గృహిణి చేయవలసిన విధులలో దినసరి ఖర్చు వెచ్చాలు గుర్తుపెట్టుకొనడం-దైవసికాయవ్యయ పిండీ కరణం-కూడ ఒక్కటి.

అయితే, వేదసంహితంలోను, బ్రాహ్మణాలలోను, ఉదాహరించిన అక్షర, వర్ణ అనే పదాలు ధ్వనిని సూచించేవేగాని లిపిని సూచించేవి కావని, ఆకాలంలో లిపి లేదని కొందరు అనుమానిస్తారు. నిజానికి ఈ రెండు పదాలు మొదట ధ్వనులకు, తర్వాత వాటి సంబంధంతో ఆ ధ్వనుల బొమ్మలకు-అంటే లిపికి వ్యవహరించారని పరిశీలిస్తే తెలుస్తుంది. అక్షరమనే మాటకు శాశ్వతంగా ఉండేది. నాశం లేనిది అని అర్థంకదా! వర్ణమంటే రంగు-రంగుతో వ్రాయబడిన ధ్వని ఆకారమన్న మాట. అవర్ణం అంటే ఏకో రంగుతో వ్రాయబడిన ఆకార ధ్వనిచిత్రం. శిలలమీదనో, ఇటుకలమీదనో, చెక్కలమీదనో చెక్కేవానికి అక్షరాలని తాళపత్రాలమీదనో, భూర్జపత్రాలమీదనో, పటాల మీదనో, కడితాలమీదనో (ప్రత్తికాయితాలమీదనో) రంగుతో వ్రాసేవాటికి వర్ణాలని పేరు వచ్చాయి. లిపి అంటే లేపం చేయబడేది, పూయబడేది. అతి ప్రాచీనకాలంలో మొత్తం అక్షరాలకు ధ్వనులనో, స్వరాలనో వాడుక ఉండి ఉంటుంది. కనుక ఈ మాటల వ్యుత్పత్తినిబట్టే వర్ణశబ్దం పురాతనమని, దానిని లేపనం చేయడం వల్ల లిపి అయిందని భావించవచ్చు.

సరి. వేల సంవత్సరాలుగా లిపి మనకు తెలుసునంటున్నారుగదా! మరివేదానికి నేటికీ శ్రుతి అనే వ్యవహారం ఎందుకు? శ్రుతి అంటే వినబడేదేగాని, చదువబడేది కాదుకదా! దానిని నేటికీ సంత చెప్పించుకోడం ఎందుకు ?-అనే ప్రశ్నలు బయలుదేరుతాయి. శ్రుతి అంటే వినబడేది, విని గ్రహించేది అన్న మాట నిజమే. ప్రాచీనులు చెప్పగా విని పరంపరగా భద్రపరచుకుంటూ వచ్చిన విజ్ఞానమన్నమాట. ప్రతి నాగరికజాతీ తన పూర్వ సంపదను ఉన్నదున్నట్టుగా

కాపాడదలచుకొంటుంది. విన్నది విన్నట్టుగా ఉదాత్తానుదాత్త స్వరితస్వరాలతో రక్షించుకొంటూ రావడం పాతవాటిపై గౌరవంవల్లనే. కనుకనే, ఒక్క గుణితం కూడ పోనీకుండ వేదం గురుముఖంగా స్వరం, వర్ణం చెక్కు చెదర కుండా (స్వరతః, వర్ణతః) నేర్చుకొనడం ఆచారమైనది. ఇంతకూ మీరు మొదటి భాగంలో చదివినట్టు మానవ పుస్తకం కూడ అవసరం. అన్నీ పుస్తకాలతోనే అయితే ఇక మనం మనుష్యుల సహాయమే కోరనక్కర లేదు. పుస్తకమే అంతా వివరించదు. మనుష్యుడు-గురువుకానీండి, మరొకరు కానీండి-అవసరం. ప్రాచీనులు వాడిన స్వరంతోనే వేదం నేర్చుకోవాలని మనవారికున్న పట్టుదల, స్వరంలో ఏదో శక్తి ఉన్నదనే నమ్మకం, గురు ముఖతః నేర్చుకొనడానికి కారణాలుకాని, వ్రాత, వ్రాత సామగ్రి లేక కాదు.

పుస్తకాలు చూచి సరిగా చదవలేనివారు ఆకాలంలోను ఉండేవారు. యాజ్ఞవల్క్యశిక్ష అనే గ్రంథం చెడ్డ చదువరు లెవరో తెలిపింది.

"గీతీ, శీఘ్రీ, శిరఃకంపీ, తథా అలిఖిత పాఠకః!
అనర్థజ్ఞః, అల్ప కంఠశ్చ షడేతే పాఠకాధమాః"

కూనిరాగాలు తీస్తూ చదివేవాడు, తొందర తొందరగా చదివేవాడు, తల ఆడిస్తూ చదివేదు, వ్రాయనిది చదివేవాడు, అర్థం తెలియక చదివేవాడు, సన్న గొంతుకవాడు-ఈ ఆరుగురూ పాఠకాధములట. ఈ లోపాలు పోగొట్టుకొన డానికే గురుముఖతః చదవడం.

ఇంతకూ సమయానికి జ్ఞాపకంరాని చదువు ఎందుకూ? చాణక్యుడు ఈ విషయాన్ని బాగా ఈసడించాడు.

"పుస్తకస్థాతు యా విద్యా, తరహస్తగతం ధనం,
కార్యకాలేతు సంప్రాప్తే న సా విద్యా న తద్ధనం."

పుస్తకంలో ఉన్న చదువు, పరులచేతుల్లో ఉన్న సొమ్ము: అది చదువూకాదు; అది సొమ్మూ కాదు. కనుకనే మనపూర్వులు చదువుకన్నా, వ్రాతకన్నా మన నానికి, ధారణకు ప్రాధాన్య మిచ్చారు.

అక్షరం, లిపి అనేపదాలు విదేశ భాషాపదాలని అనేవారూ ఉన్నారు. ఇంతకుముందు మీరు చదివిన సెమెటిక్ జాతికి చెందిన అక్కాడియనులు అనే తెగవారినుంచి మనపూర్వులు లిపిని గ్రహించారని, అక్కడ్ అనేపదం సంస్కృతీకరణమే అక్షర అనే పదమని వీరు వాదిస్తారు. అక్షరపదం వేదంలో ఉండడం ఇంతకుముందే చూచాము గనుక ఈవాదం బలంలేనిది.

ఇక లిపి అనేది పారసీపదమని, పారసీపదమైన 'డిపి' అనే దానినుంచి పుట్టిందని కొందరు వాదిస్తారు. మీరు ఇంతకుముందు చదివిన క్రీస్తుకు 500

సంవత్సరాలముందున్న దేరియిసు అనే పారసీకరాజు బెహిస్తాన్ అనేచోట ఒక శాసనం చెక్కించాడు. దానిలో "తువమ్ కాహ్య అపరం ఇమాం డిపిం పైనాహి" అనే వాక్యం ఒకటుంది. "భవిష్యత్కాలంలో ఈ లిపిని చదివే నీవు" అని ఈ వాక్యం అర్థం. ఈ డిపిఅనే పదమే లిపి అని, లడలకు అభేద మనే సూత్రంప్రకారం మారిందని ఈవాదం వారు చెబుతున్న ఉపపత్తి. ఈ రాజుకు మూడువందల ఏళ్ళకు పూర్వం ఉన్నపాణిని వ్యాకరణంలో పూయడం అని అర్థమిచ్చే లిపధాతువునుంచి పుట్టిన లిపి, లిఖి, లేపనం, లేపం, లింపనం వంటి వివిధరూపాలు కనిపించడంవల్ల లిపి డిపినుంచి వచ్చిందనే వాదం నిస్సారం. సంస్కృత, పారసీకభాషల ఆదిమూలం ఒక్కటే గనుక పారసీక భాషలోను ఆపదంఉంటే ఉండవచ్చు, లేక అంతకుముందే అభివృద్ధి పొందిన సంస్కృతం నుంచి చేరిఉండవచ్చు.

మరొక తమాషావాదం ఉంది; ప్రాచీనకాలపు క్రీట్ వారు వ్రాసే సాధ నాన్ని "అలెఫ్" అనేవారు. అలెఫ్‌లోని మొదటి అకారం ఉచ్చారణలో జారి పోయి, లెఫ్‌మాత్రం మిగిలింది. లెఫ్‌లోని ఫ్ ఉచ్చారణ ఇంగ్లీషులోని ఎఫ్ ఉచ్చారణవంటిది. ఈ ఉచ్చారణ మనకు లేదు. కనుక, లెఫ్ అనేపదం-లిఫ్ లిఖ్, లిపి లిఖి- అని రెండు రూపాలుగా మారింది అని వీరివాదం. లిపధాతు వుకు లేపనమనే అర్థం మనకు ఉన్నందున ఈ వాదపు ద్రావిడ ప్రాణాయామం మనకు అవసరంలేదు. విదేశాలతో సంబంధం ఏర్పడిన తర్వాత లిఖి అనేరూపం కూడ మనం గ్రహించాము.

ఇంతకూ ఎన్నోపదాలు ధ్వనికి అనుకరణతో ఏర్పడుతూ ఉంటాయి. ఈలాటిపదాలు ప్రపంచమంతటా అంతో, ఇంతో పోలికతో ఉంటాయి. వ్రాసేటప్పుడు, చెక్కేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణగా లేఖనసాధనాల పేర్లు పుట్టి ఉంటాయని నా అభిప్రాయం. కనుక ఏకాస్తో పోలిక కనిపిస్తే దాని నుంచి పుట్టిందీ, దీనినుంచి పుట్టిందీ అని నిర్ణయాలకు రావడం ఏమి న్యాయం ?

ఏతావతా మనకు కొన్నివేల ఏళ్ళకు ముందే వ్రాత ఉందని తేలింది. కాని, ఈ వ్రాత ప్రజాసామాన్యంలో ప్రచురంగా లేనిమాట వాస్తవమే. అయితే ఎప్పటినుంచి విశేష ప్రచారం పొందింది?

ద్వితీయ ప్రకరణం

# బౌద్ధ జైనాలు చేసిన ప్రచారం

మనదేశంలో చదువు, వ్రాత అతి ప్రాచీనకాలం నుంచి ఉన్నప్పటికీ, విశేష ప్రచారంపొందింది బౌద్ధులవల్లను, జైనులవల్లను. అంతకుముందు చదువు, వ్రాత కొన్ని వర్గాలకే పరిమితంగా ఉండేవి- రోమనులలో అధికార వర్గాలకే అన్ని సౌకర్యాలు పరిమితంగా ఉన్నట్టు, ఎంతోకాలం ఇతర వర్గాలలో ఉన్న అసంతృప్తి బుద్ధుని కాలానికి పెల్లుబికింది. అది అన్నివిధాలుగా ఒక విప్లవం-సాంఘిక విప్లవం. దేశమంతా ఒక్కటి కావాలనే దృష్టి పాలించే రాజులకూ కలిగింది. బుద్ధుని కాలంలో ఉన్న బింబిసారుడనే శిశునాగవంశపు రాజు దేశం ఒక్కటిగా చేయాలని ప్రయత్నించాడు. దానికి తోడు సంఘంలో ఒక వైపు బుద్ధుడు, మరొకవైపు మహావీరుడు అవతరించారు. వీరు కొందరే సంస్కరించుకొని మాట్లాడే సంస్కృత భాషను మాని, ఆయా ప్రాంతాల ప్రజలు వ్యవహరించే భాషలో ఉపదేశాలు చేయడం మొదలుపెట్టారు. ఆ ఉపదేశాలు ఏవో సూత్రాలుగా, కోరికలుగా, భాష్యాలుగా కాక, కథలుగా, నీతులుగా విధ విధాలుగా చెప్పడం ప్రారంభించారు. దీనితో వ్రాత, చదువు ప్రజా సామాన్యంలో బాగా విస్తరించాయి. ఆడవారు కూడ చదువను వ్రాయను నేర్వాలని బుద్ధుడు ఆదేశించాడు.

ఈ ఆదేశాలు, ఉపదేశాలు పాలీ భాషలో ఉన్నాయి. పాలీ అంటే అప్పటి మగధదేశం రాజధాని అయిన పాటలీపుత్ర నగరం ప్రాంతంలో వ్యవహారంలోవున్న ప్రాకృత భాష; సంస్కృతం నుంచి అపభ్రంశమై మారిన భాషలలో ఇదొక్కటి. ఆ పాటలీ పుత్రం, పాటలీ పట్టణం అయి, పాట్నా అయింది నేడు. బుద్ధుడు తన అభిప్రాయాలు ప్రజలందరికీ తెలియడానికి ఈ పాటలీపట్టణభాష అయిన పాలీలోనే ఉపదేశించాడు.

ఈ పాలీ క్రమంగా బౌద్ధుల మతభాష అయింది. ఆయా తెగల, ప్రాంతాల భాషలు వాటి ప్రాబల్యాన్నిబట్టి మతభాషలవుతూ ఉంటాయి. మహమ్మద్ పైగంబర్ అవతరించిన తెగ మక్కాలోని కురేష్ అనే తెగ. ఆయన తన

ఉపదేశాలు తను రోజూ వ్యవహరించే భాషలోనే చేశాడు. ఆయన గొప్పద నాన్నిబట్టి ఖురాన్ షరీఫ్ భాష మత భాష అయింది.

బౌద్ధమత గ్రంథాలలో వ్రాత ప్రసక్తి పెక్కుచోట్ల కనిపిస్తుంది. బౌద్ధ గ్రంథాలంటే బుద్ధుని ఉపదేశాలు క్రోడీకరించిన గ్రంథాలు. బుద్ధుని నిర్యాణా నంతరం ఇంతకు ముందు మీరు చదివిన బింబిసారుని కుమారుడైన అజాత శత్రువు అనే రాజు బౌద్ధాచార్యుల సభ జరిపి బుద్ధుని ఉపదేశాలన్నిటిని సంపు టాలుగా కూర్పించాడు. బుద్ధుడు నిర్యాణమై ఇప్పటికి 2,500 సంవత్సరాలు గడిచాయి. ఈ నిర్యాణాన్ని బౌద్ధులు మహాపరినిర్వాణమని అంటారు. ఈ మహాపరి నిర్వాణం తర్వాత జరిగిన సభను బౌద్ధ సంగీతి అంటారు దీనిలో క్రోడీకరించిన ఉపదేశాలను, తక్కిన విషయాలను మూడు భాగాలు చేశారు. వీటికి పిటకాలని పేరు. పిటకమంటే గంప, పెట్టె అని అర్థాలు. వినయ పిటకం, సుత్త పిటకం, ధమ్మపిటకం అనేవి ఈ మూడూను. వీటిలో మతం సంగతి అటుండగా, అప్పటి సంఘ పరిస్థితి అద్దంలోలాగ కనిపిస్తున్నది. సుత్త పిటకంలోని ఒక భాగం జాతక కథలు. జాతక కథలంటే బుద్ధుడు తన పూర్వజన్మ విషయాలు చెప్పిన కథలు.

ఈ జాతక కథలలో బానిసలుకూడ బడికి వెళ్ళడం, పలక, బలపాల సంగతి, దొంగప్రామిసరీనోట్ల సంగతి, దొంగలెక్కలసంగతి చాల దొరుకు తాయి. కటాహక జాతకం అనే కథలో కాశీశెట్టి బానిసయిన కటాహకుడు తన యజమాని కుమారునితోపాటు బడికి వెళ్లేవాడట. అక్కడే చదువు వ్రాతలు నేర్చుకున్నాడు తర్వాత తన యజమానిని మోసం చేయడానికి కూటరిణపణ్ణం- దొంగ అప్పుపత్రం - తయారు చేశాడట.

రురుజాతకం అనే మరొక కథలోను ఇణపణ్ణాల- ఋణపర్ణాల- సంగతి ఉంది.

అసదిశ జాతకం అనే మరొక కథలో బాణంపై చెక్కిన అక్షరాల ప్రసక్తి ఉంది. చాటునుంచి గాని, దూరంనుంచిగాని కొందరు ఒకే లక్ష్యాన్ని కొడుతారను కోండి. ఎవరి బాణం తగిలిందో స్పష్టంగా తెలియడానికి బాణంపై పేర్లు చెక్కే వారు.

స్త్రీలు చదువను, వ్రాయను నేర్వాలని, లేఖనవృత్తి ఉత్తమమని, సుఖ జీవన సాధనమని, లేఖకుడు ఎవరినీ నొప్పించగూడదని, నొప్పిస్తే దుక్ఖితం- దుష్కృతం-వస్తుందని వినయపిటకంలో ఉన్నది. వ్రాస్తున్నాడు అనడానికి "లేఖంఛిందతి" అనే ప్రయోగం ఉంది. ఛిందతి అన్నమాటనుబట్టి వ్రాయడం చెక్కడం ఉన్నవన్నమాట.

వినయపిటకంలో భాగమైన మహావగ్గోలో ఒక తమాషాకథ ఉంది, బుద్ధుని శిష్యగణంలో కొందరు దొంగలుకూడ చేరేవారట. అలాటివారిని కనుక్కోడం చాల కష్టమయ్యేది. ఒకసారి లిఖితచోరుడు-వారంటు జారీచేయబడిన జాబితాలో ఉన్న దొంగ-బుద్ధుని పరివారంలో చేరాడట. అప్పటికి అతనిని బుద్ధుడు క్షమించి తర్వాత అలాటిది జరగకుండా కట్టుదిట్టాలు చేశాడట.

ఒక్క వారంటు సంగతేకాక గణనం, లేఖనం, ఫలకం, తిరకం (బలపపు సుద్ద) వర్ణకంవంటి వ్రాతకు, వ్రాతసామగ్రికి సంబంధించిన మాటలు మహావగ్గోలో కొల్లలు.

లేఖనవృత్తి ఉత్తమమనే అభిప్రాయం ఉండేదని ఇదివరకే అన్నాను. కదా? గృహస్థులు తమ సంతానాన్ని చదువుసందెలు నేర్పి లేఖనవృత్తిలో ప్రవేశపెట్టాలని అనుకునేవారు. ఉపాలి అనే బాలుని తలిదండ్రులు తమ కుమారునికి చదువు, లెక్కలు నేర్పి సంఘంలో-బౌద్ధ సంఘంలో - చేర్చాలని నిర్ణయించుకుంటాడు. సంఘంలో మంచి అన్నవస్త్రాల వసతి ఉంటుంది; గౌరవంగాను ఉంటుంది- అని వారు అనుకుంటారు.

ఆ కాలంలో అక్షరిక అనే ఆట ఆడేవారు. ఇది అక్షరాలకు సంబంధించిన ఆట. పసిపిల్లల వీపుమీదగాని, ఎదుట ఆకాశంలోగాని అక్షరాలువ్రాసి ఏ అక్షరమో కనుక్కోమనడం; అక్షరాలతో పదాలుకూర్చడం ఇది ఆ కాలపు శిలాసుత్తం అనే బౌద్ధగ్రంథం చెప్పింది. పిల్లల ఆటలలో అక్షరాలసంగతి రావాలంటే లిపి ఎంతో ప్రచారంలో ఉండాలికదా!

బుద్ధునికి 64 లిపులు తెలిసినట్టు లలిత విస్తరమనే గ్రంథంలో ఉంది. బౌద్ధగ్రంథాలలో లలిత విస్తరం అనేది ఒకటి. దీనిలో బుద్ధుడు జన్మించి సర్వసంగ పరిత్యాగంచేసి జ్ఞానోదయం కలిగినతర్వాత కాశీసమీపంలో ప్రథమోపదేశం చేసినప్పటివరకు గల చరిత్ర వర్ణితమైంది. ఇది బుద్ధుని మొదటి చరిత్ర గ్రంథం. ఇది రెండువేల మూడువందల ఏళ్ళనాటి పురాణం. కర్త ఎవరూ లేరు కనుక దీనికి లలితవిస్తర మహాపురాణమని కూడ పేరుంది. ఇది మహాయాన బౌద్ధులకు ప్రామాణికమైన గ్రంథం. ఇది ఒక చిన్న విజ్ఞాన సర్వస్వమన్నా అనవచ్చు. 19 వందల ఏళ్ళ క్రితమే ఇది చీనాభాషలో అనువదించబడింది. దీని నుంచి మనకు ఆ కాలపు వివిధ సాంఘిక విషయాలు తెలుస్తాయి. (దీనిని మహాపండితులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు, నేను తెలుగుచేశాము)

బుద్ధుడు పెరిగి పెద్దవాడయ్యాడు. తండ్రి శుద్ధోదనుడు ఆయనను బడికి పంపాడు. బుద్ధుడు లిపిశాలకు - బడికి - వెళ్లాడు పలక, బలపం తీసుకుని. మామూలు పలకకాదు, ఉరగసార చందన మయమైన లిపి ఫలకం. మామూలు

బలపంకాదు, మణిరత్న ప్రత్యుప్తమైన దివ్య సువర్ణతిరకం. ఆచార్యుడైన విశ్వామిత్రుడు అక్షరాలు దిద్దుకోమన్నాడట. "ఏ లిపిని నాకు చెప్పదలచారు? బ్రాహ్మి, ఖరోష్ఠి, పుష్కరసారి, అంగలిపి, వంగలిపి, మగధలిపి, మంగల్యలిపి, అంగులీయలిపి, సకారిలిపి, బ్రహ్మవలిలిపి, పారుష్యలిపి, ద్రావిడలిపి, కిరాతలిపి, దాక్షిణ్యలిపి, ఉగ్రలిపి, సంఖ్యాలిపి, అనులోమలిపి, అవమూర్ధలిపి, దరదలిపి, ఖాష్యలిపి, చీనలిపి, లూనలిపి, హూనలిపి, మధ్యాక్షర విస్తరలిపి, పుష్పలిపి, దేవలిపి, నాగలిపి, యక్షలిపి, గంధర్వలిపి, కిన్నరలిపి, మహోరగలిపి, అసురలిపి, గరుడిలిపి, మృగచక్రలిపి, వాయసరుతలిపి, భౌమదేవలిపి, అంతరిక్షదేవలిపి, ఉత్తరకురుద్వీపలిపి, అపరగోడానీలిపి, పూర్వవిదేహలిపి, ఉత్క్షేపలిపి, నిక్షేపలిపి, విక్షేపలిపి, ప్రక్షేపలిపి, సాగరలిపి, వజ్రలిపి, లేఖప్రతిలేఖలిపి, అనుద్రుతలిపి, శాస్త్రావర్తలిపి, గణనావర్తలిపి, ఉత్క్షేపావర్తలిపి, (నిక్షేపావర్తలిపి) పాదలిఖితలిపి, ద్విరుత్తరపదసంధి లిపి, యావద్దశోత్తరపద సంధిలిపి, మధ్యాహారిణీలిపి, సర్వరుత సంగ్రహణీలిపి, విద్యానులోమావిమిశ్రితలిపి, ఋషితపస్తప్తలిపి, రోచమానలిపి, ధరణీప్రేక్షిణీలిపి, గగనప్రేక్షిణీలిపి, సర్వౌషధినిష్యందలిపి, సర్వసార సంగ్రహణీలిపి, సర్వభూతరుత గ్రహణీలిపి-ఈ అరవై నాలుగింటిలోను ఉపాధ్యాయులవారూ, ఏ లిపిని నేర్పదలచారండీ?" అని బుద్ధుడు ఆచార్య విశ్వామిత్రుని ప్రశ్నించాడట.

బుద్ధుడు బాల్యంలోనే సర్వజ్ఞుడని చెప్పడం మనకు అతిశయోక్తిగా కనిపించినప్పటికీ, ఈ అరవై నాలుగు లిపులలో కొన్నైన అప్పటికి ప్రచారంలో ఉండేవని నమ్మవచ్చు. అంత ప్రచారం కావడానికి ఎన్నో శతాబ్దాల క్రితమే లిపి అభివృద్ధి కావడం అవసరం కదా!

లలిత విస్తరంలో బుద్ధుని పెండ్లికి సంబంధించిన ముచ్చట చెబుతాను శుద్ధోదనుడు బుద్ధునికి పెండ్లిచేయ సంకల్పిస్తాడు. ఎంతో బతిమాలగా బతిమాలగా బుద్ధుడు అంగీకరిస్తాడు పెళ్లికి. కాని షరతులున్నాయి-కులగోత్రాల పట్టింపులు తనకు లేవు. కన్య ఫలానా ఫలానా గుణాలు కలిగి ఉండాలి. గాథలు వ్రాసి చదివి అర్థం చెప్పగలిగి ఉండాలి. అలాటి కన్యను వరిస్తాను-అని.

"సోగాథ లేఖ లిఖితే గుణ అర్థ యుక్తా
యా కన్య ఈదృశ భవే మమ తాం వరేథాః"

అని కొన్ని గాథలు వ్రాసి తండ్రిచేతికిస్తాడు. కుమారుడు పెండ్లికి ఒప్పుకోవడమే పదివేలని తండ్రి ఆ లేఖను పురోహితున కిచ్చి కన్యాన్వేషణకు పంపుతాడు. పురోహితుడు కపిలవస్తు నగరంలో ఇంటింటికి వెళ్ళి కన్యాన్వేషణ ప్రారంభిస్తాడు. దండపాణి అనే శాక్యుని కుమార్తె దానిని చదివి బుద్ధుడు

కోరిన గుణాలన్నీ తనలో వున్నవని గాథ వ్రాసి సమాధానం చెబుతుంది.

"మహేృతి బ్రాహ్మణ గుణా అనురూపసర్వే
సోమే పతిర్భవతు సౌమ్య సురూపరూపః,
భణహి కుమారు యది కార్యమహూ విలంబః
మా హీన ప్రాకృత జనేన భవేయ వాసః"

ఓయీ బ్రాహ్మణుడా! ఆ అనురూప గుణాలన్నీ నా వద్దే ఉన్నవి. సౌమ్యస్వ రూపుడైన అతడే నా భర్త కానీ, విలంబం వద్దని ఆ రాజకుమారునికి తెలియజేయి. హీనుడైన అనాగరికునితో నాకు సహవాసం కలుగకుండా ఉండనీ- దీనిని బట్టి స్త్రీలలో చదువు వ్రాత ఎంతో వ్యాపించిందనేకదా అనుకోవాలి— అందరిలోను లేకపోయినా, కొన్ని వర్గాలవారిలోనన్నా సరే.

ఇక బుద్ధునికాలపు పుస్తకాలేకాక శాసనాలువంటి శాశ్వత ప్రమాణాలు కూడ మనకు బాగా దొరికాయి. వీటిలో ఒకటి ఆయన కాలంలో రాజ్యంచేసిన అజాతశత్రువు ప్రతిమమీద వ్రాసినది. మనకు దొరికినదానిలో శాసనరూపంలో కనిపించే తొలి లిపి బహుశా ఇదే. ఇతడు బింబిసారుని కుమారుడని మీకు తెలుసు. ఇతని వంశంవారి మరి రెండు ప్రతిమలుకూడ దొరికాయి. ఒకటేమో అజ ఉదయుడనే రాజుది. రెండవది అతని కుమారుడైన నందివర్మది. ఈ రెండింటిమీద వీరి పేర్లు, తక్కిన వివరాలు ఉన్నాయి. వీరిద్దరూ అజాత శత్రువుకు ముప్పైఏళ్ళ తర్వాత రాజ్య మేలినవారు. అజాతశత్రువు ప్రతిమ మధుర మ్యూజియంలోను, తక్కినవి రెండు కలకత్తా మ్యూజియంలోను ఉన్నాయి.

ఇవి స్పష్టంగా లేవని అనుమానించే వారికి మరొక ప్రాచీన శాసనం చూపవలసివస్తుంది. ఇది నేపాల్ అడివారంలోని పిప్రావా అనేచోట ఒక స్తూపంలో ఉంది. బుద్ధుని వంశీయులైన శాక్యులు అతని పవిత్రాస్థులు సమాధి చేసి, దానిపై ఈ స్తూపం కట్టించారు. ఆ అస్థికలున్న పాత్రమీద ఈ శాసనం చెక్కి ఉంది. బుద్ధుని నిర్మాణకాలం క్రీస్తుకు ముందు 487 వ సంవత్సరంకనుక ఈ శాసనం కూడ అప్పటిదే.

"ఇయం సలిల నిధానే బుధస భగవతే సకియానాం సుకుతి భటినాం సభ గినికనం సపుత దలనం" అని. బుద్ధ భగవానుని ఈ శరీర నిధానం అతని అన్నదమ్ములు, భగినీసహితులు, పుత్రదార సహితులు అయిన శాక్యులది-అని దీని అర్థం. అస్థులను సమాధిచేయడమనేది, అందులోను ఆయన గోత్రంవారు చేయడమనేది బుద్ధుని మహాపరినిర్వాణానంతరం వెన్వెంటనే జరిగి ఉంటుంది గాని కాలాంతరంలో కాదుకదా! ఈ శాసన భాషకు తర్వాతిభాషకు ఎంతో భేదం

కనిపిస్తుంది. దీనినే తర్వాతికాలంలోని మౌర్యులనాటి వ్యవహార భాషలో-అంటే అశోకుని శాసనభాషలో అనుకుందాము-వ్రాసేటట్టయితే "ఇదం శరీరనిధానం బుద్ధస్స భగవతో శాక్యానాం సు కుటిభటికనాం సభగినినం సపుత్తదారానం." అని ఉండవలసివస్తుందని పండితులంటున్నారు.

ఈకాలందే అయిన మరొక శాసనం అజ్మీర్ జిల్లాలోని బడలీగాంవ్ అనే గ్రామంలో దొరికింది.

"వీరాయ భగవతే

చదురాసితి వ (స)"

అని రెండుపంక్తుల శాసనమిది. ఇది బడలీగాంవ్‌లోని స్తూప స్తంభంపై చెక్కినది. 'వీరాయ భగవతే' అన్నదానినిబట్టి, చతురాసితి అనే 84 సంఖ్యను బట్టి ఇది కట్టకడిపటి జైనతీర్థంకరుడైన మహావీరుని నిర్యాణ సంవత్సర సంఖ్య అని, ఈ స్తూపం మహావీరుని అస్థికలు నిక్షేపించి నిర్మించిందని మనం అనుకునే పక్షంలో ఈ శాసనం క్రీస్తు పూర్వం 443 వ సంవత్సరంది అవుతుంది. ఈ లిపికి అశోకునికాలపు లిపికి చాల భేదం కనిపిస్తుంది. ఈ శాసనంలోని వ గుడి దీర్ఘం (వీ) అశోకశాసనాల దీర్ఘంలాగ లేదు. 71 వ పుటలోని అశోక శాసనం 5వ పంక్తి, ఎనిమిదవ అక్షరం తీ చూడండి-గుడి దీర్ఘం ఎలాగ ఉందో.

ఈ కాలానికి కొంచెం ఇవతలివయిన మరి మూడు ప్రాచీన శాసనాలు దొరికాయి. మొదటిది నేటి ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ జిల్లా సోహ్‌గౌరా అనే గ్రామంలో దొరికింది. ఈ గ్రామం గోరఖ్‌పూర్‌కు ఆగ్నేయంగా రాప్తీ నది దక్షిణతీరంలో పధ్నాలుగు మైళ్ళ దూరంలో ఉంది. ఇది రెండున్నర అంగుళాల వెడల్పు, రెండంగుళాల పొడవుగల చిన్న తామ్రశాసనం. 1893లో



దొరికింది. ఇది బండ్లకు నోటీసు బోర్డు వంటిది. ఏ రాజమార్తాండుడో మూడు మార్గాలు చేరేచోట ప్రయాణికుల సౌకర్యం కోసం వేయించింది. ఇదే ఇప్పుడు దొరికిన తొలితామ్రశాసనం గనుక దీని వివరాలు తెలుసుకొనడం అవసరం. అందులోను ఇదొక నోటీసు బోర్డు వంటిది గనుక అప్పటి సంఘపరిస్థితి కూడ మనకు తెలుస్తుంది.

సవతియన మహ మగన ససనే మనవసి తికే
దసిలి మతే ఉసగమే వ ఏతే దువే కోఠగలని
తియవనిమధుల ఛచు మెదమ భలకన వ
ల కయియతి అతియాయికయ నో గహితవయ
(సవ్వ తియాన మహామగ్గానాం సాసనే మనవసి తికే
దసిలిమతే ఉసగామే వ ఏతే దువే కోత్థాగాలాని
తియవని మధులా ఛంఛూ మేదమ భాలకానాం వా
ల కయ్యాయంతి అతియాయికాయ నోగహితవ్వాయ.)

మూడు మహామార్గాల్లో వెళ్ళే యానాలకు (బండ్లకు) ఇది శాసనం. మూడుదారులు కలిసే మనవసి అనేచోట దసిలిమత ఉసగామ అనే రెండు గ్రామాలలో రెండు కోష్ఠాగారాలు (ధాన్యం గిడ్డగుంలు) తియవని, మధులా, ఛంఛూ నగరాలనుంచి వచ్చిపోయే సరకులు అత్యవసర పరిస్థితులలో దింపు కోడానికి నిర్మించబడ్డాయి; శాశ్వత వినియోగానికి కాదు.

ఆ కాలంలో దారులలో కోసుల గుర్తులున్న రాళ్ళు, స్తంభాలు ఉన్నవని చంద్రగుప్తుని ఆస్థానంలోని గ్రీకురాయబారి మెగస్థనీస్ అన్నాడు. కనుక సర కులు దింపడానికి కూడ బాటకు సమీపంలోనే గిడ్డంగులవంటివి కూడ ఉన్నట్టు ఈ శాసనం తెలుపుతున్నది. ఛంఛూ అనే నగరాన్ని చీనా బౌద్ధయాత్రికుడు హుయెన్‌త్సాంగ్ తెలిపాడు. ఇది నేటి ఘాజీపూర్ కావచ్చునని పండితుల అభి ప్రాయం. తియవని అనేది బహుశా సోహ్‌గౌరాకు ఈశాన్యంగా డెబ్బయిమైళ్ళలో నేపాలదేశపు సరిహద్దులోని త్రిబేణీఘాట్ కావచ్చును. ఈ శాసనానికి నాలుగు కొనలలోను నాలుగురంధ్రాలు కనిపిస్తున్నాయి. గనుక అందరికి కనిపించే రీతిగా ఒకగడకు మేకులతో బిగించి ఉంటారని ఊహిస్తున్నారు పండితులు.

ఈ కాలపు రెండవ శాసనం నేటి మహారాష్ట్రంలోని సాగర్‌జిల్లా ఐరణన్‌లో దొరికింది. ఇది ఒక నాణెం దీనిపైన ధర్మపాలుడనే రాజు పేరు చెక్కి ఉంది.

K D J ४ ⅃ ⅃

"అధమపలస" అని. ఈ శాసనం పోతపోసిన వాడెవడో కొంచెం అజ్ఞుడుగా కనిపిస్తున్నాడు. కనుక అక్షరాలు తలకిందులుగా చెక్కాడు. ఆ చర్చ అక్షర వికాస చర్చలో చూద్దాం.

మూడవది గుంద్రటి రాతి పలక. ఇది బెంగాల్‌లోని బోగ్రాజిల్లా మహా స్థాన్ అనేచోట దొరికింది. ఈ మహాస్థాన్‌ను పూర్వం పుండ్రనగరం అనే

వారు. ఇది కరతోయా నదీతీరంలో ఉంది. ఈ నదిని "కరతోయా సదా నీరా" అని అమరసింహుడు నామ లింగాను శాసనంలో ఉదాహరించాడు.



ఈ శాసనం కరువుకాటకం ఏర్ప డినప్పుడు అధికారులు చేయవలసిన పనులను గూర్చిన ఉత్తరువు. శాసన చిత్రం చూచారుగదా! దాని పాఠం చూడండి.

నేనసవంగియానం గలదనస। దుమదిన మహా
మాతే। సులఖితే పుడనగలతే। ఏతం
నివహిపయిసతి। సంవంగియానం ఛదినే తథా
ధానియం। నివహిసతి। దంగతి యాయికే దేవా
తి యాయి కసి। సు అతియాయికసి పి। గండకేహి
ధానియికేహి ఏస కోఠాగాలే కోసంభార......

సంవంగీయ వంశీయుడైన గలదనుని-గలార్దనుని-శాసనం. దీనిని పవిత్రమైన పుండనగరం నుంచి మహామాత్రుడు నిర్వర్తింపజేస్తాడు. సంవంగీయ వంశీయు లకు ధాన్యం అందజేస్తాడు. దైవికంగా పట్టణంలో కలిగిన అతియాయికం-దుర్భిక్షం-పోగొడుతాడు. ఎక్కువ సమృద్ధి కలిగినప్పుడు కోష్ఠాగారాన్ని-ధాన్యం గిడ్డంగిని-ధాన్యంతోను, గండక నాణేలతోను నింపుతాడు-అని దీని అర్థం. దుర్భిక్షంలో రాజు అన్నదానం చేయాలని, ధాన్యం పంచిపెట్టాలని, అత్యవసర పరిస్థితుల నిమిత్తం ధాన్యాగారాలు నిర్మించాలని అర్థశాస్త్రంలో ఉంది.

అర్థశాస్త్రమంటే మనం సరిగ్గా మౌర్యుల కాలానికి వచ్చాము. ఈ కాలంనుంచి మనకు పాశ్చాత్యదేశాలతో విశేషంగా సంబంధం కలిగింది. నిజానికి మనకు మూడువేల సంవత్సరాలనుంచే, అంటే బుద్ధునికి మూడువందల సంవత్సరాలనుంచే విదేశాలతో ఓడల వ్యాపారం, రాకపోకలు సాగుతున్నాయి. ఇంతకుముందు సెమెటిక్ అక్షరాల ప్రసక్తిలో సోలమన్ చక్రవర్తిని గూర్చి విన్నారు. ఆయన కాలంనుంచే ఇటు దక్షిణదేశం నుంచి అటు ఉత్తర దేశంనుంచి కూడ అరబ్బీదేశాలతో మనకు సంబంధం ఉంది. పంజాబు సింధువంటి భారతదేశ పశ్చిమ ప్రాంతాలకు కొంత ఎక్కువ సంబంధం ఉండేది; కాని మౌర్యులకాలం నుంచి విశేషంగా సంబంధం కలిగింది. పర స్పరం రాయబారులను నియమించుకొనడం, విదేశీయులు వచ్చి మనదేశంలో స్థిరపడడం సర్వసాధారణమైంది. అప్పటినుంచి మన లిపిని గురించి విదేశీ

యులుకూడ తమ పుస్తకాలలోను, దినచర్యలలోను, యాదాస్తులలోను వ్రాసుకొన్నారు. అవి కొన్ని చూద్దాం.

ఇప్పటికి రెండువేల మూడువందల యేండ్లక్రితం అలెగ్జాండరు అనే గ్రీకు చక్రవర్తి ప్రపంచ దండయాత్ర చేస్తూ భారతదేశానికి కూడ వచ్చి పంజాబులో కొంత ప్రాంతాన్ని జయించడం మనం చిన్ననాడే చరిత్రలో చదివిన సంగతి. అతని సేనాపతి నియార్కస్ అనే గ్రీకుపౌరుడు భారతదేశాన్ని గురించి వ్రాసిన విషయాలలో భారతీయులు గుడ్డలను మెదుగకొట్టి కాయితాలు చేసి వాటిపైన వ్రాస్తారని తెలిపాడు. అలెగ్జాండరు తర్వాత గ్రీసు చక్రవర్తి అయిన సెల్యూకస్ రాయబారిగా మెగస్థనీస్ అనే గ్రీకు పండితుడు మౌర్యచంద్రగుప్తుని ఆస్థానంలో ఉండేవాడు. అతడు మనదేశం గురించి తమ భాషలో ఎన్నో విషయాలు వ్రాసిపెట్టాడు. చంద్రగుప్తుని వరకు రాజ్యమేలిన పూర్వరాజుల వంశవృక్షం పాటలీపుత్రంలో ఉందని, బాటలకు, భవనాలకు పేర్లున్నాయని ఈ పేర్లు రాతిబండలపై చెక్కి అందరికీ తెలిసే ఎత్తైనచోట్లలో తాపడంచేస్తారని మెగస్థనీస్ వ్రాశాడు.

ఈ చంద్రగుప్తుని మనమడే అశోకుడు. ఇతని కాలానికి దేశంలో ప్రధానంగా రెండులిపులు వాడుకలో ఉండేవి. మనదేశం పశ్చిమ ప్రాంతంలోను, వాయవ్య ప్రాంతంలోను ఒకలిపి, తక్కిన దేశమంతటా మరొకలిపి. అశోకుడు చాల గొప్పరాజు. బుద్ధమతం నమ్మినవాడు. ప్రజలందరూ ధర్మమార్గంలో నడవాలని, సత్పురుషులు కావాలని కోరిన మహారాజు. కనుక అతడు బౌద్ధమతం వ్యాపింపజేయడానికి దేశదేశాలకూ దూతలను పంపాడు. తదకు తన చెల్లెలు సంఘమిత్రను, కుమారుడు మహేంద్రునికూడ పంపాడు. దేశమంతటా శాసనాలు వేయించాడు. ఇంత వరకు మనదేశంలో 30 చోట్ల ఈయన శాసనాలు దొరికాయి. బుద్ధమత ప్రచారంకోసం వేయించిన శాసనాలు గనుక వీటిని అశోకుడు "ధర్మలిపులు" అన్నాడు. ఈ శాసనాలు కొండలపైన, శిలా స్తంభాలపైన, గుహలలోను ఉన్నాయి.

మైసూరు రాష్ట్రంలో సిద్ధాపురం అనే గ్రామం దగ్గర బ్రహ్మగిరి అనే గుట్టపైని అశోకుని చిన్నశాసనం మచ్చుకొకటి చూడండి.

సేహేవం దేవానాం పియే
ఆహ మాతాపితిసు సుసూసితవియే హేమేవ గురుతం ప్రాణేషు ద్రహ్యితవ్యం సచం
వతవియం సేఇమే ధమగుణా పవతితవియా హేమేవ అంతేవాసినా
ఆచరియే ఆపచాయితవియే ఇతికేసుచ కం య(థా) రహం పవతితవియే
ఏసా పోరాణా పకితీ దిఘావుసే చ ఏసహేవం ఏస కటివియే
ఛపడేన లిఖితే లిపికరేణ.

దేవానాం ప్రియుడు ఈ విధంగా చెబుతున్నాడు. మాతాపితలకు శుశ్రూష చేయాలి. ఈ విధంగానే ప్రాణులనుకూడ మహాదయతో చూడాలి. సత్యం చెప్పాలి. ఈలాటి ధర్మగుణాలను ప్రవర్తింపజేసుకోవాలి. ఈవిధంగానే శిష్యుడు ఆచరించి, సపర్యలు చేయాలి. జ్ఞాతుల విషయంలో సముచితంగా ప్రవర్తించాలి. ఇది పురాణాచారం. ఇది దీర్ఘాయువు కలిగిస్తుంది, దీనిని నేర్చుకోవాలి. లిపికరుడైన ఛపడునిచేత వ్రాయబడింది.

దక్షిణ భారతదేశంలో అశోకుడువేయించిన శాసనాలలో రాయలసీమలోను, కళింగంలోను కొన్ని దొరికాయి. ఇవిగాక దక్షిణాపథంలో మరొకచోట మాత్రమే ఆ కాలపు శాసనాలు దొరికాయి. అవి దొరికింది ఆంధ్రదేశంలో; మనం గర్వపడవలసిన విషయం. బౌద్ధమతం అశోకునికి ముందే ఆంధ్ర దేశంలో వ్యాపించింది. శాసనాలు దొరికిన ఆంధ్రదేశమంటే ఏమనుకున్నారు?



By Courtesy of Government Museum Madras.

గుంటూరుజిల్లా భట్టిప్రోలులో. ఇక్కడ బుద్ధుని సంస్మరణార్థం కుబిరకుడనే రాజు ఆదేశంపై ఒక స్తూపం నిర్మించబడింది. ఈ స్తూపంలో మూడు రాతి బరిణెలు, స్ఫటికపు ముక్క దొరికాయి. ఈ బరిణెలలో చితా భస్మం, అస్థికలు, బంగారు పూలు, నవరత్నాలు ఉన్నాయి. బరిణెల మూతల మీద, బరిణెల కంఠంచుట్టూ బరిణెలు చేయించి స్థాపించినవారి పేర్లు ఉన్నాయి. ఈ బరిణెలలో ఒక బరిణె చిత్రాలు, వాటిపై వ్రాసిన లిపులు చూడండి.



మూతమీది వ్రాత ఇది.

నేగమా
వఛో చఘో
జేతో జభో తిసో
రేతో అచినో షభికో
అఖఘో కేలో కేసో మాహో
సేతో ఛదికో ఓఖబూలో
సేణుతరో సమణో
సమణదాషో సామకో
కాముకో చీతకో



బరిణె మెడ చుట్టూ వ్రాసినది :

అరహదినానం గూఠియా మజూస చ షముగో చ తేన కమ యేన కుబిరకో రాజా అకి.

అరహదినుని గోష్ఠికిచేరిన వఛ (వత్స), చఘ, జేత (జయంత), జభ (జంభ), తిస (తిష్య), రేత, అచిన, షభిక (సభిక), అఖఘ (అక్షఘ్న), కేల (కేశ), మాహ, సేఠ, ఛదిక (ఛందిక), ఓఖబాల, సోణుతర (శోణోత్తర) సమణ (శ్రమణ), సమణదాష (శ్రమణదాస), సామక (శామక), కాముక, చీతక అనేవారు ఈ మంజూషను, షముగాన్ని (పెట్టెను) దత్తం చేశారు. కుబిరకరాజు ఆజ్ఞ పొందినవాడు ఈ పని చేయించాడు.

అశోకుని శాసనాల అక్షరాలకు, భట్టిప్రోలు మంజూషలమీద వ్రాతలకు ఎన్నో అక్షరాలలో చాల భేదం కనిపిస్తుంది. ఘ, జ, మ, ల, స అనే అక్షరాలు పూర్తిగా వేరు. అశోకుని శాసనాల అక్షరాలకూ వీటికి ఏమీ సంబంధం లేదు. అక్షరాలపైన దీర్ఘాలు సూచించడానికి అశోకశాసనాలలో కనిపించే అడ్డగీతలు భట్టిప్రోలు అక్షరాలలో మామూలుగా హ్రస్వాలకే ఉన్నాయి.

తమిళదేశంలోని కొన్ని గుహలలో కొన్ని శాసనాలు చెక్కి-ఉన్నాయి. వీటి లిపిలో కొంత అశోక, భట్టిప్రోలు లిపులను పోలి ఉంటుంది. కొన్ని కొత్త అక్షరాలు కూడ ఉన్నాయి. ఇలాటి గుహలు తిరునెల్వేలి జిల్లాలోని వీర శిఖామణి, ముత్తుప్పట్టి, ఆయకుడి అనే చోట్ల, మధురజిల్లా కళుగుమలై, ఆనైమలై, అళగర్మలై, తంజావూరు జిల్లా శిత్తణ్ణవాశల్ మున్నగుచోట్ల ఉన్నాయి. ఇవన్నీ బౌద్ధశాసనాలనీ భాషతమిళని తమిళ పరిశోధకులు అంటున్నారు. అయితే అక్షరాలు తెలుస్తున్నవి కాని భాష స్పష్టంగా తెలియడం లేదు. ఈ అక్షరాలను బట్టి, భట్టిప్రోలులో స్పష్టంగా దొరికిన బౌద్ధప్రాకృత శాసనాలను బట్టి లిపి మనకు-అంటే తెనుగువారికి-చాలపాతకాలంనుంచే తెలుసునని స్పష్టమైంది. అయితే ఈ లిపిని ఏమని వ్యవహరించేవారు? ఇది ఎలా పుట్టింది?



తృతీయ ప్రకరణం

# మనలిపి - మన చిత్రలిపి

మన దేశంలో ఒక లిపి ఎక్కువ ప్రచారంలో ఉన్నదని, పశ్చిమభాగం లోను వాయవ్యభాగంలోను మరొకలిపి ఉన్నదని ఇదివరకే తెలుసుకున్నాము గదా! మొదటి దానిని బ్రాహ్మి అని, రెండవదానిని ఖరోష్ఠి అని అన్నారు. ఈ పేర్లు ఎలా వచ్చాయనుకున్నారు?

మన సంప్రదాయం ప్రకారం వాక్కుకు అధిష్ఠానదేవత సరస్వతికదా! ఆ వాక్కుకు రూపకల్పన చేసిన లిపిని బ్రహ్మ పేరున పిలిచారని కొందరన్నారు. అబ్బే! సృష్టికర్త బ్రహ్మ. ఎవరు తయారుచేసిందీ తెలియని ఈ లిపి బ్రహ్మ నుంచే పుట్టిందన్న భావంతో బ్రాహ్మి అని అన్నారని మరికొందరు పండితుల వాదం. ఇదీకాదు. అక్షరజ్ఞానం అనాదిగాఉన్న బ్రాహ్మణ సంఘంవారు దీనిని వాడడంవల్ల దీనికి ఈపేరు వచ్చింది అని మరికొందరన్నారు. బ్రహ్మజ్ఞానరక్ష ణకు ఇది సర్వోత్తమమని భావించారు గనుక బ్రాహ్మి అన్నారు అని ఇక కొందరు అంటారు. ఏమైనా ఇది మనదేశంలో అతి ప్రాచీనకాలం నుంచి ఉన్న లిపి అన్నది మాత్రం నిజం.

బౌద్ధగ్రంథాలను బట్టికూడ ఇదే నిర్ణయానికి రావలసివస్తుంది. ఇంతకు ముందు లలితవిస్తరం మాట చదివారుగదూ! దానిలోని లిపులజాబితాలో మొద టిది బ్రాహ్మి. రెండవది ఖరోష్ఠి. జైనగ్రంథాలను చూచినా బ్రాహ్మియే ప్రాచీన మని తేలుతుంది. జైనమత గ్రంథమైన పన్నవణాసుత్తంలో లిపులను గురించి ఉంది. వారి సమవాయంగసుత్తం అనే మరొకగ్రంథంలో బంభీ, ఖరోట్టి, ధామిలీ, పోలిందీ అని పద్దెనిమిది లిపులు ఉన్నాయి. భగవతీ సుత్తం అనే మరొక గ్రంథం "నమో బంభీయేలివియే" అని బ్రాహ్మిలిపికి నమస్కారంతో ప్రారంభ మౌతుంది. దేవగఢ్‌లోని ఒక దేవాలయంలో పద్దెనిమిది లిపుల శాసనం ఉంది. దానిలోని మొదటిది బ్రాహ్మి లిపేనట.

చీనాలో ఇప్పటికి పదమూడు వందల ఏండ్ల క్రితం విజ్ఞానసర్వస్వం రచించబడింది. దానిలో బ్రాహ్మి, ఖరోష్ఠి, త్సం-కీ అనే లిపులు వర్ణించ

బద్దాయి. బ్రాహ్మి, ఖరోష్ఠి దేవలోకంనుంచి అవతరించాయని, త్సాం-కీ పశు పక్షుల కాలిగుర్తుల నుంచి పుట్టిందని చీనావారి నమ్మకం. ఈ సాక్ష్యాన్నిబట్టికూడ బ్రాహ్మి మనదేశంలో మొదటిలిపి అని నమ్మవచ్చు. దీనిని మౌర్యలిపి, అశోక లిపి అనికూడ ఇటీవలి పరిశోధకులన్నారు. ప్రాంతభేదాల్ని బట్టి దక్షిణబ్రాహ్మి, ఉత్తరబ్రాహ్మి అన్నారు.

ఇంతకు ముందు మీరు చదివిన శాసనాలన్నీ బ్రాహ్మిలిపివి. రెండవలిపి ఖరోష్ఠి అన్నాముకదా! అశోకుడు ఈ లిపిలో వేయించిన శాసనాలలో రెండు మనకు దొరికాయి. ఇవి ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దులోని శహ్‌బాజ్‌గఢ్, మాన్సేరా అనే పట్టణాలలో దొరికాయి.

ఈ లిపి మామూలుగా మనం చదివేటట్టు ఎడమవైపునుంచి కుడి వైపుకు వ్రాసేది అనుకున్నారేమో ! కాదు ఉరుదూ, ఫారసీ, అరబ్బీలలాగ కుడినుంచి ఎడమకు వ్రాసేది. ఇంతకు ముందు మీరు చదివిన అశోకుని శాసనం అఖరుపంక్తి అఖరు మాట చూడండి. లిపికరేణ అన్న మాటలోని అక్షరాలు తక్కిన అక్షరాలలాగ ఉన్నాయా ? లేదు. అది ఖరోష్ఠి "ఐరేకపిలి" అని చదవాలి. ఆ శిల్పి తనకు రెండురకాల లిపులూ వచ్చునని చూపడానికో లేక తను ఏ పంజాబు ప్రాంతంవాడోనని తెలుపడానికో-అఖరు పంక్తి అఖరు మాట అలా చెక్కాడు. ఖరోష్ఠీలిపి పూర్తి స్వరూపం తెలియడానికి ఈశాసనం చూడండి. ఎడమవైపునుంచి చదవాలి. ఇది కాబూలుకు పశ్చిమంగా 30 మైళ్ళలో వర్ధక్ జిల్లాలోని స్తూపంలో ఇత్తడి బరిణెపైని ఉన్న శాసనం. మొత్తం నాలుగు వరుసలు. క్రీస్తుశకం మొదటి శతాబ్దంది.

సం. ౧౩౩ మంద్ర అష్ఠమితి యశ సేహి ౧x। ఇమేన గత్రి
గేన షమగు పుత్ర అగమతే గద్ర ఇయ ఖయణ గ్రగషణ శిగ
ఆగమతి గయ విహార మృభగ అణ యక్ష శతి తవ
తిథవేతి....ఇమేనషుయలేన మహరజ రజతిరజ హొలేష్షంద్ర.

ఇంతకు ముందున్న శాసనాలను దీనితో పోల్చి చూడండి. ఖరోష్ఠి అక్షరాలు చాలవరకు నిలువుగీతలూ, అడ్డగీతలూను. గుణింతాలు మొదలయిన వాటివల్ల కలిగే మార్పులు దాదాపు అక్షరాల పైభాగం మీదే కనిపిస్తాయి. గుండ్రటి అక్షరాలు లేవనే అనవచ్చు. వర్ణాల ఆకారం, ప్రమాణం ఒకేరకంగా లేవు.

బ్రాహ్మీ లిపిలో నియమబద్ధమైన గీతలు కనిపిస్తాయి. గుండ్రటి ఆకారం, కలిగే మార్పులు అక్షరాల కిందిభాగంలోనే కనిపిస్తాయి. పైన కలిగే మార్పులు కొద్ది. ఆకారం సుందరంగాను, స్థిరపడినట్లు అగుపిస్తుంది. గుణింతాల గుర్తులు పరకలాటి చిన్న గుర్తుతో సూచించబడుతాయి.

ఇలా అన్నీ వంకర గీతలు ఒంటి పెదవుల్లాగ కనిపించాయేమో మన వారికి ఖరోష్ఠి అని పేరు పెట్టారు. టర్కీ, టిబెట్, వాయవ్య సరిహద్దు ప్రాంతాల ప్రజలను మనవారు అనాగరకులుగా భావించి, అలాటి అనాగరకులు, ఖరులు-వాడె లిపి గనుక, అలాటి ఖరుల పెదవులనుంచి వెలువడేవి గనుక-ఖరోష్ఠి అన్నారని కొందరు పండితులన్నారు. గాడిద చర్మం మీద-ఖరపోస్త-మీద వ్రాసిన లిపి గనుక, ఖరోస్త అనే పదం క్రమంగా ఖరోష్ఠి అయిందని కొందరు అంటారు. ఖరోత్థ అనే అరమీన్ భాషాపదం సంస్కృతీకరించబడి ఖరోష్ఠి అయిందని మరికొందరన్నారు. ఏమైనా ఇది విదేశ లిపే కాని మన దేశపు లిపి కాదు. కాని మనదేశపు బ్రాహ్మీలిపితో పాటు అభివృద్ధి పొంది ఐదారు వందల ఏళ్ళపాటు ఆ ప్రాంతాలలో ప్రచారంలో ఉండి, తర్వాత నశించింది.

అయితే ఇది ఏ విదేశీ లిపినుంచి వచ్చింది? మన దేశపు పశ్చిమోత్తర ప్రాంతానికి బుద్ధునికి బహుకాలానికి ముందే ఇతర పశ్చిమదేశ ప్రజలతో సంబంధం ఏర్పడిందని ఇదివరకే తెలుసుకున్నాము. పాణిని 'యవన లిపిని పేర్కొనడం కూడ విన్నాము. బుద్ధుని కాలంలో ఈ ప్రాంతం దారిఉష్ (డెరయస్) అనే పారశీక రాజు స్వాధీనపరచుకొని తన సామ్రాజ్యంలో చేర్చుకున్నాడు. అశోకుని కాలానికి కొంచెం ముందు పారశీకదేశం పాలించిన

బాడెస్యస్ అనే రాజు శాసన మొకటి తక్షశిలలో దొరికింది. కనుక ఈ ప్రాంతానికి పారశీకంతో బహుకాల సంబంధం ఉంది.

ఆ కాలంలో అరమీన్ జాతివారి భాష, లిపి ఆ ప్రాంతంలో అధికార భాషగా ఉండేది. అరమీనులంటే సెమ్‌జాతివారిలో ఒక తెగ. వీరు సిరియా వాసులు. సిరియాను పూర్వం అరమ్ అని, అక్కడివారిని అరమీనులని అనేవారు. వీరు అరేబియా ఈశాన్యభాగం నుంచి సిరియాకు ఇప్పటికి మూడువేల సంవత్సరాల క్రితం వలస వచ్చారు. అటు తర్వాత మూడువందల సంవత్సరాలవరకు వీరి భాష లిపి, సిరియా, మెస్సపొటేమియా, ఈజిప్టు, ఆసియా మైనరులనుంచి భారతదేశం సరిహద్దువరకు అధికారభాషగాను, అధికార లిపిగాను ఉండేవి.

దీనికి ఖరోష్ఠికి సమానోచ్చారణ గల పెక్కు అక్షరాలలో పోలిక ఉంది. వ్రాత పద్ధతి కూడ-కుడినుంచి ఎడమకు-రెండింటికి సమానమే. కనుక ఖరోష్ఠి ఈ అరమీన్ లిపినుండి ఆవిర్భవించి పారశీకరాజుల కాలంలో మనదేశం పశ్చిమోత్తర భాగంలో వ్యాపించింది.

అరమీన్ వర్ణమాలలో 22 అక్షరాలే ఉన్నాయి. దీనితో ప్రాకృతభాషను వ్రాయడమెలా? కనుక భ, ఘ, ధ వంటి మహాప్రాణాలను, ఇతరాక్షరాలను ఖరోష్ఠి బ్రాహ్మీలిపినుంచి గ్రహించింది. అరమీనులిపిలోగాని, మరేపాశ్చాత్య లిపిలోగాని గుణింతాలు చేర్చడమనేది లేదుగదా? అవికూడ బ్రాహ్మీలిపి నుంచి ఖరోష్ఠిలో చేరాయి. దీనినిబట్టే కొందరు ఇదికూడ భారతదేశంలో పుట్టిన స్వతంత్రలిపి అని వాదించారు.

ఈ లిపి భారత అఫ్ఘనిస్తాన్ సరిహద్దులలోను, తూర్పు గాంధారంలోను, తూర్పు టర్కిస్థాన్‌లోను ఎక్కువ వ్యాప్తిలో ఉండేది. ఈలిపిలో క్రీస్తుకు రెండువందల ఏళ్ళ ముందుకాలపు గ్రీకు, సిథియన్ జాతి రాజులు నాణేలు, కర్రపైన, చర్మంపైన, కాయితంపైన వ్రాసిన శాసనాలు దొరికాయి. తూర్పు టర్కిస్థాన్‌లోని గోసంగ విహారమనే బౌద్ధవిహారం శిథిలాలలో బౌద్ధలిఖిత పుస్తకాలు పద్దెనిమిది వందలఏళ్ళనాటివి దొరికాయి. అయితే ఖరోష్ఠిశాసనాలు ఎక్కువగాదొరికింది ప్రాచీనగాంధారంలోను, ఉత్తర పంజాబులోను. ఇవి క్రీస్తుశకం ప్రారంభంలోనివి.

ఈ లిపికి ఖరోష్ఠి అనే పేరు ఉన్నదని తెలియకముందు బాక్ట్రియన్ ఇండో బాక్ట్రియన్, బాక్ట్రో - పాలీ, వాయవ్యభారత లిపి, కాబూలీలిపి, ఈరానీ-పాలీ అని ఆధునిక పరిశోధకులు పేర్లు పెట్టారు.

ఖరోష్ఠి విదేశీయ స్వదేశీయ సాంకర్యంవల్ల ఏర్పడిందని తెలుసుకున్నాము.

దేశంలో ఎక్కువ వ్యాప్తిలో ఉండిన బ్రాహ్మీలిపి ఎలా పుట్టిందనుకున్నారు ?

తక్కిన లిపులలాగే మన బ్రాహ్మీలిపికూడ చిత్ర లిపినుంచే పరిణమించిందని అన్నానుకదూ ఆ చిత్రాలేవి? అవి నేటి మన అక్షరాలుగా ఎలామారాయి? ఈ ప్రశ్నలకు ఈజిప్టు, చిత్రలిపులను వివరించినంత సులువుగా చెప్పలేము. మూలంమాత్రం దొరికింది. క్రమపరిణామం వివరించే సాధనాలు దొరకలేదు.

మూలమంటే ఏమిటి అంటారేమో! ఒకతరం క్రితం ప్రపంచాన్నే దిగ్భ్రాంతికొలిపే ఘటనలు మనదేశంలో జరిగాయి. పశ్చిమ పంజాబ్ రాష్ట్రంలోని (నేటి పాకిస్తాన్‌లోని) మాంట్‌గొమరీ జిల్లాలో హరప్పా అనే గ్రామం ఉంది. సింధురాష్ట్రంలోని లాడ్‌ఖానా జిల్లాలో మోహెంజోదడో అనే గ్రామం ఉంది. ఈ గ్రామాలలో ఏవో ప్రాచీనశిథిలభవనాలు కనిపించాయి. వాటిని పురాతత్వశాఖవారు తవ్విస్తుండగా, ప్రాచీన నగరాల చిహ్నాలు కనిపించాయి. ఇదేదో చిత్రమని అధికారులు తవ్వకాలు సాగించారు. మూడంతస్థుల మేడలాగి ఒకదానిపై మరొకటిగా ఉన్న మూడు నగరాల శిథిలాలు బయల్పడ్డాయి. తీర్చి దిద్దినట్లున్న రాజవీధులు, ఎంతో వాస్తుశాస్త్ర జ్ఞానం కలవారు కట్టినట్లున్న ఇళ్లు, కాల్చిన ఇటుకలు, మురుగునీరుపోయే కాలువలున్న వీధులు, మట్టిపాత్రలు, మట్టి ముద్రలు-ఇంకా ఎన్నో రకరకాల విచిత్ర వస్తువులు దొరికాయి. మట్టి ముద్రలే



వేయింటికి పైగా దొరికాయి. వీటిలో కొన్నిటి మీద ఒకపక్కన జంతువుల బొమ్మలు, వాటిమీద ఏవో చిత్రమైన లిపులు ఉన్నాయి. రెండవపక్క గుబ్బల వంటివి ఉన్నాయి. కొన్నిటిమీద వట్టి లిపులే ఉన్నాయి. కొన్నిటిమీద స్వస్తికచిహ్నాలు రేఖా గణితపు గుర్తులూ, ఉన్నాయి. ముద్రికల మీది మృగాల బొమ్మలుకూడ విచిత్రమైనవే. పెద్ద మూపురాలుగల ఎద్దులు, నేలమీద జీరాడే గంగ





డోలు గల ఎద్దులు, ఒంటికొమ్ముఎద్దులు, ఏనుగలు, కారెనుబోతులు ఇంకా రకరకాల మృగాలు. ఒక మానవుడు పులితో పోరాడుతున్నట్టు మరొక బొమ్మ ఉంది. ఈ ముద్రికల మీద దాదాపు 396 అక్షరాలున్నాయి. ఇవన్నీ ఎడమనుంచి కుడివైపుకు వ్రాసేవో కుడివైపునుంచి ఎడమకు చదివేవో మరెలాటివో స్పష్టం కాలేదు.

ఇది ఇలా ఉండగా, ఇలాటి ముద్రికలే మెసపొటేమియాలోను దొరికాయి. మెసపొటేమియా సుమేరియా జాతివారు పాలించినది. ఇవన్నీ ఇప్పటికి ఐదువేల సంవత్సరాల నాటివి. వాటినిబట్టి మనదేశంలో దొరికిన ఈ ముద్రికలు గూడ ఐదువేల సంవత్సరాల కిందివని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. కాని సుమేరియనులకూ, సింధులోయవారికీ సంబంధం ఏమిటి? వాటికీ, వీటికీ పోలికలున్నాయిగాని, సమానోచ్చారణగల అక్షరాలని ఎలా చెప్పగలం?

ఈ అక్షరాలన్నీ రేఖలలో ఉండటంవల్ల మొదట ఇవన్నీ చిత్రరూపంలోనే ఉండి, తర్వాత ఈ స్వరూపానికి వచ్చాయని పండితుల అభిప్రాయం. పలువురు పండితులు ఈ లిపి స్వదేశీయమే అన్నప్పటికీ, కొందరుమాత్రం విదేశీయమని అనుమానిస్తున్నారు. ఈ లిపి, లోగడ మీరు చదివిన కీలలిపి, ఎలెమ్ అనే జాతివారి లిపి ఒకే కుదురునుంచి పుట్టినవని కొందరివాదం. ఎలెమ్ జాతివారంటే ఎలెమ్ ప్రాంతంవారు. ఎలెం అనేది పర్షియన్ సింధుశాఖకు ఉత్తరంగా దిగువటి గ్రెసెకు తూర్పున నేటిపర్షియాలోని ఖుజిస్తాన్ ప్రాంతం. ఇక్కడి వారిని ఎనెమ్‌జాతివా రన్నారు. వీరు కూడ సుమేరియనుల వలె, సెమ్‌జాతుల వలె ప్రాచీనమైన నాగరికజాతివారు. ఈ మూడు లిపులలోను ఒకటి మొదటపుట్టి ఏదో లిపి ఉందనే ఊహతో, ప్రయత్నం మీద తక్కిన రెండు పుట్టిఉంటాయని కొందరు తమాషా ఊహ చేశారు. ఇవన్నీ సుమేరియన్ జాతి లిపులు. ఇదంతా సుమేరియన్ సంస్కృతి. వేదంలో చెప్పిన ఇంద్రుడు, బృహస్పతి,




1. మానవ విగ్రహాలు, 2. విగ్రహాలు, 3. పాత్రలు, 4. చేపలు, 5. పర్వతాలు, 6. చెట్లు.

శుక్రుడు మొదలయిన భారతీయ వేదపురాణాల పురుషులందరూ మెసపొటేమియా సిరియా, ఫినీషియా, హిట్టైట్‌లనే ప్రాంతాలు పాలించిన సుమేరు ప్రజల సంతతి వారు- అని ఎల్. ఎ. వాడెల్ అనే పండితుడన్నాడు.

ఈ లిపులున్న ముద్రలు మనదేశంలోనే విరివిగా దొరికాయి. కనుక లిపులూ మనవే. మనకు ఐదువేల సంవత్సరాలనాడే లిపుల సంగతి తెలుసు.



ఈ ముద్రికలలోని వృషభాలు, మూడు మొనల కిరీటం ధరించిన యోగీశ్వరుడు ఋగ్వేదంలోని కొన్ని ఋక్కుల ప్రతిరూపాలుగా ఉన్నవి. కనుక విదేశీయమైనవి కావు- అని టి. ఎన్. రామ చంద్రన్‌వంటి పండితులు అంటున్నారు. శ్రీసుధాంశు కుమారరాయ్, డాక్టర్ ఎస్. ఆర్ రావ్, పలువురు పాశ్చాత్యులు మరికొన్ని సిద్ధాంతాలు చేశారు. కాని ఏదీ స్పష్టంగా లేదు.

ఇటీవలనే మరొక చిత్రం దొరికింది. అహమదాబాద్ జిల్లాలోని సరగ్వాలా అనే గ్రామంలో కొన్ని శిథిలాలు కనిపించాయి. ఇవి అక్కడ కొన్ని వేల ఏళ్ళకిందట ఉన్న లోథాల్ అనే నగరం అవశేషాలు. మొహెంజోదడో, హడప్పాలలో దొరికిన ముద్రికలలాంటివే ఇక్కడ కూడ దొరికాయి. ఇవి



వందకు పైగా ఉన్నాయి. విశేషమేమిటంటే ఇక్కడ సుద్దరాతితో చేసిన ముద్రికలు దొరకడం. లిపికూడ దానిలాగే ఉంది. మొహెంజోదడో ముద్రలు దొరికినప్పుడు అవి ఎలా చేసేవారనేది తెలియలేదు. లోథాల్ శిథిలాలలో ఆవం కూడ బయటపడింది. దీనివల్ల ముద్రలు ఎలా తయారుచేసి కాల్చేవారో తెలిసింది. లోథాల్ ప్రాచీన మైన రేవు పట్టణం గనుక ఈ ముద్రికలకు మంచి గిరాకీ ఉండేదని, మొహెంజోదడో, హరప్పా నగరాలకూ దీనికి వాణిజ్యం కొనసాగుతూ ఉండేదని పండితులు ఊహిస్తున్నారు.

బుద్ధునికి వచ్చిన లిపులలో పాదలిఖిత లిపి; ద్విరుత్తపద సంధిలిపి అనే లిపులుండడం మీరు చదివారు. పదంలో ఒక భాగమైన లిపి, పదాల చేరికవల్ల ఏర్పడిన లిపిఅని ఈ రెండు లిపుల పేర్లు మనకు ధ్వనింప జేస్తున్నాయి గదా! ఈజిప్టు చిత్ర లిపిలాగానే మొహెంజోదడో చిత్ర లిపికూడ మొదట వస్తువు బొమ్మగాను, తర్వాత వస్తువును సూచించే పద భాగంగాను, పదప్రథమాక్షరంగాను అయి ఉంటుంది. దానినుంచే బ్రాహ్మీలిపి పుట్టింది. దీని క్రమవికాసం పరిశోధనల వల్ల ఇంకా రుజువుకావాలి.

| తాంత్రిక చిత్రాంకనము | చిత్రాంకనపు పేర్లు | అశోకాక్షరములు | తెలుగు |
|---|---|---|---|
| + | కాముడు. శివుడు | + | క |
| Δ | ఏకపాదము. ఏకాదశాధార. ఆదిశక్తి | △ | ఏ |
| ∴ | ఇంద్రాణి | ∴ ∴ ⁛ | ఈ |
| X, H, ట | అమృతకలశము. అమృతేశ్వరి | ㅅ, ㅂ | అ |
| ट | ఉమ. కర్ణ | L, ट | ఉ |
| ✳ | తార. భ్రమము | ⊙ ⊃ | ఓ |
| o | బిందువు | o | ం |
| ః | విసర్గ | ః | ః |
| ㄩ, ᘏ, ㄩ | క్షితి. లిపి | ᒍ, ᒍ, ᘏ | ల |
| ⚘, ⚘ | కరుణ, మణిపురము. పద్మము | ♁ . ♁ | వ |
| \|, ⌠ | రక్తము. భుజము | ⌠, ⌠, \| | ర |
| ⊥, ⊥ | వాయువు. నాసికము | ⊥, ⊥, ⊥, ⊥ | య |
| ♆, ♆, ♆ | శరము | | శ |
| ♃, ♃, ♃ | శూలము | ↑ ↑ ↑ | ష |
| ᔕ, ᔕ | పాశము. ప్రకృతి | ᔕ ᔕ, ᔕ | స |
| ∪, ㄩ, ○ | కపాలము, దేహము. శిరస్సు | ᒐ, ᒐ, ᒐ | హ |
| ♀, ♀ | ధనువు | ◖ D | థ |
| ⟨, ⟩ | ధనువు | ⟨ ⟩, ⟩ ⟨ | ద |
| ㄩ, ㄩ | దక్షిణ పార్శ్వము. పార్శ్వము | ᒐ, ᒐ | ప |
| ♉, ♉ | విషము, మహాకాయము, మేరువు | ɣ, ɣ | మ |
| ♀, ⫶ | భాతి. ఉన్మని | ∂ ⌡ | ఖ |
| ♆, ♃ | ముండాధారిణి | ω, ᒐ, ᒐ | ఘ |
| ⚱ | చర్మముండాధారిణి | ∂, ∂ | ఛ |
| ∪, K | టంకము. అర్థచంద్రుడు | ( | ట |
| Г, ˥ | నాదాంతము | 1, I, ᒍ | న |

బ్రాహ్మీలిపి తంత్ర సంప్రదాయపు చిత్రాలనుంచి పరిణమించిందని మన పండితులు కొందరంటున్నారు. దాని సత్యాసత్యాలు ఎలా ఉన్నా తెలుసుకో దగిందే గనుక వినండి. మనదేశంలో తంత్ర సంప్రదాయం అతి ప్రాచీన కాలం నుంచీ ఉంది. ఈ సంప్రదాయంలో ప్రధాన విషయము శివశక్తుల పూజ. ఈ తంత్రాలలో దక్షిణాచారం, వామాచారం అని రెండు శాఖలున్నాయి. దక్షిణాచారం ఉత్తమమైనది. వామాచారం అవినీతికరమై, ఇతరులకు నష్టం కలిగించే శాతబడివంటి దుష్టచర్యలకు కారణమైంది. ఈ తంత్ర సంప్రదాయంలో దేవతలను పూజించడానికి ఆయా దేవతల ఆకారాలను రంగు రంగుల ముగ్గులతో వేయడం ఉంది. ఈ ఆకారాలు క్రమంగా రేఖలుగా మారాయి. పూర్వము ఈజిప్టువారు, నేటి చీనావారు సూచించే బొమ్మలు మీకు గుర్తున్నాయికదా! అలాగే ఈ దేవతల చిత్రాలు ఆ దేవతల నామదేయాల ప్రథమాక్షరాలను సూచించే సంకేతాలుగా మారాయి- ఇది తంత్రవాదం సారాంశం.

లిపిజ్ఞానం మనకు ఎన్నోవేల ఏళ్ళనాటినుంచి తెలుసునని గ్రహించాము గదా! మన లిపి ఈదేశంలోనే పుట్టిందిగాని పరదేశంనుంచి కొట్టుకువచ్చింది కాదనీ తెలుసుకున్నాము గదా! అయినా, విదేశీయులు మాత్రం మనకు లిపి జ్ఞానం లేదని, తమ నుంచి మనం లిపిని తీసుకొని అభివృద్ధి పరచుకొన్నామని తలకొక విధంగా వ్రాసి పెట్టారు. వారి వాదాల సారాంశం చెబుతాను :

1. వేదసాహిత్యంలో లిపిని గురించి స్పష్టంగా లేదు. వాక్కుకు అధిష్ఠానదేవత కనిపిస్తుంది గాని లిపికి అధిష్ఠాన దేవత లేదు. మౌర్యులకాలం నుంచే శాసనాలు హెచ్చుగా కనిపిస్తున్నాయి కనుక గ్రీకులతో సంబంధంవల్లనే బ్రాహ్మీ లిపి ఏర్పడింది.

2. అబ్బే! లేదు. లిపి బౌద్ధుల కాలంనుంచే వ్యాపించింది. క్రీస్తుపుకు వేయి సంవత్సరాల ముందునుంచే భారతదేశానికి ఇతర దేశాలతో వ్యాపార సాహారాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా సెమెటిక్ జాతులతో ఏర్పడ్డాయి. వీరిలో హెచ్చుగా ఫినీషియావారితో సంబంధం ఎక్కువ. కనుక పాశ్చాత్య లిపులలాగే బ్రాహ్మీకూడ ఫినీషియా లిపి నుంచి వచ్చింది.

3. కాదు కాదు. ఫినీషియా లిపినుంచి రాలేదు. మనం అనుకున్న కాలానికి మధ్యధరా సముద్రం తూర్పుతీరంతో భారతదేశానికి సరాసరి సంబంధం లేదు. కనుక ఫినీషియా లిపితో దీనికి సంబంధం లేదు దాని ప్రభావం దీనిపై పడలేదు. దక్షిణ సెమెటిక్ జాతికి చెందిన సాబా తెగవారి లిపినుంచి బ్రాహ్మీ పుట్టింది. యమన్‌కు భారతదేశానికి క్రీస్తుకు వేయి సంవత్సరాల ముందునుంచే సంబంధం ఉంది. ఇండియాతో జరిగే పశ్చిమ వ్యాపారమంతా సాబావారి చేతుల్లో

ఉండేది. వారి ఓడలు సింధు ముఖద్వారం నుంచి వెళ్లేవి. 'అల్‌యమన్' అంటే కుడిచేయి, దక్షిణ ప్రాంతమని అర్థం. కనుక సెమెటిక్ తెగవారైన సాబావారి లిపినుంచే బ్రాహ్మీప్రాదుర్భావం.

4. ఇది సరికాదు. ఇండియాకు, దక్షిణ అరేబియాకు సరాసరి సంబంధం ఉన్నప్పటికీ, అరేబియా సంస్కృతి ప్రభావం భారత సంస్కృతిపై పడలేదు. సాబాలిపి శాసనాలు క్రీస్తు శకం రెండవ శతాబ్దికి ముందువి కనిపించవు. మీదుమిక్కిలి బ్రాహ్మీకి దక్షిణ అరేబియా లిపులకూ పోలిక చాల కొద్ది. కనుక దక్షిణ సెమెటిక్ లిపినుంచి పుట్టలేదు. ఉత్తర సెమెటిక్ జాతికి చెందిన అరమీన్ లిపి నుంచే బ్రాహ్మి పుట్టింది. అరమీన్ తెగవారికి భారతీయులకు బహుకాలం నుంచే సంబంధాలున్నాయి. ఇంత మాత్రాన సరాసరి ఆ లిపి నుంచే భారతీయ లిపి వచ్చిందని కాదు. కొంత మార్పులు చేసుకొన్న వెనుక, కొంత కొత్త చేర్చుకొన్నారు. కొన్ని వెనక్కు తిప్పారు. బ్రాహ్మణులు ఈ లిపిని తయారు చేసుకున్నారు. దీనిని అరమీన్ వ్యాపారులే భారత దేశానికి

| ఆంధ్రము | బ్రాహ్మి | సాబా | ఫొనిక్ | మోయబైటు శాసనము | ప్రాచీనగ్రీకు | ఇంగ్లీషు |
|---|---|---|---|---|---|---|
| అ | ꓘ | 7 | 4 | K | A A | A |
| బ | □ □ | ς | 9 | 9 | ∂ b | B |
| గ | ∧ | φ | 7 1 | | 1 Γ | G |
| ధ | D D | ∫ | ◁ ◁ | ◁ | Δ Δ | D |
| ఎ | ⁚⁚ | 7 | ∃ | | ∃ F | E |
| వ | ძ ძ | 7 | Y | Ꮭ | | F(W) |
| జ | ς ζ | Y | I | I | I I | Z |
| హ | L L | ∩ | ⌗ ⌗ | B B | B | H |
| థ | O | ∧ | | ⊕ | ⊕ ⊗ | T-H |
| య | ⊥ ⊥ | ⅄ | ╕╕ | ⺄ | ʃ ʃ ζ ζ | I |
| క | + + | γ | ɣ ɣ | Y | K K | K |
| ల | ɾ | ' ' | ι ι | L L | 7 7 Γ | L |
| మ | ४ ४ | ς | ᒧ ᒧ | ᒧ | M M | M |
| న | ⊥ | ∇ | 4 4 | 4 | N N | N |
| క్ష | ɟ | Γ Γ | ≢ ≢ | ≢ | [M ≢] | X(SH) |
| ఓ | ʅ | Y | o | oo | O | O |
| ప | ι | ς | ʃ 7 | | 7 | P |
| చ | d d | 7 | Γ Γ | ᛏ | · | C |
| ఖ | ʅ 7 | T | φ P P | Φ | φ φ P | Q |
| ర | ʃ ʃ | 7 | 4 | 4 | 9 P R | R |
| శ | ∧ ∧ | | w w | w | M M | S |
| త | λ λ | | x | + + | T | T |

తెచ్చారో, భారతీయ వర్తకులు బాబిలోనియా నుంచో, ఇతర స్థలాలనుంచో తెచ్చుకున్నారో చెప్పడం అంత ముఖ్యంకాదు. భారతీయ వర్ణమాలలో ప్రతి అక్షరం అకారంతో పాటు పలకడం అరమీన్ భాష చివర అలెఫ్ ప్రధానంగా ఉన్నదాని ఫలితం. అచ్, హల్ విభాగం కూడ పశ్చిమ ఆసియాలోనే జరిగింది. కనుక భారతీయులు చేసిందేమీ లేదు. ఇతరుల లిపిని అరువుతీసుకుని అభివృద్ధి పరచుకున్నారు.

5. ఇక వ్రాత పద్ధతికూడ సెమ్‌జాతులనుంచి నేర్చుకున్నదే. మొదట బ్రాహ్మినికూడ కుడినుంచి ఎడమకు వ్రాసేవారు. అధమ పలస-అనే ఐరణ్ నాణెంమీద వ్రాతే దీనికి తార్కాణం. 23 సంవత్సరాల క్రితం(1933) కర్నూలు జిల్లా ఎర్రగుడిలో దొరికిన ఒక అశోకుని శాసనంలో మొత్తం ఇరవైమూడు పంక్తులలోను 2, 4, 6, 9, 11, 13, 14, 23వ పంక్తులు కుడినుంచి ఎడమకు ఎడమనుంచి కుడికి నాగేటి చాలువలె చెక్కి ఉన్నాయి. కనుక బ్రాహ్మి మొదట కుడినుంచే ఎడుమకు వ్రాసేవారు. తర్వాత ఎడమనుంచి కుడివైపు వ్రాయడం స్థిరపడింది-అని.

ఈ వాదాలన్నీ విన్నారుగదా! పక్క చిత్రంలోని కొన్ని అక్షరాలనుపోల్చి చూడండి. ఖరోష్ఠి లిపి అరమీన్ లిపినుంచి పుట్టిందని ఇదివరకు చూచాము. బ్రాహ్మికూడ దానినుంచే పుట్టిఉంటే పరస్పరం భిన్నంగాఉన్న లిపులు ఒకే దానినుంచి ఒకే కాలంలో పుట్టడం సమంజసంగా కనిపిస్తున్నదా ? కనీసం తెలుగు కన్నడ లిపులలాగానో, మలయాళ తమిళ లిపులలాగనో దగ్గరి పోలిక ఉన్నాయా ? లేదు. సెమ్‌జాతి అక్షరాలన్నిటికి, వాటినుంచి పుట్టిన ఖరోష్ఠికి పైభాగం స్థూలం, కిందిభాగం, నిలువుగీతో, వంకరగీతో, బ్రాహ్మిలో పైభాగం పలచన, కిందిభాగం స్థూలం. ఇక నాగేటిచాలులాగ వ్రాయడమనేది లేఖకుని దోషంగాని లిపిపద్ధతి కాదు. ఇంతకుముందు బ్రహ్మగిరి శాసనంలో ఆఖరు పంక్తిలో "లిపికరేణ" అనేమాట కుడినుంచి ఎడమకు వ్రాయడం చూచారుగదా! అలాగే ఎర్రగుడి శాసనాలు చెక్కినవాడుకూడ ఏ పంజాబు ప్రాంతంవాడో అయి, రెండు లిపులూ, రెండు వ్రాతపద్ధతులూ తెలిసినవాడయి ఉంటాడు. కనుక ఒక్క ఆ శాసనాన్ని, ఐరణ్ నాణేన్ని పట్టుకుని వ్రాతపద్ధతిపై సిద్ధాంతాలు చేయడం సబబుకాదు.

మన వ్రాతకు మన సంస్కృతిలో, సంప్రదాయంలో అనూచానంగా వస్తున్న ప్రదక్షిణపద్ధతి మూలమయి ఉంటుందని నేను భావిస్తున్నాను. ప్రదక్షిణ మంటే మనం ఎడమవైపునుంచి ప్రారంభించి చుట్టివస్తాము. పరిషేచనం చేయడం - యజ్ఞయాగాది కర్మలలోను ఎడమవైపునుంచి, అశుభ కర్మలలో

మాత్రం అపసవ్యంగా కుడివైపునుంచి పరిషేచనంచేయడం మనసంప్రదాయం.

వ్రాత పద్ధతులు అలవడడానికి ఏవో తాత్కాలిక పరిస్థితులుకాక బలీయమైన సంస్కృతి సంప్రదాయాలు కారణమంటూ శ్రీ అరవిందుడు "ఆర్య" పత్రిక ప్రథమ సంపుటి 255, 256 పుటలలో వ్రాసినది పాఠకులు వినడం అవసరం :—

"రకరకాల వ్రాత పద్ధతిని-కుడినుంచి ఎడమకు, ఎడమనుంచి కుడికి, చీనావారు అనుసరిస్తున్నట్టు నిటారుగాను ఉన్నవాటికి-మూలమేమిటి ?

"ఇది చాల ముచ్చటైన ప్రశ్నే! ప్రబలమైన ప్రమాణాలు లభించనందున స్పష్టంగా సమాధానం చెప్పడం సాధ్యం కావడంలేదు. ప్రతివారూ చేయగలిగిందల్లా అదైఉండవచ్చు, ఇదైఉండవచ్చు అని చాల సంభావ్యంగాను, సంతృప్తికరంగాను ఉండే వ్యాఖ్యలు ఊహించుకొనడమే.

"మొదటిది:- వ్రాత పద్ధతిలోని ఈ వ్యత్యాసాలు ప్రాగైతిహాసికకాలాల నాటి విభిన్న మహత్సంస్కృతులున్న వర్గాలతోపాటే ఏర్పడ్డాయిగాని, కేవలం కాకతాళీయంగానో, అల్ప స్వల్పకారణాలవల్లనో, స్థానిక నిమిత్తాలవల్లనో ఏర్పడలేదనడం మాత్రం సుస్పష్టం. ఒక సమష్టి మూలసంస్కృతిని అనుసరిస్తున్నందున ఆర్యులని వ్యవహరించబడే జాతులవారి వ్రాత ఎడమనుంచి కుడికి; షాల్డోనులనుంచి సంస్కృతిని స్వీకరించిన మెసపొటేమియా జాతులవారు కుడినుంచి ఎడమకు; మంగోలులు నిటారుగా పైనుంచి కిందికి వ్రాస్తున్నారు.

"రెండవది : వ్రాత మానవజాతి చరిత్రలో చాల ఇటీవల కనుగొన్న విషయం; అతి ప్రాచీనజాతులు వ్రాతను ఒకేమూలనుంచి-దీనిని దారితప్పడమని అందాం-ఈజిప్టువారి చిత్రలిపులనుంచి, గ్రహించాయి. ఫినీషియా వ్యాపారుల బేరసారాలమూలంగా అది నేల నాలుగుచెరగులా వ్యాపించింది-అనే అభిప్రాయంతో ఉంటేమాత్రం వ్రాతపద్ధతుల వైవిధ్యానికి కారణం చెప్పడం సాధ్యం కాదు. మనం ఈ అభిప్రాయానికి భిన్నంగా, ఈ వైవిధ్యం చాల ప్రాచీనకాలంలోనే, గొప్ప సంస్కృతులు రూపుతీర్చుకుంటున్ననాడే, ఆ సంస్కృతులను అనుసరిస్తున్న జాతులు విడిపోకముందే పుట్టి పెరిగిందని ఊహించాలి.

"వర్తమాన నాగరికతావర్త చరిత్రలో వ్రాత సర్వసామాన్యం కావడం, ఇటీవల అభివృద్ధి చెందినదనడం నిస్సందేహం. వ్రాత సర్వసామాన్యం కాకుండా అవరోధాలు ఏర్పడడానికి గల కారణాలు రెండు, మొదటిది సరళమైన, సులభమైన లేఖనపద్ధతి లేకపోవడం; తర్వాతిది- సులభంగాను, అందరికి అందుబాటుగాను, చాలకాలం మనగలిగేదిగాను వుండే లేఖనసామగ్రి లేకపోవడం. ఈ అవరోధాలను గట్టెక్కనిదే వ్రాత దైనందిన వ్యవహారాలకు, సామాన్య వ్యవ

హారాలకు వినియోగపడి ఉండడం కష్టం. కాని యజ్ఞయాగాది మహత్తర మత కార్యాలకు సంబంధించిన వ్యవహారాలలోను, లేక భౌతికంగాను, సంస్కృతి అభివృద్ధిచెందిన సందర్భాలలోను, అతిముఖ్యమైన విషయాలను, గుప్తమైన పవిత్రమైన జ్ఞానాన్ని భద్రపరచుకోడానికి మాత్రమే వ్రాత వినియోగించేవారు.

"కనుక మనం వెంటనే సమాధానం మత భావాలకు, మతాచారాలకు సన్నిహితమైన ఏవో పరిస్థితులనుంచి లభిస్తుందేమో చూడాలి. ఆ పరిస్థితి ఈ సంస్కృతుల కన్నిటికి సర్వసాధారణంగా ఉంటూ, పెద్ద భేదానికి దారితీయ దగినట్టిదిగాను ఉందేమో చూడాలి.

"ఇలాటి ముఖ్యమైన సర్వసామాన్య పరిస్థితి ఒకటి ప్రాచీనజాతుల మత భావాలకు, ఆచారాలకు కేంద్రమనదగినది సూర్యునిఎడల ఈ జాతులకు గల భక్తి, మత కార్యకలాపంలో సూర్యునికి గల అత్యంత ప్రాధాన్యమూను. ఆ జాతులు అనుసరించిన వ్రాతపద్ధతికి కారణం తూర్పునుంచి పడమరకు దినదినమూ సాగే సూర్యుని గతిని వారు గ్రహించినదానినిబట్టేనని నిర్ణయం కాదా !

"ఇలా గ్రహించడంలో వ్యత్యాసానికి కారణం కూడ ఆర్యుల తాత ముత్తాతలు ఏ కారణంవల్లనో దక్షిణాభిముఖులుగాను, మెసపొటేమియావారు ఉత్తరాభిముఖులుగాను, మంగోలులు పూర్వాభిముఖులుగాను బయలుదేరి ఉండి ఉంటారని మనం ఊహించినప్పుడే స్పష్టమౌతుంది. అప్పుడు, సూర్యుడు ఆర్యులకు ఎడమనుంచి కుడివైపుకు, మెసపొటేమియావారికి కుడినుంచి ఎడమకు, మంగోలులకు ఎట్టఎదుట నిట్టనిలువునా వెళ్ళుతున్నట్టు అగుపిస్తాడు. సూర్య గతిలో తమకు తోచిన ఈ వ్యత్యాసాలు తొట్టతొలుత వ్రాతకోసం వాడిన రాయిమీదనో, మరొక కఠిన పదార్థంమీదనో తమ పవిత్ర చిహ్నాలు, గుర్తులు చెక్కేటప్పుడు వారికైవాడంలో ప్రతిఫలించి ఉంటాయి.

"అయితే, ఈ వ్యత్యాసాలకు దారితీయగలిగిన పరిస్థితి ఏదైఉంటుంది? వ్రాతలో ఈ పోబడి ఈజాతులు తమ మూలస్థానంనుంచి నిరంతరం సాగించిన వలసలలో ఏర్పడి ఉంటుందనేది ఒక్కటిమాత్రమే మనం ఊహించ వచ్చు. ఆర్యులు ఉత్తరధ్రువ ప్రాంతాలనుంచి దక్షిణానికి భారతదేశం వైపు పారశీకంవైపు, మధ్యధరా సముద్రతీర దేశాలవైపు వలస వచ్చారనే శ్రీ తిలక్ సిద్ధాంతాన్ని మనం ఆమోదిస్తే, మెసపొటేమియా సంస్కృతికి మూలపురుషులైన వారు దక్షిణంనుంచి ఉత్తరంవైపు వలసవచ్చారని, మంగోలుల వలస మొట్ట మొదట మధ్య ఆసియానుంచి తూర్పుకు సాగిందని మనం ఊహిస్తే, ఆ వ్యత్యాసానికి అవసరమైన పరిస్థితి స్పష్టమౌతుంది. ఈ విధంగా మనం సంస్కృతంలో

నాలుగు దిక్కులకు వాచకాలైన పదాలకుకూడ అర్థం చెప్పుకోవచ్చు. పడమటి నుంచి భారతదేశంలో ప్రవేశించి తమ తొలివలసలను నెలకొల్పడంలోను ఈ పద్ధతినే (పడమటినుంచి తూర్పుకు వెళ్ళడాన్నే) అనుసరించిన ఆర్యులకు తూర్పు- పూర్వం- ఎదుటఉండేది; పశ్చిమం వెనుకఉండేది; కుడిపక్కఉండేది దక్షిణం; ఉత్తరం ఎత్తైనది. నేడుకూడ తమ దేవతల నివాసమైన పవిత్ర పర్వతం ఉత్తరానే ఉన్నట్టు భావిస్తున్న ఆర్యుల ప్రాచీనమైన ఉత్తర నివాస స్థలం భూమికి ఉత్తరాగ్రాన ఉండినదనడానికి ఈ ఉత్తరపదం సూచన కావచ్చు.

"అయితే, ఈ వ్యాఖ్య వట్టి ఊహపైన, పూర్తిగా హేతువాదంపైన ఆధారపడి ఉందనడం తప్పనిసరి; ప్రబలమైన నిదర్శనాలు లేనందున విశ్వస నీయం కాకపోవచ్చు. అయినప్పటికి ఇది దానంతటనే మనకు తోచే సంభావ్య మైన వివరణ. ఊహగాకూడ పరిశీలనార్హమైంది."

ప్రపంచానికంతా చంద్రుడే లెక్కలు నేర్పినప్పుడు- అంటే చంద్రుని హెచ్చుతగ్గులే లెక్కల అభివృద్ధికి కారణమైనప్పుడు-సూర్యునినుంచి వ్రాత పద్ధతిలో వ్యత్యాసాలు ఏర్పడినవని ఊహించడంలో ఆశ్చర్యమేముంది?

ఇక అచ్, హల్ విభాగంకూడ మనకు తెలియదని, పశ్చిమ ఆసియా లోనే పుట్టిందని అంటే నవ్వు వస్తుంది. మనం శబ్దశాస్త్రాన్ని, సర్వశాస్త్రాన్ని ప్రపంచంలోని అన్ని జాతులకన్నా ముందు అభివృద్ధి పరచుకొన్నాము. యజుర్వే దంలో వ్యాకరణచర్చ ఉన్నట్టు ఇదివరకే చదివారుగదా! మన లిపి ఆదర్శ వర్ణమాల. ఒకటి అనుకుని మరొకటి వ్రాయము; ఉచ్చారణకు అనుగుణమైన స్పష్టమైన గుర్తులు వ్రాస్తాము. ప్రతి ఉచ్చారణకు స్పష్టమైన గుర్తు, అచ్చులు, హల్లులు పూర్తిగాను, అచ్చులు హల్లులు కలపడానికి గుర్తులు, 63, 64 మూలో చ్చారణలు, ఒక ఉచ్చారణకు ఒకేగుర్తు, అక్షర విన్యాసక్రమం- ఇది ఆదర్శవర్ణమాల లక్షణాలు. ఇవి బ్రాహ్మీకి పూర్తిగాఉన్నాయి. సెమ్‌జాతి వర్ణమాలలోగాని, దానినుంచి పుట్టిన ఇతర వర్ణమాలలలోగాని ప్రతి ఉచ్చార ణకు స్పష్టమైన గుర్తులేదు. ఒకటి అనుకుని మరొకటి వ్రాయడం సంభవిస్తు న్నది. అచ్చులు, హల్లులు పూర్తిగా లేవు. గుణింతాల గుర్తులు లేవు. దీనివల్ల హ్రస్వదీర్ఘాలు తెలియడమే కష్టం. ఒక ఉచ్చారణకు పెక్కు గుర్తులు, పెక్కు ఉచ్చారణలకు ఒకే గుర్తు ఉంటున్నవి. అక్షర విన్యాసక్రమం లేదు. నిజానికి ప్రపంచంలోని అన్ని లిపులలోను బ్రాహ్మీ లిపి సరళం, నిర్దుష్టం. ఏవో గుర్తులు కనిపెట్టడం గొప్పకాదు. ఒక అక్షరంతో ఒకే ధ్వనిని తెలిపే వర్ణ మాల కనిపెట్టడమే గొప్ప.

అది తలకిందులై ఇదైంది; ఇది తోక తెగి అదయింది; అది అడ్డంగా పడి ఇదయింది-అని అసంగతమైన కల్పనలు చేయడం ప్రారంభిస్తే, ప్రపంచంలో ఏలిపినన్నా మరొక లిపినుంచి లాగవచ్చు. ఇలా లాగేవారికి రెండు విషయాలు చెప్పాలి. భాషలాగే లిపికూడ మనుష్యస్వభావం తెలుపుతుంది. మొదట ఈ రెండూ మామూలుగా ప్రారంభమైనవే. మొదటిది అరుపులవల్ల; రెండవది బొమ్మలవల్ల. ప్రతివారూ లాఘవం కోరుతారు. "ఏకమాత్రా లాఘవం పుత్రోత్సవం మన్యంతే వైయ్యాకరణాః" అని సంస్కృత లోకోక్తి. అంటే, ఒకమాత్ర తగ్గించి పలుకవలసివచ్చినా, కొడుకు పుట్టినంతగా సంతోషిస్తారట వైయ్యాకరణులు. ఒక్క వైయ్యాకరణులేకాదు, ప్రతి మనిషీని ఎంత సులువుగా పని జరిగితే అంత సంతోషిస్తాడు. ఈ సౌలభ్య సూత్రంవల్ల పదాలు, అక్షరాలు పుట్టాయి. తర్వాత సమర్థతాసూత్రం వస్తుంది. ఏది ఎక్కువ మంది వాడుతారో, ఎవరు దేనిని చక్కగా వాడుతారో అదే నిలుస్తుంది. ఇదే సమర్థతా సూత్రం. ఇంతమాత్రంతో ఆగుతుందా? ఇతరులపోటీ ప్రారంభమౌతుంది. దానితో పునర్నిర్మాణమూ మొదలవుతుంది. ఏదో ఒకటి స్థిరపడుతుంది. ఇలా ఉండగా కొంతకాలానికి మరొకమార్పు వస్తుంది. దానినుంచి మరొకమార్పు; ఇలా ఈ శృంఖలిక వెళ్లుతూ ఉంటుంది. లిపి పరిమాణానికి ఇంత కథ జరగాలి. కనుక ఒకరిజేబులో సొమ్ము కొట్టివేసినట్టుగా అకస్మాత్తుగా ఏ జాతీ మరొకరి దానిని కొట్టివేయదు.

ఇలాగే బాహ్యమైన పోలికల సంగతీని. ప్రపంచంలో మనిషికీ మనిషికీ పోలికలేదూ! ప్రపంచంలో ఎక్కడైనా లేఖన సామగ్రి రాయి, కర్ర, లోహం, మట్టి, మైనం, తాటాకులు, పట్టలు, చర్మాలు వంటివి; ఉలి, కుంచె, రెల్లుకలం, ఈకవంటివీకదా! వీటితో వ్రాస్తున్నప్పుడు ఘుణాక్షర న్యాయంగా, పోలికలు కనిపించినంతమాత్రాన, అంతా మనదే, మన కోడి, మన కుంపటే ప్రపంచానికంతానని అనుకొనడం ఏమి ధర్మం?

మొహెంజోదడో లిపికి, బ్రాహ్మికి సంబంధంలేదనికూడ కొందరు పాశ్చాత్యుల వాదం. వాటి ప్రసక్తి వేదంలో లేదట. కాని ఈ లిపి మొహెంజోదడో చిత్రరూపదశనుంచి మరొక దశకు వచ్చిన స్థితికూడ కొంతవరకు తెలిసింది. మన నల్లగొండ జిల్లాలో రాయగిరి అనే గ్రామం ఉంది. దానిలో ఇరవైఅయిదు సంవత్సరాలక్రితం కొన్ని సమాధులు బయటపడ్డాయి. ఇవి చాల ప్రాచీనమైనవి, రాతివి. వీటిలో శవాలను పూడ్చిన పెద్దబానలు, కుండలు దొరికాయి. ఈ కుండలమీద గీతలు, గుర్తులు ఉన్నాయి. మొత్తం 131 గుర్తులున్నాయని పండితులు తెలుపుతున్నారు. వీటిలో ఏడుగుర్తులకు బ్రాహ్మి అక్షరాలతో

పోలికఉంది. కాని ఈ గుర్తుల ఉచ్చారణ ఏమిటో, విషయ మేమిటో తెలియడం లేదు. కనుక ఇది బ్రాహ్మీకి, సింధుతీరలిపికి మధ్యలిపి కావచ్చునేమో!

దీనితో బ్రాహ్మీలిపి అచ్చమైన స్వదేశీలిపి అని, ఖరోష్ఠి సెమ్‌జాతివారి తెగఅయిన అరమీన్‌ల లిపినుంచి ఉద్భవించి బ్రాహ్మీప్రభావంతో సంస్కృత, ప్రాకృతాలు వ్రాయగలవర్ణమాలగా రూపుదాల్చిందని తెలుసుకొన్నాము. అయితే వీటిని సులభంగా చదవగలిగామనుకున్నారా ? లేదు, వీటిని చదివి మనకాలంలో మనకు తెలిపిన దెవరు ?



## మహామేధావి ప్రిన్సెప్

ఈ రెండు లిపులను తర్వాతివారు పూర్తిగా మరచిపోయారు. దీనికి కారణం ఖరోష్ఠి కొంతకాలం తర్వాత బ్రాహ్మీలిపికి లోబడిపోయి అంతరించి పోవడం, బ్రాహ్మీ లిపి నుంచి పుట్టినలిపులు దేశంలోవ్యాప్తి చెందడం కావచ్చును. ఈరెండు లిపులను చదివి, తెలుసుకొని ప్రపంచానికి చాటిచెప్పడం గడచిన శతాబ్దిలో సంభవించింది. అంటే పాతవారెవరూ వీటిని చదవడానికి ప్రయత్నించ లేదని, ఉపేక్షించారని కాదు. ప్రయత్నం కొనసాగింది.

నేటికి సరిగ్గా ఆరునందల సంవత్సరాలక్రితం ఉత్తరదేశాన్ని పాలించిన ఢిల్లీసుల్తాన్ ఫిరోజ్ శాహ తుఘ్లక్ పంజాబ్‌రాష్ట్రంలోని టోపరాలోని శాసన స్తంభాన్ని, మీరట్ జిల్లాలోని అశోక శాసనస్తంభాలను ఢిల్లీకి తెప్పించి ఫిరోజ్ శాహ్‌కటోరాలోను, కుశ్క్-శికార్ (శికార్‌మహల్) లోను నాటించాడు. పండితులను పిలిపించి వాటిని చదవడానికి ప్రయత్నించాడు. కాని ఫలించలేదు. అక్బర్ చక్రవర్తి కూడ ప్రయత్నించాడు. కాని, ఆయన కృషికూడ ఫలించలేదు.

ఈ కృషిలో సఫలుడయిననాడు జేమ్స్ ప్రిన్సెస్ అనే బ్రిటిష్ ఉద్యోగి. ఈయన 1799 ఆగస్టు 20 వ తేదీన లండన్‌లో జన్మించాడు. 20 వ ఏట

భారతదేశానికి వచ్చి కలకత్తాలోని ఈస్టిండియా కంపెనీవారి టంకసాలలో ఉద్యోగిగా కుదిరాడు అప్పుడు ఆ టంకశాల అధికారి విల్సన్. ఆయనకు ప్రిన్సెప్ సహాయోద్యోగి. తర్వాత కొంతకాలానికి కాశీ టంకశాలలో ఎస్సే మాస్టర్‌గా పనిచేశాడు. 1830 లో కాశీ టంకసాల రద్దుకావడంవల్ల కలకత్తా టంకసాలకు బదిలీ అయి ఎస్సేమాస్టరుగా పనిచేశాడు. భారతీయ సాహిత్య సంస్కృతుల పరిశోధనాభివృద్ధుల నిమిత్తం 1784 లో కలకత్తాలో ఏషియాటిక్ సొసైటీ అనే పండిత సంఘం స్థాపించారు. దాని పరిశోధనల ప్రచురణకొక పత్రిక కూడ ప్రచురించేవారు. ప్రిన్సెప్ తన శక్తిసామర్థ్యాలతో ఈ సొసైటీకి కార్యదర్శి అయి పెక్కు పరిశోధనలు జరిపాడు.

ఈయనకు కొత్త లిపులను చదవడమన్నా, చరిత్ర అన్నా చాల అభిరుచి. కనుక 1834 లో అలహాబాద్, రథియా మథియా పట్టణాలలోని శాసన స్తంభాల అచ్చులుతెప్పించి, వాటిని ఢిల్లీ స్తంభం మీది శాసనంతో పోల్చిచూచాడు. ఆరెండు లిపులూ ఒక్కటేనని తేలింది. నిజానికి అవి అశోకుని బ్రాహ్మీ శాసనాలే. బాగా పరిశీలించగా, గుప్తులకాలపు శాసనాలలోలాగ వాటిలోను గుణింతంగుర్తులు వేరుగా ఉండడం గుర్తించి, ఐదు చిహ్నాలను వివరిస్తూ వ్యాసం ప్రకటించాడు. ఢిల్లీ స్తంభంమీది శాసనం గ్రీకు శాసనమని, అలెగ్జాండరు పోరసును జయించిన మీదట నాటిన విజయస్తంభమని పాశ్చాత్యులు భ్రాంతిపడ్డారు. ప్రిన్సెప్ వ్యాసంతో ఢిల్లీ స్తంభం లిపి గ్రీకు లిపి కాదని తేలింది. తర్వాత ప్రిన్సెప్ ఢిల్లీ స్తంభంలోని వర్ణాలను గుప్తరాజుల శాసనాల లిపితో పోల్చి, పోలికగలవాటిని వర్ణక్రమంలో వ్రాసుకున్నాడు. ఈవిధంగా పెక్కు అక్షరాలు గుర్తించాడు.

అదేసమయంలో ఫాదర్ జేమ్సు స్టీవెన్‌సన్ ప్రిన్సెప్‌లాగే క, జ, ప, అక్షరాలను కనుగొని ఒక అశోకుని శాసనం చదివాడు. శాసనం సంస్కృత భాషలో ఉందని భ్రాంతిపడడంవల్ల చదవడం తప్పయిపోయింది. ఇంతలో ఒకవైపు బ్రాహ్మీ మరొకవైపు గ్రీకు లిపి ఉన్న గ్రీకురాజుల నాణేలు బాక్ట్రియాలో దొరికాయి. చిత్రలిపి కనుగొనడానికి, కీల లిపి కనుగొనడానికి రాజుల పేర్లే ఎక్కువగా ఉపయోగించాయని ఇదివరకే చదివారు. ఇప్పుడుకూడ అదే విధంగా జరిగింది. ఒక గ్రీకు నాణెంపైన ఉన్న "అగథాక్లిస్" అనే పేరును ఒకరు చదివారు. దీనితో చాల అక్షరాలు గుర్తయాయి.

ప్రిన్సెప్ సాంచీస్తూపంలోని చిన్నచిన్న శాసనాల అచ్చులను ఒకతట్టు పెట్టి పోల్చిచూచాడు. శాసనం చివరి రెండు అక్షరాలు సమానంగా ఉన్నాయి. కాని చదవడానికి వీలుకాలేదు. చివరి రెండు అక్షరాల వెనుక 'స' అనే అక్షరం ఉంది. తర్వాతి రెండక్షరాలు 'దానం' అనే పదం అయి ఉంటుందని అను

మానం కలిగింది. చిన్న శాసనాలన్నిటినీ పోల్చి చూచాడు. అనుమానం స్థిర పడింది. అప్పటికిగాని ఆ శాసనాల భాష సంస్కృతం కాదని తేలలేదు. 'స' అనేది యొక్క అనే ప్రాకృత ప్రత్యయమని గుర్తించారు. ఈవిధంగా అశోకుని శాసనాలన్నీ చదవడం సాధ్యమైంది.

ఖరోష్ఠి లిపి చదవడానికికూడ నాణేలే ప్రధాన సాధనాలు కావడం మరీ వింతకాదూ! ప్రిన్సెప్ కాలంలో జేమ్స్‌టాడ్ అనే బ్రిటిష్ ఉద్యోగి బాక్ట్రియా గ్రీకురాజుల, శక, పార్థియన్, కుషానురాజుల నాణేలు సేకరించాడు. వీటిమీద ఒకవైపు పాత గ్రీకు లిపిలోను, మరొకవైపు ఖరోష్ఠి లిపిలోను రాజుల పేర్లున్నాయి.

రంజిత్‌సింగ్ సేనాపతి అయిన జనరల్ వెంటూరా మానిక్యాల్ అనే చోట ఉన్న 80 అడుగులు ఎత్తు స్తూపాన్ని తవ్వించగా, రెండు ఖరోష్ఠి శాసనాలు, నాణేలుదొరికాయి. మానిక్యాల్ నేటి పశ్చిమ పంజాబ్‌లో పాకిస్తాన్‌లో అటక్-లాహోర్ పట్టణాల దారిలో ఉన్న గ్రామం. స్తూపం ఉండడాన్ని బట్టి ఈ గ్రామాన్ని మునికా అలయ్ అనేవారు పూర్వం. ఆ మాట క్రమంగా మానిక్యాల్ అయింది. పంజాబుప్రాంతంలోని మరికొన్ని స్తూపాలనుంచి కూడ ఇలాటి నాణేలే దొరికాయి. గ్రీకు అక్షరాలు చదవడం పడింది కాని, ఈ నాణేల రెండవవైపున్న లిపి చదవడం పడిందికాదు. ఇది పర్షియాదేశపు పహలవీభాష అని, సుసానియన్ భాష అని భావించడం వల్ల అక్షరం కూడ పెగలలేదు. బ్రాహ్మీశాసనాల వలె ఈ భాషకూడ పాలీప్రాకృతం అయి ఉంటుందని ప్రిన్సెప్ అనుకున్నాడు. బ్రాహ్మీలిపికి ఇది బిలుగుప్రాత కావచ్చునని కూడ అనుమానించాడు. ఏదీ స్థిరం కాలేదు.

అఫ్ఘనిస్తాన్‌లో పరిశోధనలు జరుపుతున్న మ్యాసన్ అనే పండితునికి కొన్ని నాణేలు దొరికాయి. ఈ నాణేలమీద కూడ ఒకవైపు గ్రీకులిపిలో రాజుల పేరు, బొమ్మ, వెనుకవైపు ఖరోష్ఠిలో అదే పేరు ఉన్నాయి ఇలాటి నాణేలు రెండు చూడండి. మొదటి నాణెం అంటెలికిడెస్‌ది. రెండవది మెనెండర్‌ది.



వీరిద్దరూ క్రీస్తుకు వంద, వందయాభై సంవత్సరాలకు ముందు మనదేశంలోని పంజాబు, నేడు అఫ్ఘనిస్తాన్‌తో చేరిన గాంధారం పాలించిన సిథియన్‌జాతి

రాజులు. అంటెలికిడెస్ అంతల్కిదస అయ్యాడు. మెనెండర్ మిలింద అయ్యాడు. వారి బిరుదులుకూడ సాటెరెస్ అనేది త్రాత అని, మరొకటి మరొక విధంగాను తర్జుమా అయాయి. మొదటిదానిమీది ఖరోష్ఠి వ్రాత "అంతిలకిద తస తదతస మహరజస" అని, రెండవ దానిమీదిది "మిళిందస మహరజస త్రదతస" అని తెలిసింది. గ్రీకులిపిలో ఉండేవి ఆంటిలికిడెస్ సాటెరస్ బసలేయస్, మెనెండ్రెస్ సాటిరస్ బసిలేయస్ అనే మాటలు. వీటి సహాయంతోను గ్రీకులేఖల సహాయంతోను ఖరోష్ఠిని పోల్చి చదువగా, పన్నెండుగురు రాజుల పేర్లు, ఆరు బిరుదులు తెలిశాయి.

తర్వాత యిది కుడినుంచి ఎడమకు వ్రాసేదని తెలుసుకున్నారు. ఇది సెమెటిక్ జాతి లిపిగనుక పహల్వీ అని, ఈరానీ అని మొదట్లో భ్రాంతిపడ్డారు. ఆ భాషా వ్యాకరణం ప్రకారం చదువగా తప్పులు వచ్చాయి. 1838లో బ్యాక్ట్రియన్, గ్రీక్ నాణేల భాష పాలీ అని తెలిసింది. ఈ సిథియనుల నాణేల భాషకూడ పాలీయే అయిఉంటుందని ప్రిన్సెప్‌కు అనుమానం కలిగింది; ఆ ప్రకారం చదివాడు. పదిహేడు అక్షరాలు తెలిశాయి. తర్వాత తక్కిన పండితులు తక్కిన అక్షరాలు తెలుసుకున్నారు.

ప్రిన్సెప్ 1835 లో వివాహం చేసుకున్నాడు. నిరంతరం లిపి పరిశోధన వల్ల 1838 లో ఆయనకు తలనొప్పి ప్రారంభమైంది. అది విపరీతమై ఆ సంవత్సరం అక్టోబరు నెలలో చికిత్సకు విశ్రాంతికి ఇంగ్లండు వెళ్ళాడు. 1840 ఫిబ్రవరి నెలలో మరణించాడు. ఈయన నిరంతర పరిశోధన ఫలితంగా ఈ రెండు లిపులూ నేడు మనం చదువగలుగుతున్నాము.

చతుర్థ ప్రకరణం

# బ్రాహ్మీలిపి అవతారాలు

ఈ బ్రాహ్మీలిపినుంచే-భట్టిప్రోలు లిపినుంచే - మన నేటి తెలుగు లిపి పరిణమించింది. ఒక్క మన తెలుగు లిపి మాత్రమే కాదు; మన దేశంలోని అన్ని లిపులూ పరిణమించాయి. అంటే; మన పొరుగునఉన్న తెనుగు తోబుట్టువులయిన కన్నడిగులు వ్రాసే కన్నడ లిపి; అరవలు వ్రాసే పూర్వపు లిపి, నేటి అరవ లిపి, వారు, సంస్కృత గ్రంథాలు వ్రాసుకొనే గ్రంథ లిపి, ఉడిపి ప్రాంతంవారు వ్రాస్తూఉండిన తుళు లిపి, కేరళులు వ్రాసే మలయాళ లిపి, పశ్చిమాన మన పొరుగునఉన్న మహారాష్ట్రులు ముందు వాడుతున్న మోళీలిపి, ఉత్తరాన మన పొరుగునఉన్న ఓఢ్రులు వాడే ఓఢ్రలిపి, ఉత్తర భారతంలో హెచ్చుగా ప్రచారంపొందిన నాగరీలిపి, శిఖ్కులు వ్రాసే గురుముఖీ లిపి, కాశ్మీరీలు వ్రాసే డోగ్రి, నేపాలీలు వ్రాసే నేవారీ లిపి, టిబెట్‌వాసులు వ్రాసే టిబ్బతీలిపి, వంగలిపి, మైథిలి, అస్సాంలిపి, మణిపురిలిపి, మధ్యప్రదేశ్‌లో పూర్వం ఉన్న నిమాడీలిపి, రాజస్థాన్‌లో వ్రాసే మార్వాడీలిపి, నేడు పాకిస్తాన్‌లో చేరిన పంజాబు ప్రాంతంలోని ముల్తానీ, సింధీ లిపులు, గుజరాతీలు వ్రాసే గుజరాతీ లిపి, లంకావాసులు వాడే సింహళ లిపి, ఇంకా పరాచి, బహ్వాల్ పురీ, రోడియా, బికారీ, హరీ, లామావాసీ, లుంగీ, సరాఫీ, సారికా, సఈసీ, షికార్‌పురీ మున్నగు ఉత్తరాది లిపులు దీనినుంచే పుట్టాయి.

"మన లిపి గుండ్రంగా, అందంగా ఉందిగదా! మన కవులు మన లిపిని 'లలిత ముక్తాఫలాకార విలసనమున' అని. 'అణిముత్యముల సోయగము మించిన వ్రాలు' అని వర్ణించారుగదా! విజయవిలాసుకారుడు మన వర్ణమాలను

కన్నులు దీర్ఘముల్, నగుమొ
  గం బవురా తలకట్టు తమ్మి పూ
పున్నమ చందమామలకు,
  బొక్కిలి చక్కదనంబు చెప్పగా

నున్నదె ! మేలు బంతులు ప
యోధరముల్, మరికొను సున్నచో,
నెన్నిక కెక్కు వ్రాతఫల
మి వ్వరవర్ణి నికి న్నిజంబుగన్' (2-104)

అని చక్కని చుక్కకు ఉపమేయంగా గ్రహించాడే! దస్తూరీ గుండ్రంగా ఉండడానికి మన పెద్దలు

'యరలవ మదనస యనుచును
బరువడి ని యక్షరముల భయనయతతులన్
నిరతమును వ్రాయనేర్చిన
వరకరుణా వానిప్రాలు వర్తువ లమరున్'

అని సెలవిచ్చారే! ఈ వంకర టింకర గీట్లనుంచి, కొక్కిరి బిక్కిరి కోతిగీతల నుంచి మనలిపి రావడమేమిటి? అని అనుమానంతో గాభరాగా చూస్తున్నారు గదూ! నిజమే మీ అనుమానానికి కారణం లేకపోలేదు. మీరు ఇప్పటి లిపి స్వరూపాన్ని చూచి, అనాదిగానే ఇది అణిముత్యాల కోవ అని, రత్నాలరాజి అని అనుకుంటున్నారు. కాని, నిజం వేరు. ఆ వంకటింకర గీతలే రాళ్ళపైన, రాగిరేకులపైన తాటాకులమీద, కడితాలమీద రాపాడగా, రాపాడగా నేడు కనిపించే గుండ్రటి రూపాలు తీర్చుకున్నాయి. ఈ చక్కని ఆకారాలు రావడానికి ఎంత కాలం పట్టిందనుకున్నారు? దాదాపు రెండువేల ఏండ్లు. ఆ కథ వినండి.

మన తెలుగునాడును పెక్కువంశాల రాజులు పాలించారు- సాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, బృహత్ఫలాయనులు, వైంగేయకులు (శాలంకాయనులు), కందారులు (అనందగోత్రికులు), విష్ణుకుండినులు చాళుక్యులు, చోళులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు మున్నగువారు. వీరందరూ తమతమ కాలాలలో తమ మాతృభాషల్లో కొందరు, దేశభాషలలో కొందరు శిలాశాసనాలు, తామ్రశాసనాలు వేయించారు. ఆ శాసనాల లిపులు ఆయారాజుల పేరుతోనే సాతవాహనలిపి, లేక ఆంధ్రలిపి, ఇక్ష్వాకులిపి, పల్లవ లిపి, వేంగిలిపి, చాళుక్యలిపి, కాకతీయలిపి-అనే విధంగా ప్రచారానికి వచ్చాయి. తక్కిన ప్రాంతాలలోను ఆయాకాలాలలో పాలించిన రాజులనుబట్టే గుప్తలిపి, వల్లభీలిపి, కదంబలిపి, బాదామీ చాళుక్యలిపి, దక్షిణగాంగ లిపి, చేరలిపి, రాష్ట్రకూటలిపి, కళింగగాంగలిపి ఇత్యాదిగా లిపులకు పేర్లు వచ్చాయి.

సాతవాహనుల రాజ్యం చాల ప్రాచీనమైంది. మౌర్యచంద్రగుప్త చక్రవర్తి సంగతి మీకు ఇదివరకే తెలుసు. ఆయనకాలానికి భారతదేశంలో అయ

నది కాక పెద్దరాజ్యం సాతవాహనులదే. అంటే ఇప్పటికి రెండువేల నాలుగు వందల ఏళ్ళకు పూర్వమే ఈ రాజ్యం స్థాపించబడిందన్నమాట. ఈ రాజులు అప్పటినుంచి దాదాపు ఐదువందల సంవత్సరాల పాటు రాజ్యంచేశారు. ఇది ఉచ్చస్థితిలో ఉన్నప్పుడు నేడు దక్షిణాన తమిళనాడు రాష్ట్రం తూర్పుకోస్తాలో ఉన్న కడలూరు మొదలు ఉత్తరాన తూర్పుకోస్తాలో కళింగపట్నం వరకు, అక్కడనుంచి ఉత్తరాన నర్మదానదికి ఆవలినుంచి పడమటి కోస్తాలోని కచ్ వరకు వ్యాపించిన విస్తృత సామ్రాజ్యం. అంటే; నేటి ఆంధ్రప్రదేశ్, మైసూరు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు, తమిళనాడు రాష్ట్రంలో కొంత ఈ సామ్రాజ్యంలో ఉన్నవన్నమాట.

ఈ రాజులు గుహలలోను, కొండలమీద, మందిరాల గోడలమీద, స్తంభాలమీద శాసనాలు చెక్కించారు. ఇవి నాసిక్, జూనార్; కన్హేరి, కార్లా, నానేఘాట్, అజంతా మున్నగు ప్రాంతాల గుహలలోను, నాగార్జున కొండ, తదితర ప్రాంతాలలోను నేటికీ ఉన్నాయి. వీరందరూ ప్రాకృతభాషాభిమానులు. కనుక, వీరి శాసనాలన్నీ ప్రాకృతభాషలోనే ఉన్నాయి. వీటిలిపి బ్రాహ్మీలిపి. అంతమాత్రాన అప్పటికి తెనుగు భాషలేదని కాదు, ఉంది. కాని, రాజుల దృష్టిని, అందుకోలేదు. వారి అనుగ్రహం సంపాదించలేదు. అయినప్పుడు, పండితుల అభిమానం చూరగొనడం సంభవంకాదుకదా! అందువల్లనే సాహిత్యస్థాయి అందుకోలేదు. రాజులు ప్రాకృత భాషాభిమానులు. వారి మాతృభాషకూడ ప్రాకృతమే. ఇక అప్పటికి ఆంధ్రదేశంలో ప్రబలంగా ఉన్నది బౌద్ధమతం. ఆ మత గ్రంథాలన్నీ ఒకరకం ప్రాకృతమైన పాలీభాషలోనే, కనుక తెలుగులో శాసనాలు వేయించే దిక్కు లేకపోయింది. అయినా అప్పటి ప్రాకృతశాసనాలలో వేపూరువంటి తెలుగు గ్రామాలపేర్లు, నాగబు వంటి వ్యక్తుల పేర్లు చేరకపోలేదు. నాగబును గురించి ఒక్క తమాషా ఉంది. ఈ పదంఉన్న రాతిబండ అమరావతి స్తూపం దిబ్బలలో దొరికింది. పురాతత్వ పండితులు కొందరు దీనిని నాగ-బు అని పద విభాగంచేసి, రెండూ వేరువేరు పాలీభాషా పదాలని భ్రాంతిపడ్డారు. కాని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఇది తెలుగుపదమని, నాగబు అనేది తెనుగు ప్రథమావిభక్తి ప్రత్యయంతోఉన్న నాగ అనే తత్సమపదమని , నాగంబు నాగము అనే నేటి



రూపాల పూర్వస్వరూపమని సకారణంగా నిరూపించారు. కనుక ఆ కాలంలో క్వచిత్తుగా తెలుగుపదాలు శాసనాలలోను చేరేవని అనుకోవచ్చు. అలాటి అతి ప్రాచీన బ్రాహ్మీశాసనాలలో నిబద్ధమైన అతి ప్రాచీనమైన తెలుగువ్యక్తి నామం నాగబు అని మనం భావించవచ్చు. తెలుగువారు తమ పదాలను ఇతర భాషల వారికి ఇవ్వడంతోపాటు, సంస్కృతాది ఇతర భాషాపదాలను తమ ప్రత్యయాలతో చేర్చి వాడుకొనే తత్సమపద సంప్రదాయంకూడ రెండువేల ఏండ్లనాడే ఆరంభమైందన్నమాట. ఇక సాతవాహన రాజులలో ఒకడైన హాలుడు సంకలనం చేసిన గాథాసప్తశతిలోని గాథలలోను అత్త, వోలంకి (ఒల్లెంక), పిల్ల, పిలక, పత్తి, వెంటు మున్నగు తెలుగు పదాలు చేరకనూపోలేదు. (వివరాలకు నా మౌలికవ్యాసం 'గాథా సప్తశతిలోని తెలుగు పదాలు'- 1948 భారతి) కాని తెలుగు భాషది అనదగిన శాసనం పెద్దదేమీ కనిపించదు.

రెండువేల సంవత్సరాలనాటి వ్రాతలకు మచ్చుగా భట్టిప్రోలు స్తూపం బరిణెలమీది శాసనాలను, అశోకుని శాసనాలను నాగబును చూచారుగదా ! మౌర్యలిపికి, ఆంధ్ర సాతవాహన లిపికి అంతగా భేదం కనిపించదు. తర్వాత తర్వాత ఏండ్లు గడచినకొద్దీ, అంటే క్రీస్తుశకం రెండువందల సంవత్సరాలకు ఇక్ష్వాకుల కాలంలో బ్రాహ్మీలిపి ఎంతగా మారిందో చూడండి. ఇదికూడ



అమరావతి స్తూప శిథిలాలలోదే. అమరావతి ఆగ్నేయ ఆసియా దేశాలలో కళలకు అందాలు దిద్దిందికదా ! మరి అక్కడి శిల్పులు వంకర టింకర అక్షరాలను అలాగే వ్రాస్తారా ? మూల స్వరూపం చెడకుండా చక్కగా చెక్కుకున్నారు చదవండి :

గామే వాథవస గహపతిస వాకాటకస గహపతికి ....

........ ........

.... .... ....

దీనిలోని ఆఖరు వరుసలోని ఆ అలు మొదట్లో పట్టుకారకొనలుగా కనిపించేవి. క్రమక్రమంగా తమలోని నిలువుగీతను ఎడమవైపుకు వంచుకుంటూ ఇప్పటి ఆకారాన్ని పొందడానికి ఆత్రపడేట్టు కనిపించడంలేదు! మొదటి

అశోక, భట్టిప్రోలు శాసనాలలో ꓘ ꓖ ꓖ ఈ రూపాలతోఉన్న ఆకారం

క్రీస్తుశకం మూడవ శతాబ్దికి-ఆరువందల ఏళ్ళలోను ꓶ ఇలా మారింది.

తక్కిన అక్షరాలుకూడ ఎలా మారాయో చూడండి.

ఈ ఇక్ష్వాకులుకూడ ప్రాకృత భాషాభిమానులే కనుక, వీరి శాసనాలూ ప్రాకృత భాషలోనే ఉన్నాయి. వీరి రాజ్యం తెలుగుదేశంలో యాభై ఏండ్లకన్నా హెచ్చుకాలం నిలవలేకపోయింది. వీరి తర్వాత పల్లవులనే రాజవంశంవారు కృష్ణాతీరం మొదలు దక్షిణాదిని కాంచీనగరం రాజధానిగా పాలించారు. దక్షిణ భారతంలో-ముఖ్యంగా ఆంధ్రదేశంలో-బ్రాహ్మీలిపి పరిణామంలో ఇక్ష్వాకుల వరకు ఒక ఘట్టం అనవచ్చు.

జనంలో జీవం, జనం ఉంటే పరరాజుల పాలన ఎంతకాలం సాగుతుంది? బృహత్ఫలాయనులనే వంశం రాజులు పల్లవులను ఎదిరించి, వారిని తెలుగుదేశం నుంచి తరిమివేశారు. నేటి బందరు సమీపంలోని గూడూరు అనేది వీరి రాజధాని. కాని, ఈ వంశంకూడ ఎంతోకాలం-అంటే యాభై ఏండ్లకు మించి వర్ధిల్లలేదు. మరల పల్లవులు దక్షిణాంధ్రంపై దండెత్తివచ్చి ఆక్రమించుకొన్నారు. ఈ బృహత్ఫలాయనుల శాసనాలుకూడ ప్రాకృతంలోనే ఉన్నాయి. వీరికాలంలో విశేషమేమిటంటే తామ్రశాసనాలు వాడుకలోకి రావడం. రాతిశాసనాలు తగ్గిపోవడం. ఈ పద్ధతి క్రీస్తుశకం 10వ శతాబ్దిదాక సాగిందనవచ్చు.

అయితే పల్లవుల పెత్తనం తెలుగుదేశంపై ఎంతోకాలం సాగలేదు. ఆనంద గోత్రికులనే మరొక రాజవంశంవారు పల్లవులను ఎదిరించి తరిమివేశారు. ఈ వంశం మూలపురుషుడు కందారుడు. వీరి రాజధాని నేటి నరసారావుపేట తాలూకాలోని చేజెర్ల. దీనిని పూర్వం విజయకంధారపుర మనేవారని కొందరు పండితులు అంటున్నారు. ఈ రాజులకు కందారులనే పేరుకూడ వచ్చింది. వీరికి సమకాలంలోనే శాలంకాయనులనే మరొక రాజవంశంవారు వేంగీపురం రాజధానిగా కొంత ఆంధ్రదేశాన్ని పాలించసాగినారు. ఈ వేంగీపురం ఇప్పటి ఏలూరు సమీపంలోఉంది నేడు దీనిపేరు పెదవేగి. శాలం

కాయనులకు, పల్లవులకు మధ్య ఆనందగోత్రికులు ఎంతోకాలం స్వతంత్రంగా ఉండలేకపోయారు కాని వీరు ఒకప్పుడు స్వతంత్ర స్థితిలోను, మరొకప్పుడు సామంతస్థితిలోను మొత్తం మూడుశతాబ్దాలపాటు ఆంధ్రదేశంలో కొంత ప్రాంతం ఏలారు.

శాలంకాయన రాజులకు ఏలూరు సమీపంలోని వేంగినగరం రాజధాని అని మీకు ఇదివరకే తెలుసు. ఈ నగరం రాజధాని కావడంవల్ల వీరికి వైంగేయకులనే పేరుకూడ వచ్చింది. వీరు కృష్ణా గోదావరీనదుల మధ్యప్రాంతాన్ని పాలించారు. దక్షిణాంధ్రంలో అంటే కృష్ణకు దక్షిణాన ఉన్న ప్రాంతంలో పల్లవుల పెత్తనాన్ని సహించి ఊరుకున్నారు. శాలంకాయన వంశం చాల ప్రాచీనమైంది. క్రీస్తు తర్వాత మూడవ శతాబ్దిలో ప్రబలులై దాదాపు నూటయాభై ఏండ్లు ఆంధ్రదేశంలో పెద్దప్రాంతం పాలించారు. వీరు వైదిక మతావలంబులు గనుక సంస్కృతానికి ప్రాధాన్యం కలిగింది. అప్పటికి బౌద్ధమతంలోను మహాయానమనే శాఖ బయలుదేరింది. ఈ శాఖవారు పాలీ ప్రాకృతంతో పాటు సంస్కృతాన్ని కూడ మతభాషగా గ్రహించారు. ఇంతేకాక బౌద్ధమతం తెలుగుదేశంలో క్షీణింపసాగింది. దీనితో భాషలోను సంఘంలోను గొప్ప మార్పులు వచ్చాయి. దక్షిణ బ్రాహ్మీలిపిలో మరికొన్ని మార్పులు కలగడం. ఇప్పటినుంచే గనుక బ్రాహ్మీలిపి పరిణామంలో ఇదొక ముఖ్యఘట్టం.

అశోకుని లిపితో వీటిని పోల్చిచూస్తే కొన్నిటిలో వింతమార్పు కనిపిస్తుంది. ఇక్ష్వాకుల కాలంలో అక్షరాలు కిందభాగం పెరగడం, ఎడమవైపు

మళ్ళడం మరికొన్ని మార్పులు కలుగగా, శాలంకాయనుల నాటి లిపిలో అక్షరాల తలపై చిన్న అడ్డగీత స్పష్టంగా ఏర్పడింది. ఇది నేటి మన అక్షరాల తలకట్టుకు మూలం. మరికొన్ని అక్షరాలు అశోక లిపివలె గుండ్రంగా లేక కోణాకారంగా కనిపిస్తాయి. ఈ మార్పులు శాలంకాయనుల తర్వాత తెలుగు దేశాన్ని పాలించిన విష్ణుకుండుల కాలంలో ఎక్కువ. బ్రాహ్మీలిపి రూపే మారిపోయింది. ఇక్కడినుంచి లిపి పరిణామంలో మరొకఘట్టం ప్రారంభమైందనవచ్చు. శాలంకాయనుల కాలంనుంచి బయలుదేరిన సంస్కృత శాసనాలలో తెలుగు శబ్దాలు గ్రామనామాలు, సరిహద్దులు సూచించేవి, వ్యక్తులపేర్లని కంబురాంచెరువే, గొల్లతెంకిః, చెరుకు మడ్లుళ్ళ, పోతురాయుఃలాంటివి సంస్కృత వేషంతో కనిపిస్తాయి.

ఈ శాలంకాయనుల శాసనాలు మొదట వేంగీనగర ప్రాంతంలో కనిపించాయి గనుక వీటిలిపిని, ఆ కాలపు తక్కిన పరిసరశాసనాల లిపిని పండితులు వేంగీలిపి అని వ్యవహరించారు.

శాలంకాయనుల తర్వాత ఆంధ్రదేశాన్ని పాలించినవారు విష్ణుకుండులు-అన్నానుగదా! వీరి జన్మస్థలం గుంటూరు జిల్లాలోని వినుకొండ. తర్వాత కొంతకాలానికి రాజధాని దెందులూరు. వీరు ఆంధ్రదేశాన్నంతా రెండువందల సంవత్సరాలపాటు ఏలారు. వినుకొండ సంస్కృతీకరణమే విష్ణుకుండిన అని అయిందని కొందరు పండితులు అంటారు. వీరి రాజ్యం క్రీస్తుశకం ఐదవ శతాబ్ది మధ్యనుంచి ఏడవశతాబ్ది మధ్యదాక ఉంది. తర్వాత చాళుక్య రాజులకు ఆంధ్రదేశం వశమైపోవడంతో విష్ణుకుండుల రాజ్యం అంతరించింది.

౬

విష్ణుకుండుల కాలంలో ఆంధ్రుల ప్రభ దివ్యంగా వెలిగింది. వీరు పల్లవులను పెన్నకు దక్షిణానికి తరిమివేశారు. ఉత్తరాన వాకాటులతో వియ్యం చేసుకొన్నారు. వీరు శైవులు. సంస్కృతభాషను ఆదరించినవారు. వీరి కాలంలో లిపి నిర్దిష్టమైన స్థాయిని అందుకుంది. శాలంకాయనుల కాలంలో కొన్ని అక్షరాల తలపై కనిపించిన ఆ చిన్న అడ్డగీత విష్ణుకుండినులకాలంలో అన్నింటిలోను కనిపిస్తున్నది. ఈకాలపు వర్ణమాలలో మరొక విశేషం అప్పుడు తెలుగు

భాషలో ఉంది, నేడు తమిళంలో కనిపించే వింత అక్షరం 'ళ' అనేది, మధ్యగీత లేని నేటి బండిరాలాగ చెక్కి ఉండడం. దీనితో సంస్కృత భాస నాలలో అప్పటమైన తెలుగు ఉచ్చారణగల శబ్దాలూ చొచ్చుకుపోయేవనేకదా !

ఈ వింత అక్షరం నన్నయకాలం దాకఉంది.కొన్నిటిలో మొదలయిన



వింత ఆకారాలతోను కనిపిస్తుంది. ఈ చర్చ వివరాలకు అహదనకర గ్రామ శాసనంపై జరిగిన వాదోపవాదాలు చదవండి. (భారతి-విభవ ఆషాడం....) ఈ వింత అక్షరం ఉచ్చారణకూడ క్రమంగా ధ, ర, ల, శ, ర, అ, ండ లుగా మారిపోయింది. అసలు అక్షరం అంతరించింది.

విష్ణుకుండినుల శాసనాలలో అక్షరాలపై అడ్డుగీత పొడుగుతూ, వంకర వుతూ నేటి తలకట్టు కావడానికి తహతహ పడుతుండగా, వారి రాజ్యానికి ఉత్తరాన ఉన్న వాకాట



రాజుల శాసనాలలో లిపిపై అడ్డగీత చిన్నరంగంపెట్టెలాగ కావడం తమాషాగా లేదూ! అది నేడు దేవనాగరిలో అక్షరాలమీద కనిపించే పెద్ద అడ్డగీత మూలమన్న మాట.

విష్ణుకుండినులను చాళుక్యులనే రాజవంశీయులు జయించి తెలుగుదేశాన్ని ఆక్రమించుకొన్నారని ఇదివరకే తెలుసుకున్నాము. చాళుక్యులు దేశ భాషాభిమానులు. వీరి కాలంలో తెలుగుకు ఆదరం లభించింది. తెలుగులో శాసనాలు వెలయసాగాయి. ఈ చాళుక్యులనేవారు మన రాష్ట్రంవారు కారు. నేటి మైసూరు రాష్ట్రంలోని బాదామినగరం వీరి రాజధాని. వీరు కర్నాటకులు. ఈ బాదామిని పూర్వం వాతాపిఅనేవారు. వీరు కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతాలను పాలించేవారు. వీరిలో ప్రతాపశాలి అయిన సత్యాశ్రయ పృథ్వీవల్లభ మహారాజు వేంగీ కళింగరాజ్యాలను జయించాడు. ఆ రాజ్యాల పరిపాలనకు తన తమ్ముడైన విష్ణువర్ధనుని నియమించాడు. ఇది జరిగిన క్రీస్తుశకం ఏడవ శతాబ్ది ప్రారంభంలో అంటే పదమూడువందల యాభైఏళ్ళ క్రితమన్న మాట. ఈ విష్ణువర్ధనుడు పొట్టివాడు కాబోలు! కుబ్జ విష్ణువర్ధనుడు అన్న పేరు వచ్చింది. ఇతడు క్రమంగా స్వతంత్రుడై వేంగీ కళింగాలలో స్వతంత్రరాజ్యం స్థాపించాడు; ఆంధ్ర



స్వస్తిశ్రీ ఎఱిక
ల్ముత్తురాజుల్ల
కుణ్డికాళ్ళ నివబుక
ను ఇచ్చిన పన్నస



దుజయరాజుల
ముతురాజులు నవ
ప్రియ ముత్తురాజులు
వల్లవ దుకరాజులు సాక్షి
కాను ఇచ్చి(న) పన్నస్స
కొట్టంబున పా
అకు కుణ్డికాళ్ళ
ళ ఇచ్చిన పన్నస
ఇరవది యది నా
ల్కు మఱున్తుఱ్కు నేల

చాళుక్య రాజవంశానికి మూలపురుషుడయ్యాడు

చాళుక్యులు దేశభాషాభిమానులు గనుక దేశభాషలను ఉద్ధరించారని తెలుగులో శాసనాలు వేయించారని ఇదివరకే అన్నాను గదా! ఈ కాలంలో పశ్చిమాంధ్రప్రాంతాన్ని తెలుగుచోడులు పాలించేవారు. వీరు మొదట పల్లవులకు

సామంతులు. మనకు నేడు లభించిన మొట్టమొదటి తెలుగుశాసనం రేనాటి చోళ రాజయిన ఎరికల్ ముత్తరాజుది. ఇది కడపజిల్లా కమలాపురం తాలూకా ఎఱ్ఱ గుడిపాడు గ్రామంలో చెన్నకేశవాలయం పక్కన రాతిపై చెక్కి ఉంది. క్రీస్తు శకం 575 నాటిది. మొదట తెలుగు శాసనం గనుక వినండి;

దీని సారాంశమేమిటంటే; ఎరికల్ ముత్తరాజు రాజ్యంలో కుండికాళ్ళ అనే పెద్దమనిషి ప్రోత్సాహంతో పన్నస మేరభూమి దానమివ్వబడింది. దీనికి దుజయరాజుల ముత్తరాజులు, నవప్రియ ముత్తరాజులు, వల్లవదుక (యువ) రాజు సాక్షులు. ఈ పన్నస కుండికాళ్ళల్ 24 మరుంతుర్ల మేరనేలను కొట్టంబులోని పాలకు ఇచ్చినాడు.

కుండికాళ్ళ = కుండిపాదాః అనే సంస్కృతపదానికి అనువాదం కావచ్చునని, ఈయన బౌద్ధుడు కావచ్చునని కొందరు పండితుల ఊహ. నివ బుకను = నెపముగాను నివబు = నెపము, నిమిత్తం వల్లవదుకరాజు = వల్లభ యువరాజు దుకరాజు = దుగరాజు = దువరాజు = యువరాజు. (ఇలాటివే మంగి దొంగరాజు మంగియువరాజు; పృథ్వీదుకరాజు-పృథ్వీయువరాజు.)

తర్వాత దొరికిన రెండవ తెలుగు శాసనంగూడ రేనాటి చోళులదే. దీనిని సత్యాశ్రయిడనే రాజు వేయించాడు. ఇదికూడ కడపజిల్లాలోని పోట్లదుర్తి మాలె పాడు అనే గ్రామంలో దొరికింది.

బాదామీ చాళుక్యుల రాజ్యం వేంగిదేశానికి పశ్చిమంగా ఉన్నందున, వేంగి కళింగాలు తూర్పు రాజ్యాలుగా ఉన్నందున బాదామీ చాళుక్యులను పశ్చిమ చాళుక్యులని, వేంగి చాళుక్యులను తూర్పుచాళుక్యులని వ్యవహరించడం పరిపాటి అయింది. ఈ పరిపాటిని బట్టే లిపికికూడ బాదామీ చాళుక్యలిపి-పశ్చిమ చాళుక్య లిపి అని, వేంగి చాళుక్యలిపి- తూర్పు చాళుక్యలిపి అని పేర్లు వచ్చాయి. ఈ వేంగిలిపి, బాదామీ చాళుక్యలిపి ఒక కోవలోవే. ఇవి నేటి కన్నడ తెలుగు లిపు లకు పూర్వరూపం. బాదామీ చాళుక్య లిపి కుడివైపు మొగ్గి ఉంటుంది. వేంగీ చాళుక్యలిపి చౌకంగా, నిలువుగా ఉంటుంది.

ఈ వేంగీ చాళుక్యుల అతి ప్రాచీనమైన శాసనం తూర్పుచాళుక్యుల మూల పురుషుడైన కుబ్జ విష్ణువర్ధనుడు వేయించినది ఆకాలంలో-తెలుగు శాసనాలు కొత్తగా చెక్కిన కాలంలో-శిల్పులు వ్రాతపద్ధతిని క్రమంగా పాటించినట్టు కన పడదు. వరుసలు పైనుంచి కాక అట్టడుగునుంచి చెక్కుకు పోవడం కూడ ఉంది. ఈ కుబ్జ విష్ణువర్ధనుని వంశంలోని మూడవ విష్ణువర్ధనుడనే రాజు తండ్రి అయిన మంగిదొంగ రాజు శాసనమొకటి ఈ వింత పద్ధతిలో ఉంది. ఇది కుబ్జ విష్ణువర్ధనుని తర్వాత డెబ్బయి సంవత్సరాలలోపుదే గనుక మనం ప్రత్యేకంగా, లిపి పరిణామదృష్ట్యా పరిశీలించవలసి ఉంది.

ఈ శాసనం కృష్ణాజిల్లా దివితాలూకా లక్ష్మీపురమనే గ్రామంలో దొరికింది. తెల్లటి పాలరాతిపై చెక్కిన శాసనం, మూరవెడల్పు, రెండుమూరల పొడవు ఉంది. రెండువైపులా శాసనం చెక్కిఉంది. లిపి నిలువుగాను, చౌకంగాను ఉంచి కదూ! ఇక భాష ఇంతకు ముందు మీరు చదివిన ఎర్రగుడిపాడు శాసనం భాషకన్నా జటిలం. క్రమంగా మనలిపి, భాష సరళంకావడం చూడగా ఆశ్చర్య మౌతుంది. శాసనం చూడండి:-





24. పవశున్దరా
23. తావాయో
22. స్వదత్తా పరద
21. తశ్యతథా ఫలం
20. తా భూమి తశ్యశ్య
19. యశ్యయశ్యయ
18. (ఈ బంతి మాసిపోయింది)
17. చమ్బిన చన్నంగు
16. వేపురు పఱాను

11. రెన్డుట్టియు తూఱ్ఱు
10. ఉఱుపుటురి బోళ
9. ట్టు ద్రుగ్గాదేవి నేలయు
8. పదేన్డుంబు అడ్లుప
7. దశిన రెన్డువట్టి
6. జకుఱెంగరి పె
5. మిరియమ్బుబోళ

4. ల ఇచ్చిన రెన్డువటి 15. ము వేశెఱువుఱ
3. జ్యంబున కడువం(డ్లు) 14. వేగవిలాఘ వేడ్లు
2. విౖటజుల ౖపతమరా 13. కళరేని బారనాసి
1. స్వస్తిశ్రీమగిదొగరజులముడ్లు 12. ఈ రెన్డు ట్టి బిచువరు

దీని సారాంశమేమిటంటే; తూర్పు చాళుక్యరాజైన మంగి యువరాజు రాజ్యం చేస్తుండగా, ఆయనకింది అధికారి అయిన విౖటాజు రాజ్యంలోని కడువండ్లుల ౖగామంలో మిరియంపుబోళజ అనే వ్యక్తి కోసం తెంగటి అనే వ్యక్తి పదిహేను తూముల ఆళ్ళ విత్తనాలుపెట్టే రెండుపట్ల భూమిని పొందాడు. ఈ భూమికి తూర్పుటెల్ల దుర్గాదేవి నేల ఉఱువుటూరి బోలరెండుట్టి (రెండుపట్లభూమి)ని, దీనిని పాడుచేసేవారు వారణాసిలో వేయి కపిల గోవులను చంపిన, వేయి గుళ్ళను, వేయి చెఱువులను పాడుచేసిన, వేయిమంది ౖబాహ్మణులనుచంపిన పాపం అనుభవిస్తారు.

ఈ చాళుక్య వంశంవాడే అయిన యుద్ధమల్లుడనే రాజు బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయంలో వేయించిన శాసనంకూడ ఈ విధంగానే ఉంది. ఇది యుద్ధమల్లుని బెజవాడ శాసనమని ౖపసిద్ధికెక్కింది. ఇది ఒక స్తంభంలో మూడుపక్కల చెక్కిఉంది. ఒకపక్క పై నుంచి చదివిన తర్వాత రెండవ పక్కన ఉన్నభాగాన్ని అట్టడుగునుంచి చదవాలి మూడవపక్కను మరల పై నుంచి మొదలుపెట్టాలి.

మన నన్నయాభట్టారకుడు ఆంౖధభారతం ౖవాసినది ఈ వేంగీ చాళుక్య లిపిలోనే. కాని నన్నయ నాటిలిపికీ మొదటి వేంగీ చాళుక్యలిపికి పోలిక ఏమీ కనిపించదు. నన్నయకాలానికి లిపి బాగా తలకట్టు దిద్దుకొని చగికిలబడింది. నన్నయ ౖవాసిన భారతం తాటాకుౖపతి మనకు లభిస్తే ఎంత బాగుండును! లేదు మరి! ఆయన రాజరాజనరేంౖదుని విద్యాధికారిగా చెక్కించిన శాసనాలుమాౖతం ఉన్నాయి. నన్నయకాలపు మరొక్క శాసనం కోరుమిల్లి శాసనం. చూడండి లిపిలో ఎంత తేడా ఉందో! ఈ శాసనం రచించినవాడు బేతనభట్టు. చీదమార్యుడనే ౖబాహ్మణునికి కోరుమిల్లి ౖగామం దానమిచ్చినట్టు ఈ శాసనం తెలుపుతున్నది. కోరుమిల్లి తూర్పు గోదావరి జిల్లా రామచంౖదపురం తాలూకాలోనిది. దీనిని చెక్కినవాడు గండాచార్యుడు.

శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో న్నార్భీవంక
రుహాద్బభూ

వజగతస్స్రిష్టా స్వయంభూస్తతః జజ్ఞేమానససూను ర్రత్రిరితియః
తస్మాన్మునే ర్రత్రితస్సోమో

వంశకరస్సుధాంశు రుదిత శ్రీకణ్ఠ చూడామణిః। తస్మాదాసీత్సుధా సూ
తేర్బుధో బుధనుత స్త

తః జతః పురూరవా నామ చక్రవర్తి సవిక్రమః। తస్మాదాయు
రాయుషో సహుషఃతతో యా

యాతిశ్చక్రవర్తివంశకర్తా తతఃపురురితి చక్రవర్తీతతో జనమేజ
యోశ్వమేధత్రిత

యస్యకర్తా తతః ప్రాచీశః తస్మాత్సైన్యయాతిః తతోహయపతిః
తతస్సార్వ

భౌమః తతో జయసేనః తతో మహాభౌమః తస్మాదైశానకః। తతః
క్రోధానన:

తతో దేవకిః దేవకే రిభుకః తస్మాదృషకః। తతో మతివరస్సత్రయాగ
యాజీ సర

స్వతీనాథః తతః కాత్యాయనః కాత్యాయనాన్నీలః తతో దుష్యన్తః తత
అయ్యర్గ

గాయమునా తీరే య దవిచ్ఛిన్న న్నిఖాయ యూపాన్క్రమశః కృత్వా
తథాశ్వమే ధాన్నామ మహాక

మ్మ భరత ఇతి యోలభత। తతో భరతాద్భూమన్యుః తస్మాత్సు
హోత్రః తతో హస్తి తతో విరో

చనః తస్మా దజమీలః తతస్సంవరణః తస్యచ తపన తపనసుతాయా
స్తపత్యాశ్చ సుధన్వా త
ఈ పరిక్షిత్।తతో భీమసేనః।తతః ప్రదీపనః తస్మాచ్ఛన్తనుః తతో
విచిత్రవీయ్యః।

చూచారుగదూ ఎటికల్ ముత్తరాజు శాసనానికి, లక్ష్మీపురం శాసనానికి, దీనికీగల భేదం! వాటిలోని అక్షరాలపైని చిన్ని అడ్డుగీతలేమో దీనిలో పూల రేకుల్లా, ద్విదళంలా తలకట్లయాయి. ఈ శాసనం తొమ్మిదవ పంక్తిలోని అయ్య అనే పదంలో ఉన్న ఆ ను చూడండి. లా దీర్ఘంలాగ కనిపించడం లేదూ! ఇంతకుముందు అకారం ఇక్ష్వాకులకాలంవరకు ఎలా మారిందో తెలుసుకున్నారు. ఆ అకారం శాలంకాయనుల, మొదటి కళింగగాంగుల కాలంలో

[illegible] గాను, విష్ణుకుండినుల కాలంలో [illegible] గాను, వేంగీ చాళుక్యుల

కాలంలో [illegible] గాను మారింది. నన్నయకు కొంచెముందుగా [illegible] గామారి

నన్నయకాలంలో [illegible] అయింది. ఈ అకారానికి దీర్ఘమే పక్కన పంపుగా

ఉన్న కొస. ఆకారం తర్వాత [illegible] ఈ విధంగా మారి [illegible] అయిందనుకోండి.

నన్నయ భట్టారకుని కాలంనుంచి వేంగీ చాళుక్య లిపిలో మార్పులు ప్రారంభమైన తర్వాత వందయాభై, రెండువందల ఏళ్ళకు కన్నడ తెలుగు లిపులు విడిపోయాయి. అంతవరకు బాదామి, వేంగీ చాళుక్య లిపులు కలగలుపుగాఉన్న లిపి ఆంధ్ర, కన్నడ దేశాలలో వ్యాప్తిలో ఉండేది. దీనిని కచ్చితంగా తెలుగు లిపి అనిగాని, కన్నడ లిపి అనిగాని అనలేము. ఇది తూర్పున రాజ మహేంద్రవరంపైనుంచి పడమటికోస్తావరకు ప్రచారంలో ఉండేది. అప్పుడు మార్పులు ప్రారంభమై దాదాపు రెండువందలఏళ్ళకు పూర్తిగా భేదం ఏర్పడింది. ఈ రెండువందల సంవత్సరాల కాలాన్ని లిపి శాస్త్రజ్ఞులు సంధి కాలం అన్నారు. సంధికాలం అంటే మార్పులు ప్రారంభమైనకాల మన్నమాట. ఈకాలంలోనే దక్షిణభారతంలో - తెలుగులోను, కన్నడంలోను, వాఙ్మయం కొత్త కొమ్మలు చిగిర్చింది. అచ్చు ప్రారంభమైన తర్వాత తెనుగు కన్నడ లిపులు మరీ వేరయాయనుకోండి - తెలుగులిపేమో మరీ గుండ్రనైపోయింది. కన్నడలిపి కోణాకారమైపోయింది.

పదమూడవశతాబ్దికి తెలుగు లిపి ప్రత్యేకమై నిలవదొక్కుకుందనడానికి మంచనకవి మాటకూడ మనకు సాక్ష్యమిస్తుంది. మంచన తన కేయూర బాహు చరిత్రలో కృతిపతి గుండయమంత్రి శక్తి సామర్థ్యాలను వర్ణిస్తూ-

"వాచకత్వము లేఖ నోచితంబును నంధ్ర
లిపియట్ల మహి సర్వలిపులయందు,

ఫణితిజాతియు ద్రవిభంగియును దెనుగు
భాష యట్టులె సర్వభాషలందు."

అని గుండయమంత్రి తన ఆంధ్రలిపినిలాగే ఇతర లిపులనుగూడ చదివేవాడని వర్ణించాడు. మంచన తిక్కన సమకాలంవాడు. కనుక పదమూడవ శతాబ్దానికే తెనుగులిపి స్థిరపడిందని అనుకోవచ్చు. ఇక పద్నాలుగో శతాబ్ది వాడయిన జక్కన తన విక్రమార్క చరిత్రలో కృతిపతి సిద్ధమంత్రిని వర్ణిస్తున్నప్పుడు

"ఆత్మీయ లిపులట్టు లన్య దేశ్యంబుల
లిపులను జదువంగ నిపుణుడయ్యె."

అన్నాడు. జక్కనకాలానికి అంటే 14 వ శతాబ్ది- రెడ్డిరాజుల కాలానికి తెలుగులిపి విడిగాఉండక ఏమౌతుంది?

చాళుక్యుల కాలంలోనే పశ్చిమతెలుగుదేశాన్ని కొంత తెనుగుచోళులు పాలించారు. తెలుగుదేశంలో ఎక్కువ ప్రాంతాన్ని, మహారాష్ట్రంలో కొంతకూడ (మరాత్వాడాలో) పాలించినవారు కాకతీయులు. పదకొండవ శతాబ్దం అరంభం నుంచి మూడు శాతాబ్దాలపాటు వీరి సామ్రాజ్యం కొనసాగింది. వీరి రాజధాని ఓరుగల్లు-వరంగల్. ఈ సామ్రాజ్యం పడిపోయిన తర్వాత కొంతభాగాన్ని రాచకొండ, దేవరకొండ రాజధానిగా పద్మనాయకులు. మరి కొంతభాగాన్ని కోరుకొండ నాయకులు, కొండవీడు, రాజమహేంద్రవరం రెడ్లు పాలించారు. పదిహేనవశతాబ్దం నుంచి విజయనగర సామ్రాజ్యం ప్రబలి పదహారవశతాబ్ది ఆఖరువరకు ఉంది. దీనితో ఆంధ్రసామ్రాజ్యం అస్తంగతమైంది. ఈ రాజుల కాలాల తెలుగు లిపులకు ముందులాగే కాకతీయలిపి, రెడ్డిరాజుల లిపి, విజయనగరలిపి అనేపేర్లు వచ్చాయి. కాకతీయకాలపు లిపిని మనం తిక్కనలిపి అని, రెడ్డిరాజులలిపిని శ్రీనాథలిపి అని వ్యవహరించుకుందాము.

ఈ సంధికాలపు లిపిలో కలిగిన మార్పు లేవనుకున్నారు? చకారానికి పూర్వం తలకట్టులేదు ఇప్పుడు తలకట్టు వచ్చింది. ఛకారం ఎడమభాగం గుండ్రంగా అయింది. ఠకు, థకు, ధకు, తలకట్లు వచ్చాయి. ఫకారం ఎడమ పక్కని సుడిని అంటిపెట్టుకున్న తలకట్టు ఎప్పుడెప్పుడు విడిపోదామా అని చూస్తున్నది. ఫ మరీ తమాషాగా మారింది. అంతకుముందు పకారం వ్రాయ డానికి పకారం కుడిగీతకొసకి ఒత్తును గుడిలాగ ఇచ్చేవారు. ఈ గుడి ఈ సంధికాలంలో ప కుడివైపు గీతమధ్యకు దిగింది. భ పూర్వం ఇప్పటి లావ త్తు (౧) కు కొద్దిగా తలకట్టిస్తే ఎలాగుంటుందో అలా ఉండేది. ఇప్పుడు బకారానికే తలకట్టిచ్చి భ చేసుకొన్నారు పొక్కిలిలో గీత వాడలేదు. అయితే

బెబె, బేభే, బైభై, బొభొ, బోభో, బౌభౌలలో భేదం ఎలా కనుక్కోడం అని అంటారేమో! ఏమీ చిక్కులేదు. సులభంగా కనుక్కోవచ్చు. అడుగున రెండు భాగాలు—దళాలు-చేరిఉంటే బ; చేరక విడిగాఉంటే భ. కోరుమిల్లి శాసనం మొదటి పంక్తిలో మధ్యన ప్రభో అన్న పదంలోని భో చూడండి. వింత అక్షర మైన క్ష ఇదిగో వెళ్లుతాను. అదిగో వెళ్లుతాను అనేట్టుఉంది.

సంధికాలం దాటిన తర్వాత అక్షరాలు ఏరూపం దాల్చుకొన్నాయో తెలుసుకొనడానికి కోరుమిల్లి లిపిని తిక్కనకాలపు శాసనంతో - కాకతీయ శాసనంతో - పోల్చిచూడండి. ఇది గణపతిదేవుని గజసైన్యాధ్యక్షుడైన జాయన 1213-14 లో చేబ్రోలులో వేయించిన శాసనం. దీనిని చదువుకొని వరసగా అక్షరాలు పరిశీలించండి.



స్వస్తిశ్రీః। జయతి హరివరాహః ప్రేమసం
భ్రాంత పృథ్వీస్తనభర పరిరంభా రంభ

దృప్తస్యయస్య। పుళక చుళికితాంధ
స్సంచయస్తోయరాశిః పునరవిరళ ని
ర్యత్స్వేదపూరైరపూరి॥ హేరంబస్య
వికల్ప దంతముకుళం గౌరీ రహస్యో
త్సవ ప్రత్యాసంన విలాస దీపకళికా
గంగామృణాళాంకురః। దేవస్య త్రిపుర
ద్రుహో విజయినా పుష్పేషుణా మస్త
కే విన్యస్తాంకుళ విభ్రమా విజయతే
చూడాసుధాంశోఃకలా॥ పాయాద్వః ప
రివర్తమాన లహరీ ప్రాగ్భార మాస్ఫా
లయ న్నాయంకాల తరంగకేళిషు కరాస్కం
దేన మందాకినీం। దేవస్యారభటి పరిభ్ర
మకలా సంరంభ సంభావినః శంభో రంబు
మృదంగవాద్య రచనారంభాయ లంబోదరః॥
హంసాః పద్మాసనారూఢా యదంత స్సము

ఇప్పటికి తెలుగు విడిపోయే స్థితిలో ఉన్నట్టు కనిపించదూ! నన్నయకాలం అక్షరాలమధ్యన గీతగీస్తే తలకట్టు దగ్గర తెగుతుంది. అంటే తలకట్టు సగమూ, తక్కినది సగమూను. కాకతీయులు అక్షరాలలో తలకట్టు చిన్నదై తక్కిన స్వరూపం పెద్దది కావడంతో అక్షరాలు పొంకంగా, దీర్ఘవర్తులంగా అయి, కొత్తరూపం వచ్చింది. క అంతగా మారలేదు. కాని గ మారింది. చ ఛలు మారాయి. ఛ కు కింద ఏటవాలుగా ఉన్న చిన్న గీత-ఒత్తు ఉంది. చూడండి. న వాలిపోక నిలబడింది. పకారం తలకట్టు విడిపోయింది. ఫకు ఒత్తుగా నన్నయ కాలంలో ప పక్క గీత మధ్యకు దిగజారిన గుడి పక్కన కొట్టివేస్తున్న గీతగా మారింది. బ భలు మరింత గుండ్ర నయాయి. బోర్లించిన గంధం గిన్నెలాగ ఉన్న శ శంఖాకారంగా తయారయింది. ష తలకట్టు విడిపోయి స్పష్టంగా ఒక రూపానికి వచ్చింది. స హ లు తలకట్టు విదిల్చుకొన్నాయి. బండి ఱ లోని అడ్డగీత విడిచి వ్రాస్తున్న ళ్ష అనే వింత అక్షరం మాసిపోయింది. మొత్తంమీ తెలుగు ప్రపంచంలో పడ్డామనిపిస్తుంది.

ఇక శ్రీనాథుని కాలానికి అంటే 14వ శతాబ్ది ఆఖరు 15వ శతాబ్ది మధ్యను-ఒకటి రెండు మినహాగా అన్ని అక్షరాలు మారాయి. ఇప్పటి తెనుగుకు సన్నిహిత దశ ఇదేననిపిస్తుంది. కన్నడ లిపిచ్ఛాయలు కూడ తొలగిపోయాయి

అనవచ్చు. క పూర్తిగా మారి ఇప్పటి క లాగా అయింది. కొన్నిచోట్ల పాత రీతిగా వ్రాయడమూ ఉండేది. త కు మొదట సుడి ఏర్పరడం ఆరంభమైంది. దానికి మొదటిదళ అన్నట్టు త రావాకులాగ వ్రాయడం కనిపిస్తుంది. ఫ కావ డానికి ప పక్కగీత మధ్యన దానిని కొట్టివేస్తున్నట్టు వ్రాస్తున్న గీత కాస్త ప పక్కకో, కిందికో హంసపాదు ఆకారంతో వెళ్లింది. భ కు కూడ హంసపాదు లాగ ఒత్తు పెట్టడం మొదలయింది. ష స్పష్టంగా నేటి రూపానికి వచ్చింది. లోగడ లావుగా ఉన్న హకారం మొదటి సుడిభాగం చిన్నగా అయి నేటి హకా రానికి దగ్గరగా వచ్చింది. ళ కిందికొన పొడుగైన క లాగ కనిపిస్తుంది. ఈ మార్పులన్నీ శ్రీనాథుడు స్వయంగా రచించిన పెదకోమటి వేమభూపాలుని శాసనంలో చూడండి. ఇది క్రీస్తుశకం 1410 నాటిది.

శాకాబ్దములు సహస్రము
ను మున్నూంట ముప్పదియొ
క్కండునునైన భవ్యసంఖ్యః పటలు
విరోధి సంవత్సరంబున ఫాల్గు
నంబున బహుళపక్షంబు విదియ
శుక్రవారంబున శుభముహూ
ర్తంబున శ్రీధాన్యవాటీ పురాధి ప
తియు।ం గ్రీష్మవేణ్ణ జల క్రీడావినో
దుండ్డు నగు గన్నభూపాలునను
ంగుంబుత్రి। వీరనారాయణుం
డు వేమవిభుని దేవి। భూరిసద్గుణ
నికురుంబ సూరమాంబ।జగము
వినుతింప సంతాన సాగరాఖ్య వర
తటాక ప్రతిష్ఠోత్సవం బొనచ్చె॥ జాహ్న
వీయమునాది సకళ పావన నదీ
విమల తీర్థాంభః పవిత్రితంబు।స
విధదేశస్థాయి శివమౌళి బాలేందు
కౌముదీ సంఫుల్ల కైరవంబు।బ
హుమహీ పరివాహ పాథో భరద్వా
న ఘుమఘుమాయిత దిశాగో
ళకంబు। జలసారణీసేక సంవర్ధిత

తానేక వనవినీతాధ్వగాధ్వ శ్రమంబు
బలవదురు మత్స్య కచ్ఛప దుళికుళీర
తిమి తిమింగిళ విక్రమ క్రమ విహార
తరళతర తుంగభంగ కదంబచుంబి
తాభ్రవీధి సంతాన మహాపయోధి॥

రెడ్డిరాజుల కాలంలో ప్రారంభమైన మార్పులు విజయనగర సామ్రాజ్య కాలంలో-15వ శతాబ్దినుంచి 16వ శతాబ్ది ఆఖరువరకు స్థిరపడిపోయాయన వచ్చు. విజయనగర చక్రవర్తులు ఆంధ్ర కన్నడ తమిళ కేరళదేశాలను ఏలిన వారు. తమ శాసనాలన్నిటినీ భాష తెలుగుకానీండి, సంస్కృతంకానీండి. కన్నడం కానీండి-తెలుగు లిపిలోనే వేయించి లిపిని ఉద్ధరించారు కనుకనే తమిళ దేశంలోనూ వీరి శాసనాలు అప్పటి తెలుగులిపిలోనే కనిపిస్తున్నాయి.

ఈకాలం లిపికి నమూనాగా తాళ్ళపాక అన్నమాచార్యులు చెక్కించిన రాగిరేకు చూడండి. ఈయన 15వ శతాబ్ది ప్రారంభంలో అవతరించి ఆ శతాబ్ది దాటి 16వ శతాబ్ది ప్రారంభంలోనూ ఉన్నవాడు. ఈయన 30వేలు, ఈయన కుమారుడు పెద్ద తిరుమాలాచార్యుడు మరికొన్నివేలు ఏడుకొండలవానిపై కీర్తనలు రచించి, ఏనాటికానాడు రాగిరేకులపై చెక్కించారు. శృంగార సంకీర్తనములు అనే గ్రంథం మొదటి కీర్తన చెక్కిన రాగిరేకు ప్రతిబింబ మిది.



శుభమస్తు॥ శ్రీమతే రామానుజాయనమః॥శ్రీ జయాభ్యుదయ శాలివాహన
శక వరుషంబ్బు
లు ౧౩౪౭ అగు నేటి క్రోధి సంవత్సరమంద్దు తాళపాక అన్నమా
చార్యులు అవతరించ్చిన పదారుయేండ్ల
కు, తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహన
శక వరుషంబ్బులు ౧౪౨౪

అగునేంటి దుంధ్ధుభి సంవ్వత్సర పాల్గుణ బ ౧౨ నిరుధానకు తిరు
వేంగళనాథుని మీంద్దను అంకితము
గాను తాళపాక అన్నమాచార్యులు విన్నపము చేశిన శృంగ్గార సంకి్క
ర్తనలు ॥*॥ శ్రీ వేంకటేశాయనమః ॥*॥
శ్రీరాగం ॥పల్లవి॥ యేవూరికే వూరు యెక్కడికినెక్కడ ! నీవు మాకు
నింకనేల నిజమైనాం జెప్పరా॥
అద్దమరాతిరి దాంకా నంద్దు వింద్దు నుండ్డివచ్చి। వొద్దువోరా నీకు నింత్త
వొలశి నొల్లములు। నిద్దుర
గంటికి లేక నీకు నుండ్డవారమా। వొద్దిక చాలనివారముండ్డినా నుండి
తిమి ॥౧॥ వేంకమైన పరితాపవేదనం
బొరలలేకి। కాంకపుట్టి తిరిగేవు కన్నుగానలేక। యేంకట దీరంగ నీకు
నెంద్దరు గలరని। వొంక
ల పులుసు కలువులం బుచ్చవలెనా ॥౨॥ అంద్దగాండ తిరువేంక్క
టాద్రీశ పెక్కొండ్ల। వింద్దవై నీవొకతెపై వెచ్చందన
మున్నదా। మంద్దెమేళమున నీతో మాటలాడితిమిగాక। కంద్దుపమన్నన
చాలు కలకాలమెల్లనూ ॥౩॥ ॥*॥
భైరవి ॥పల్లవి॥ గంద్దము పూసేవేలే కమ్మనిమేనయీ। గంద్దము నీమేని
తావికంట్టే నెక్కుడా ॥-॥ అద్దము చూచే
వేలె అప్పటికప్పటికిని। అద్దము నీమోముకంటే నపురూపమా। వొద్దిక
తామెర విరినొత్తేపు కన్నులు నీ।గద్దరికం
న్నులకంటె కమలము ఘనమా ॥౧॥ బంగ్గారు వెట్టేవేలే పడంతి
నీ మెయినింద్డా. బంగ్గారు నీతనుకాంత్తి వ
తి వచ్చినా। వుంగ్గరాలేంటికి నీ వొడికపు వేళ్ళ। వెంగ్గలిమణులు నీవేలి
గోరంబోలునా ॥౨॥ సవరమెం
టికినే జడియు నీ నెరులకు। సవరము నీకొప్పు సరివచ్చినా। యివలం
జవులు నీకు నేలె వేంక్కటపతి।
సవర నీ కెంమ్మోవి చవి కంట్టేనా ॥౩॥ **

తెలుగు లిపి పరిణామంలో విజయనగరకాలం మరొక ముఖ్యఘట్టం. దానిలో జరిగిన మార్పులు తెలుసుకొనడానికి ముందు శాలంకాయనులకాలం నుంచి 15వ శతాబ్దిదాక కలిగిన పరిణామంసూచించే ఈ పట్టికను పరిశీలనగా చూడండి. (ప్రక్కన)

ఇక యిప్పుడు అన్నమాచార్యుల సంకీర్తనం రాగిరేకు చూడండి అక్షరాలు మన కవులు వర్ణించిన ఆణిముత్యాలలాగ లేవూ ! మార్పులు

చూడండి. క అంతగా మారలేదు. శ్రీనాథునికాలంనుంచి ఇప్పటి క వంటిది, మొదటి కన్నడ మోడి క వంటిది ప్రచారంలో ఉన్నవని ఇదివరకే అన్నాను. త రెండు కొసల సుడులు తీర్చుకుంది. ద కుడిపక్కన విడిపోయినట్టున్న భాగాలు కలిసిపోయాయి. థ ధ లకు కింద నిలువుగీత ఒత్తు చేరింది. ఫ కు పక్కన, కింద హంసపాదులాగ ఉన్న గుర్తు ఫ మధ్యన చేరింది. భ కుకూడ ఒత్తుగా నిలువుగీత మధ్యన వచ్చింది. ఇంతేకాదు. ఖ, ఘ, ఝలవంటి తక్కిన మహాప్రాణాలకూ అంతకుముందులేని నిలువుగీత ఒత్తులు ధ ఫ భల సామ్యంతో కిందిభాగంలో చేరాయి. శ కూడ కొద్దిగా మారింది. హ పూర్తిగా నేటిదే. కిందికొస పెరిగిన క లాగఉన్న శ సరిగ్గా నేటి శ లాగే మారింది. అంటే మొత్తం మీద విజయనగరరాజ్యకాలంలో లిపి స్థిరపడిపోయిందని అచ్చు వచ్చిన తర్వాత కొద్దిగా స్వరూపం మార్చుకుందని మనం నిర్ణయించుకోవచ్చు.

మనకు త్స, జ్స అనే వింత ఉచ్చారణలు ఉన్నాయి. వాటి తెలుప డానికి ఇప్పుడైతే చ, జ పైన – గరిటెలాంటి రెండవ అంకె-౨- గుర్తు కని పిస్తుంది అచ్చులో. కాని ఉత్తరాలు పత్రాలు వ్రాసేటప్పుడు సందర్భాను సారంగా వ్రాసి చదువుకొంటామే గాని ఆ గుర్తులు పెట్టము. ఈ రెండు వింత ఉచ్చారణలకు పూర్వం ఏవైనా వేరే అక్షరాలుగాని గుర్తులుగాని ఉండేవా?

లేవు. తెలుగులో మొదటి వ్యాకరణం వ్రాసిన కేతన పంచవర్గలను చెప్పిన సందర్భంలో 'ఐదు నైదు నైదు' అని ఐదు అక్షరాలతో ఐదువర్గాలు ఏర్పడుతాయని చెప్పాడు చ౽ కూడ ప్రత్యేకంగా ఉంటే చ వర్గంలో ఏడు అక్షరాలున్నవని చెప్పేవాడు కదా! ఈ ఉచ్చారణమాత్రం పాతకాలంనుంచే మనకు ఉన్నట్టుంది. మహారాష్ట్రంలో ఈ ఉచ్చారణ ఉండడాన్ని బట్టికూడ తెలుగులో ఇది ప్రాచీనకాలం నుంచి ఉందనవచ్చు. ఎందుకంటే మహారాష్ట్రం సంస్కృతం నుంచి పుట్టినది. సంస్కృతం నుంచి పుట్టిన హిందీవంటి ఇతర భాషలలో ఈ ఉచ్చారణ లేదు. కనుక ఇది తెనుగునుంచి మహారాష్ట్రంలోకి చేరిఉంటుందని అనుకోవచ్చు. ఆంధ్ర మహారాష్ట్ర కన్నడ ప్రాంతాలు ఎన్నో శతాబ్దులపాటు ఒకే పరిపాలనలో ఉన్న ఇరుగుపొరుగు ప్రాంతాలు. కనుక తెనుగు, కన్నడాలనుంచి ఎన్నోపదాలు, ఉచ్చారణలు మహారాష్ట్రానికి చేరాయి. ఈ చర్చ ఇప్పుడెందుకు? మన కిప్పుడు కావలసింది త్స జ్స ఉచ్చారణలకు ప్రత్యేకంగా అక్షరాలు ఉన్నాయా-అనడమే కదూ! పూర్వం లేవంటే చాలు.

అయితే 17వ శతాబ్దిలో ఉన్న గొప్ప లక్షణకారుడైన కాకునూరి అప్ప కవి "దంత్య చజ గురురలలకు దనరు బొట్లు" అని అన్నాడు. అంటే త్స ఉచ్చారణగల-దంత్య చకారానికి, జ్స ఉచ్చారణగల-దంత్య జకారానికి బండిర-

అకు, పెద్దల-ళకు బొట్లు, చుక్కలు పెట్టాలి. అంటే చ జ లకు పైన చుక్కలు పెడితే త్స జ్స వర్ణాలు, రల లకు పైన చుక్కలు పెడితే ఱ, ళలు అవుతాయి-అన్నమాట. తాటాకు పుస్తకాలలో-అప్పకవికి ముందువి లెండి - అలాటి గుర్తులేవైనా ఉన్నాయేమో చూద్దామంటే. మనకు అతి ప్రాచీనమైన తాళపత్ర గ్రంథాలు దొరకలేదు. శాసనాలలో ఇలాటిదేదీ లేదు. బండిర, పెద్ద లలు ప్రత్యేకంగా ఱ, ళ స్వరూపాలతో కనిపిస్తున్నాయి. మనకు దొరికిన మొదటి తెనుగు శాసనమైన ఎరుకల్ ముత్తరాజు శాసనంలో పదకొండవపంక్తి చూడండి. అటుతర్వాతి లక్ష్మీపురం శాసనంలో బండిరాలు-ఱలు-కొల్లలు. ఇక అప్పకవి చెప్పిన గురులకారం-ళ-భట్టిప్రోలు, సాతవాహన శాసనాలనుంచే విడిగా కనిపిస్తుంది. ర, లలపై చుక్కలు పెట్టి ఱ, ళ లు చెక్కినట్టు ఏ శాసనంలోనూ లేదు. ఈ అక్షరాలసంగతే కాదు అప్పకవి చెప్పిన ఇతరాక్షరస్వరూపమంతా కూడ తనకాలపు అక్షరాలకు మూలస్వరూపమైఉంటుందని భావించుకొన్న ఊహాస్వరూపాలేనని, కనుక అప్పకవి ప్రాచీన లిపి పరిజ్ఞానం లేక ఏదో వ్రాశాడని పండితులు అభిప్రాయపడుతున్నారు.

అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణికి వ్యాఖ్య చేశాడేగాని స్వంతంగా వ్రాయలేదు. దానిలోను 'దంత్య చజౌ, గురురలౌచ బిందు ముతౌ' అని ఉంది-అని కొందరివాదం. శాసనాలలో ఈ స్వరూపాలు కనిపించవనేదే వారికి సమాధానం.

అప్పకవి తర్వాతి తాటాకు పుస్తకాలలోను ఈ గుర్తులు కనిపించవు. అయితే చ, జలపై ఈ గుర్తులు ఎప్పుడు వచ్చాయి ? ఎలా వచ్చాయి ? తెలుగులో అచ్చు ప్రారంభమైనతర్వాత వచ్చాయి. ఇది 19వ శతాబ్దిలో తెలుగుభాషాపోషకుడుగా ఉన్న శ్రీ చార్లెస్ ఫిలిప్ బ్రౌనుగారు చేసిన సంస్కరణ. తెలుగు వారికయితే అలవాటు, సందర్భంబట్టి ఏది చ, ఏది త్స, అని గుర్తులు లేకనే తెలుస్తుంది. విదేశీయులకు ఎలా తెలుస్తుంది? దేశపరిపాలనకోసం విదేశీయులు దేశభాషలను నేర్చుకుంటున్నకాలమది. వారికి సులభంగా, స్పష్టంగా అక్షరజ్ఞానం కలగాలిగనుక బ్రౌను చంద్రుడు, చారణుడులాంటి పదాలలోని తాలవ్య చకారం మొదటిదని, చాప, చలి లాంటి పదాలలోని దంత్యచకారం రెండవదని తెలుపడానికి చ చ జ జ అని అక్షరాలపైన ఒకటి రెండు అని అంకెలువేయడం అలవాటు చేశారు. దీనితో ఒకటవ చకారం చ అని, రెండవ చకారం త్స అని చదువుకొనడానికి వీలయింది.

## తెలుఁగు వ్యాకరణము

### అక్షరలక్షణప్రకరణము.

---

౧ తెలుఁగుభాషకువర్ణములు ఏఁబదిమూఁడు। అ-ఆ-
-ఈ-ఉ-ఊ-ఋ-ౠ*ఌ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-ం-ఁ-ః।
ఖ గ ఘ ఙ-ౘ చ ఛ ౙ జ ఝ ఞ-ట ఠ డ ఢ ణ-త థ ద ధ
ప ఫ బ భ మ-య ర ఱ ల వ శ ష స హ ళ క్ష। అని।

---

ఁ-ఈ అక్షరము-౨ ఇట్లా కూడా వ్రాయుదురు కద్దు

ఈ పద్ధతిని అప్పుడు చెన్నపురిలోని ఫోర్ట్‌సెయింటు జార్జి విద్యాలయం ప్రధానాంధ్రోపాధ్యాయులుగా ఉన్న శ్రీ రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు తమ తెనుగు వ్యాకరణంలోను పొందుపరచారు. అది 1836లో ముద్రితమైంది. దాని మొదటి పుట పైది. చిన్నయసూరిగారి బాలవ్యాకరణం కన్నా 23 సంవత్సరాల ముందే వ్రాసింది. తర్వాత తర్వాత చజలపైన ఒకటోసంఖ్య మరుగై త్స ఉచ్చారణను తెలిపే రెండవ అంకెమాత్రం అచ్చులోను, ఇటీవలి వ్రాత ప్రతులలోను మిగిలింది. కాని నేటి పుస్తకాలలో దాని వాడకం లోపించిందనే అనవచ్చు; సందర్భాన్ని బట్టి చదువుకొనడమే జరుగుతున్నది.

ఱ, ళ లను గూర్చి ఇదివరకే కొంత తెలుసుకున్నాము. ళ అనేది భట్టిప్రోలు కాలంనుంచి క్రమంగా అభివృద్ధి అవుతున్న ప్రత్యేకాక్షరమే గాని ల పైన చుక్క పెట్టడం వల్ల నడమంత్రంగా తయారయింది కాదు. అలాగే ఱ-బండి ర కూడ చాల పాతది. ఇది మనకు శాలంకాయనుల నుంచే-అంటే ఇప్పటికి 16 వందల ఏళ్ళనాటి నుంచే శాసనాలలో కనిపిస్తున్నది. తమిళంలోను అంత ప్రాచీనకాలం నుంచి ఉంది. కన్నడంలోను మన శాసనాలలో కన్నా ముందుగానే ఉంది. మీరు దీనిని—ఱను- మొదటి తెనుగు శాసనమైన ఎఱ్ఱగుడిపాడు శాసనంలోను, తర్వాతిదైన లక్ష్మిపురం శాసనంలోను చూచారు గదా! నేడు ర, ఱ ల ఉచ్చారణ ఒక్కటే అయిపోయింది గాని పూర్వం భిన్నోచ్చారణ ఉండేది కనుకనే విడివిడిగా అక్షరాలు పుట్టాయి. సంస్కృత

శాసనాలలో గ్రామాలపేర్లు వ్రాసేటప్పుడు ఱ వాడేవారు. దీనినిబట్టి రకు ఱకు ఉచ్చారణ వేరుగా ఉండేదని స్పష్టమౌతున్నది కదా!

మన పూర్వులు ఈ రెండిటి ఉచ్చారణ ఎప్పటికప్పుడు వేరని హెచ్చరికతోనే ఉండేవారు కాని వీటి సాంకర్యం అంటే ఒకదానికొకటి వ్రాయడం-ప్రమాదవశాత్తుగా గాని అజ్ఞానవశాత్తుగా గాని జరుగుతూనే ఉండేది. లక్ష్మీపురం శాసనం రెండవ పంక్తిని చూడండి-విట్టజుల అని ఉంది. ఇది విట్రాజుల అని ఉండాలి. రాజు అనే పదం సంస్కృతం నుంచి పుట్టింది. గనుక రయే కాని ఱ కాదు. కాని లేఖకులు, లిపికారులు ర ఱ భేదం కాని, హ్రస్వదీర్ఘ భేదంకాని అంతగా పాటించేవారు కారు. ఈలాటి వచన శాసనాలలోనే కాక నన్నయకు ముందున్న పద్యశాసనాలలోను రకు మారు ఱ వ్రాయడం కనిపిస్తుంది. అద్దంకి శాసనంలో "కొట్టంబు ల్వణ్డెజ్ఞు" లాంటి ప్రయోగాలున్నాయి.

ఇలాగే లకు ళ వ్రాయడం కూడ. పులక చులుకిత అనడానికి మారు పుళక, చుళుకిత అని ళ కారయుతంగా తిక్కనకాలపు శాసనాలలోను, సకల తిమింగిల అనడానికి మారు సకళ తిమింగిళ అని శ్రీనాథుని శాసనంలోను కని పిస్తుంది. ఇవి సంస్కృతపదాలంటారేమో! అహదనకర శాసనంలో లేదు అనడానికి మారు ళేదు అని, ఏలె అనడానికి ఏళె అని ఉన్నది. అయితే ఈ సాంకర్యాన్ని పండితులు అంతగా తప్పని భావించలేదు. కాని ర ఱ ల సాంకర్యం మాత్రం తప్పని భావించారు. కవిత్రయం నన్నయ, ఎఱ్ఱన, తిక్కనలు ఈలాటి సాంకర్యం చేయలేదని వారి నమ్మకం. కనుక తర్వాతి కవులు ఈలాటి సాంకర్యం చేయకుండా 'రేఫ ఱ కార సీసమాలిక' "ద్విరేఫ వర్గ దర్పణము" "రేఫ ఱకార నిర్ణయము" వంటి శాస్త్రగ్రంథాలు బయలుదేరాయి. వీటిలో రేఫ ఱకారాలున్న పదాల జాబితాలు విడివిడిగా ఉంటాయి.

మరి దీనితో ఱ, ళ ల స్వరూపమేమిటో, అవెంత పాతవో కరతలామలకమైంది కదా! కాని నన్నయ తన ఆంధ్రశబ్ద చింతామణిలో "దంత్యా చజౌ గురు రలౌ చ బిందుయుతౌ" అని (చ జ వర్ణాలకు పైన చుక్కలు పెడితే త్స ద్స లు, రల లకు చుక్కలుపెడితే ఱళలు అవుతాయని) చెప్పిన ప్పటికీ, శాసించినప్పటికీ శాసనలేఖకులు పాటించినవారు కారని వాదించే పండితులున్నారు. నన్నయ, శ్రీనాథులవంటి రాజ విద్యాధికారుల ఆజ్ఞలను కాదన గల గుండెలు ఎవరికుంటాయి!

బండిఱ క్రమవికాసాన్ని లిపి పట్టికలో మరొకమారు చూడండి.

## గుణింతాల గమ్మత్తు

గుణింతాల సంగతి, ఒత్తుల సంగతి మరచేపోయానని అనుకుంటున్నారు

గదూ! వినండి మరి! కొంత విసుగ్గా ఉంటుంది ఓర్పుతో వినాలి. అక్షరాలు ఎంతగా మారుతూవచ్చాయో గుణింతాలు వాటికి రెండింతలుగా మారుతూ వచ్చాయి. విచిత్ర మేమిటంటే ఒత్తులు చాలవరకు పూర్వస్వరూపంతోనే ఉండటం.

తలకట్టు అనేది అక్షరం మారుతూ వచ్చినప్పుడు ఏర్పడిన ఆకారమే గాని విడిగా చేరిందికాదని ఇదివరకు గ్రహించిన పరిణామాన్ని బట్టి తెలుసు కున్నాముగదా! కాని అది అకారానికి చిహ్నమనే భావం తర్వాత స్థిరపడింది.

**ఆ** గుణింతం :- అశోకుని శాసనాల్లో అక్షరంపై కొసని చిన్న అడ్డు గీత ఆ (ా)కు చిహ్నం. అశోకుని శాసనం (67వపుట) మొదటిపంక్తి చూడండి. దేవానాం అన్నప్పుడు పైకొసను అంటిపెట్టుకొని చిన్నఅడ్డుగీత ఉంది. ఈగీత అక్షరం కుడిపక్కన మధ్యగా ఉండడంకూడ కద్దు. అశోకశాసనం రెండవపంక్తిలోనే ఆహ మాతాపితిసు అన్నపదంలో ఆమధ్యను, మామధ్యను అడ్డగీత ఉందికదూ! భట్టిప్రోలు శాసనంలోను ఇలాగే అక్షరానికి మొదట్లోనేఅడ్డు గీత ఉంటే దానికి కొంచెం ఏటవాలుగా మరొక అడ్డుగీత ఉంటుంది. భట్టిప్రోలు కరండం చుట్టూ ఉన్న పంక్తి (70 వ పుట) చూడండి. అరహదినానం గోఠియా అన్నపదాలలో నా, యా అక్షరాలు చూడండి నకు మొదటే ఒక అడ్డుగీతఉంది. దానికి ఏటవాలుగా మరొక అడ్డుగీత, యాకుగూడ అలాగే. సాతవాహనుల కాలంలోను చిన్న అడ్డుగీతే దీర్ఘం. ఇక్ష్వాకుల లిపిలో ఒకప్పుడు దాని కుడి కొస కొద్దిగా కిందికి వంగి ఉంటుంది, వట్టి అడ్డుగీతకూడ ఉంది. అమరావతి లోని ఇక్ష్వాకుశాసనం చూడండి (94 వ పుట) మొదటి పంక్తిలో గామే వాథ వస అనే పదంలో గా వా లు ఎలా ఉన్నాయి? రెండవ పంక్తిలోని నా యా బాల కొసలు అవునో కాదో అన్నట్టు వంగి ఉన్నాయికదూ! ఈ వంగిన కొస బాదామీ చాళుక్యలిపిలో మరికొంత పొడవుకావడం కనిపిస్తుంది. తూర్పు చాళుక్యలిపిలో అంటే 6 వ శతాబ్ది మొదలు 10 వ శతాబ్దివరకు రెండు మూడు రకాల దీర్ఘాలు కనిపిస్తాయి. మొదటిది చిన్న అడ్డుగీత. దాని కుడికొసకు కచ్చి తంగా చిన్నవంపు. ఎరికల్ ముత్తరాజు శాసనం చూడండి (100పుట). ఈ శాసనంలో ముత్తరాజుల్ల, కుండికాళ్ళు, పాఙకు మొదలయిన పదాల రా కా పా దీర్ఘాలు చూడండి. లక్ష్మీపురం శాసనంలోని (103వ పుట) 13,14 పంక్తులలో బారనాసి, వేగవిలాళు పదాలలోని వా నా లా లు చూడండి. రెండవ రకం దీర్ఘ చిహ్నం కొనవంపు పొడవు. ఆ వంపు కొసకూడ కొద్దిగా పైకి చూడడం. మూడవది: ఏటవాలుగా పెట్టిన ఇంగ్లీషు ఎస్ (S) లాగో; పూసలదండల

కొక్కెంలాగో ఉండేది. ఇవన్నీ నన్నయనాటి కోరుమిల్లి శాసనంలో చూడండి. (పుట 104). అంతవరకు పొట్టిగా ఉన్న అడ్డుగీత కాకతీయుల కాలానికి పొడు వైంది; వంగిన కొస లోపలికి సుళ్ళు తిరగడానికి చూస్తూఉంది. జాయన సేనాని శాసనం (పుట 107) మొదటి రెండుపంక్తుల వరాహ, భ్రాంత, రంభా పదాలలోని రా భ్రా భా అక్షరాలు చూడండి. రెడ్డిరాజుల కాలానికి దీర్ఘం కొస వంపు లోపలికి బాగా తిరిగింది. శ్రీనాథుని శాసనం (పుట 109) మొదటి పంక్తి లోని శా, కా, ఆరవ పంక్తిలోని వా, ఏడవ పంక్తిలోని ధా, సా, వా చూడండి. తర్వాత విజయనగర కాలానికి వంపు సుడికాస్త బాగా లోపలికి తిరిగిపోయి ఇప్పటిలాగే అడ్డుగీతను తాకింది. అన్నమాచార్యుల కీర్తనరేకులో (పుట 111) మొదటి పంక్తిలోని రామానుజాయనమః అనే పదంలోని రా, మా, జా, లు చూడండి, అటుతర్వాత మార్పేమీ కలుగలేదు అచ్చు వచ్చిన తర్వాత కలిగిన మార్పల్లా దీర్ఘం చివరి సుడి చిన్నదికావడమే.

ఇ:—అక్షరంపై కొసకు అడ్డగీత పెట్టడం ఆ దీర్ఘం సూచించడం కదా! ఈ అడ్డుగీతకొసపై చిన్న నిలువుగీత పెట్టడం ఇకి చిహ్నంగా అశో కుని లిపిలోను, భట్టిప్రోలు లిపిలోను కనిపిస్తుంది. అశోకుని శాసనం రెండవ పంక్తి మొదట్లో మాతాపితిసు అనే పదంలోని తి, పి, చూడండి. భట్టిప్రోలు కరండంమీది వ్రాతలో తిసో, ఫఖికో, కుబిరకో అనే పదాలలోని తి, ఖి, బి చూడండి. అడ్డుగీత కొసను నిలువుగీత వ్రాతతొందరలోనో, చెక్కడంలోని సౌలభ్యంకోసమో ఇప్పుడు మనం ఉకారానికి చిహ్నంగా పెడుతున్న కొమ్ము లాగ కావడమూ కద్దు. భట్టిప్రోలు శాసనం ఆఖరున అకి అనే పదంలోని కి చూడండి. ఈ కొమ్ము సాతవాహనలిపిలో మరింత అందంగా పైకివెళ్ళి కోడి జుట్టులా కుడివైపుకు, ఎడమవైపుకు వాలడం మొదలుపెట్టింది. ఇక్ష్వాకులకాలం నాటికి ఇది మరింత పొడుగై తురాయిలాగ కొస లోపలికి సుళ్లు తిరిగింది. అమరావతి శాసనం మొదటిపంక్తిలో గహపతిస అనే పదంలోని తి చూడండి. గుడి ఎంత ఠీవిగా తురాయిలాగ ఉందో! బాదామీ చాళుక్యుల కాలానికి తురాయి కుడికొస మరింత వంగిపోయి బోర్లించిన గిన్నెలాగ, సున్నలో పై అర్ధభాగంలాగ, ఒకప్పుడు నిండుసున్నలాగను అయింది. తూర్పు చాళుక్యుల లిపిలోను గుడి మొదట్లో నిండుసున్నలాగ కనిపిస్తుంది. కాని ఈ సున్నపైభాగం కొంచెం వెడల్పయింది. ముత్తరాజు శాసనంలో మొదటిపంక్తిలోని స్వస్తి, మూడవపంక్తిలోని నివబున, నాల్గవపంక్తిలోని ఇచ్చిన అనే పదాల స్తి, ని, చ్చి చూడండి. ఈ గుడిసున్నలు కొంచెం కోడిగుడ్డు ఆకారంలో ఉన్నాయి. క్రమంగా పైభాగం వెడల్పయింది. లక్ష్మీపురం శాసనంలో ఐదోపంక్తిలోని

మిరియమ్ము, ఆరోపం_క్తిలోని తొంగరి అనే పదాలలోని మి, రి, రి చూడండి. గుడిపైభాగం కొంచెం అదిమినట్లు లేదూ! ఈ అదిమినట్టున్న పైభాగం మధ్యన నన్నయ కాలానికి ఇప్పటి ల ఒత్తులో ఉన్నట్టు కొంత వంపు ఏర్పడింది. కాకతీయులకాలంలో ఈ వంపు పోయి వట్టి కమాను (ఆర్చి)లాగ అయింది. జాయన సేనాని శాసనం మొదటిపం_క్తిలో జయతి హరి అనే పదాలలోని తిరిల గుడి ఆర్చిలాగ ఉండడం చూడండి. శ్రీనాథుని కాలానికి ఈ ఆర్చి మరి కొద్దిగా వెడల్పయింది. పెదకోమటి వేముని శాసనంలోని నాల్గవపం_క్తిలో విదియ అనే పదంలోని వి, ది అనే అక్షరాలు చూడండి. విజయ నగర కాలంలో ఈ ఆర్చి ఎడమ కొస లోపలికి వంపు తిరిగి ఆర్చిని కలుసు కుంది. అన్నమాచార్యుని కీర్తన మొదటిపం_క్తిలోని శాలి, రెండవ పం_క్తిలోని క్రోధి అనే పదాలలోని లి, ధి చూడండి. ఇప్పటి గుడిలాగే ఉన్నదా? లేదా?

ఈ:-అక్షరం చివరని అడ్డగీత ఇచ్చి, దానికొసన నిలువు గీత ఇస్తే గుడి గుర్తు అన్నాము కదూ మొదట. ఆ నిలువు గీతలు రెండయితే గుడిదీర్ఘం. అశోకలిపిలోను, భట్టిప్రోలు లిపిలోను ఈ పద్ధతి కనుపిస్తుంది. అశోకశాసనం ఐదోపం_క్తిలో పోలాణాపకితీ అనే పదంలోని తీ చూడండి. అడ్డగీత పైన రెండు నిలువు గీతలున్నాయి. ఒకప్పుడు అక్షరం చివరన ఏటవాలుగా రెండు చిన్న నిలువుగీతలు పెట్టడంకూడ కద్దు. ఈ రెండు ఏటవాలు గీతలు క్రమంగా గుండుగా, గుర్రపులాడం లాగానో, పైన కొంచెం సందువదలి వర్తులాకారం గానో మారాయి. ఇక్ష్వాకుల కాలానికి ఈ గుర్రపులాడం గుర్తు ఎడమకొస పొడుగై నేడు మనం ఉకారం సూచించే కొమ్ములాగ మారింది. ఒకప్పుడు పక్కకు నిలబెట్టిన ల వత్తు లాగాను మారింది. అమరావతి శాసనం మొదటి పం_క్తి ఆఖరు అక్షరాలు చూడండి. నన్నయకు ముందున్న తూర్పు చాళుక్య లిపిలో గుడిదీర్ఘం సుడితిరిగిన గ వత్తులాగ మారింది. నన్నయకాలంలో ఈ గ వత్తు కొద్దిగా పైన అదిమినట్టయి ల వత్తుగా మారి దాని పొట్టలో చిన్న 'కామా' వంటి గుర్తు పెట్టినట్టు మారింది. ముత్తరాజు శాసనంలోను, లక్ష్మీ పురం శాసనంలోను మొట్టమొదటి పం_క్తిలోనే ఉన్న స్వస్తిశ్రీ అనే మాటలోని శ్రీ చూడండి. కాకతీయుల కాలానికి గుడి ఆర్చి ఎడమకొస లోపలికి సుడి తిరిగింది. జాయనసేనాని శాసనంలో రెండవ పం_క్తిలోని పృథ్వీ, ఆరోపం_క్తి లోని గౌరీ, పద్నాలుగవ పం_క్తిలోని ఆరభటీ అనే పదాలలోని థ్వీ, రీ, టీలు చూడండి. రెడ్డిరాజుల లిపిలో ఈ కమాను పెద్దదయింది. విజయనగర కాలం లోను ఈ పద్ధతే ఉందనవచ్చు. మ గుడిదీర్ఘం మ పక్క కొమ్ముకు ఇప్పటి లాగే ఇవ్వడం కూడ ప్రారంభమైంది. అంటే ఆ దీర్ఘం గుర్తు కేవలం దీర్ఘం చిహ్నంగా పరిగణించడం ఆరంభమైందన్న మాట. అన్నమాచార్యుని కీర్తన

నాల్గోపంక్తిలో ఆఖరున తిరువేంగళనాథుని మీంది అనే పదంలోని మీ చూడండి. అచ్చంగా ఇప్పటి మీయే కదూ! తర్వాత గుడికి పైన కోడి జుట్టులాగ దీర్ఘం ఇవ్వడం అలవాటయి అచ్చులో స్థిరపడిపోయింది.

**ఉ:-** ఉ గుణింతం సూచించడానికి అశోకుని శాసనాలలోను, భట్టిప్రోలు లిపిలోను అక్షరం కింద నిలువుగీతగాని, అడ్డగీతగాని చెక్కేవారు. పైన అడ్డగీత పెడితే ఆ దీర్ఘం — అయిపోతుందిమరి! కనుకనే అక్షరంకింద ఇవ్వడం. మధ్యన నిలువుగీత ఉన్న అక్షరమైతే ఆ నిలువుగీత కింద కొసకు కుడివైపున అడ్డగీత, మామూలు అక్షరమైతే నిలువుగీత. అశోకుని శాసనంలో రెండవపంక్తిలో మాతాపితిసు సుసూతవియే అనే పదాలలోని సులు చూడండి. కింద నిలువుగీత లున్నాయి. భట్టిప్రోలు కరండం మూతచుట్టూ ఉన్న వ్రాతలో ఆఖరున కుబిరకో అనే పదంలోని కు చూడండి. క అడుగున అడ్డగీత ఉంది కదూ! సాతవాహనుల కాలంలో కిందఇచ్చే నిలువుగీత కొంత వంపు తేలింది. క వంటి అక్షరాలకిచ్చే అడ్డుగీతకూడ ఉంది. అది వంపు తిరగడమూ ఉంది. మరి ఇక్ష్వాకుల లిపిలో కింద పొడుగాటి నిలువుగీత కొస ఎడమ పక్కకు వంగినదిగాని, కుడివైపుకు తిరిగిన కొక్కెం వంటిదిగాని అయింది. అమరావతి శాసనంలో రెండవపంక్తిలో చమునాయ సభాతు కేహి అనే పదాలలోని ము, తు చూడండి. మ కొమ్ము కిందికి దీర్ఘంగా వెళ్ళి ఎడమ వైపుకు మళ్ళింది. తు కొమ్ము కొక్కెంలాగ కుడివైపుకు తిరిగింది. మొదటి తూర్పు చాళుక్యలిపిలో ఉకారానికి కొసలు సమానంగా ఉన్న కొక్కివంటి గుర్తు కనిపిస్తుంది. ముత్తరాజు శాసనంలో రెండోపంక్తిలోని ము, జు చూడండి. లక్ష్మీపురం శాసనంలో పదోపంక్తిలో ఉఋపుటురిబోళ అనే పదంలోని ఋ, పు, టులు చూడండి. నన్నయ కాలానికి ఇక్ష్వాకుల కాలంనాటి పొడుగాటి కొమ్ము, చిన్న కొమ్ము, అక్షరం కుడిపక్కను కిందికి వంపుతిరిగిన చిన్న అడ్డుగీత వంటి గుర్తులు వచ్చాయి. కోరుమిల్లి శాసనంలో మొదటి పంక్తిలోని పురుషోత్తమ అనే పదంలోని రు చూడండి. అక్షరం కుడిపక్కన వంపు తిరిగిన అడ్డుగీత లేదూ! రెండవ పంక్తి ఆఖరులో తస్మాన్మనేః అనే దానిలో న్మ చూడండి. ఇదికూడ రకు ఇచ్చిన కొమ్ములాంటిదే కదూ! మూడో పంక్తి మొదట్లో సుధాంశురుదితో అనే పదంలోని రు చూడండి. ఇక్ష్వాకుల నాటి పొడుగాటి కొమ్ములేదూ! పదోపంక్తి మొదట్లో యమునాతీరే అనే పదంలో ము చూడండి. ఇక్ష్వాకులనాటి కొమ్మే, కాని చిన్నది. కాకతీయుల కాలంలో కొమ్ము అక్షరానికి కిందను, కుడిపక్క కిందను ఉండడం పోయి అక్షరాన్ని అంటిపెట్టుకుని,

పక్కన నేటిలాగ అర్ధ చంద్రాకారం దాల్చింది. రెడ్డిరాజుల కాలంలో కొమ్ము పై కొస కుడివైపు మొగ్గింది. జాయన శాసనం మూడోపంక్తిలో పుళక చుళుకిత అనే పదంలోని పు, చు, ళు చూడండి. కొమ్ముల కొసలు నిటారుగా పైకి చూస్తున్నాయి. శ్రీనాథుని శాసనంలో మొదటి పంక్తిలోని శాకాబ్దములు-సహస్ర మునులు అనే పదాలలోని ము లు, ను, లు చూడండి. కొమ్ములు పైకి వెళ్లి కుడివైపు మొగ్గాయి. విజయనగర కాలంలో కొమ్ము ఇప్పటిలాగ చక్కగా తీర్చినట్టయింది. అన్నమాచార్య కీర్తన మొదటిపంక్తిలో జయాభ్యుదయ శాలి వాహక శక వరుషంబ్బులు అనే పదాలలోని భు, రు, లు, బు, లు చూడండి.

ఊ :- ఉ గుణింతానికి అశోకశాసనాల్లో అక్షరం క్రింద ఒక్క నిలువు గీతగాని, అడ్డగీతగాని ఉంది కదూ! ఊ-ూ-దీర్ఘం తెలుపడానికి మరొకగీత కలిపారు. రెండు నిలువు గీతలుగాని, అడ్డగీతలుగాని ఊ-ూ-నుసూచిస్తాయి. అశోకశాసనంలో రెండవపంక్తిలో సుసూసితవియే అనే పదంలోని సూ కింద రెండు నిలువుగీతలు చూడండి. కూ వ్రాయవలసివస్తే క కింద రెండు అడ్డ గీతలన్నమాట. భట్టిప్రోలు వ్రాతలలో ఈ రెండు నిలువుగీతలు చేయి తిరుగుడులో కాబోలు హంసపాదంలాగ మారిపోయాయి. కరండం వ్రాతలోని ఆరో వరుసలో ఓఖబూలో, కరండం గొంతుచుట్టూ ఉన్న వ్రాతలో మజూస అనే పదాలలోని బూ, జూ అనే అక్షరాలు చూడండి. అక్షరాల కింద హంస పాదాలలాగ లేవూ! ఈ హంసపాదం కుడికొన సాతవాహనులకాలంలో పొడుగై ఎడమవైపు మళ్లింది. ఇక్ష్వాకుల కాలంలో హంసపాదు కుడికొన మరింత పొడుగై ఎడమవైపు తిరిగింది రెండు అడ్డగీతలుగా. మరొక చిహ్నంలో రెండు అడ్డగీతలూ కొద్దిగా కుడివైపు వాలాయి. పశ్చిమ చాళుక్యుల కాలానికి ఇక్ష్వాకులనాటి పొడుగాటి కొమ్ము, పైకొస ఇంగ్లీషు ఎస్‌లాగ దీర్ఘ సూచకంగా వంపుతిరిగింది. కొన్నిచోట్ల కొమ్ము కుడివైపుకొన మరొకవంపు తిరిగి కొంచెం ఇప్పటి స వత్తులాగ అయింది. తూర్పు చాళుక్యుల లిపిలో కొమ్ము కొసను కొద్దిగా పొడిగించినట్టు, ఇప్పటిలాగ చిన్న దీర్ఘమిచ్చినట్టు, కొద్దిగా యావత్తు ఆకారంతోను - మూడురకాలుగా మారింది. కోరుమిల్లి శాసనంలోని రెండోపంక్తిలోని స్వయంభూః, మూడోపంక్తి ఆఖరున సుధా సూతేః అనే పదాలలోని భూ, సూ చూడండి. కొమ్ముకొన పొడుగించగా, ఏట వాలుగా పెట్టిన "ఎస్" లాగ లేదూ! కాకతీయులకాలంలో ఈ "ఎస్" పక్కకు పూర్తిగా వాలిపోయినట్టు మారింది. అంటే ఇప్పటి కొమ్ముదీర్ఘానికి-ూకు-దగ్గరగా వస్తున్నామన్న మాట. జాయన సేనాని శాసనం ఐదోపంక్తిలోని పూరై రపూరి అనే పదంలోని పూ అక్షరం చూడండి. ప పక్కన "ఎస్" వాల్చిపెట్టి

నట్టులేదూ! రెడ్డిరాజులకాలానికి కొమ్ము దీర్ఘం పెరిగి లోపలికి సుడి తిరిగింది. శ్రీనాథునిశాసనం ఆరోపంక్తిలో శుభముహూర్తంబున, తొమ్మిదోపంక్తిలో భూపాలు ననుంగుంబుత్రి అనే పదాలలోని హూ, భూ లు చూడండి. దీర్ఘాలసుళ్లు కొమ్మును మించిపోయాయి. విజయనగర కాలానికి కచ్చితంగా ఇప్పటి కొమ్ము దీర్ఘం రూ ప్రారంభమైందన్న మాటే. అన్నమయ్య కీర్తన పదకొండో పంక్తిలో కాలమెల్లనూ అనే పదంలో నూ చూడండి దీర్ఘపు వర్తులం ఇప్పటిదానికన్న కొద్దిగా పెద్దది. అంటే రెడ్డిరాజుల కాలంలోని దీర్ఘంకొన లోపలికి సుడితిరిగి పైగీతను అందుకొని సున్న ఆకారం పొందిందన్నమాట.

మరొకసంగతికూడ చెప్పాలి. కాకతీయుల కాలంవరకుకూడ ప, ఫ, వలకు కొమ్ము, కొమ్ముదీర్ఘము తక్కిన అక్షరాలకిచ్చినట్టే కుడిపక్కన ఇచ్చే వారు. జాయన సేనాని శాసనం ఐదోపంక్తిలో పూర్తై రపూరి అనే పదాలు చూడండి. పూ వర్ణం కొమ్ముదీర్ఘం పొక్కిలిలో కాక కుడిపక్కన లేదూ! ఇలా ప వర్ణానికి ఇవ్వడం వల్ల ఫ అనే భ్రాంతి, వకారానికి ఇవ్వడం వల్ల మకార భ్రాంతి కలిగిందేమో! కనుక రెడ్డిరాజులకాలంనుంచి ఈ మూడక్షరాల కొమ్ములూ పొక్కిలిలో ఇవ్వడం ప్రారంభమైంది.

**ఋ** :- రెండువేలఏళ్ళనాటి శాసనాల్లో ఋ గుణింతానికి అక్షరం కుడి వైపు కిందికొసను ఒక వంపు నిలువుగీతతో సూచించేవారు. దీని ఉచ్చారణ ప్రాకృతంలో లేకపోవడంవల్ల కాబోలు సాతవాహన, ఇక్ష్వాకు శాసనాలలో ఇది కనిపించదు. కాని సంస్కృత శాసనాలు పడడం ప్రారంభమైన తర్వాత కనిపిస్తుంది. ఉషవదాత శాసనాలలో ఇది చూడవచ్చు. పశ్చిమ చాళుక్యుల నాటికే ఇప్పటి వట్రసుడి (వట్రువసుడి) రూపం తయారయిందనవచ్చు.నన్నయ కాలానికి ఈ వట్రసుడిని అక్షరం అడుగున వ్రాసేవారు. కోరుమిల్లి శాసనం ఎనిమిదోపంక్తి మధ్యనుగల తస్మాదృక్షకః అనే పదంలోని దృ చూడండి. ద అడుగున వట్రసుడి చేరిపోయింది. కాకతీయులకాలంలోను, రెడ్డిరాజుల కాలంలోను ఈ సుడి పెద్దదయింది. కాని అక్షరం అడుగును అంటిపెట్టుకొనే ఉండేది. జాయన సేనాని శాసనం ఎనిమిదోపంక్తిలో గంగా మృణాళాంకురః అనే పదంలోని మృ చూడండి. వట్రసుడి లోపలికి సుడులుపోయి మకారాన్ని మోస్తున్నట్టు కనిపించదూ అంటిపెట్టుకొని? విజయనగర లిపిలో వట్రసుడి అక్షరాన్ని అంటిపెట్టుకొని ఉండడం మాని విడిగా పక్కన మోసులెత్తింది. అన్నమాచార్యుల కీర్తన ఐదోపంక్తిలో శృంగార సంకీర్తనలు అనే పదంలోని శృ చూడండి. వట్రసుడి విడిపోయి, శ కిందినుంచి బయలుదేరి పక్కన నిలిచింది.

ఋకారోచ్చారణ విశిష్టంగా ఉంటుంది; అటు రు కాదు, ఇటు రి కాదు, ఈ రెండింటికి మధ్యస్థంగా ఉంటుంది. కనుక పలకడం కష్టం. అందువల్లనే మనదేశంలో దీనిని వివిధ ప్రాంతాలవారు విధవిధాలుగా పలుకుతారు. ఉత్తర భారతంవారంతా రి లాగ పలుకుతారు. దక్షిణ భారతంవారు-అంటే మహారాష్ట్ర, ఆంధ్ర, కర్ణాటక ద్రావిడులు రు గా పలుకుతారు. ఇక ఓఢ్రులు, వంగవాసులు అరు అంటారు. ఈ మూడు ఉచ్చారణల్లోను రి ఉచ్చారణే ప్రాచీనమని పెద్ద లంటారు. ప్రాకృతంలో ఋ రరిరు అవుతుంది. (ఋణపర్ణ, రణ పణ్ణ, రిణవణ్ణ; మృగ-మిగ-మగ-ముగ) మన ఛందశ్శాస్త్రంలో ఋకారానికి ఇ, ఏలకు యతి మైత్రి ఉంది. ప్రాకృత సంప్రదాయంతో వచ్చిన రి ఉచ్చారణనే మనవారు గ్రహించి యతి మైత్రి కల్పించుకొన్నారన్నమాట, ఉచ్చారణ రు గా ఉన్నప్పటికీని.

పూర్వపు శాసనాల్లో సంస్కృతభాగం చెక్కేటప్పుడు వ్రటసుడిని బాగానే పాటించేవారు కాని తెనుగుపద్యాలు, భాగాలు చెక్కడంలో రిగానో, రుగానో చెక్కడం మామూలని తోస్తుంది. శ్రీనాథునిశాసనం ఎనిమిదోపంక్తిలోని గ్రిష్టవేణ్ణా జలక్రీడా వినోదుండు అనే వాక్యంలో కృష్ణ అనడానికి మారు క్రిష్ణ అనే చెక్కి ఉంది. శ్రీనాథుడు తననుగురించి శాసనాలలో

"విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమ భూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం"

అనే మాటలు చెప్పుకున్నవాడు, ఇంతమాత్రం ఎరుగడా అని ఆక్షేపిస్తారేమో! అప్పటి శిల్పికి వ్రటసుడి తెలియదనడానికి వీలులేదు. ఈ శ్రీనాథుడే రచించిన ఫిరంగిపురం శాసనంలో తృషితాః మృగపక్షి మనుష్యాః, ప్రనృత్యంతి అనే పదాలలో స్పష్టంగా వ్రటసుడి చెక్కిఉంది. కాని మనకు సహజంగా రు ఉచ్చారణే వ్యాప్తి పొందింది. కవులుకూడ ఉచ్చారణనుబట్టి కృష్ణుకు అనడానికి మారు క్రుష్ణుడు అని క్రావడి కొమ్ము వ్రాయడం ప్రారంభించారు. దానితో అప్ప కవివంటివాడు భాష భ్రష్టమైపోతుందని గాభరాపడి ఏవి ఋకారం ఉన్న పదాలో, ఏవి కొమ్ము క్రావడులో పెద్ద జాబితా యిచ్చి, అలాటి పొరపాట్లు చేయవద్దని హెచ్చరించవలసివచ్చింది.

ఏ: - అశోకలిపిలోను, భట్టిప్రోలులిపిలోను అకారదీర్ఘం గుణింతం చూపే గుర్తు అక్షరంపై చివరనో, మధ్యనో కుడివైపున అడ్డుగీతకదూ! ఏకారం చూప డానికి అక్షరం ఎడమకొనకు అడ్డుగీత పెట్టారు. అశోకుని శాసనం మొదటి పంక్తిలోని సేహేవం దేవాణం పియే అనే మొదటివాక్యం చూడండి, సహద

యలకు ఎడమవైపు కొనను చిన్న అడ్డగీతలున్నాయి కదూ! భట్టిప్రోలు వ్రాతలో మొదటిపంక్తిలోని నేగమా, మూడోపంక్తిలోని జేతో, నాల్గోపంక్తిలోని రేతో అనే పదాలలో నే, జే, రే లు చూడండి. జకు వెనుక మధ్యన అడ్డుగీత. సాత వాహనుల కాలంలోను ఇదే పద్ధతి. ఇక్ష్వాకుల లిపిలో ఈ అడ్డగీత కొద్దిగా వంపు దేలింది. అమరావతి శాసనం రెండవవరుసలో రే, కే లు చూడండి. పశ్చిమ చాళుక్యలిపిలోను, ఆరోశతాబ్ది తూర్పు చాళుక్యలిపిలోను ఈ అడ్డగీత ఎడమకొస కొంచెంగా వంగింది. మరికొన్నిచోట్ల ఈ వంపు బాగా కనిపిస్తుంది. ముత్తరాజు శాసనం చివరి పంక్తిలోని నేల, లక్ష్మీపురంశాసనం నాల్గోపంక్తిలో రెన్డువటి, ఆరోపంక్తిలో ఆెంగరి, ఎనిమిదో పంక్తిలో పదేన్డుంబు పదాలలోని నే, రె, ఆె, దే, లు చూడండి. అడ్డగీత ఎడమకొస బాగా వంగి, తిప్పి వ్రాసిన అకారదీర్ఘంలాగ కనిపిస్తుంది. నన్నయకు ముందు, ఆయనకాలంలోను ఉన్న లిపిలో ఈ ఎడమకొస అడ్డగీత పైకిమళ్ళి కుడివైపు వచ్చి మరల పైకి తల ఎత్తింది. కోరుమిల్లి శాసనంలోని ఏత్వంతోఉన్న అక్షరాలు చూడండి. ఇది కాకతీయుల కాలంలో చిన్న ఇంగ్లీషు 'ఎస్' లాగ మారింది. జాయన శాసనం ఐదోపంక్తిలో హేరంబ, పదోపంక్తిలో విజయతే అనే పదాలలో హే, తే చూడండి. రెడ్డికాలపు లిపిలో ఈ వంపు తిరిగిన కాకతీయుల ఏత్వం నిటారుగా నిలబడినట్లు కనిపిస్తుంది. శ్రీనాథుని శాసనంలో ఎనిమిదో పంక్తిలోని క్రిష్ణవెణ్ణ, పదకొండో పంక్తిలోని దేవి, పదిహేనోపంక్తిలోని దేశ అనే పదాలలోని వే, దేలు చూడండి. చిన్న 'ఎస్' ఒంటికాలిపై నిటారుగా నిలిచినట్టుంది. విజయనగరకాలంలో ఈ నిటారుకొమ్ము చిటారుకొస వెనక్కు తిరిగి పెరిగింది. తర్వాత తర్వాత కిందిభాగం తగ్గిపోయి పైభాగం మిగిలి నేటి ఏత్వమైంది.

ఐ:- అక్షరం వెనుక ఒక్క అడ్డగీతయితే అశోక భట్టిప్రోలు కాలాలలో ఏత్వం; రెండు అడ్డగీతలయితే ఐత్వం. ప్రాకృతంలో ఐ, ఔలు లేవు గనుక సాతవాహన, ఇక్ష్వాకురాజుల శాసనాలలో ఈ రెండక్షరాలు కనిపించవు. పశ్చిమ చాళుక్యులకాలంలో ఈ రెండు అడ్డగీతల కుడికొనలు కలుసుకొని పక్షిముక్కులాగ తయారయాయి. నన్నయకాలంలో ఏ గుణితంఉన్న అక్షరానికి కుడిపక్కన అంటిపెట్టుకొని అరసున్నవంటి గుర్తు ఐత్వంసూచించేది. కోరుమిల్లి శాసనం ఐదోపంక్తిలో త్సైన్యయాతి, ఏడోపంక్తిలోని తస్మాదైశానకః అనేపదాలలోని త్సై, దై చూడండి. అక్షరాలకింద అంటిపెట్టుకొని అరసున్నవంటి గుర్తులేదూ ! ఈ కింది అరసున్న కొస కాకతీయులకాలానికి పొడుగై

నేటి ఐత్వానికి దారితీసింది. జాయన శాసనం ఐదోపంక్తిలో పూర్వై అనే పదం లోని రై చూడండి. రెడ్డిరాజులలిపిలో ఈ ఐత్వం అక్షరాన్ని అంటిపెట్టుకొనడం మాని, విడిపోయింది. శ్రీనాథుని శాసనం మూడోపంక్తిలో నైన, పద్దెనిమిదవ పంక్తిలో కైరవంబు అనే పదాల నై, కై చూడండి. విజయనగరం కాలానికి ఇప్పటి రూపంలోనే ఐత్వం ఉంది. అన్నమాచార్యుల సంకీర్తన మూడో పంక్తిలో ప్రత్యక్షమైతేను, ఎనిమిదో పంక్తి అఖరున వెంకమై అనే మాటల లోని మై చూడండి. ఇప్పటి దానికీ, దానికీ ఏమైనా తేడా ఉందా ?

ఓ:— అశోకలిపిలో ఓ గుణింతం చూపడానికి ఆకారంగుర్తును. ఏకారం గుర్తునూ కలిపారు. అంటే అక్షరం చివర ఎడమవైపు కుడివైపు అడ్డగీతలు పెడితే ఓత్వ మన్నమాట. ఇప్పటి 'ౚ' స్వరూపం రెండువేల ఏండ్లకిందే కనిపిస్తున్నట్టులేదూ! అశోక లిపిలో ఈ రెండు అడ్డగీతలూ ఒకప్పుడు ఎగుడు దిగుడుగానూ ఉండడం కద్దు అశోక శాసనం ఐదో పంక్తి మొదట్లోనే ఏసా పోరాణా పకితీ అనేవాక్యంలో పో కొసచూడండి. ప వెనుక చిన్న అడ్డ గీత, తర్వాత కొంచెంపైగా కుడివైపున అడ్డగీత. భట్టిప్రోలు వ్రాతలలో ఓత్వం అటూ ఇటూ పెద్దఅడ్డగీతగా కనిపిస్తుంది. రెండో వరుసలో వఛో, చఘో అనే పదాలలోని ఛో ఘో చూడండి. సాతవాహనులకాలం అక్షరానికి కొసనో, మధ్యనో అటూ ఇటూ అడ్డుగీతలు ఇచ్చేవారు. ఇక్ష్వాకులకాలంలో ఈ రెండు అడ్డుగీతల మధ్య కొద్దిగా వంపు - లోపలికి అదిమినట్టు-వచ్చింది. పశ్చిమచాళుక్యుల కాలంలోను, తొలిరోజుల తూర్పు చాళుక్యుల లిపిలోను మధ్య వంపువచ్చిన ఓత్వం కుడికొస కిందికి దిగింది. లక్ష్మీపురం శాసనం మొదటిపంక్తిలోని మంగిదొగ, ఐదవ పంక్తిలోని బోళ అనే పదాలలోని దొ, బో లను పరిశీలించండి. పక్షులు రెక్కలు విచ్చుకున్నట్టు లేదూ ! నన్నయ నాటికి ఈపక్షి రెక్కలలాంటి దాని కుడికొస పొడుగయింది. అక్షరానికి ఎత్వం పక్కన కొమ్ము ఇవ్వడంకూడ బయలుదేరింది. ఓత్వ చిహ్నంలో రెండు భాగాలున్నాయి కదూ ! ఒకటి వెనుక, మరొకటి ముందు ఇవ్వవలసినవి. య, మ వంటి అక్షరాలకు ఒత్వం 'ా' ఈ విధంగా ఇవ్వడం పడదు; కొమ్ము అడ్డుతుంది. కనుక ఏత్వం, కొమ్ముకు దీర్ఘం ఇవ్వటం అలవాటయింది. కనుక ఓత్వం నన్నయకాలంలో రెండు మూడు రకాలుగా కనిపిస్తుంది. కాకతీయుల కాలానికి పాత రెండు రకాలు వచ్చాయి. జాయనసేనాని శాసనంలో నాల్గోపంక్తిలో సంచయ స్తోయరాశిః, ఆరోపంక్తిఅఖరులో రహస్యోత్సవ అనే పదాలలోని స్తో ఓత్వం, స్యోలోని ఓత్వం పరిశీలించండి. రెడ్డిరాజుల కాలానికికూడా ఈ రెండు పద్ధతులూ వచ్చాయి. శ్రీనాథుని శాసనం

నాల్గోపంక్తిలో విరోధి, ఎనిమిదో పంక్తిలో క్రీడావినోదుండుఅనే పదాలలోని రో, నో లు చూడండి. రెండురకాలూ ఉన్నాయి. విజయనగర కాలంలోను ఇవి అలాగే వచ్చాయి. అచ్చు వచ్చిన తర్వాత మొ, యొ, హొ వంటి కొన్నిటికి మినహాగా తక్కినవాటికి "ా" గుర్తు పెట్టడమే రూఢమైంది.

**ఔ:**— ఔ గుణింతం ప్రాచీన ప్రాకృతశాసనాలలో లేదని ఇదివరకే తెలిపాను. పశ్చిమ చాళుక్యులకాలంలో ఇది ఎదో ఒంటెమెడలాగ, జిరాఫీమెడ లాగ ఉంది. ఇది నన్నయకాలానికి ౧ల వత్తును ఏటవాలుగా పెడితే ఎలా ఉంటుందో అలా మారింది. కోరుమిల్లి శాసనం ఏడో పంక్తి మధ్యన మహా భౌమః అనే పదంలో భౌ చూడండి. '౧' వంటి గుర్తుమీద ఏదో చిన్న బుడప (బొప్పి) లాగ కనిపిస్తుంది. తిక్కన కాలానికి ఈ లావత్తు ఎడమకొస పెద్దవంపు దేరింది. జాయన సేనానిశాసనం ఆరోపంక్తి చివరి గౌరీ అనే పదం లోనే చూడండి. శ్రీనాథుని కాలానికి ఇప్పటి 'ౌ' వంటిది ఔత్వంచిహ్నం. అంటే తిక్కనకాలపు వంపుదేరిన ఔత్వం అణిగిపోయిందన్నమాట. మ, హ, య వంటి అక్షరాలకు ఔత్వమిచ్చే పక్షంలో కొమ్ములకు ఓత్వమిచ్చి, అక్షరానికి ఎత్వమిచ్చేవారు. శ్రీనాథుని శాసనం పదిహేడోపంక్తిలో శివమౌళిబాలేందు అనే పదంలోని మౌకు ఔత్వం కొమ్ముకు, మపైన ఎత్వంకూడ ఉన్నాయి. పద్దెనిమిదో పంక్తిలోని కౌముదీ అనేమాటలో క పైని పెద్ద ఐకారం వంటి ఔత్వం ఉంది. విజయనగర కాలానికి ఇది కొంత మారింది. ఔత్వంకుడివైపున పెచ్చుగా కనిపించే అరసున్నవంటి భాగం పోయింది.

ఏ, ఐ, ఓ, ఔ ల గుణింతం చెప్పావుగాని, ఎ, ఒల గుణింతం చెప్పలేదేమని ప్రశ్నిస్తారుగదూ! నిజమే. మనలిపిమాల ప్రాకృతాన్ని, సంస్కృతాన్ని అంటిపెట్టుకొని వచ్చినందున వాటిలో ఎ, ఒలు లేనందున మనకు కూడ మొదట్లో ఎ, ఏలకు, ఒ ఓలకు భేదం లేదు. మన శాసనాలలోను తక్కిన వ్రాతలలోను కూడ ఈ విషయంలో హ్రస్వదీర్ఘాలు పాటించడం కనబడదు. సందర్భాన్ని బట్టి హ్రస్వంగాను, దీర్ఘంగాను చదువుకోవలసి ఉండేది. ఒక్క ఎ, ఒ ల విషయంలోనేకాదు. ఇతర అక్షరాల హ్రస్వదీర్ఘాలూ అంతగా పాటించబడేవికావు. లక్ష్మీపురం శాసనం చూడండి. కాని, అన్నమాచార్యుల కీర్తనలు చెక్కడంలో ఒక పద్ధతి అనుసరించినట్టు తోస్తుంది. ఎ గుణింతం తెలుపడానికి మామూలు ఎత్వం, ఏ (దీర్ఘం) తెలుపడానికి ఎత్వంలోపలికి సుడి తిప్పడం. అన్నమాచార్యుల కీర్తనకిందనుంచి మూడోపంక్తి చూడండి. వెంగలిమణులు నీ వేలిగోరం బోలునా అనే వాక్యంలో వెంగలిలోని ఎత్వం మామూలుగా ఉంది. వేలిలోని వే లోపలికి సుడి తిరిగింది. అయితే ఒఓల విషయంలో ఈ సూత్రం

స్పష్టంగా చెప్పడానికి వీలులేదు. ఏమైనా 16 వ శతాబ్దివరకు ఎఏ, ఒఓల హ్రస్వదీర్ఘ భేదం పాటించినట్టు కనబడదు. చెదురుగా మాత్రం కనిపిస్తుంది. తర్వాత తర్వాత ఎత్వం మీదికి ఒత్వంమీదికి గుడిదీర్ఘంవంటి గుర్తు వచ్చింది. గుడిదీర్ఘం లోపలికి సుడి తిరగడం కదా! ఆ సుడి దీర్ఘమనే సంతృప్తి కలిగించలేకపోయింది. కనుక ఆ సుడినుంచే పాము పడగలాగ దీర్ఘం పైకి లేచింది. గుణింతాల మార్పు స్పష్టంగా తెలుసుకొనడానికి క్రింది చిత్రం చూడండి. అవి అసలు అక్షరాల కన్నా ఎంత వింతగా మారాయో!

అశోక, భట్టి

సాత వాహన

ఇక్ష్వాకు

పశ్చిమ చాళుక్య

తూర్పు చాళుక్య

కాక తీయ

రెడ్డి

దీనిని చూచినమీదట, గుణింతాలంటే అచ్చులో భాగమేకదా, అచ్చుల ఆకారం కొంతైన ఉండాలికదా, పాత అచ్చులకుగాని, నేటి అచ్చులకు గాని ఈ గుణింతాలతో పోలికలేదే! - అని సందేహం వస్తుంది కదూ! నిజమే. ఈ గుణింతాలను మనం అచ్చులకు ప్రతినిధులుగా భావిస్తున్నప్పటికి ఇవి వాటి నుంచి పుట్టుకువచ్చినవి కావని, మనపూర్వుల మనస్తత్త్వం పనిచేసిందని నా

అభిప్రాయం. మన స్తత్వమంటే ఉచ్చారణ సమయపు నాలుక పెదవులు మొదలయినవాటి పరిశీలన. ఆ అన్నప్పుడు నోరుతెరిచి ఏదో పొడిగించడానికి, ముందుకు పోవడానికి యత్నిస్తున్నట్టు ఉంటుంది. దానికి గుర్తుగా అక్షరం పై కొసకు ముందు గీత పెట్టారు మనవారు. ఇ అనేటప్పుడు దవడలు, సెలవులు వెనక్కు కుంచించుకొంటాయి. కనుక అడ్డగీత పైన నిలువుగీత-సంకోచానికి చిహ్నంగా. అది క్రమంగా వెనక్కు మళ్ళడం కూడా సంకోచచిహ్నమే. దవడలు వెనక్కులాగినట్టే వెనక్కు ముడుచుకు పోతూ వచ్చింది. ఈ పలికేటప్పుడు సెలవులు దవడలు వెనక్కుపోతూనే మరెక్కడికో లోపలికి వెళ్ళినట్టు ఉంటుంది. దానికి సూచన గుడి లోపలికి మరొక సుడితిరగడం. ఉ అన్నప్పుడు పెదవులు ముందుకుసాగుతాయి; లోపలికి అదిమి పెట్టినట్టు ఉంటుంది. దీనికి సూచనే అక్షరంకింద, కిందవైపు పక్కన గీతలు. ఊ అన్నప్పుడు దానిని పొడిగించారు. ఋ అన్నప్పుడు నాలుకకొస మలుపులు తిరుగుతుంది. దానికి గుర్తే వట్రసుడి. ఏ అన్నప్పుడు పైకి లేదా వెనక్కు వెళ్ళినట్టవుతుంది. కనుక అక్షరం పై భాగం వెనుక, దానిని పైకి లేపుతున్నట్టు గుర్తు. ఐ అన్నప్పుడు పైకి లేచి వెనక్కువెళ్ళి కిందికి పడినట్టవుతుంది. కనుక ఐత్వంగుర్తు వెనుక-కింద ఉంది. ఓ అన్నప్పుడు పైకి తేలిపోయినట్టవుతుంది. మరి దీని గుర్తు అక్షరంపైన తరంగాలలాగ, రెక్కలలాగ కాక మరేమవుతుంది? ఔ అన్నప్పుడు పైకి తేలిపోయి కిందికి తిష్ఠవేసినట్టు అవుతుంది. కనుక పైకిపోయి కిందికి వంగినట్టు ఔత్వం గుర్తు. ఇదంతా నా ఊహే సుమా!

అచ్చుల రూపం ఆదినుంచీ ఎలా మారుతూ వచ్చిందో చెప్పానుకదూ! ఇంతకుముందు మీరు అ ఆల పరిణామం తెలుసుకున్నారు. ఇ ఈ ఉ ఊ ఋ కారాల పరిణామం చూస్తే అచ్చులూ, అచ్చుల చిహ్నాలైన గుణింతాలూ ఎలా వేర్వేరుగా మారుతూ వచ్చాయో తెలుస్తుంది.

అశోకునికాలానికి ఇ పొయిగడ్డలవలె ∵ మూడుచుక్కలు మాత్రమే. పై చుక్క వ్రాసే తొందరలో చిన్న అడ్డగీతగా మారింది. తర్వాత అది వంపు దేరి ఇప్పటి తెలుగు ന ల ఒత్తుకు రెండు కొసలలోను రెండుచుక్కలు పెడితే ఉంటుందో అలా అయింది. ఎరికల్ ముత్తరాజు శాసనం నాల్గోపంక్తి రెండో అక్షరం చూడండి. లక్ష్మీపురం శాసనం నాల్గోపంక్తి రెండో అక్షరం చూడండి. వ్యాకరణాలవల్ల వచ్చే ఆగమాలను, ఆదేశాలను మనవారు అప్పుడు వ్రాతలలో అంతగా పాటించలేదు గనుక యకు గుడి ఇచ్చి యి అని వ్రాయడానికి మారు అచ్చు ఇకారమే వ్రాశారు. కింది కొసలలోని రెండు చుక్కలూ క్రమంగా వ్రాత ఒడుపులో కలిసిపోయి నన్నయకాలానికిముందే ఇప్పటి రూపానికి మారింది; క్రమంగా కుడివైపు కొస పెరిగింది.

ఈకారం రకు మధ్యన అడ్డుగీత ఇచ్చినట్టుకదూ నేడు వ్రాస్తున్నాము. నిలువుగీతగా ఉన్న ర క్రమంగా నడుము బలిసి అనుస్వారాకారం దాల్చినట్టే ఈకారంకూడ మారుతూవచ్చింది. సాతవాహనులనాడు ఒక్క నిలువుగీతకు అటు ఇటు చెరిఒక చుక్క పెడితే ఈ . | . ఇప్పటి భాగిహారం గుర్తును నిలువుగా పెట్టడం అన్నమాట. నన్నయకు పూర్వమే ఈకారంలోని నిలువు గీత నిలువు గడిగా మారింది. తర్వాత పక్కన అటూ ఇటూ రెండు చుక్కలు. ఈ చుక్కలు వ్రాసేఒడుపులో అడ్డుగీతగా మారాయి. అది క్రమంగా నేటి చక్కని రూపం తీర్చుకొని, చూచారా నా ఠీవి అన్నట్టు మెడ తిప్పుకొని తలెత్తి చూస్తున్నది.

ఉకారంలో పెద్ద మార్పు లేవనే అనవచ్చు. అశోకునికాలంలో |__ ఈ విధంగా ఉన్న ఉకారం వ్రాసే వేగంలో ఇప్పటి పెద్ద అకసున్నలాగ మారింది మొదట్లో. లక్ష్మీపురం శాసనం పదవ పంక్తిలోని "ఉరువుటురిబోళ" అనే పదంలోని ఉ చూడండి. అర్ధచంద్రాకారంగా లేదూ! ఈ అర్ధచంద్రాకారం వ్రాసేటప్పుడు కచ్చితంగా వ్రాయడం పడుతుందా? పైనుంచి వ్రాసేటప్పుడు పై కొస కొద్దిగా తలయెత్తింది. అది క్రమంగా కొమ్ములాగ నిలిచింది. కింది భాగం వ్రాయసంవారి కళాదృష్టితో రెండు మలుపులుగా రూపం దాల్చింది.

ఊ దీర్ఘం ఎలా అయిందనుకున్నారు? ఈకారంలోని అడ్డుగీత చూచారు గదా! ఎలా వచ్చింది? రెండు చుక్కలను ఒడుపుగా పెట్టడంలో కదూ! దాని సాదృశ్యంతోను, దీర్ఘానికి పొడుగాటి గీత అవసరమనే దృష్టితోను ఉకారం మధ్యన అడ్డుగీత పెట్టి లాగి, తల తిప్పారు. ఊ దీర్ఘం అయింది.

ఋకారం అశోకశాసనాల్లో కనిపించదు. ఎందుకంటే, ప్రాకృత భాషలో ఋకారోచ్చారణ లేదు గనుక, ప్రాకృతంలో ఇది ర, రి, రు లుగా మారుతూ వచ్చింది. ఈ ఋకారం 6 వ శతాబ్దినాటి "ఉష్ణీష విజయధారిణి" అనే గ్రంథం వ్రాతప్రతిలో తొలిసారిగా ఇప్పటి దేవనాగరి ఆకారంలో కనిపిస్తున్నది. కొందరు దీనిని వ్రాయడానికి నిలువుగీతగా ఉన్న రకు పక్కన కొమ్ము ఇచ్చేవారు. ర నిలువుగీతనుంచి గడిలాగ మారడంతో ఋ తల కట్టు లేని రకు కొమ్ము ఇచ్చినట్టు మారింది. వ్రాసే తొందరలో మొదటి ర వర్ణం గడి చిన్నదైపోయింది. దానితో తర్వాతి వారికి ఇది బకారమనే భ్రాంతి కలిగి ఉంటుంది. దానికి మరొక కొమ్ము ఇచ్చినా బు అయి మరింత భ్రాంతి కలిగిందేమో! ఆ భ్రాంతి పోగొట్టటానికి మరొక కొమ్ము ఇచ్చారు. ఋ అయింది. 10 వ శతాబ్ది నాగరీలిపిశాసనాలలోను, 11 వ శతాబ్దపు గాంగవంశ రాజుల శాసనాలలోను ఇది దేవనాగరిరపక్కన కొమ్ము ఇచ్చినట్టే కనిపిస్తుంది.

అనవేముని శాసనంలో ఇప్పటిరూపంలో ఉంది. కాని తలకట్టు అదనం.

ఎకారం మార్పు కొంచెం తమాషాయే. అశోకుని కాలానికి త్రికోణా కారంగా ఉన్న ఈఅక్షరం ఇక్ష్వాకులనాటికి దశమిచంద్రుని ఆకారానికి మారింది. క్రమంగా కుడికొస పెరిగి ఎడమభాగం దించుకొని పోసాగింది. ఎరికల్ ముత్తరాజు శాసనం మొదటిపంక్తిలోని 'ఎరిక' పదంలోని ఎ చూడండి. విజయనగరకాలం తర్వాతగాని దీని మొదటి సుడి కలుసుకుని సున్నలాగ కాలేదు.

ప్రాకృత సంస్కృతాలలో ఎ హ్రస్వంలేదుగా! దీర్ఘఎను మనం హ్రస్వం గా పరిగణించుకున్నాము. ఆ ఎకారాన్ని దీర్ఘం చేయడానికి ఏమి చేయాలి? మొదట్లో హ్రస్వ దీర్ఘాలనే భేదం వ్రాతలో పాటించేవారు కాదనుకోండి. తర్వాతిమాటే. ఎకారానికి దీర్ఘం గురుత్వాలి. ఎలా ఇవ్వడం? పై కొసకి మామూలుగా దీర్ఘసూచకమైన అడ్డుగీత పెడితే వా మొదలయిన అక్షరాలనే భ్రాంతి కలుగవచ్చు. కనుక పైన ఎడమపక్కన ఒక నిలువుగీత పెట్టారు. విజయనగరకాలానికిది విడిగానే ఉంది. తర్వాత తర్వాత పై కొసమీద బోర్లించి నట్లు మారి వ్రాత తొందరలో దానిలో చేరిపోయింది.

ఏకారానికి దీర్ఘం ఐ అనుకున్నారు కాబోలు! ఆ దీర్ఘానికి మరొక దీర్ఘంగా కొసను ఎడమవైపు వంచారు. ఐ అన్నప్పుడు అంగిలిని అదిమినట్టు అవుతుంది గదా! ఐ ఆకారాన్ని చూచినా పైనుంచి అదుముకుపోతూ ఉన్నట్టు తోస్తుంది.

ఒకానికి సంస్కృతంలో హ్రస్వంలేదు. కాని దాన్ని - ఓకారాన్ని హ్రస్వంగా గ్రహించాము. ఒకారం క్రమంగా తన రూపాన్ని తీర్చిదిద్దుకొనే ప్రయత్నంలో ఒంపెలాగా వక్రమైపోయింది. అమరావతి శాసనం మూడవ పంక్తి ఆఖరు అక్షరం చూడండి. ఒ ఎలా ఉంది? ఇంగ్లీషు Z లాగ ఉంది. అది నేటి తెలుగు ఒ గా మారడం అతి సహజం.

ప్రాకృత సంస్కృతాల్లో ఓ దీర్ఘమేకాని, హ్రస్వంలేదు. కాని, మనం ఓకారాన్ని హ్రస్వంగా గ్రహించాము కనుక ఏ వ్రాయడానికి ఎకారానికి పై పక్కన నిలువుగీత పెట్టినట్టే ఒ పైన నిలువుగీత పెట్టారు. సమంగా కుదిరింది. ఓ అయింది.

ఔ వ్రాయడానికొక తమాషా చేశారు. గుణింతాలలో వ్రాసే ౌకారం గుర్తును ౌ ఒ నెత్తిని పెట్టారు. కాకతీయులకాలానికే ఔ కారం ఈ విధంగా వ్రాయడం ఉంది. కాకతి రుద్రదేవుని అన్మకొండ శాసనంలో ఈ ఔ కారం కనిపిస్తున్నది.

ఒక సంగతి చూచారా! ఇ ఎ లకు ఉ ఓలకు జన్మస్థానం ఒక్కటే

గనుక ఆకారంలోను, పోలికలుండడం చూడండి.

ఇక మళ్ళీ గుణింతాల్లోకి వద్దాము. గుణింతాల్లో ఇంకా సున్న మిగిలి పోయింది కదూ!

సున్నను మనం ఇప్పుడు అక్షరంపక్కన వ్రాస్తున్నాము. ఇది మొదట్లో అక్షరంపైన వ్రాసేవారు నేడు హిందీలో వ్రాసినట్టు. అదీని వట్టి చుక్క. కనుకనే బిందువు అన్నారు. తెనుగు లాక్షణికులు బొట్టు అన్నారు. అచ్చును-స్వరాన్ని-అనుసరించి ఉండేదిగనుక అనుస్వారం అన్నారు. కోరుమిల్లిశాసనం మొదటి పంక్తి ఆఖరులో పంకరుహ అన్న పదంలో ప తర్వాత చుక్క చూడండి. రెండోపంక్తిలో స్వయంభూ అనేటప్పుడు యకు భూకు మధ్యన పైన చుక్క చూడండి. శిల్పి మొదట సున్న వ్రాయడం మరచేపోయి తర్వాత వ్రాశాడని అంటారుకదూ! కాదు. లక్ష్మీపురం శాసనం మూడో పంక్తిలో జ్యంబున కడు వండ్లు, ఆరోపంక్తిలో ఱంగరి అనే పదాలు చూడండి. బు పైన చుక్క-సున్న; గ పైన సున్న. ఈ సున్నలు మ వ్రాయడానికి బదులు అన్నమాట. బు పైన చుక్క పెడితే మ్బు అని ము పైన,బ కింద ఉన్నట్టు అర్థం. అశోకుని శాసనం మొదటి వాక్యం సేహేవం దేవాణం పియే అనేది చూడండి. వ పైన చుక్క. ణ కొసను చుక్క. నన్నయకు ముందువరకుకూడ ఈ అలవాటే ఉండేది. సున్నను పక్క అక్షరంపైన కొంచెం ఎడంగా చెక్కేవారు. నన్నయకాలానికీ రెండు అక్షరాలకు మధ్యన కొంత వ్రాయడం, అక్షరం వెనుక వ్రాయడం రెండూ ఉండేవి. క్రమంగా పైన వ్రాయడం మాయమయింది. నన్నయవరకూ ఇది బొట్టే, వర్తులాకారం కాలేదు. చుక్క స్పష్టంగా కనిపించడం కష్టం. కనుక మొదట ఇది చిన్న వర్తులాకారమైంది. జాయన సేనాని శాసనం చూడండి. తర్వాత ఇది పక్కన ఉన్న అక్షరంతో సమానంగా పెద్ద వర్తులాకారం ధరించింది. శ్రీనాథుని శాసనం చూడండి.

ఈ సున్నను అనునాసికాక్షరాలకు- అంటే ఙ, ఞ, ణ, న, మలకు బదులుగా వాడడం మనదేశంలో అంతటా ఉంది. అఙ్క, అఞ్జన, అణ్డ, అన్త, అమ్బుజ అనడానికి మారుగా అంక, అంజన, అండ, అంత, అంబుజ అని వ్రాస్తాము. ప్రాకృతంలో అనునాసికాలకు అనుస్వారం వ్రాసేపద్ధతి ఉంది. అశోకునిశాసనం మూడోపంక్తి చివర అంతే వాసినా అనేపదం చూడండి. నిజానికి ఇది అన్తేవాసినా అని ఉండాలి. అ పక్కన సున్న ఉంది. అలాగే మొదటిపంక్తిలో హేవం దేవాణం అనే పదాలలోని సున్నలకు మారు హేవమ్, వేవాణమ్ అని మకారంపొల్లులు ఉండాలి. కాని సున్నలే ఉన్నాయి. మన సాహిత్యంపైన కూడ ప్రాకృతప్రభావం చాల

పడింది గనుక ఈపద్ధతి మనకుకూడ వచ్చింది.

కోరుమిల్లి శాసనం మొదటిపంక్తి చివర నాభిపంకరుహ అనే పదంలో పఙ్క అని ఉండాలి కాని పంక అని సున్నే ఉంది ఙకారానికి మారుగా. రెండవ పంక్తిలో స్వయమ్భూః అని ఉండాలి. కాని య పక్కన సున్నే ఉంది. జాయన సేనాని శాసనం రెండోపంక్తి చూడండి; పరిరంభా రంభ అని ఉంది. శ్రీనాథుని శాసనం ఇరవై ఐదవ పంక్తిలో తరళతర తుంగ భంగ కదంబ చుంబిత అని అను నాసికాలకు మారు సున్నలే ఉన్నాయి.

ఇక్కడ మరొక తమాషా చెబుతాను. సంస్కృతపదాలలో అనునాసి కాలకు మారుగా మనపూర్వులు సున్నలు వ్రాసేవారన్నాను కదూ! సంస్కృతం పద్ధతినే తెనుగుపదాలనూ అనునాసికాలతోనే వ్రాయడం కూడ ఉండేది; బంక అనడానికి బఙ్క, వంట అనడానికి వణ్ట, రాముండు అనడానికి రాముణ్డు, పొంత అనడానికి పొన్త, చెంబు అనడానికి చెమ్బులాగ. ముత్తరాజు శాసనం మూడో పంక్తిలోని కుణ్డికాళ్కు, ఆఖరుపంక్తిలోని మరున్తుఙ్కు అనే పదాల ణ్డి, న్తు లు చూడండి. లక్ష్మీపురం శాసనం నాల్గోపంక్తిలోని రెన్డువటి, ఎనిమిదో పంక్తిలో పదేన్డుంబు, పదిహేడవ పంక్తిలోని చమ్పిన అనే పదాలలో న్డు, న్డు, మ్పి చూడండి. సంస్కృతపదాలలోని అనునాసికాలే సున్నలైపోగా, తెలుగు పదాల అనునాసికాలు సున్నలైపోవడం ఆశ్చర్యమేముంది?

## అర్ధాంతరంగా వచ్చిన అరసున్న

తెలుగులో మరొక సున్నకూడ ఉంది. ఇది అరసున్న. ఇది ఇప్పుడు అచ్చయిన కావ్యాలలో కనిపిస్తుంది. కాని మున్నూఱేండ్లకు ముందున్న వ్రాతలలో లేనేలేదు. అంటే, ఇది విజయనగర రాజులకాలానికి కూడ చాల ఇటీవలిదన్న మాట. కనుకనే మన వ్యాకరణాలు వ్రాసిన వారిలోను ఇటీవలివారే దీనిని తమ గ్రంథాలలో పేర్కొన్నారు. పాతకాలపు శాసనాలలో ఇది ఉందా? మున్నూఱేండ్లకు ముందిది లేనేలేదన్నప్పుడు శాసనాల ప్రసక్తే లేదుకదా! అయితే ఇది ఎలా వచ్చింది? ఎప్పుడు వచ్చింది?

దీనిని తెలుసుకొనడానికి మన భాషోచ్చారణ విషయం కొంచెం చూడాలి. ప్రతిభాషలోను ఒత్తి పలికే పదాలు, తేల్చి పలికే పదాలు ఉంటాయి. మాన వుడు సులువును కోరుతాడు. ఒత్తి పలికే అక్షరాలను తేలికగా పలకడం ప్రారం భించేసరికి కొన్ని ధ్వనులు లోపించడం, ఉన్న పదాలకు కొత్తరూపాలు రావ డం జరుగుతుంది. ఎడ్డ అనే పదం చూడండి. ఎడ్ద అంటే హృదయం. దీని డకార దకారాలను ఒత్తిపలకక తేలికగా పలికినప్పుడు ఎడద, ఎద అనే రెండు

రూపాలు పుట్టాయి. పూర్వం ఇలాటివాటిని ఒత్తిపలికేటప్పుడు-పూనికతో ఊని పలికేటప్పుడు-కొంత ముక్కుతో పలకడం ఉండేదేమో! ఎడంద అనే మరొక రూపం కూడ పుట్టింది. ఇది కేవలం అంటీ అంటని అనునాసికోచ్చారణం అయి ఉంటుంది. కనుక అస్వరం లోపించింది, ఎడద అయింది. కాని ఒకప్పుడు దీనిలో అను నాసికోచ్చారణ ఉండేది సుమా అని తెలుపడానికి అరసున్న గుర్తుగా పెట్టుకున్నారు. ఈఁగలు అనే పదం చూడండి. ఈగ ఈఁఈఁ ఈఁ అని చేసే ధ్వనిని బట్టి దీనికి పేరు వచ్చింది. దీనిని మొదట్లో ఈంగ అని నిండుగానే పలికేవారు. దక్షిణదేశంలోని మన తెలుగువారంతా నేటికీ ఈలాటి పదాలను ఈంగ, ప్రాంత, పేంద, తోంట, ఆంకలి, పోంక, వాండు అనే పలుకుతారు. ప్రాచీనోచ్చారణకు వారిని పరమ ప్రమాణంగా తీసుకోవచ్చును. అయితే ఈ సున్నను నోటినిండ పలుకరు; కొంత తేల్చి, ఒక రకమైన యాసతో పలుకుతారు. హిందీమాటలు కొన్నైనా మీరు వినే ఉంటారు. వినకపోతే ఎలా? అది రాజభాష కదూమరి! "మైఁ జాతా హూఁ" అన్నప్పుడు మైఁ హూఁ అన్న పదాలను ముక్కుతో అంటీ అంటనట్టు పలుకుతారు. 'ఏఁ' 'కానీఁ' అన్నప్పుడు మనం కూడ అదొకరకం యాసతో ముక్కుతో పలుకుతాము చూడండి ఆలాగనన్నమాట. కనుక ఈ అర సున్న ఉచ్చారణ ద్విత్వాక్షరాలను తేలికగా పలికేటప్పుడో, అనునాసిక ధ్వనిని అనుకరిస్తూన్న పదాలు ఉచ్చరించేటప్పుడో ఏర్పడిందని తెలుసుకున్నాము.

కొంతకాలానికి వాండు, ఈంగవంటి దీర్ఘాలమీది అనునాసిక ధ్వనిని తేల్చి పలకడం ప్రారంభమైంది. ఈంగ ఈఁగ అయింది. హ్రస్వం మీది అనునాసికాలు అవసరమైనప్పుడు-అంటే తమకు ఇష్టమున్నప్పుడు ఒత్తిపలికేవారు; లేనప్పుడు తేల్చి పలికేవారు. ఈంగ-ఈఁగ, బొద్దు ఈంగ-బొద్దింగ-బొద్దిఁగ-బొద్దింక్క-బొద్దక్క-బొద్దఁక, పలకడం, చదవడం ఎలా ఉన్నా వ్రాతలో మాత్రం అను నాసికమే ఉండేది. నన్నయకు ముందు, ఆయనకాలంలోను, అటుతర్వాతను ఈవిధంగానే వ్రాసి తేల్చి పలికేవారు. ఈ పద్యాలను చూడండి. నన్నయకు ముందున్న యుద్ధమల్లుని బెజవాడ శాసనం, మొదటి రెండుపాదాలివి :-

"స్వస్తి నృపాఙ్కుశాత్యన్త వత్సల సత్యత్రిణేత్ర
విస్తర శ్రీ యుద్ధమల్లు న్డనవద్య విఖ్యాత కీర్తిఁ."

దీనిలో యుద్ధమల్లున్డు అనే దానిలోని న్డు తేల్చి పలుకకపోతే ఛందోభంగం.

1065 నాటి- నన్నయకాలపు- మరొక శాసనపద్యం చూడండి. శాసనం రాజరాజనరేంద్రుని సవతిసోదరుడైన విజయాదిత్యుని కూతురు సోమలదేవి దాక్షారామంలో వేయించింది:

"సకల వసుమతీశ మకుటలసద్రత్న
కిరణరుచి విరాజి చరణుణ్డయిన
నిజభుజ ప్రధాని బెజయితదేవని
కూన్తు సరియెపోల్పం గాన్తలెన్దు?"

ఇక్కడ చరణుండయిన అని ఒత్తి పలికితే ఆటవెలది చెడుతుంది.

మరొక శాసనపద్యం చూడండి. ఇది మన్మ మందరాజనే రాజు వేయించినది: 1130 నాటిది.

"సూరి కవిస్తుతు ణ్డనఘుండు
చారు చతుర్థాన్వయాబ్ధి చంద్రుణ్డు గులని
స్తారకుణ్డు సుజననిధి రిపు
వారణ గజరిపుణ్డు బుద్ధవమ్మఁ జనించెను!"

ఇక్కడ అన్ని ప్రథమావిభక్తి ప్రత్యయాలను తేల్చి పలకాలి. లేకపోతే కందపద్యం ఖరాబైపోతుంది.

దీనినిబట్టి ఈ అనునాసికాలను అవసరమైతే ఒత్తి పలికేవారు! అవసరం కాకపోతే తేల్చి పలికేవారన్నమాటే కదూ! వ్రాయడం మాత్రం అనునాసికంతో కలిపి ద్విత్వాక్షరంగానే వ్రాసేవారు. అనునాసికంతో ఉన్నప్పుడు భాష, సందర్భం తెలియకపోతే ఎప్పుడు ఒత్తి పలకాలో, ఎప్పుడు తేల్చిపలకాలో తెలియడం కష్టమే. క్రమంగా అనునాసికాలకు సున్న వ్రాసే కాలం వచ్చింది. సంస్కృత పదాలఉచ్చారణ విషయంలో చిక్కేలేదు. అనుస్వార సహితమైనవి, అనునాసిక సహితమైనవి అన్నీ ఒత్తిపలికేవే. (అయినా వాటికికూడ తర్వాతివారు అంక్క అని, మంద్ద అని సున్న తర్వాతి అక్షరానికి ఒత్తు ఇవ్వడంకూడ కద్దనుకోండి. ఇది తెలుగువ్రాత అలవాటును బట్టి ఏర్పడింది) కాని తెలుగు పదాలలో ఇవి ఒత్తి పలకవలసినవి, ఇవి తేల్చి పలకవలసినవి అని తెలుసుకొనడం సున్న తర్వాత వ్రాసే అక్షరాన్నిబట్టి ఉంటుంది. సున్న తర్వాత వ్రాసే అక్షరం ద్విత్వంగా వ్రాస్తే ఒత్తి పలకడం అవసరం. ద్విత్వం లేకపోతే తేల్చి పలకాలి. రాముండ్డు-దీనిని ఒత్తి పలకాలి. రాముండు-దీనిని ఒత్తి పలకవలసిన అవసరంలేదు. తేల్చి పలకాలి. దీర్ఘంమీది అనునాసికం-మూండు, నేంటికి లాంటి పదాలలోనిది ఎప్పుడూ తేల్చి పలకవలసిందే. నన్నయ కాలానికికూడ కూంతురు, పేంద, వాండు అనే పదాలు వ్యవహారంలో ఉండేవి. సోమలదేవి శాసనపద్యం ఆఖరుపాదం చూడండి. [పుట 113] కాని నేడు దక్షిణదేశంలోని మన తెలుగువారిలాగే అప్పటివారు కూడ ఒకరకం యాసతో పలికేవారేమో! పండితులకు అది నచ్చివుండదు.

కనుక దానిని గ్రంథస్థంచేయడం మానినారు. ఒక్క నన్నెచోడుడు మాత్రం "వాండె" అని వాఁడు అనడానికి మారు వాండు అని ప్రయోగించాడు. వీటిని తేల్చి పలకడం కొన్ని వర్గాలలో నన్నయకాలానికీ ఉండిఉంటుంది. క్రమంగా ఈ ఉచ్చారణే మరుగయింది, కనుకనే నన్నయగాని, అతనిని అనుసరించిన తిక్కనాదులుగాని పూర్ణబిందు, అర్ధబిందు ప్రాస, యతి సాంకర్యం చేయలేదని ప్రామాణికులైన పండితులవాదం. ('భారతి' యువ భాద్రపదం, యువ మార్గశిర సంచికలలో నా 'ఆంధ్రఛ్ఛందో విశేషములు', 'ఎసగు పొసగు' అనే వ్యాసాలు చూడగోరినాను). ఇది స్పష్టంగా తెలియడానికి శ్రీనాథుని శాసనం పద్యం చూడండి :

"శాకాబ్దములు సహస్రమును మున్నూంట ము
  ప్పది యొక్కండును నైన భవ్యసంఖ్య
వఱలు విరోధి సంవత్సరంబున ఫాల్గు
  నంబున బహుళ పక్షంబు విదియ
శుక్రవారంబున శుభముహూర్తంబున
  శ్రీధాన్యవాటీ పురాధిపతియు
ంగ్రిష్ణ వెణ్ణ జలక్రీడా వినోదుండ్డు
  నను గన్న భూపాలు ననుంగుంబుత్రి
  వీర నారాయణుండు వేమ విభునిదేవి
  భూరి సద్గుణ నికురుంబ సూరమాంబ
  జగము వినుతింప సంతాన సాగరాఖ్య
  వరతటాక ప్రతిష్ఠోత్సవంబొనర్చెన్."

దీనిలో చూడండి లేఖకుడు తేలి పలకడం, ఊది పలకడం ఎంత నియమంతో పాటించాడో ! ఈ నియమం తెలుగుపదాల విషయంలోనే గనుక తెలుగు పదాలనుమాత్రం చూడండి. మున్నూంట యొక్కండును అనేవి తేల్చిపలకాలి. కనుక టకి, డుకు ఒత్తులు లేవు. వినోదుండ్డు అనేది ఒత్తి పలకాలి. కనుక డ్డుకు ఒత్తు, అనుంగుం బుత్రిలో ంగు, ంబు తేల్చి పలకాలి. కనుక గు, బులకు ఒత్తులు లేవు. వీరనారాయణుండు అనేది తేల్చిపలకాలి. లేకపోతే గణభంగం కనుక డుకు ఒత్తులేదు.

ఈ పద్ధతి విజయనగరకాలానికి కూడ వచ్చింది. కాని, మరొకవిశేషం కూడ ఉంది. సంస్కృత పదాలకున్నూ సున్న తర్వాత ఒత్తులు పెట్టడం ప్రారంభించారు. సంస్కృత పదాలనుకూడ తేల్చి పలికే ప్రబుద్ధులు బయలు దేరి ఉంటారు. లేక, పాఠకుల సౌలభ్యం కోసమూ ఈ పద్ధతి అలవాటుకు

వచ్చి ఉంటుంది. అన్నమాచార్యుల కీర్తన చూడండి. తేల్చి పలికేవి, ఒత్తి పలికేవి ఎంత స్పష్టంగా నియమబద్ధంగా ఉన్నాయో!

కనుక మనం అరసున్న గుర్తు చాల ఇటీవలిదేననే నిర్ణయానికి రావచ్చు. పాతదే అయిఉంటే, అన్నమాచార్యులుగాని, ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యులుగాని ప్రతి సున్న తర్వాత అక్షరాలకు ఒత్తులు పెట్టడం, మానడం అనే ఇంత శ్రమ ఎందుకు పడతారు? హాయిగా అరసున్నలు, నిండుసున్నలూ పెట్టుకుంటూ పోయేవారే! శిల్పికి కూడ శ్రమ తగ్గేదే! అయితే ఈ గుర్తు ఎలా వచ్చింది? వేదం లిఖిత పుస్తకాలలో ఉదాత్తస్వరం తెలుపడానికి అక్షరం మీద నిలువుగీతగాని సున్నగాని వ్రాసేవారు. అలాగే 'హంస' అనే పదాన్ని 'హగ్మ్స' అని పలకడానికి హంస అనేపదంమీద అరసున్న పెట్టేవారని, దీనిని బట్టి ఇటీవలివారు, అంటే అప్పకవివంటివారు అరసున్న గుర్తును గ్రహించి లుప్తమై పోయిన అనునాసికోచ్చారణకు సూచనగా వాడారని పండితులు కొందరన్నారు.

హిందీ, మరాఠీ సాహిత్యాల సంబంధంతో ఈ అర్ధచంద్రాకార చిహ్నం వచ్చిందని నా అభిప్రాయం. వేమ భూపాలుని కాలానికే మనకు ఫార్సీ మొదలయిన సాహిత్యాలతో సంబంధం ఉంది. విజయనగర రాజులు గోవానుంచి గుర్రాలు మొదలయినవి దిగుమతి చేసుకొనడంతో మరాఠీలతోను, హిందూస్తానీలతోను సన్నిహిత సంబంధ ఏర్పడింది. హిందీ, మరాఠీలలో ఈ చిహ్నానికి అక్షరంమీద సున్నతోసహా అర్ధచంద్రాకారం వ్రాయడం పాతకాలంనుంచి ఉంది. ఆ వ్రాతలనుంచి దీనిని చాలా మన ఇటీవలి లాక్షణికులు గ్రహించి గ్రంథస్థం చేసిఉంటారు. ప్రాకృతప్రభావం మనపై ఉందన్నారు గదా! దానిలోను, దానినుంచి పుట్టిన భాషలలోను ఈ అర్ధానుస్వారోచ్చారణ ఉందిగదా! ప్రాకృతంనుంచే ఎందుకు వచ్చి ఉండకూడదు?– అని ప్రశ్నిస్తారు కదూ! ప్రాకృతప్రభావం ఎంతగానో మనపై ఉండటం నిజమే. అనునాసికాలను సున్నలుగా వ్రాసే పద్ధతిని మనం ప్రాకృతంనుంచి గ్రహించడమూ నిజమే. కాని అనునాసికం సున్నగా మారినందుకు శాసనాలలో క్రమపరిణామం కనిపిస్తున్నది కదా! అట్లే అర్ధానుస్వారం ఉంటే అదికూడ అర్ధచంద్రాకారంతోనో, వలపలగిలకలాగనో ఏదో రూపంతో దర్శనమివ్వవద్దూ। ఇంతకూ పూర్వం ప్రాకృతంలోనూ అనుస్వారాన్ని తేల్చి పలకడానికి గుర్తు పుట్టలేదు. దానినుంచి పుట్టిన భాషలలోనే బయలుదేరింది. ఏతావతా అరసున్న ఒకప్పుడు వ్యవహారంలో ఉండి, కాలక్రమంగా లోపించిన అక్షరాల, అనునాసికస్వరాల జ్ఞాపక చిహ్నంగా అర్ధాంతరంగా పుట్టుకువచ్చిందని తెలుసుకున్నాము.

సున్నకు పూర్వం గుర్తు చుక్క కదూ! సంస్కృతంలో విసర్గల గుర్తును

తెలుపడానికి రెండుచుక్కలు ఒకదానికింద ఒకటి పెట్టారు. కోరుమిల్లి శాసనం చూడండి. మొదటి పంక్తి మొదటిపదం - శ్రీధామ్నః. సున్నవర్తులాకారంగా మారడంతో విసర్గ కూడ వర్తులాకారమైంది.

## ఒత్తుల ఒయ్యారాలు

అక్షరాలు, గుణింతాలు మారినా ఒత్తులలో కొన్ని వాటి పూర్వస్వరూపం లోనే ఉన్నాయన్నాను కదూ! ఎలా అని అంటారేమో! అశోకుని కాలంనుంచి ఈ ఒత్తులు చూడండి

ఒత్తు అంటే ఊదిపలకడం కదూ! అక్షరం కింద మరొక అక్షరం పెట్టడం అన్నమాట. దీనిని సంస్కృతంలో ద్విత్వం అంటారు. ఈ రెండక్షరాలలోను పైది అచ్చులేని అక్షరంగాను, కిందిది అచ్చుతో కూడిన పూర్ణాక్షరంగాను గ్రహించాలి. అశోకుని శాసనంలో రెండోపంక్తి చివర చూడండి ద్రహ్యితవ్యం అనేమాటను. ద్ర హ్యి వ్య అనేవి ఒత్తు అక్షరాలు. దకింది కొసను అంటిపెట్టుకొని ర (రేఫం), హి కింద అంటిపెట్టుకొని య, వను అంటిపెట్టుకొని య ఉన్నాయి ఒత్తులుగా ఉన్నవి వట్టి అక్షరాలే; మారిపోయిన ఒత్తులు కావు. వీటిలో ద హి వ అనేవి అప్రధానమైనవి; వెనుక ఉండవలసినవి. అంటే మొదట పలకవలసినవి. కింద ఉండే ర య య లే ప్రధానాలు. కాని గుణింతాల మార్పులన్నీ అప్రధానమైన పై అక్షరాలకే ఉన్నాయి. హ్యి గుడి హ కు ఉంది. వ్యం పక్కన సున్న వ పైన ఉంది. ఈ అలవాటే-అప్రధానమైన పై అక్షరానికి గుణింతాలిచ్చే అలవాటే - బ్రాహ్మీసంప్రదాయంతో మనకూ వచ్చింది. ఈ ప్రాచీన సంప్రదాయం నేటికీ మారలేదు.

క్రమంగా ఈ పొరపాటును లేఖకులు గ్రహించారు కాబోలు! ప్రధానాక్షరమైన కింది అక్షరానికే గుణింతాలు ఇవ్వడంకూడ అలవాటులో పెట్టారు. ఎరికల్ముత్తరాజు శాసనం రెండోపంక్తి చూడండి. ల్ముత్తరాజు అనే పదంలోని ల్ములో మ వత్తుకే కొమ్ము ఉంది. లక్ష్మీపురం శాసనం పదకొండో పంక్తిలో రెన్డు ట్టియు తూఙ్ప అనే పదాలు చూడండి. రెన్డు ట్టియులో న్డులోని దకారానికి కొమ్ము, ఙ్ప అన్నప్పుడు కింద ఉన్న పకారానికి కొమ్ము ఉన్నాయి. నిజానికి ఇదే శాస్త్రీయమైన వ్రాతపద్ధతి. కాని, ఇవి పాతశాసనాల లేఖకులు నియమానుసారంగా పాటించినట్టు కనబడదు. ద్విత్వాక్షరాలలో కొన్నిటిలో పైదానికి-కొన్నిటిలో కిందిదానికి ఇలా అస్తవ్యస్తంగా గుణింతాలు చెక్కేవారు. ఇది నన్నయకాలంవరకు సాగినట్టు తోస్తుంది. అప్పటికిగాని ఒక వ్యవస్థ ఏర్పడినట్టు కనిపించదు.

ఈపద్ధతివల్ల-కింది అక్షరాలకు గుణింతాలు ఇవ్వడంవల్ల-ఒకగట్టి చిక్కు ఏర్పడి ఉంటుందనుకుంటాను. ఆకారణంగా పై అక్షరాలకు గుణింతాలు పెట్టడమే ఉచితమని, సులువని పండితులు అభిప్రాయపడివుంటారని నా ఊహ. ఆ చిక్కేమిటి అంటారా? అప్పటికే తలకట్టు పద్ధతి బాగా స్థిరపడింది. ఒత్తుగా పెట్టిన కింది వరుస అక్షరాలకు గుణింతాలు ఇవ్వడంవల్ల చదివేటప్పుడు రెండు వరుసలు చూచి తడుముకునే చిక్కు, తప్పులు చదివే ప్రమాదం ఏర్పడి ఉంటాయి. పైన కనిపించే-తలకట్టుతో పూర్ణంగా కనిపించే-అక్షరానికి మార్పు లేమీలేక ఒత్తుగా ఇచ్చిన కిందివరుస అక్షరానికి గుణింతాలు ఇచ్చామనుకోండి. పాఠకుడు అంటే సామాన్యుడు-చదువుతూపోతాడు. పైవరుస తలకట్టుతో పూర్ణాక్షరంగా కనిపిస్తుంది కిందివి మరచిపోతాడు; లేక చూపు తప్పుతుంది. తప్పులు చదువుతాడు. కనుకనే పై అక్షరానికి గుణింతాలు ఇవ్వడం నన్నయ కాలంలో ఒక స్థిరరూపానికి వచ్చింది. కోరుమిల్లి శాసనం చూడండి. అయితే పాతవాసననుబట్టి కొన్ని వత్తులకు-ఉదాహరణకు య వత్తు వంటివాటికి-గుణింతాలివ్వడం పోలేదు. కోరుమిల్లి శాసనం తొమ్మిదోపంక్తిలోని కాత్యాయనః, కాత్యాయనాత్ అనే పదాలు చూడండి. త్యాలు రెండింటి దీర్ఘాలు య ఒత్తుకే ఉన్నాయి. తకు తలకట్టు. చదువరి ఈ తలకట్టుచూచి పొరపాటుతో ముందుకు పోవచ్చు. అలాటి ప్రమాదాలు జరుగకుండా ప్రధానమైన పైవరుస అక్షరానికే గుణింతాలు ఇవ్వడం మొదలుపెట్టారనుకుంటాను. తిక్కన కాలానికికూడ య ఒత్తుకు గుణింతం ఇచ్చే పద్ధతి పోలేదు. జాయనసేనాని శాసనం చూడండి. ఐదో పంక్తిలో రహస్యోత్సవ అన్నప్పుడు సకు ఏత్వమిచ్చినప్పటికీ య వత్తుకు దీర్ఘమిచ్చాడు. పదమూడోపంక్తిలో అస్యాల అన్నప్పుడు దీర్ఘం సాకే ఉంది. పధ్నాలుగో పంక్తిలో దేవస్యారఘటీ అన్నప్పుడు యావత్తుకే దీర్ఘం. తిక్కనకాలం తర్వాత ఈ పద్ధతి పోయింది.

ఇక ఒత్తులు వరుసగా చూడండి. అక్షరంపైని అడ్డుగీత - తలకట్టు స్పష్టంగా అకారానికి చిహ్నమనే భావం బలపడిన తర్వాత తలకట్టులేని అక్షరం అచ్చులేని అర్ధాక్షరమనే అభిప్రాయం ఏర్పడింది. దానితో, తలకట్టుకల అక్షరాలను తలకట్టు తొలగించి, తలకట్టులేని వాటిని ఉన్నవున్నట్టుగానూ పంక్తికి దిగువ అక్షరంకింద చిన్నవిగా వ్రాయడం ప్రారంభించారు. ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ థ ద ధ ప ఫ బ భ వ శ ష స హ ళ లలో తలకట్టున్న అక్షరాల తలకట్టు తీసివేసి ఒత్తులుగా వాడారు. తలకట్టు లేని ఙ జ ఞ ట ణ బ ఱ ల స్వస్వరూపంతోనే ఒత్తులయాయి. ఎక్కువగా మారినట్టుకనిపిస్తున్నవల్లా ్క ్త ్ష ్న ్య ్ర ్మ ఒత్తులు మాత్రమే. నిజానికి

ఇవి మార్పులు కావు. పాత అక్షరాల రూపాలే.

పీడిలో క ఒత్తు ్క చూడండి. ఇది నన్నయ, కాకతీయకాలాలలో సరిగ్గా అప్పటి కలో సగం-తలకట్టు భాగం లేనిదన్నమాట. కోరుమిల్లి శాసనం పదో పంక్తిలో యూపాన్క్రమశః అనే మాటలో న్క్ర చూడండి. నకు క్రావడికి మధ్య సగం క ఉంది. జాయనసేనాని శాసనం పదమూడో పంక్తి చివర కరాస్కందేన అనే పదంలో స్క చూడండి. క ఒత్తు సరిగ్గా క లో సగమే. అన్నమయ్య కీర్తన చూడండి. ఇదే విధంగా ఉంది. కాని కన్నడ, తెలుగులకు సమానంగాఉన్న క రెడ్డిరాజులకాలం నుంచి మారుతూ వచ్చిందని ఇదివరకే తెలుసుకున్నాము. అంటే నేటి క ఆకారానికి దగ్గరిదన్నమాట. అది క్రమంగా వ్యాపించినమీదట దాని సగం ఒత్తయింది. తెలుగు కను- ఇంగ్లీషు S ఆకారంలోఉన్న దానిని వ్రాయడంలో క్రమంగా కిందిభాగం పైకి ఎదిగింది; పై చివర పక్కకు పెరిగింది; ్క అయింది. మన వ్రాతపద్ధతి - ఖత్తు - గంటంతో వ్రాసేగుండ్రటిది కదూ మరి?

త ఒత్తు - ్త - లో ఒక విశేషముంది. క ఒత్తు కంటె ఇది కొంచెం ఎక్కువగా మార్పుచెందింది. మొదటి త ఎలా ఉంది? బావిలోపడిన బిందెలను తీసే గాలంకొక్కిలాగ లేదూ! ఎటికల్ ముత్తరాజు శాసనం రెండోపంక్తి చూడండి. త్తు అనేది చిన్న గొలుసులాగ కనిపిస్తుంది. ఈ త కుడివైపు చిన్న సున్న ఏర్పడడం చూచారు గదూ! ఇది నన్నయకాలానికి ఇప్పటి కన్నడం త లాగ కుడివైపునమాత్రం సున్నతోఉండేది. పైన తలకట్టు తీసివేయండి. త ఒత్తు అయింది. తిరగవేసిన ఇప్పటి ల లాగ ఉంది. తిక్కనకాలానికి ఇప్పటిరూపం పొందింది. ఈలాటి త ఒత్తు కుడికొస పైకిచూస్తూ ఉంటే, క్రావడిగానో, మరొక అక్షరంగానో పొరపాటు పడేవారు కాబోలు! ఒత్తుకొస అక్షరంకింద అడ్డగీతలాగ వ్రాయడం ప్రారంభించిఉంటారు. కోరుమిల్లి శాసనం మొదటిపంక్తిలోని పురుషోత్తమస్య అనే మాటలో త్త చూడండి. జాయనశాసనం మూడోపంక్తిలో దృప్తస్యలోని ప్త చూడండి. పోల్చి చూడండి.

న ఒత్తు - ్న - తలకట్టులేని పాత నకారమే. వ్రాసే తొందరలో ఎడమ వైపున గడి ఏర్పడింది. న పరిణామాన్ని చూస్తూరండి పట్టికలో. నన్నయ కాలానికే ఇప్పటి న ఏర్పడింది. కోరుమిల్లి శాసనంలో న ఒత్తు చూడండి. శ్రీనాథుని కాలపు న ఒత్తుతో పోల్చండి. ఇప్పటి న ఒత్తు శ్రీనాథునికాలానికే వ్రాత తొందరలో ఏర్పడింది. బ్రాహ్మీ వర్ణమాలలోని నను తొందరగా వ్రాయండి '్న' కాలేదూ!

మ – - ఒత్తు సరిగ్గా బ్రాహ్మీ మకారమే. కాని, ఎడమకొనమాత్రం పక్కకు-వెనక్కు వాలింది. వ్రాత ఒడుపే దీనికి కారణం. మకార పరిణామం పరిశీలించండి. – వత్తు ఎంత సులభంగా బోధపడుతుందో!

య ఒత్తు- ్య పూర్వపు యకారం కుడిభాగం, లేక పూర్తి యకారమే అనవచ్చు. లక్ష్మీపురం శాసనంలోని 19, 20, 21 పంక్తులు చూడండి. వెను కనే ఉన్న యకారంతో పోల్చి చూడండి. య ఒత్తుకు కియ్యవడి, క్యావడి అనే పేర్లు మీరు వినేవుంటారు వాటికి కారణం ఏమనుకున్నారు? అప్పకవికి కొంచెం ముందు, అంటే కృష్ణదేవరాయల తర్వాతనుంచే క ఒత్తు నేటి ్క ఒత్తులాగ వ్రాయడం అలవాటయి ఉంటుంది. ఈ క ఒత్తును ్క, య ఒత్తును ్య చూస్తే పొరపాటుపడే అవకాశం ఉంది. కనుక ఇది క ఒత్తుకాదు, క ఒత్తు లాగ, కలాగ కనిపించే య ఒత్తు అని చెప్పడం మన పెద్దల ఉద్దేశమై ఉంటుందని నా అభిప్రాయం. కనుక క్యావడి, కియ్యవడి అనే పేర్లు వచ్చాయి. మన నిఘంటువులలో కియ్యవడి అంటే అక్షరంకింది ఒత్తుగా ఇవ్వబడిన య అనే అర్థం ఉంటుంది. మన వ్రాత పద్ధతిలో ప్రతి అక్షరమూ-ఒక్క వలపల గిలక మినహా అన్నీ-అక్షరంకింద ఇచ్చేవే. కనుక ఈ అర్థం అతుకుతుందా?

ర ఒత్తు-కారావడి పూర్తిగా పూర్వపు ర వర్ణమే. అశోక, భట్టిప్రోలు కాలానికి నిలువుగీతలాగ ఉన్న ర ఇక్ష్వాకుల కాలానికే ఎడమవైపు తిరిగి గుండుగా కాసాగింది. ముత్తరాజు శాసనం ఏడోపంక్తిలోని ప్రియ అన్నమాట చూడండి. నన్నయకాలం వరకు ఇది అక్షరాన్ని అంటిపెట్టుకొని ఉండేది. అంటే అక్షరం కిందినుంచి బయలుదేరి ఎడమవైపు పై వరకు వెళ్ళేది. తిక్కన కాలానికి కింద అంటిపెట్టుకొని ఉండడం పోయింది. అడుగునుంచి విడిగా బయలు దేరి ఎడమవైపు వెళ్ళడం చూడవచ్చు. విజయనగర కాలానికి అక్షరం కుడి పక్కనుంచి చుట్టుకు బయలుదేరడం కనిపిస్తుంది. అన్నమాచార్యుల కీర్తనలో క్రోధి, వెంకటాద్రీశ అనే పదాల క్రావడి చూడండి. కారావడి, క్రావడి అనే పేర్లు ఏమై ఉంటాయి? పూర్వపు రనుపోలినది అని కాబోలు!

వలపలగిలక అనే పేరు మీరు వినే ఉంటారు. అక్షరానికి కుడిపక్కన వ్రాసే గిలకలాంటిదన్నమాట. ఇది మరేమీకాదు ర వర్ణమే. పర్వతం అన్న పదాన్ని పాత పుస్తకాల్లో చూడండి. పవ౯తం అని ఉంటుంది. అంటే ర్వ అన్నప్పుడు వ రెండవ అక్షరం ర మొదటి అక్షరం. కనుక మనం ఒత్తులిచ్చే సంప్రదాయం ప్రకారం ఈ గిలక మొదట తర్వాత వ కాని, వ ఒత్తు కాని ఉండాలికదూ! కాని, అలా లేదు. ఎందుకు? దీని పరిణామం ఒక తమాషా. పూర్వపు ర పట్టి నిలువుగీత అని మీకు తెలుసు. పూర్వం వ వ్రాసి పైన

నిలువుగీత వ్రాసేవారు. అంటే ర క్రింద వ ఉన్నట్లే. ఇది విష్ణుకుండినుల కాలానికి అక్షరంపైన కుడిమూలకు ఏటవాలుగీతగా మారింది. నన్నయకాలానికి అడ్డుగీతకు దగ్గరగా కిందికి వాలింది. విష్ణుకుండినుల శాసనం మొదటి పంక్తి లోని శ్రీపర్వ్వత అనే పదం చూడండి. కోరుమిల్లి శాసనం ఐదోపంక్తిలోని చక్రవర్త్తి అనే పదంలో ఈ గిలక చూడండి. పక్కన ఏటవాలుగీతగా లేదూ! తిక్కనకాలానికి కూడ ఇది అక్షరాన్ని అంటిపెట్టుకుని ఉండేది. జాయన శాసనం ఐదోపంక్తిలో య్యర్. పన్నెండో పంక్తిలో పరివర్త్త చూడండి. శ్రీనాథునికాలానికి అక్షరంతో విడిపోయి, పక్కన తురాయిలాగ ఉండేదేకాని గిలకరూపం దాల్చలేదు. శ్రీనాథుని శాసనం పధ్నాలుగో పంక్తిలో బొనచ్చెర్ అనే పదంలో చె కుడివైపున విడిగా వంకరగీత చూడండి. ఇది విజయనగర కాలానికి పూర్తిగా గిలక అయింది. తెలుగు తొమ్మిదో అంకెలాగ. అన్నమయ్య కీర్తన ఐదోపంక్తి మధ్యను కీర్త్తనలు అన్నపదం చూడండి. గిలకగా మారిందా!

ల ఒత్తూ ్ల పూర్వపు ల అక్షరం భాగమే. లక్ష్మీపురం శాసనం ఒకటి, మూడు, ఎనిమిది పంక్తులలోని డ్లు చూడండి. దాని కుడికొస కిందికి వాలింది. శ్రీనాథుని కాలానికి నేటి ్ల అయింది.

ద్విత్వాలు-ఆయా అక్షరాలకు ఆయా అక్షరాలే ఒత్తులుగా వ్రాయవలసి వస్తుందనుకోండి. అంటే కకు ్క ఒత్తు, గకు ్గ ఒత్తు. అప్పుడు సులువుకోసం క వ్రాసి పైన ఒక సున్న పెట్టేవారు-క పైన సున్న వ్రాస్తే క ద్విత్వం పలకాలి అన్నమాట. దీనికి కారణమేమిటో తెలుసా? సున్న అనునాసికానికి ప్రతినిధి అనేది శాసనాలపద్ధతికదూ! ఆ జ్ఞాపకంతో పైన సున్నపెడితే ఆ కిందఉన్న అక్షరంవంటి మరొక అక్షరంసుమా అనేభావం.

ఇంతకూ ఈ ఒత్తులన్నీ రెండువేల ఏండ్లనాటి అక్షరాల స్వరూపానికి మచ్చుతునకలని తెలుసుకున్నాము గదూ!

## ఒంటిగీత, జంటగీత

మనమిప్పుడు వ్రాసేటప్పుడు వాక్యాలమధ్యన, వాక్యాల ముగింపులోను కామాలు, ఫుల్‌స్టాపులు పెడుతున్నాము గదా! అలాటి పద్ధతి పూర్వం తాటాకుల లోను, శాసనాలలోను ఉండేదా? లేదు. ఈ పద్ధతి మనకు ఇంగ్లీషు సంబంధంతో చాల ఇటీవల వచ్చింది. పూర్వం ఇలాటిది లేదు. మరొకటి ఉండేది.

మీరు ఈ ద్వితీయభాగం మొదట్లోని మహాస్థాన్ శాసనం చూడండి

(66 వ పుట) మొదటివాక్యం "నేన సవంగియానం గలదనస" అన్న తర్వాత ఏముంది? నిలువుగీత కదూ! ఈ మహాస్థాన్ శాసనం అశోకునికి ముందుదని మీకు ఇదివరకే తెలుసు. అప్పటి శాసనాలలో వాక్యంలో ఒక భాగమైన తర్వాత ఒక్క నిలువుగీత, వాక్యం సమాప్తిలో రెండు నిలువుగీతలు వ్రాసేవారు. సున్నను పూర్వం చుక్కలాగ వ్రాసేవారు గనుక ఫుల్‌స్టాప్ వంటి గుర్తుపెట్టడానికి అవకాశం లేదు. కనుక నిలువు గీత.

ఇక తెలుగు శాసనాలలో నన్నయకు పూర్వంనుంచి కూడ ఇదేపద్ధతి. నన్నయకాలపు కోరుమిల్లి శాసనం చూడండి. (104 వ పుట) ప్రతి శ్లోకం ముగిసిన తర్వాత ఒక్క నిలువుగీత కనిపిస్తుంది. జాయన సేనాని శాసనం (107వ పుట) చూడండి. శ్లోకం పూర్వార్ధం తర్వాత ఒక్క నిలువుగీత, శ్లోకం పూర్తయిన తర్వాత రెండు నిలువుగీతలు ఉన్నాయి. శ్రీనాథుని శాసనంలోను (109 వ పుట) ఇలాగే పద్యపాదం చివర ఒక్క నిలువుగీత, పద్యం పూర్తయిన తర్వాత రెండు నిలువుగీతలు ఉన్నాయి. ఈ నిలువుగీతల పద్ధతి బ్రౌను వ్రాసిన అచ్చువేసిన వ్యాకరణ పుస్తకంలోను చూడండి. (పుట 115) కొన్ని తాటాకు పుస్తకాలలో అయితే మరీ రోకటిపాటగా ఉంటుంది. ఒక అధ్యాయమో, పరిచ్ఛేదమో ముగిసిన తర్వాత ఒక్క నిలువుగీత — 1 ఉంటుంది. 15వ శతాబ్ది తర్వాత ఈ పద్ధతి పోయింది. అధ్యాయసమాప్తిలో మాత్రం మంగళమహా శ్రీ శ్రీ శ్రీ శ్రీం జేయును అని శ్రీకారాలు రకరకాలుగా చుట్టేవారు. ప్రారంభంలో ఒక్క శ్రీని చిత్ర విచిత్రంగా వ్రాసేవారు. ఆఖరులో ఎన్ని శ్రీ లయినా వ్రాయవచ్చు. ఇంతకూ ఉత్తరాలు వ్రాసేటప్పుడు మాత్రం.

"ఒకటి సుతునకు, చెలికాని కొనర రెండు,
మూడు హితునకు, వైరికి మూడు నొకటి,
ఏను భూపాలునకును శ్రీ లెలమి నిడుడి
సరసు లుత్తరములు వ్రాయు సమయమునను."

అని నిర్బంధం ఉండేది.

శాసనాలలోను, తాటాకులలోను తప్పులు దిద్దడంలోను పద్ధతి ఉంది. కొట్టివేయటం చాల అరుదు. అక్షరం వ్రాసిన తర్వాత అది సరస్వతి స్వరూపం గనుక కొట్టివేయడం పాపమనే భావం ఉండేది. కనుక తప్పుగా వ్రాసిన పదంకింద అడ్డగీత పెట్టేవారు. అంటే అది లేనట్టేనని భావం. ఒకొకప్పుడు కుండలీకరణం చేసేవారు. అంటే పొరపాటుగా వ్రాశామనడానికి ఆ పదం చుట్టూ గుండ్రంగా గీత గీయడమన్నమాట. ఇది చదవనక్కరలేదు అని

దీని భావం. ఈ కుండలీకరణాన్ని ఒక కవి చమత్కారంగా వర్ణించాడు చూడండి.

"హరిపూజోత్కర గుంటుపల్లి సచివేం
 ద్రా సాంబయామాత్య నీ
స్థిరకీర్తి ప్రతతి ప్రతాపములతో
 దీపించు చంద్రార్కులన్
గరిమన్ పద్మభవుండు త్రాసు నిడి వే
 గంబై పయింబోవగన్
సరి రారంచును గుండలించె బరివే
 షా పంక్తి రేఖా కృతిన్."

గుంటుపల్లి సాంబయామాత్యుని ప్రతాపకీర్తులే ఉన్నాయి, సూర్య చంద్రులిక అక్కరలేదు అని బ్రహ్మ కుండలీకరించుకొన్నాడట.

ఉత్తరదేశంలో కుండలీకరణంతోపాటు మరొకపద్ధతికూడ ఉంది. ఆ తప్పులమీద హరిదళంకాని, సుద్దకాని, సున్నంకాని పూయడం, ఆ తప్పులు కనబడకుండా చేయడం. మొత్తంమీద కొట్టివేయడమనేది చాల అరుదు.

అవసరంలేని అక్షరాలు వ్రాసినా , లేనివి వ్రాసినా పైన చెప్పిన పద్ధతి. అక్షరాలు మరచిపోతే ఏంచేసేవారు ? మరచిన అక్షరాలచోట పంక్తికి కింద ఇప్పటిలాగ హంసపాదం × పెట్టి వ్రాయవలసిన పదాన్నో, అక్షరాన్నో రెండుపంక్తుల నడుమనో, ఆకు పక్కనో మార్జిన్‌లో వ్రాసేవారు. ఈ గుర్తుకు హంస పాదమనే ఎందుకు ప్రచారం వచ్చింది ? గద్దపాదమనో, గువ్వపాదమనో అనరాదూ ! జ్ఞానం, చదువు సరస్వతీ రూపాలని మన పూర్వుల నమ్మకం. ఆమె తెల్లనిదనికూడ మనపూర్వుల భావన. "శారదనీరదేందు ఘనసార" అనే పోతన్నగారి సరస్వతీస్తుతి పద్యం జ్ఞాపకం చేసుకోండి. జ్ఞానమనేది మానవునికి వెలుగునిచ్చినట్టవుతుంది గనుక తెల్లగా ఊహించారు. కనుక జ్ఞానానికి సంబంధించినవన్నీ తెల్లనివే. సరస్వతికి వాహనమైంది హంస, కనుక హంస పాదమని రమ్యంగా ఊహించుకుని గుర్తు పెట్టుకున్నారు.

వ్రాసేటప్పుడు ఇక్కడి అక్షరం అక్కడ, అక్కడి అక్షరం ఇక్కడ వ్రాయడం జరుగుతుందనుకోండి. కుండలీకరణలు, హంసపాదులు అవసరం లేకనే 1, 2, 3 అని సంఖ్యలు వేస్తారు. ఆ వరుసలో ఒకటి ముందు చదువుకుని, రెండవది తర్వాత చదువుకుంటే సరిపోతుంది.

వ్యాఖ్యానాలు వ్రాసేటప్పుడు ఏది మూలమో, ఏది వ్యాఖ్యానమో పాఠకునికి తెలియాలిగదా ! మూలమంతా ఇస్తే వ్రాత పెరుగుతుంది. కనుక మూల

వాక్యమో, పద్యమో మొదలు కొంత ఇచ్చి + (ప్లస్) గుర్తు పెట్టేవారు. ద్దీనితో మూలం అయిపోయింది ఇక తర్వాతిది వ్యాఖ్య అని దాని అభిప్రాయం. అథాతో దర్మ + వ్యాఖ్యాస్యామః అని. అట జని కాంచె +.... పూర్తిగా మూలం ఏకరువు పెట్టనక్కరలేదు.

వేద సంహితల లిఖిత పుస్తకాలలో ఉత్తరదేశంలో ఒక పద్ధతి, మన దేశంలో తాటాకుపుస్తకాల్లో ఒక పద్ధతి ఉంటాయి. ఉత్తరదేశంలో ఉదాత్తం తెలుపడానికి అక్షరంమీద నిలువుగీత. అనుదాత్తం తెలుపడానికి అక్షరంకింద అడ్డగీత వ్రాస్తారు. శ్నో మిత్ర స్యం అని, తెలుగు తాటాకుపుస్తకాలలో ఉదాత్తం చూపడానికి అక్షరమీద సున్న చుట్టేవారు. శ్నో ఈలాగ. తమిళులు గ్రంథాక్షర పుస్తకాలలో ఉదాత్తం చూపడానికి అక్షరంపైన గ్రంథలిపి ఉకారం-౨ పెట్టేవారు.

ఛందో గ్రంథాలలో లఘువుకు 1 ఒక్క నిలువుగీత, గురువుకు ౮ కారావడి వంటి గుర్తు వ్రాయడం పూర్వం నుంచి నేటికి వస్తున్నది.

పంచమ ప్రకరణం

# ఓనమాలు

మనం వర్ణమాలను అ ఆ ఇ ఈ అనే వరుసలోనే ఎందుకు వ్రాయాలి? ఇంగ్లీషు వర్ణమాల, దానికి మూలమైన రోమన్ వర్ణమాల ఏ బి సి డి — అబ సడ అనే వరుసలో ఉన్నాయి. ఈ రెండిటికి మూలమైన ఫినీషియా-సెమెటిక్ వర్ణమాల అలీఫ్ బే పే తే- అబపత అనే వరుసలో ఉంది. ఈ వరుసను గురించి మీరు ఈ పుస్తకం ప్రథమభాగంలో చదివారు. మనంకూడ అబపతట అనికాని, అకమసయ అనికాని ఎందుకు వ్రాసుకోకూడదు?

వ్రాసుకోకూడదనేది ఏమీలేదు. కాని, ఎంతకాలంనుంచి ఈ పద్ధతి వస్తూఉంది? దీనికి కారణం ఏమైఉంటుంది?- అని తెలుసుకుంటే, విచ్చలవిడిగా వ్రాయడంకంటే ఇప్పుడున్నట్టు వ్రాయడమే ఉచితమని సకారణమని తెలుతుంది. మరి ఎప్పటినుంచి ఈ పద్ధతి అలవాటులో ఉంది?

వేదంలోనే- ముఖ్యంగా తైత్తిరీయ సంహితలో వ్యాకరణ ప్రసక్తి ఉందని ఇదివరకు ఈ భాగం ప్రారంభంలో మీరు చదివారు. వేదానికి వ్యాకరణాలు, నిఘంటువు ఇప్పటికి దాదాపు మూడున్నరవేయి సంవత్సరాలకిందే పుట్టాయనికూడ మీరు చదివారు. వేదవ్యాకరణాన్ని ప్రాతిశాఖ్యం అంటారు. దీని అర్థం మరేమీకాదు. వేదంలోని ప్రతిశాఖకు సంబంధించిన భాషావిశేషాలు తెలిపేది అనే. నిఘంటువును నిరుక్తం అంటారు. ఈవేదవ్యాకరణాలు ఎందుకు బయలుదేరాయి? వేదపదాలక్రమం, వర్ణక్రమం, స్వరం, మాత్ర,వీటి విశేషాలు పూర్వులు అనుసరించి వస్తూఉన్న పద్ధతిలో తెలియడానికి. ఆచార్యుడైనవాడు ఇవన్నీ తెలుసుకొని ఉండాలి.

"పదక్రమ విభాగజ్ఞః వర్ణక్రమ విచక్షణః,
స్వరమాత్రా విశేషజ్ఞః గచ్ఛే దాచార్య సంజ్ఞకం"

అని ఋగ్వేద ప్రాతిశాఖ్య ప్రారంభంలోని సూచన. పదం, స్వరం, మాత్రలు తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? అక్షరాలవరుస, వాటి స్వరూపం తెలియాలి; వాటి పుట్టుక తెలియాలి. ఈ విధంగా ప్రాతిశాఖ్యాలు-వేదవ్యాకరణాలు ఏర్పాటు చేసిందే ఈ వర్ణసమామ్నాయ పద్ధతి.

మన పూర్వులు వేదజడులు కదా! నిరంతరం వేదం వల్లెవేస్తూనే ఉన్నప్పుడు ఏఏ అక్షరం ఉచ్చరించేటప్పుడు ముఖయంత్రంలో ఏఏ భాగం కదులుతుందో, ఎంత ఊపిరితో ఉచ్చరించడం సాధ్యమో తెలుసుకోవాలని బుద్ధిపుట్టి ఉంటుంది? లేకపోతే బ్రాహ్మణాల కాలంలోనే పదాన్ని గూర్చి అంత చర్చ ఎందుకు పుడుతుంది? పరిశీలించగా, పరిశీలించగా, అక్షరాలు పుట్టే స్థానాలు ఐదని నిర్ణయించుకున్నారు. అవి గొంతునుంచి పెదవులవరకు- గొంతు, దవడలు, అంగిలి, పళ్ళు, పెదవులు. వీటిని సంస్కృతంలో చెప్పేటట్టయితే కంఠం, తాలు, మూర్ధ, దంతం, ఓష్ఠం. ఈ వరుసలోనే వర్ణమాలను నిర్ణయించుకున్నారు. ఈ ఐదుస్థానాలలోను పుట్టినవి కంఠ్యాలు, తాలవ్యాలు, మూర్ధన్యాలు, దంత్యాలు, ఓష్ఠ్యాలు. ఈ వరుస చూడండి.

| | కంఠం | తాలు | మూర్ధ | దంత | ఓష్ఠం |
|---|---|---|---|---|---|
| 1 | అ | ఇ | ఋ | ౡ | ఉ (ఉఫ్గ) |
| 2 | కఖగఘ ఙ | చఛజఝ ఞ | టఠడఢ ణ | తథదధన | పఫబభమ |
| 3 | | య | ర | ల | వ |
| 4 | | శ | ష | స | |
| 5 | హ | | | | |

కొన్ని మిగిలిపోయాయికదూ ! వాటికి ఒకే స్థానంకాదు. కనుక ఈ వరుస చూడండి.

| కంఠతాలు | కంఠోష్ఠ్యం | దంత్యోష్ఠ్యం | జిహ్వామూలం | నాసిక |
|---|---|---|---|---|
| ఏ ఐ | ఓ ఔ | వ | గ(అక్) | సున్నఙఞణనమ |

మీకు సందేహంగాఉంటే కొన్ని అక్షరాలు పలికి చూడండి. అ పలకండి. గొంతు కొండనాలుకనుంచి వస్తున్నట్టులేదూ! ఫ అనండి రెండు పెదవులూ అప్పళిస్తున్నాదు. శ పలకండి శ్ శ్ శ్ అని దవడలు చొట్టలు పడుతున్నాయే ! ర అనండి. నాలుక అంగిలికి తగిలి హార్మోనియం వాయించినంతపనవుతున్నది. స అనండి. నాలుక చివర పంటి కుదుళ్ళను తాకడంలేదూ! ఏ అనండి. మెడా మూతీ ఎందుకు వంకర చేస్తారు ? మ అనండి. పెదవులూ కలుస్తున్నాయి, ముక్కుతోనూ మాట్లాడుతున్నారు. ఇవి ఇప్పుడు మీకు సులభం అని తోస్తున్నాయి. కాని, ఎన్నో వేల సంవత్సరాల పరిశీలన ఫలితమిది.

ఇంకా వీటిలో మనం అక్షరాలు పలికేటప్పుడు చేసే ప్రయత్నం, నాలుక ఆనడం, ఊనడం, ఊపిరి పారడం మొదలయిన వాటినిబట్టి కలిగిన భేదాలను కూడ మన పూర్వులు ఎంతో వివేచన చేశారు. చూచారుగదా! ఎంత

శాస్త్రీయంగా ఏర్పడిందో మన వర్ణమాల! కనుకనే ప్రపంచంలోని వర్ణమాలలన్నిటిలోను మన వర్ణమాల శాస్త్రీయమని, నిర్దుష్టమని పండితులు ప్రశంసించారు. ప్రపంచంలో అందరికంటే మనం భాషాశాస్త్ర విషయంలో ముందంజ వేసినవారమని ఖితాబులు ఇచ్చారు.

పై వరుసలో ఇ తర్వాత ఋ ౠ ఉన్నాయికదూ! అవును. మొదట్లో ప్రాతిశాఖ్యలకాలంలో అఋఇఉఏఐఓఔ అనేదే అచ్చులవరుస, అచ్చులు, హల్లులు అనే పేర్లు కూడా లేవు. అఋఇఉఏఐఓఔ అనే ఎనిమిదక్షరాలను సామాన్యాక్షరాలని హల్లులను సంధ్యక్షరాలని అనేవారు సామాన్యాక్షరాలంటే అన్నిటికి ఉమ్మడిగా ఉండేవి; సంధ్యక్షరాలంటే మరొక అక్షరం చేరికతో పలికేది. ఈ సామాన్యాక్షరాలను స్వరూపాలని. సంధ్యక్షరాలను వ్యంజనాలని కూడాఅన్నారు. పాణిని ఈ అచ్ హల్ పద్ధతిని ప్రవర్తింపజేశాడు. ఈ పేర్లు పాణిని తన వ్యాకరణ పరిభాష కోసం పెట్టుకొన్నవే. ఈ సామాన్యాక్షరాల వరుసనుకూడ అ ఇ ఉ ఋ ౠ అని మార్చివేశాడు. అప్పటినుంచి ఈ పద్ధతిలోనే అక్షరాలు దిద్దుకోడం అలవాటయింది.

బుద్ధభగవానుడూ తన బాల్యంలో ఈ పాణిని పద్ధతినే అక్షరాలు దిద్దుకున్నట్టుంది. ఈ కథ లలితవిస్తరంలో ఉంది. లలితవిస్తరమంటే అశోకుని కాలంలో వ్రాసిన బుద్ధుని జీవితచరిత్ర అని మీకు తెలుసు. బుద్ధుడు బడికి వెళ్ళినప్పుడు అతనితోపాటు తక్కిన పిల్లలకూ ఉపాధ్యాయుడు అక్షరాలు సంత చెప్పేవాడు. ఇప్పుడు క కలము, ప పంట, లాగే అప్పుడూ ప్రతి అక్షరాన్ని ఏదో పదంచెప్పి పిల్లలతో పలికించేవారు. బుద్ధుడు పలుకుతూ వచ్చిన అక్షర క్రమము కొంత వినండి.

"ఇతి హ భిక్షవో దశదారక సహస్రాణి బోధిసత్త్వేన సార్థం లిపిం శిక్ష్యంతే స్మ. తత్రబోధిసత్త్వాధిష్ఠానేన తేషాందారకాణాం మాతృకాః వాచయతాం. యదాఆకారం పరికీర్తయంతిస్మ. తదా అనిత్యః సర్వసంసారశబ్దో నిశ్చరతిస్మ. ఆకారే, పరికీర్త్యమానే ఆత్మ పరహితశబ్దో నిశ్చరతస్మ. ఇకారే, ఇంద్రియవైకల్య శబ్దః. ఈకారే, ఈతి బహుళం జగదితి. ఉకారే, ఉపద్రవ బహుళం జగదితి. ఊకారే, ఊనసత్వం జగదితి. ఏకారే, ఏషణాసముత్థానదోష శబ్దః. ఐకారే, ఐర్యాపథ శ్రేయానితి. ఓకారే, ఓఘోత్తరశబ్దః. ఔకా-రే ఔపపాదుకాశబ్దః అంకారే, అమోఘోత్పత్తి శబ్దః అఃకారే, అస్తంగమన శబ్దో నిశ్చరతిస్మ. కకారే, కర్మవిపాకావతారశబ్దః. ఖకారే, ఖసమసర్వ ధర్మ శబ్దః....హకారే, హతక్లేశాది శబ్దః. క్షకారే పరికీర్త్యమానే, క్షణపర్యంతాభిలాష్య సర్వధర్మశబ్దః నిశ్చరతిస్మ."

అక్షరాభ్యాస వేళనుంచే బుద్ధునికి సర్వసంగ పరిత్యాగబుద్ధి కలదని చెప్పడం ఈ గ్రంథం లక్ష్యం గనుక ఈ పెద్ద పెద్ద మాటలు చెప్పడం మనకు అతిశయోక్తిగా కనిపిస్తుందనుకోండి. మనకు అవసరమైంది అక్షరాలు నేర్పే పద్ధతి మాత్రమేకదా! అది అప్పటినుంచి ఇప్పుడున్న వరుసలో, పదాలు పలికించి నేర్పేవారనేది స్పష్టం-అ-అనిత్యః, ఆ-ఆత్మా, ఇ-ఇంద్రియవైకల్యం ఈ-ఈతి బహుళం ఇలాగ.

మనం సంస్కృత వర్ణమాలను యథాతథంగా తీసుకున్నాము గనుక దానినే అనుసరిస్తూ వచ్చాము మన సాహిత్యంలో మొట్టమొదట ఈ వరుసను చెప్పినవాడు పాల్కురికి సోమనాథుడు. శివస్తోత్రపరంగా ఈతడు వ్రాసిన అక్షరాంక గద్యలో ఈ వరుసే ఉంది. "అకారాది క్షకారాంతం అకరోత్ అక్షమాలికాం" అని అ మొదలు క్షతో ముగించాడు.

అయితే, 'చదువేమీరాదు' అనడానికి మనవారు "అక్షరాలు రావు, అ ఆలు రావు" అనడంపోయి, 'ఓనమాలు రావు' 'ఓ అంటే ఢం రాదు' అని అంటారెందుకు? శుకసప్తతికారుడు.

"అక్కట పొట్ట చించిన నొౘక్షరమైనను రాదు టెక్కులుం
డక్కులెగాని అమ్మనిన డమ్మన నేరదు ........"

అని విసిరాడే! ఈ ఓనమాలేమిటి? అమ్మంటే ఢం రాదు అనడమేమిటి? ఓ అంటే ఢం రాకపోవడ మేమిటి?

ఔను. వర్ణమాలను మనం ఓనమాలు అంటాము. దీనికి పెద్దగాథ ఉంది. ఇది వెయ్యేళ్ళపైగా వస్తున్న సంప్రదాయం.

మన ఆంధ్రదేశంలో పూర్వం బౌద్ధం వ్యాపించినట్టే కన్నడదేశంలో జైనమతం వ్యాపించి ఉండేది. కన్నడదేశంలో విద్యావ్యాప్తి చేసినవారు జైనులే. వారే కన్నడంలో ఆదికవులు. వారే మతాచార్యులు. వారే విద్యా ప్రచారకులు. ప్రజలు వారితోనే తమపిల్లలకు అక్షరాభ్యాసం చేయించేవారు. కొత్తపనిని ప్రారంభించేటప్పుడు ఇష్టదేవతా సంస్మరణ చేసుకొనడం, ఇష్టదేవతకు నమస్కరించడం మనపూర్వుల ఆచారం. ఆ జైన గురువులు మొదట "సిద్ధం నమః" అని సిద్ధునికి నమస్కారం-అని జైన తీర్థంకరులకు-సిద్ధులకు-నమస్కారంచేసి అక్షరాభ్యాస తంతు జరిపేవారు. జైన, బౌద్ధ శాసనాల్లో మొట్టమొదట సిద్ధం అనే పదం వాడడం మనం చూడవచ్చు. అంటే సిద్ధుని స్మరిస్తున్నాము-అని అర్థం. కన్నడుల సంబంధంతో మనదేశంలోను ఈ జైన సంప్రదాయం వ్యాపించింది. నన్నయకు ముందు ఎన్నో జైనకావ్యాలు ఉండేవని, వాటిని నన్నయ వైదికమతావలంబి గనుక పాడుచేయించాడని పుక్కిటి

పురాణాలు ఉండనే ఉన్నాయికదా! సాహిత్యం నశించినా, జైనాచారాలు నశించ లేదు. మనంకూడ అక్షరాభ్యాసం సిద్ధం నమః అనే ప్రార్థనతోనే చేయించేవారం.

తర్వాత వీరశైవమతం మనదేశంలో వ్యాపించింది. అప్పుడు మరి వారే విద్యాగురువులు అందరికిని. వీరశైవ మతంలోని ఏ ఏకాంగివీరుడో వచ్చి అక్షరాభ్యాసం చేయించేవాడు అప్పుడు. తన ఇష్టదేవతా ప్రార్థనతో కాక జైన ప్రార్థనతో ఏపనైనా ప్రారంభిస్తాడా? జైనానికి వీరశైవానికి చుక్కెదురుకదా! కనుక ఓన్నమశ్శివాయ అనే ప్రార్థనతో అక్షరాభ్యాసం జరిగేది. కాని ఎంతో కాలంగా వాడుకయిన సిద్ధం నమః అనే మాట పోలేదు. దానిని కాదనడానికి వీర శైవులు కూడ యత్నించలేదు. దానికి పైగా తమ షడక్షరి ఉందిగా! ఇంతకు సంఘంలోని రహస్యమేమిటంటే మతం మరుగైనా ఆచారాలు, సంప్రదాయాలు మిగిలిపోతాయి, మారవు త్వరగా. కనుక ఓన్నమశ్శివాయ సిద్ధం నమః అని రెండు ప్రార్థనా వాక్యాలు అలవాటయాయి. ఇవి క్రమంగా వికారం చెంది ఓ నామా సీవాయా సీధం నమః అని మారింది. రానురాను ఈ ఓనామాతో ప్రారంభించే అక్షరాలకు ఓనమాలు, ఓనామాలు అనే పేరు రూఢమైంది. ధం అనేది సిద్ధంలో భాగం. అదీ పలకలేదన్నమాట. క్రమంగా అక్షరాలు చదువనే అర్థంలో వ్యవహారానికి వచ్చినమీదట ఓ నామాలంటే చదువనే అర్థంకూడ వ్యాపించింది. అక్షరం ముక్కైనా రాదు, పొట్ట పొడిస్తే అక్షరంలేదు, ఓనమాలు రావు అనే నానుడులు బయలుదేరాయి. అక్షరం విలువ తెలిసినమీదట దానిని ప్రశంసించే పద్యాలకు కొరవా!

అక్షరంబు వలయు కుక్షి జీవనులకు,
అక్షరంబు జిహ్వ కిక్షురసము,
అక్షరంబు తన్ను రక్షించు గావున
అక్షరంబు లోక రక్షితంబు.

సరి నక్షరములె మంత్రం
బరయగ, తరుమూలమెల్ల నౌషధచయమే,
ధరయెల్ల ఫల నిదానమె,
నరులా స్థితి యెరిగి క్రియల నడిపిర యేనిన్.

అక్షరంబు తల్లి అఖిల విద్యలకెల్ల,
అక్షరంబు లోకరక్షణంబు,
అక్షరంబు లేని అబలుల కెందును
భిక్షపుట్టబోదు పృథ్విలోన!

అని ఒక కవి తెగేసి చెప్పాడు. మీరు మీ చిన్నతనంలో ఏమీ చదవక తలా

యించేటప్పుడు మీ ముసలితాతయ్య 'ఓనామ కాక, తినిపోయే మేక' అని గేలి చేయడం జ్ఞాపకంఉందా!

ఓనమాలు వ్రాయడం, కాకాలు గుణించడం అనే వ్యవహారాలు సంఘంలో ఉన్నప్పుడు సాహిత్యంలో జాతీయాలుగా, నానుడులుగా ఎక్కకుండా ఏమవు తాయి? రాయని బాస్కర మంత్రి చాల దానశీలుడట. 'దేహీ' అని అడిగినవానికి 'లేదు' అనిగాని నా అనిగాని చెప్పేవాడు కాడట.

చేకొని రాయని బాచడు
కాకాలు గుణించు పిదపకాలమునాడే
లాకేత్వ మివ్వనేరడు
దాకును కొమ్మియ్య డిట్టి ధన్యులు కలరే!

పొరపాటుతో నా వ్రాస్తాడనుకోండి. స్త్రీ వ్రాయదట.

ఏ వ్రాలైనను వ్రాయను
నా వ్రాయుడు, వ్రాసెనేని నవ్వేచునైనన్
సీ వ్రాసి తావడియ్యడు,
భావజ్ఞుడు రాయనార్యభాస్కరు డెలమిన్.

కా గుణింతాలవరకు ఎందుకు? ఓనామాలు వ్రాసేటప్పుడే ఓ వ్రాసి నా వ్రాయ డానికి జంకేవాడట.

అక్షరాభ్యాసంబు శిక్ష చేసెడునాడె
ఓ వ్రాసి నా వ్రాయకుండినావు.
గుణిత వేళలయందు కోరి లాకేత్వంబు
దాకు కొమ్మియ్యక తర్లినావు,
ఒకటి పంక్తిని వ్రాయ నూహ నేర్చిననాడె
సున్న చుట్టక వ్రేలు సూపినావు,
గణిత వేళలనాడె ఘనయుక్తిగా నేర్పు
గురుకీర్తికిని వ్రాలు గూర్చినావు,
నిజకులాచార ధర్మంబు నిర్వహించి
హెచ్చుగలయట్టి దాతవై హెచ్చినావు,
సరసహృదయుండ వినుకొండ శాసనుండ
భవ్యభరతుండ రాయన భాస్కరుండ !

గుణింతాలతోనే కవి ఎంతచక్కగా చెప్పాడో చూడండి. కాకాలు గుణించడం, ఏత్వ మివ్వడం, కొమ్మియ్యడం, తావడి (తావత్తు) ఇయ్యడం, సున్న చుట్టడం లాంటి నానుడులు ఎంత ముచ్చటగా ఉన్నాయో !

ఈ పద్ధతినే మన పూర్వులు ఐదు బర్లూ నేర్చుకున్నారు. ఐదుబర్లు అంటే అక్షరాల ఐదు వరసలు. బరి అంటే వరుస, వ్రాత అనే అర్థాలతోపాటు అక్షరం అనే అర్థంకూడ పూర్వం ఉండేది. కన్నడంలో బరి అంటే వ్రాయడం. ఆ బరి మనకు వ్రాయి, వడి అయింది. ఆ బరులు-వరుసలు-అక్షరాలు నేర్చుకొనే స్థలం గనుకనే బరి-బడి. ఐదు బరులు ఎలా వ్రాయడమో తెలుసా !

మీరు చిన్నప్పుడు గుంట ఓనమాలు దిద్దుకున్నారూ! ఊహూ! బెంచీల మీద కూర్చుని స్లేట్లలోను, నోటుబుక్కులలోను వ్రాసుకొనేవారికి గుంట ఓనమాలసంగతి ఏం తెలుస్తుంది? ఇంతకూ ఇది పాత పల్లెటూళ్ళ పద్ధతి. పిల్లలు తమముందు ఇసక పరుచుకుంటారు! కాళ్ళదగ్గర కొంచెంగాను, పోను పోను వెడల్పుగాను ఇసక పరవాలి! పిల్లలు అక్షరాలు దిద్దుకోటానికీ, లెక్కలు వేయటానికీ వంగినప్పుడు అక్షరాలు చేయో, కాలో, కడుపో తగిలి తుడుచుకొని పోవచ్చు. కనుక కాళ్ళదగ్గర ఇసక వెడల్పుగా పరచరు. పోనుపోను చేయి అందే మేరకు వెడల్పుగా పరుస్తారు. అక్షరాలన్నీ దిద్దుకున్నతర్వాత అవన్నీ పంతులు గారికి వ్రాసి చూపాలి. వ్రాసేటప్పుడు వాటంతట అవే ఐదు వరుసలవుతాయి.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ

త థ ద ధ న ప ఫ బ భ మ

య ర ల వ శ ష స హ

ళ క్షా త్రై తి

ఇవి ఐదు బర్లు. చేయి అందే మేరలో ఇసక వెడల్పుగా ఉంటుంది కనుక అచ్చులన్నీ వచ్చివేస్తాయి. రెండోవరస కొంచెం చిన్నదౌతుంది. కాళ్ళదగ్గరికి వచ్చేటప్పటికి ఇసక కొద్దిగా ఉంటుంది. నాల్గేనాల్గక్షరాలు వ్రాస్తారు త్రైతి అంటే ఏమనుకున్నారు? అ + ఇతి. త్రైతి "అ మొదలు (అ ఇతి) ఱ అని వర్ణ సమామ్నాయం" అని అర్థం.

ఈ ఐదు బరుల పద్ధతే విదేశాలలోనూ పూర్వం ఉండేదట. పూర్వం వారుకూడ పలకలపై-మీరు చదివిన పాటీలవంటి వాటిపైన వ్రాసి గోడకుకొట్టిన కొమ్ములకు తగిలించేవారట. దీనికి "హారన్ బోర్డ్" అని పేరు. దానిలో ఐదు వరుసలూ చూడండి. వాటికి అచ్చులు-వవల్స్, హల్లులు-కాన్సనెంట్స్ అని విభాగం యాదృచ్ఛికంగా అయిందట. మొదటి వరసపైనుంచి కిందికి అచ్చులు

| అచ్చులు | ఓష్ఠాలు | కంఠ్యాలు | దంత్యాలు | |
|---|---|---|---|---|
| A | B | C | D | అనునాసికాలు |
| E | F | GH | . | |
| I | . | K | . | LMN ( తగిలించే రంధ్రం |
| O | P | QR | ST | |
| U(V) | W | XY | Z | |

మేకుకు తగిలించే భాగంలోని అనునాసికాలు. తర్వాత ఎన్నో అక్షరాలు దీనిలో చేరినా అచ్చుల పద్ధతిమాత్రం మారలేదు.

మన అక్షర సమామ్నాయం వరుసకు కారణమేమిటో, ఓనమాలనే పేరు ఏవిధంగా వచ్చిందో తెలిశాయా!

షష్ఠ ప్రకరణం

# మన ఇరుగు పొరుగు లిపులు

కన్నడం, తెలుగు వ్రాతలలో పూర్వమేమీ భేదంలేదని పదమూడవ శతాబ్దినుంచి వేరేవేరే పేర్లు వచ్చాయని అన్నానుకదూ! కన్నడ సాహిత్యాన్ని బట్టి చూచినా ఇదే రుజువవుతుంది. 14వ శతాబ్దిలో వ్రాసిన కన్నడ బసవ పురాణంలో తెనుగు, కన్నడ, గ్రంథ, ద్రావిడ, మలయాళ, పారశీక లిపుల ప్రస్తావన ఉంది. కనుక అప్పటినుంచి తెనుగులిపి, కన్నడలిపి అనే ప్రత్యేక వ్యవహారం రూఢమైపోయి ఉంటుంది అనుకోవచ్చు.

కన్నడభాషలో అతిప్రాచీన శాసనం మన ప్రాచీన శాసనంకన్నా వంద సంవత్సరాల ముందుదే. ఇది హల్మిడి అనేచోట దొరకడంవల్ల దీనిని హల్మిడి శాసనం అంటారు. ఇది చాళుక్యలిపిలో వేసింగే. కన్నడం, తెలుగు ఎంత సన్నిహితంగా ఉన్నాయో ఈ పక్క పుటలోని పట్టికను చూడండి. మొత్తం మీద స్థూలంగా చూస్తే ఏమైనా భేదం కనిపిస్తుందా! ప్రతి అక్షరం వివేచనతో చూస్తే కొన్ని మారాయని తోస్తుంది. ఇప్పటి కన్నడ, తెలుగు లిపులను తైఫారుచేసి చూడండి. ఉ, ఊ, ఛ హ లు మాత్రమే వేరుగా కనిపించేవి.

తమిళులుకూడ మన కోవవారే. వారు మనకన్నా కొన్ని శతాబ్దాల ముందే వ్రాత తెలుసుకొన్నవారు గనుక వారి లిపినిగురించికూడ కొద్దిగా తెలుసు కుందాము. తమిళలిపికూడ బ్రాహ్మీ లిపినుంచే పుట్టిందని ఎక్కువమంది పండితుల అభిప్రాయం. లేదు, లేదు స్వతంత్రమైన లిపి, బ్రాహ్మీ ప్రభావం వల్ల కొంత మార్పుచెందింది-అని మరికొందరు అన్నారు. దీనికి బ్రాహ్మీలిపికి గల పోలికలనుబట్టి దానినుంచే ఇది పుట్టిందనేదే ఎక్కువమంది నమ్మకం.

తమిళభాషలో కొన్ని స్వరాలే ఉన్నాయి. దానినిబట్టి వర్ణమాలలోను అక్షరాలు తక్కువగా ఉండడం సహజమే. వర్గాక్షరాలలో క జ చ ఞ టణ తన పమ అనే అక్షరాలుమాత్రమే ఉన్నాయి. శ ష స హ లు లేవు. కనుక సంస్కృత శబ్దాలు, గ్రంథాలు వ్రాయడానికి మరికొన్ని అక్షరాలు అవసర

మయాయి. అప్పటి బ్రాహ్మీ లిపినుంచి కొన్ని అక్షరాలు గ్రహించగా, గ్రంథ లిపి అనేది పుట్టింది. అంటే, సంస్కృత గ్రంథాలు వ్రాసే లిపి అన్న మాట.

ఈ గ్రంథలిపి ఆర్యుల సంస్కృత గ్రంథాలకు వాడేది గనుక కేరళంలో, దీనిని 'ఆర్యఎళ్షుత్తు' అనేవారు. దేశభాషల గ్రంథాలను 'వట్టెళ్షుత్తు' అనే వర్ణమాలలో వ్రాసేవారు. వట్టెళ్షుత్తు అంటే గుండ్రటి ఖత్తు, వట్టువవ్రాత అని అర్థం. గ్రంథాక్షరాలు దబ్బఖత్తు గనుక దేశభాషా గ్రంథాలు తమిళ, మలయాళ గ్రంథాలు-వ్రాసే గుండ్రటి ఖత్తును వట్టెళ్షుత్తు అన్నారు. ఇది తమిళ తెలుగు వ్రాత అంటే చాలు. 17 వ శతాబ్దినుంచి మలయాళ గ్రంథాలుకూడ గ్రంథాక్షరాలలో వ్రాయడం - ఆర్య ఎళ్షుత్తులో వ్రాయడం మొదలయింది. ఈ లిపిలో మలయాళగ్రంథాలు వ్రాయడం అరంభించినవాడు తుంజత్త ఎళ్షుతచ్చాన్ అనే ఉపాధ్యాయుడు. అప్పటినుంచి గ్రంథలిపి మారిమారి నేటి మలయాళ లిపి అయింది. వట్టెళ్షుత్తులాగే కోలెళ్షుత్తు అనేది మరొకఖత్తు. అది గుండ్రనిదైతే ఇది నిట్టనిలువుగా ఉండేఖత్తు కనుక దీనికిపేరు వచ్చింది. ఇది వట్టెళ్షుత్తుకు మరొక ఆకారం. ఇదీ వట్టెళ్షుత్తూ ఇప్పుడు అంతరించిపోయాయి.

ఈ వట్టెళ్షుత్తు స్వతంత్రలిపి అని, అశోకలిపికూడ దీనినుంచే పుట్టిందని కొందరు పాశ్చాత్యపండితుల వాదం. అశోకలిపి, వట్టెళ్షుత్తు ఒకే సెమిటిక్ కుదురునుంచి పుట్టాయని కొందరు అన్నారు. కాని వట్టెళ్షుత్తు లో పాండ్యరాజులకు ప్రాచీనమైన శాసనాలేవీ-బ్రాహ్మీశాసనాలతో పోటీ పడదగినవి లేవు గనుక ఈ వాదం నమ్మడానికి కాదని పండితులంటారు. ఇంతకూ ఇది ఖత్తేగాని వేరే లిపి కాదుగా!

ఇప్పుడు మన జాతీయభాష హిందీ, దానిని ఏలిపిలో వ్రాస్తున్నారో తెలుసుకదూ! దేవనాగరిలో, పూర్వమంటే మనం సంస్కృతాన్ని, పారసీని తమిళను మన తెనుగులిపిలోనే వ్రాసుకొని నేర్చుకొనేవారం. ఇప్పుడు లిపి పైన యుద్ధంచేసేవారుండగా అది సాధ్యమా! హిందీని దేవనాగరలిపిలో వ్రాయ వలసిందే. జాతియోద్యమ సమయంలో హిందీప్రచారకులు తమాషాప్రచారం చేసేవారు. రాముడు, కృష్ణుడు మాట్లాడింది హిందీలో, వ్రాసింది దేవనాగరిలో, కనుక దేవనాగరలిపిలో హిందీ నేర్చుకోవాలి-అనేవారు. హిందీలిపిగాని, దేవ నాగరిలిపిగాని రాముని కాలానికి, కృష్ణునికాలానికి లేవు. దేవనాగరలిపికూడ మన తెలుగులిపిలాగే బ్రాహ్మీలిపినుంచి పరిణమించిందేకాని, ఉన్నదున్నట్టుగా ఊడిపడిందికాదు.

దేవనాగరితోపాటు ఉత్తరదేశంలో ప్రచారంలో ఉన్న లిపులన్నీ బ్రాహ్మీ నుంచి పుట్టినవేనని ఇదివరకే చెప్పానుకదూ! ఉత్తరభారతంలో వాడుకలో ఉన్న లిపు లన్నిటిలోను దేవనాగరి ఎక్కువ ప్రచారం గలది.

హిందీవారు, మరాఠీ వారు, బీహారీలు ఈ లిపినే నేడు ఉపయోగి స్తున్నారు. ఇంతేకాక ఇది నేడు మన జాతీయ లిపి కనుక దీని పుట్టుక తెలుసుకొందాం.

నాగరీలిపికి దేవనా గరి నంది నాగరి అనే మరిరెండు పేర్లున్నాయి. 1. నాగర్ అంటే నగర సంబంధమైంది. నగరంలో పుట్టింది అని కదా వ్యుత్పత్తి. బహుశా దీనిని మొదట నగర వాసులు వాడారేమో ! కనుకనే ఈ పేరు-అని కొంత మంది పండి తులు అన్నారు. 2. కాశీ నుంచి ఎక్కువ ప్రచా రమైంది గనుక మొదట కాశీనాగరీ అని అయి. కాశీపదం జారి నాగరీ అనే పేరు మిగిలిం దని మరికొందరన్నారు. 3. మన లిపి తంత్ర శాస్త్ర సంబంధమైన చిత్రాలనుంచి పుట్టింది. తంత్ర శాస్త్రంలో శ్రీ చక్రానికి దేవనగరమని పేరు. ఈ దేవనగ

| | | | |
|---|---|---|---|
| అ = ... अ | | ధ = ... ध | |
| ఆ = ... आ | | న = ... न | |
| ఇ = ... इ | | ప = ... प | |
| ఉ = ... उ | | ఫ = ... फ | |
| ఏ = ... ए | | బ = ... ब | |
| క = ... क | | భ = ... भ | |
| ఖ = ... ख | | మ = ... म | |
| గ = ... ग | | య = ... य | |
| ఘ = ... घ | | ర = ... र | |
| ఙ = ... ङ | | ల = ... ल | |
| చ = ... च | | వ = ... व | |
| ఛ = ... छ | | శ = ... श | |
| జ = ... ज | | ష = ... ष | |
| ఝ = ... झ | | స = ... स | |
| ఞ = ... ञ | | హ = ... ह | |
| ట = ... ट | | ళ = ... ळ | |
| ఠ = ... ठ | | క్ష = ... क्ष | |
| డ = ... ड | | జ్ఞ = ... ज्ञ | |
| ఢ = ... ढ | | కా = ... का | |
| ణ = ... | | కి = ... कि | |
| ణ = ... ण | | కీ = ... की | |
| త = ... त | | కు = ... कु | |
| థ = ... थ | | కూ = ... कू | |
| ద = ... द | | కే = ... के | |

రంలో వ్రాసే లిపి గనుక దేవనాగరి అంటారు - తంత్రవేత్తలు. అధర్వణ వేదంలోను, తైత్తిరీయ బ్రాహ్మణంలోను ఈ దేవనగర ప్రసక్తి కలదట. 4. బుద్ధునికి వచ్చిన 64 లిపులలోను నాగలిపి ఒకటి. ఆ నాగలిపే

| కాలము | తెలుగు-కన్నడలిపి | నాగరలిపి | గ్రంథలిపి | తమిళలిపి |
|---|---|---|---|---|
| క్రీ. శ. ౩ వ శతాబ్ది | [illegible] | | | |
| క్రీ. శ. ౪ వ శతాబ్ది | [illegible] | [illegible] | | |
| క్రీ. శ. ౫ వ శతాబ్ది | [illegible] | [illegible] | | |
| క్రీ. శ. ౬ వ శతాబ్ది | [illegible] | [illegible] | | |
| క్రీ. శ. ౭ వ శతాబ్ది | [illegible] | [illegible] | [illegible] | |
| క్రీ. శ. ౮ వ శతాబ్ది | [illegible] | [illegible] | [illegible] | |
| క్రీ. శ ౯ వ శతాబ్ది | [illegible] | [illegible] | [illegible] | |
| క్రీ. శ. ౧౧ వ శతాబ్ది | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| క్రీ. శ. ౧౪ వ శతాబ్ది | [illegible] | [illegible] | [illegible] | [illegible] |

నాగరలిపి. లలిత విస్తరాన్ని అనువదించుకొన్న టిబెట్టువారు కూడ ఈవిధంగానే అన్నారు. అని మరికొందరి వాదం. షా రాజులను నాగులనేవారు. వారి లిపి గనుక నాగరీ. 5. గుజరాత్‌లో నాగరులనే ఒక తెగ బ్రాహ్మణు లున్నారు. వారు ప్రచారంచేసింది గనుక నాగరీ అని వాదాలు మరికొన్ని. కాని, ఇది బ్రాహ్మీలిపినుంచి ఆవిర్భవించిందనడంలో ఎవరికీ అభిప్రాయభేదం లేదు. 163వ పుటలోఉన్న లిపి పరిణామపట్టిక చూడండి. ఇదిమౌర్య లిపినుంచి ఏడవ శతాబ్దిలో రూపొందించి. అక్షరాలు ఏఏ శతాబ్దిలో మారుతూ వచ్చాయో తెలియడానికి ఒక్క అకార పరిణామం చూడండి పై చిత్రంలో, మనదేశంలో ముఖ్యమైన లిపులన్నీ ఒక కుదురువేనని తెలిపోతుంది. ఈ నాగరి స్వరూపం 7వ శతాబ్దానికి శ్రీ హర్షుని కాలానికి ఏర్పడిందనవచ్చు. చూడండి ఆయన సంతకం. ఈ పుస్తకంమూడవభాగంలో ఉంది. అప్పటినుంచి మారుతూ వచ్చి తొమ్మిదవ శతాబ్ది-పదవశతాబ్ది మధ్య స్థిరరూపం పొందింది. ఈ కాలాని కంతా సంస్కృతశాసనాలకు ఈ లిపినే వాడడం ప్రారంభించారు. చాళుక్యులు, విజయనగరరాజుల కాలంలో వాడిన నాగరిని నందినాగరి అన్నారు. నంది అనే వాడు ప్రచారం చేయడం వల్లనో, విరూపాక్షుని వాహనమైన నంది పేరుతోనో ఈ పేరు వచ్చిఉంటుంది. నాగరాక్షర వికాసంలో ఆయాప్రధాన ఘట్టాలు పక్కపుట లోని పట్టికనుచూస్తే స్పష్టమౌతాయి.

మహారాష్ట్రదేశంలో వాడే నాగరికి ఇతర ప్రాంతాలలో వాడే నాగరికి పూర్వం కొంచెం భేదం ఉండేది. మహారాష్ట్ర నాగరీలిపి అందంగాఉండి చిన్న పిల్లలకుకూడ సుగమంగాను, సుబోధంగాను ఉండేది. కనుక, "బాళబోధ" అని పేరువచ్చింది. దీనిని "బాళబంధు" అనడంకూడ కద్దు. నాగరి అనేమాట తర్వాత తర్వాత ప్రచారమైంది కాని "బాళబోధ్, బాళబంధు" అనే మాటలే మహారాష్ట్ర ప్రభావంవల్ల మన ఆంధ్రదేశంలో వాడుకలో ఉండేవి. ఏభై ఏళ్ళకింద కూడ నాగరి అన్న పేరు వృద్ధులకు తెలీదంటే ఆశ్చర్యమేమీ లేదు. ఒకతరం క్రింది ముచ్చట. మాయింట్లో తెలుగు, కన్నడ, నాగరిలిపుల్లో సంస్కృత పుస్తకాలు చాలా ఉండేవి. మా తాతగారికి మరాఠీ, తెలుగు.

తమిళ, కన్నడం మొదలయిన భాషలు చాల వచ్చు. అప్పటివారికి సంస్కృతం అత్యవసరం గనుక, దానిలో పాండిత్యం ఉందని వేరే చెప్పనక్కరలేదు. నేను పొరుగూరికి వెళ్ళవలసి వచ్చింది. అక్కడ సిద్ధాంత కౌముది అవసర మైంది. మా తాతగారికి నాగరి లిపిలోని సిద్ధాంత కౌముది పంపవలసిందిగా జాబు వ్రాశాను. "ఇంట్లో తెలుగు, బాళబందు అక్షరాల కౌముది ఉన్నదేకాని, నాగిరి అక్షరాలది లేదు. నివే వచ్చినప్పుడు వెదుక్కోవలస్నిది" అని జాబు వ్రాశారు ఆయన. నాగరి, బాళబంధు ఒక్కటేనని తర్వాత తాతగారికి విజ్ఞాపన చేశానులెండి.

మహారాష్ట్రంలో మోడి అనే మరొక లిపి ఉంది. ఇది దేవనాగరి లిపికి జిలుగువ్రాత అనవచ్చు. తంజావూరు మహారాష్ట్ర రాజుల రాజరికం పత్రాలు, కవుళ్ళు, ఒడంబడికలు, లెక్కలు, లావాదేవీలు, చరిత్ర, పుక్కిటి పురాణాలు ఈ లిపిలో వ్రాసేవారు. ఇది చాల జిలుగు; చదవడం చాల కష్టం. ప్రత్యేకంగా పరిశ్రమ చేసినవారికి సాధ్యంకాని, మరొకరికి సాధ్యంకాదు. కనుక ఇతరులు ఈ లిపిని ఎగతాళి చేసేవారు. ఇలాటి హాస్యపు కథ ఒకటి మెకంజీ రికార్డు లలో ఉంది.

ఒకానొకప్పుడు లంకాధిపతి అయిన విభీషణునికి కడుపునొప్పి వచ్చిం దట. ఎన్నో వైద్యాలు చేయించాడు. మంత్రాలు వేయించాడు. కుదరలేదు. మహారాష్ట్ర దేశంలో ఒక వైద్యరాజున్నాడు. వానిని పిలిపించి వైద్యం చేయిం చుకోవలసింది-అని ఒకరు సలహా యిచ్చారట. మానవమాత్రుడు రాక్షసుల మధ్యకు కోరి కోరి ఏ గుండెలతో రాగలడు? కనుక విభీషణుడే స్వయంగా ఒక రాత్రి మాయావేషంతో కామగమనంతో మహారాష్ట్రం చేరుకుని వైద్య రాజు యింట్లో ప్రవేశించాడు. రాత్రి అకస్మాత్తుగా లేపి లంకకు రమ్మంటే ఎవరైనా వస్తారా! అమాంతంగా ఆయనను ఎత్తుకొని రాత్రికి రాత్రి లంకకు చేరుకున్నాడట. ఇంతలో తెల్లవారింది. వైద్యరాజు మేల్కొని నిర్ఘాంతపో యాడు. లంకేశ్వరుడు ఉన్న సంగతి మనవి చేశాడు. వైద్యరాజుకు ఇక తప్పే దేముంది? పరదేశం. రాక్షసరాజ్యం, ఎక్కడికి వెళ్ళడానికీ వీలులేదు. కనుక మరల స్వదేశానికి భద్రంగా పంపివేసే షరతుపై చికిత్స చేయడానికి అంగీక రించాడు.

కొంతకాలం చికిత్స సాగింది. విభీషణుని జబ్బు కుదిరింది. వైద్యరాజును విభీషణుడు ఎంతో గొప్పగా సన్మానించాడు. కాని తనకు వచ్చిన రహస్య విద్యలలో ఏదో ఒకటి మహారాష్ట్రంలో లేనిది వైద్యరాజుకు ఉపదేశిస్తేగాని తనకు సంతృప్తిలేదు. ఈ సంగతి వైద్యరాజుకు మనవిచేయగా, ఆయన

రహస్యవిద్య స్వీకరించడానికి అంగీకరించాడు. ఆ లంకాధిపతి ఉపదేశించినదే మోడీ లిపి.

దీని సారాంశం మోడీ రాక్షస లిపి అని.

నేడు శిఖ్ఖులు పట్టుదలతో తమ తమ గ్రంథాలు వ్రాసుకొనే లిపికూడ దేవనాగరికి పూర్వరూపమైన జిలుగువ్రాత. మొదటి గురువైన శ్రీ నానక్ దీనిని ప్రవర్తింపజేశాడు గనుక, గురుముఖం నుంచి వచ్చింది, గనుక దీనికి 'గురుముఖీ' అని పేరు వచ్చింది. ఈ లిపినిగూర్చి నేడు పంజాబులో యుద్ధాలు జరుగుతున్నాయి. కాని ఇది నేటి దేవనాగరికన్నా ముందుదే.

సప్తమ ప్రకరణం

# బ్రాహ్మీలిపి విదేశయాత్ర

బ్రాహ్మీలిపి మనదేశంలో ఇన్ని అవతారాలు వేయడం మాత్రమేకాదు; సముద్రాలు దాటివెళ్ళి విదేశాలలోను బహురూపాలు పొంది బహునామధేయాలు పొందింది. సముద్రాలు దాటి ఎలా వెళ్ళింది? - అంటారేమో! మూడుముక్కలలో చెబుతాను.

మనదేశానికి పశ్చిమదేశాలతో బుద్ధభగవానునికి ముందే సంబంధం ఉండడం మీరు ఇదివరకు చదివే ఉన్నారు. అలాగే మన వేదమతం, బుద్ధభగవానుని సందేశాలు తూర్పుదేశాలలో రెండువేల ఏళ్ళనాడే వ్యాపించాయి. తూర్పు దేశాలంటే-లంక, బర్మా, సయాం, మలయా, చంపా (అన్నాం), కంబోడియా, లావోస్, సుమత్రా, జావా. బలి, మంగోలియా, మంచూరియా, చీనా, కొరియా, జపాన్, టిబెట్ మున్నగు దేశాలన్నమాట. ఆకాలంలో సముద్రయానంపై నిషేధం లేదు. మన బెహారులు, సన్న్యాసులు, బౌద్ధభిక్షువులు కొండలు, నదులు, ఎడారులు, సముద్రాలు దాటి విదేశాలకు వెళ్ళేవారు. బెహారులు మన సరకులను విదేశాలలో అమ్మి, అక్కడినుంచి తెచ్చిన వస్తువులను ఇక్కడ అమ్మేవారు. మన సన్న్యాసులు బౌద్ధభిక్షువులు మన మత సంప్రదాయాలను అక్కడ ప్రచారంచేసేవారు. ఇకనేముంది? మందిరాలు, మఠాలు, విహారాలు, గురుకులాలు వేనకువేలుగా వెలసినవి; భారతీయ సంస్కృతి అక్కడ అల్లిబిల్లిగా అల్లుకుని అక్కడివారు తామే రాముని, కృష్ణుని సంతతివారమని గర్వపడేటంత బలంగా పాతుకుంది. భారతీయ జీవితవిధానం వేళ్ళతన్ని నిలిచి చిగిర్చి, పూచి, ఫలించింది.

మన మత సంస్కృతుల ప్రచారం మనగ్రంథాలు, మనలిపి లేనిదే సాధ్యంకాదుగదా! కనుక మతప్రచారంతో పాటు మనలిపి ప్రాధాన్యం వహించింది. ఈలిపి త్రివిక్రమునివలె ఆగ్నేయాసియా దేశాలను ఆక్రమించుకుంది. ఈ త్రివిక్రముని మొదటిఅంగ కృష్ణవేణ్ణా తీరంనుంచి పడింది. కృష్ణానదీతీరం భూములనుంచి మతప్రచారకులతోపాటు బయలుదేరిన శిల్పులు, ఆగ్నేయాసియాకు అమరావతి ఒరవడిగా అందాలు దిద్దగా, లిపికారులు మతాచార్యుల మాటలను శిలాక్షరాలుగా చేశారు.

ఈ ఆగ్నేయాసియా దేశాలలో భారతీయ సంస్కృతిని మొట్టమొదట ఆకళించుకున్న ప్రాంతం లంకాద్వీపం. ఈ ద్వీపాన్ని సరిత్పతి తన తరంగ హస్తాలతో వేరుచేసినా, నిజానికి ఇది భారతదేశంలో భాగమే. రామాయణ కాలం నుంచి మనకు దీనితో సంబంధం ఉండడం వేరుగా చెప్పనక్కరలేదు. అశోకుని కుమారుడు మహేంద్రుడు, కుమార్తె సంఘమిత్ర బోధివృక్షశాఖతో లంకకు వెళ్ళినప్పుడు వారివెంట తెలుగువారు చాలమంది వెళ్ళారు. అశోకుని ముందు గూడ లంకలో ఆంధ్రబౌద్ధబిక్షువులు మతప్రచారం చేసేవారని చరిత్ర చెబుతున్నది. కనుక లంకకు, కృష్ణాతీరప్రాంతానికి అశోకునిముందే సంబంధం చాలా ఉండేదనడం స్పష్టం.

లంకలో ప్రాచీన శిలాశాసనాలకు లెక్కలేదు. అక్కడి మహరట్‌మలే లోని రెండువేల యేళ్ళనాటి శాసనాలలిపి అమరావతి, జగ్గయ్యపేట శాసనాల లిపే. మతంతోపాటు అక్కడికి వెళ్ళిన బ్రాహ్మీలిపి క్రమంగా ఎన్నోమార్పులు పొంది నేడు రెండుపేర్లతో వాడుకలోఉంది. ఒకదానిపేరు "ఎళు" రెండవదాని పేరు "సింహళ". ఎళులిపిని అచ్చసింహళ భాష - అచ్చ తెలుగులాగ - వ్రాయడానికి, సింహళను అన్యదేశ్యాలు వ్రాయడానికి ఉపయోగిస్తారు. ఎళు, సింహళ అనేమాటలు ఒక్కటేనని, సింహళ అనేమాటే సింహళ - హెళ - హెళు - ఎళు అని క్రమంగా మారిందని పండితులంటారు. సింహళ లిపికి "మిశ్ర" అని మరొక పేరుకూడ ఉంది.

సింహళలిపిగా మారిన బ్రాహ్మి లంకనుంచి లంకకు నిరృతిగా 400 మైళ్ళ దూరంలోని మాల్‌దీవ్‌లకు - మాలాద్వీపాలకు - వెళ్ళింది. ఈ ద్వీపాలు మొత్తం రెండువేలు ఉంటాయి. కాని 217 ద్వీపాలుమాత్రమే జనావాసాలు. జనసంఖ్య లక్షలోపు. మొదట వీరంతా బౌద్ధులు. తర్వాత 12 వ శతాబ్దిలో ముస్లిములయ్యారు. మాలాద్వీపాలలో బ్రాహ్మీలిపికి "ఎవెళఅకురు" అని పేరు వచ్చింది. సింహాళాక్షరాలు అని అర్థం. దీనికిక్రమంగా "దివిస్‌అకురు" "దివిహి అకురు" అనే పేర్లువచ్చాయి కొంతకాలానికి. ఇది రాజశాసనాలు వేయడానికి మాత్రమే వాడేవారు. ఇప్పుడది పూర్తిగా మరుగైపోయింది. నేడు అక్కడ వాడుకలో ఉన్న లిపిపేరు "గబులి", "గబులీతనా". ఇది దివిస్‌అకురూ, అరబ్బీ సంఖ్యలనుంచి తయారయింది.

బ్రాహ్మీలిపి తూర్పుకోస్తానుంచి ఇటు తూర్పు దిక్కుగా చంపా (అన్నాం) కంబోడియాలకు వెళ్ళింది. మన వేంగిలిపిలాగే ఉన్న ఈ లిపిని చంపావాసులైన చంజాతివారు స్వంతం చేసుకొని 'చమ్' లిపి అనిపేరు పెట్టుకున్నారు. ఈ లిపే లావోస్, కంబోడియా (కాంభోజం) దేశాలకు ప్రాకి, వ్రాత ఒడుపులను

బట్టి, వ్రాతసాధనాలను బట్టి పెక్కు పేర్లు పొందింది.

1. అఖర్స్రాహ్ - చంపావాసులు వ్రాసే నిలువక్షరాలు. దీనినే అఖర్ థ్రాహ్ అనీ అనేవారు. 2. అక్బర్ బ్రీంగ్ - కంబోడియా వాసులైన ఖ్మేర్ తెగవారు వ్రాసేలిపి. 3. అఖర్ తపుక్ - పుస్తకలిపి. 4. అక్సర్ మూల్ - ఖ్మేరులు వ్రాసే మరొకఖత్తు. 5. అఖర్ గర్మిన్ - సాలీడు కాళ్ళలాగ ఉండే లిపి. 6. అఖర్రిక్ - పవిత్రలిపి. 7. అఖర్ అటువోల్ - ముద్రలలిపి. 8 అఖర్యోక్ - పవిత్రలిపి మరొకకత్తు.

బ్రాహ్మీలిపి వాడకానికి ముందు అక్కడ చీనాలిపివాడుకలో ఉండేది.

చంపా (అన్నాం) నుంచి సయాముకు నాగరికత వ్యాపించింది. దానితో పాటు లిపికూడ వెళ్ళింది సయాం, అస్సాం అనే రెండు దేశవాచకపదాలు షాన్ అనే బర్మాపదంనుంచి పుట్టాయని పండితులంటారు. షాన్ అనే జాతి వారు రెండువేల సంవత్సరాలకు ముందే బర్మానుంచి పడమరగా అన్నాముకు, ఆగ్నేయంగా సయాముకు వ్యాపించారు. సయాములో బ్రాహ్మీలిపికి ఫాక్ ఖమ్ అనేపేరు. అంటే చింతగింజల లిపి అన్నమాట. చింతగింజలలాగ అక్షరాలు వ్రాసేవారేమో! కనుక ఈపేరు వచ్చింది.

వేంగిబ్రాహ్మీ మరొకదోవన జావాకు వెళ్ళింది. జావా ఇండోనీసియా ద్వీపసముదాయంలో కల్లా పెద్దది. రామాయణం దీనిని యవద్వీపం అని పేర్కొన్నది. వేంగిలిపిని అక్కడివారు "అక్సర్ కవి, బాసాకవి" అన్నారు. అంటే సంస్కృతకవితల లిపి, సంస్కృతభాష వ్రాసే లిపి అన్నమాట. దీనిని త్రితేష్ట అనే బ్రాహ్మణుడు భారతదేశం నుంచి తెచ్చాడని అక్కడివారు అంటారు. బౌద్ధులు దీనిని "అచ్చరబుద్ధ" అని అన్నారు. అంటే బుద్ధుడు ప్రసాదించిన అక్షరాలన్నమాట. నేటి జావాలిపులన్నీ ఈ అక్సర్కవి - అచ్చర బుద్ధనుంచి పుట్టినవే. నాలుగువందల ఏళ్ళకిందట ముస్లింసంస్కృతి, పాశ్చాత్య సంస్కృతి వ్యాపించడంవల్ల అరబ్బీ, రోమను లిపులుకూడ జావాలో వాడుకకు వచ్చాయి.

అక్కడనుంచి మనలిపి సుమత్రాకు వెళ్ళింది. సుమత్రాను రామాయణం స్వర్ణద్వీపం అన్నది. సుమత్రావాసులకు వ్రాత అంతకుముందే తెలుసు. చాల తమాషాగా వ్రాసేవారు. ఎడమవైపున అట్టడుగునుంచి ప్రారంభించి అక్షరం పైన అక్షరం పేరుస్తూ నిలువుగా పైవరకువ్రాసి, తర్వాత కిందికి, మరల పైకి వ్రాస్తూపోయేవారు. అంటే-వంపులవంపులు వంకీలాగా |‾|_|‾|_|‾| వ్రాస్తూపోయేవారు. దీనికి కారణమేమిటంటే వారు పొడుగాటి వెదురుదబ్బలపై వ్రాసేవారు. ఒకేమారు పొడుగ్గా పంక్తులువ్రాయడం కంటే, ఎక్కడికక్కడే

భాగాలు భాగాలుగా వంపులు వంపులుగా వ్రాయడం సులువుగాతోచి ఉంటుందేమో! దీనిని జావా ఆదిమవాసులైన బటక్‌జాతివారు వ్రాసేవారు. జావా నుంచి 'అక్సర్ కవి' వ్యాపించినమీదట ఈ వంకీవ్రాత సుమత్రాలో అంతరించిపోయింది.

అక్సర్‌కవి వేషంలో ఉన్న బ్రాహ్మి ఫిలిప్పీన్స్‌కు వెళ్లి 'తగ్‌బనుయా' 'మంగ్యన్' అనే పేర్లు పొందింది. ఫిలిప్పీన్స్‌లో అంతకుముందు మలయాలిపి శాఖ వాడుకలో ఉండేదట. ఆ మలయాలిపి శాఖకూడ మన అమరావతి ప్రాంతంనుంచి వెళ్ళిందేనట.

మనలిపి సముద్రమార్గంగా కొరియాకు, అక్కడినుంచి, జపానుకు ప్రాకింది. కాని ఎంతోకాలం ఉండలేకపోయింది. క్రీస్తుశకం మూడవశతాబ్దిల్లో వాన్‌షిన్ అనే పండితుడు చీనాలిపిని కొరియాకు తెచ్చాడని కొరియా ప్రాచీన గాథలు చెబుతున్నాయి. అంతకుముందు బ్రాహ్మీలిపే మరొక రూపంతో వాడుకలో ఉండేది. నేడు కొరియాలోను, జపాన్‌లోను ఉన్నలిపులు వాన్‌షిన్ తెచ్చిన చీనాలిపినుంచి పుట్టినవే.

మనలిపి తెనుగు కోస్తానుంచి సాలంకాయనుల కాలంలో బర్మాకు వెళ్ళింది. అది క్రమంగా ఎన్నో మార్పులుచెంది నేటి బర్మాలిపిగా మారింది. బర్మాలిపి గుండుకత్తును "త్సాలోన్హ్" అని, శాసనాలలిపిని "త్సాక్యోంక్" అని అంటారు.

పటమటగా వెళ్ళిన బ్రాహ్మీలిపి చీనా టర్కిసాన్‌లో వ్యాపించి "కూచీన్" "అగ్నీన్" అనేపేర్లు పొందింది.

ఇది ఖోటాన్‌కు చేరగా, అక్కడివారు దీనిని "ఖోటానీ" అన్నారు. ఖోటాన్ ప్రాంతాన్ని మన పూర్వులు "గోస్తన" అని వ్యవహరించేవారు. చీనాభాషను కూడ అప్పుడు ఈఖోటానీ లిపిలోనే వ్రాసేవారట అక్కడిప్రజలు. మాటకొకబొమ్మ. ఉచ్చారణకొక బొమ్మ వ్రాసే బాధకంటే ఎంతో శాస్త్రీయంగా, ఉచ్చారణానుగుణంగా రూపొందిన మన లిపిలో చీనాభాషను వ్రాసినందుకు, అలా వ్రాయాలని తోచినందుకు మనం వారిని అభినందించాలిసుమా ! ఇప్పుడుకూడ అలా చేస్తే, ఎంత బాగుంటుందో !

బ్రాహ్మీలిపి ఖోటాన్ నుంచి టిబెట్టుకు వెళ్లింది. లాసాగరం రాజధానిగా టిబెట్ సామ్రాజ్యాన్ని స్థాపించిన థోన్‌మిసామ్‌భోటా అనే మంత్రి దీనిని టిబెట్టుకు తీసుకువెళ్లాడట. అక్కడ దీనికి కర్ర అచ్చులు తయారు చేశారు. అంటే మన లిపి అచ్చుకావడం క్రీస్తుశకం ఏడవశతాబ్దంనాడే ఆరంభమయిందనవచ్చు.

టిబెట్టునుంచి ఈలిపి చీనా చక్రవర్తి కుబ్లాయిఖాన్ కాలంలో చీనాకు, మంగోలియాకు వెళ్లింది. కుబ్లాయిఖాన్ బౌద్ధుడు. ఆయన చీనాలో బౌద్ధమత వ్యాప్తికోసం టిబెట్ నుంచి పస్పెప అనే బౌద్ధమతాచార్యుని పిలిపించాడు. పస్పెపాచార్యుడు చీనా, మంగోలియా భాషలకు టిబెట్టు బ్రాహ్మీలిపిని వాడుకకు తెచ్చాడు. ఇందువల్ల అక్కడ వ్యాపించిన లిపికి పస్పెపలిపి అని పేరువచ్చింది. కాని ఇది ఎందుచేతనో జనసామాన్యంలో వ్యాపించలేదు. అధికారముద్రలలో చాలాకాలం ఉంది.

ఈ పస్పెపలిపిని కొద్దిగా సంస్కరించుకొని వోల్గానది దిగువన ఉండే కల్మక్ జాతివారు నిన్న మొన్నటిదాక వాడుకొనేవారు.

నేపాల్‌లోని నేవారీలిపి దేవనాగరి శాఖే.

ఈవిధంగా బ్రాహ్మీలిపి విదేశ పర్యటనలో తన పేరూ, ఊరూ, ఉరువు కోల్పోయి నా అక్కడి పెక్కుజాతులకు అక్షరభిక్ష పెట్టింది.

అష్టమ ప్రకరణం

# అంకెల అంద చందాలు

అంకెల చరిత్ర అక్షరాల చరిత్రకన్న ఆశ్చర్యకరంగా ఉంటుంది. మనం నేడు వాడుతున్న అంకెలుకూడ ఒకప్పుడు బొమ్మలేసుమా!

ఒకప్పుడు మన పూర్వులు వేళ్ళతోనే లెక్కపెట్టేవారు. ఒకటి అనడానికి ఒకవేలును నిలువుగానో, అడ్డంగానో చూపేవారు. రెండు అనడానికి రెండు వేళ్ళు. ఇలాగే ఐదు అనడానికి చేయెత్తి చూపేవారు చేతికి ఐదువేళ్ళుకదా! పది అనడానికి రెండుచేతులు.

ఇప్పటికీ వేళ్ళతో లెక్కపెట్టే పద్ధతిని మనం చూడవచ్చు. పిల్లలు లెక్కపెట్టడం చూడండి. వేళ్ళను మడిస్తేగాని లెక్క ముందుకుసాగదు పల్లెటూళ్ళ నుంచి పండ్లగంపలు తెచ్చేవారిని చూచారా! వారు ఎంచే పద్ధతి పరిశీలించారా! పండ్లను రెండేసి రెండేసి, ఐదేసి ఐదేసి ఎంచుతారు. ఇన్ని జోడాల పండ్లు ఇన్ని కుచ్చీలు, ఇన్ని చేతులు అంటారు.

క్రమంగా ఎంచడానికి మరొక సులభమార్గంకూడ తట్టింది. ఇది గవ్వలతోనో, రాళ్ళతోనో లెక్కించడం. మొదటినుంచి పదివరకు లెక్కించిన తర్వాత ఒక రాయినో, గవ్వనో వేరుగా ఉంచడం; లేకపోతే ఒక్కలెక్క అయినతర్వాత గీతగీయడం; లేకపోతే మట్టో, ధాన్యమో చిన్న గుప్పగా పోయడం.

వేళ్ళను నిలువుగానో, అడ్డంగానో పెట్టేపద్ధతే వ్రాతలోనూ వచ్చింది. అశోకుని శాసనాల్లో ఒకటికి ఒక్క నిలువుగీత-।, రెండింటికి రెండు నిలువు గీతలు-।। మూడింటికి మూడు నిలువుగీతలు-।।।, నాల్గింటికి నాలుగు నిలువు గీతలు-।।।। కనిపిస్తాయి. కొన్ని శాసనాలలో నాలుగుకు ఒక నిలువుగీత, దాని మధ్యకు ఒక అడ్డుగీత - అంటే + ప్లస్ మార్కులాగానో, × ఇంటు మార్కులాగానో కనిపిస్తాయి. గీతలు గుర్తుకోసం పెట్టేవారన్న సంగతికి గాథాసప్తశతి లోని ఒక వర్ణనను మీరు ఇదివరకే చదివారు.

రెండువేల యేళ్ళనాటి ఖరోష్ఠి శాసనాలలో ఒకటి, రెండు, మూడు సంఖ్యలకు అడ్డుగీతలు కనిపిస్తాయి. నాలుగుకు ఇంటుమార్కు × గుర్తు కనిపిస్తుంది. రెండు నిలువుగీతలు, మూడు నిలువుగీతలు వ్రాసే తొందరలో

అంటే ఖరోష్ఠి కుడివైపునుంచి వ్రాసేలిపి గనుక కుడివైపునుంచి వ్రాసే తొందరలో ఒకటిగా చేరిపోయాయి. 10 కి, 20 కి, 100 కి, 1,000 కి వేరే గుర్తులూ ఉన్నాయి. అప్పటికి సున్న సంగతి తెలీదు.

మన తెలుగు సంఖ్యల సంగతి చూద్దాం. క్రీస్తుపూర్వమున్న ఆంధ్ర రాజుల శాసనాలలో సంఖ్యలు వ్రాసే అలవాటే కనిపించదు. ఒక్క శాసనంలో మాత్రం నాలుగుకు X గుర్తు కనిపిస్తుంది. సామాన్యంగా మాటలతోనే సంఖ్యలు తెలిపేవారు. నానేఘాట్ గుహా శాసనాలలో తొమ్మిదివరకు సంఖ్యలు స్పష్టంగా ఉన్నాయి. మూడు వరకు అడ్డుగీతలు, నాలుగింటినుండి విడిగుర్తులూ ఉన్నాయి. ఈ గుర్తులు ఖరోష్ఠి వర్ణమాలలోని అక్షరాలని, సంఖ్యాసూచకాలైన సంస్కృత పదాల మొదటి అక్షరాలని పాశ్చాత్య పండితులంటారు. అంటే:- చత్వారి అంటే చ; పంచ అంటే ప; షట్-ష; సప్త-స లాగ ఈ అంకెలను ఖరోష్ఠి అక్షరాలతో పోల్చిచూడండి.

| 5, 6 శతాబ్ది తెనుగు కన్నడ సంఖ్య | 10వ శతాబ్ది దేవనాగరి | 15వ శతాబ్ది కన్నడ | తెనుగు సంఖ్యలు |
|---|---|---|---|

నానేఘాట్ అంకెలనుంచే కన్నడ-తెలుగు అంకెలు పుట్టాయి. సాలంకాయన విజయదేవవర్మ వేంగీశాసనం ఎడమవైపు చూడండి. అవి సంఖ్యలు. ఒకటి అందంగా, తమాషాగా చెక్కాడు శిల్పి. రెండో అంకెను రెండు ల ఒత్తులు

లాగ చెక్కాడు అడ్డంగా గీతగీస్తే అందంగా ఉండదని కాబోలు! అదిక్రమంగా ౧ ఈ ఆకారానికి గుమ్మటం లాగ వచ్చింది. పదిహేనో శతాబ్ది వరకు కన్నడ-తెలుగుసంఖ్యలలో మార్పేమీలేదు. ఆటుతర్వాత కొద్దిగా మార్పు వచ్చింది.

రెండు, మూడు అంకెల గుర్తులు రెండుమూడు ల ఒత్తులు ఒకదానిపై మరొకటి బోర్లించినట్లున్నాయి గదా! నేటి తెలుగంకెలుగా ఎలా మారాయని సందేహం కలుగుతుందికదూ! వ్రాయగావ్రాయగా వ్రాసే తొందరలో మారిపోయాయి. మార్పు ఈ విధంగా అయి ఉంటుందేమో!



మనదేశంలోనే కాక ఇతరదేశాలలోను మొదట వేళ్ళతోనే లెక్కపెట్టే వారు. ఈజిప్టువారు, బాబిలోనియావాసులు, గ్రీకులు ఇలాగే చేసేవారు. చీనావారు వేళ్ళమీదే ఒకటినుంచి లక్షవరకు ఎంచేవారట. గ్రీకుభాషలో సంఖ్యను డిజిట్ అంటారు. డిజిట్ అంటే వ్రేలు. వ్రేలి నుంచి లెక్కపెట్టడం వచ్చింది గనుక వ్రేలి పేరే నేటికి మిగిలింది. ఈ చిత్రం చూడండి. రోమన్ సంఖ్య ఎలా




బొమ్మలనుంచి వచ్చిందీ స్పష్టమౌతుంది. ఒక వేలికి ఒక గీత, రెండువేళ్లకు రెండుగీతలు, మూడువేళ్లకు మూడుగీతలు పెట్టడం అలవాటయ్యిందని వెంటనే తోస్తుంది కదూ! V లాగ ఉన్నది బొటనవ్రేలు ఎడంగా పెట్టిన అరచేయే. పది రెండు అరచేతులూ ఎడపెడగా కలిపితే ఏర్పడింది అంటే దాదాపు అన్ని జాతులలోను ఐదు వరకు ఒక ఘట్టం. పదివరకు రెండవఘట్టం ఇరవై వరకు మరొక ఘట్టం ఏర్పడిందన్నమాట.

కాని ఈరోమను సంఖ్యలను కాలక్రమాన మన సంఖ్యలు తోసిరాజన్నవి. ఇప్పటికి పదమూడు వందలయేళ్ల క్రితంనుంచే మనదేశానికి, అరబ్బులకూ వ్యాపారసాపారాలు జరిగేవి. అరబ్బులుకూడ చాల్డియన్, గ్రీక్, హిబ్రూజాతుల

లాగే మొదట అక్షరాన్నే అంకెలుగా వాడేవారు. అంటే వర్ణమాలలోని మొదటి తొమ్మిది అక్షరాలను తొమ్మిది అంకెలకు వరుసగా వాడేవారు. ఖలీఫావలీద్ అనే ఆయన కాలంవరకు ఇలాగే జరిగింది. తర్వాత వచ్చిన ఖలీఫాలు బాగ్దాదుకు భారతీయ పండితులను పిలిపించుకొని, వైద్య, గణిత, జ్యోతిషాది శాస్త్రాలు నేర్చుకుని, తమ భాషలోకి తర్జుమా చేయించుకున్నారు. అబు జఫర్ అల్ ఖాజ్మీ భారతీయ సంఖ్యలను అరబ్బీలో చేర్చాడు. కనుకనే అరబ్బీ, ఫార్సీ కుడి నుండి ఎడమకు వ్రాసేవయినప్పటికీ, అంకెలు మాత్రం ఎడమనుంచి కుడికే వ్రాస్తారు. అంతకుముందు అంకెలనుకూడ కుడినుంచే వ్రాసేవారు ఇప్పటికి వెయ్యేండ్లనాటి లాటిన్ లిఖిత పుస్తకాల్లో అంకెలను కూడ కుడినుంచి ఎడమకు వ్రాసేవారని ఎస్కోరియల్ లైబ్రరీలోని కొన్ని వ్రాత పుస్తకాలను బట్టి తెలుస్తున్నది. అరబ్బులు యూరప్‌ను జయించినమీదట ఇప్పటికి ఎనిమిది వందల సంవత్సరాల క్రితంనుంచి మన సంఖ్యలు యూరప్ అంతటా వ్యాపించాయి.

కాని ఆసంఖ్యలు అక్కడి వ్రాత ఒడుపునుబట్టి మారుతూ వచ్చాయి. వారు మనలాగ తాటాకులమీద వ్రాయడానికి, రాతిమీద చెక్కడానికికాక, పపైరస్ మీద, చర్మంమీద వ్రాయడానికి అలవాటు పడ్డవారు గనుక అడ్డుగీతలను



వంకరటింకరగా కాక చక్కగా వ్రాసేవారు. మన తాటాకుమీద అడ్డుగీతలను కొంచెం అదిమివ్రాస్తే తాటాకు చినిగిపోతుందేమో! అడ్డుగీత కనిపించకనూ పోవచ్చు. కనుక కొంచెం వంపుగా గోపురంలాగ వ్రాసుకున్నాము. ఈ అంకెలు తమ దేశంలో వ్యాపించడంచూచి కొందరు పాశ్చాత్యులు వీటిని నిషేధించారట. ఫ్లోరెన్స్‌లోని వడ్డీ వ్యాపారస్థులు వీటిని బహిష్కరించారట.

ఈ సంఖ్యలు మరల ఎన్నో మార్పులతో ఇంగ్లీషువారి మూలంగా మనదేశానికి వచ్చాయి. డెబ్బై సంవత్సరాలనుంచి దేశమంతా వ్యాపించాయి. పూర్వపు గుజిలీ పుస్తకాలు చూడండి: తెలుగంకెలే కనిపిస్తాయి. తర్వాతఇవి బాగా వ్యాపించాయి.

సున్నకథ మరీ వింత! పాత శాసనాల్లో సున్న కనిపించదన్నాను కదూ! దశగుణాంక క్రమం వ్యాపించిన మీదటగాని సున్న కనిపెట్టడం జరుగలేదు. దశగుణాంక క్రమ మంటే పదితో హెచ్చవేస్తూ పోయే పద్ధతి. ముందు పది వ్రాయవలసివస్తే ఒకటిపక్కన సున్నపెట్టక వేరే అక్షరమే వ్రాసేవారని మన అంకెల పరిణామం చిత్రంలో చూచారుగదా! కాని ఈ సున్న ఎప్పుడు

అవతరించిందో చెప్పడం కష్టం ! ఐదవ శతాబ్దినుంచి అవతరించి ఉంటుందని పండితు లంటారు. అవతారంమాత్రం భరతభూమిలోనే.

సున్న అంటే ఏమిటి ? శూన్యం. అంటే ఖాళీస్థలం. ఏమీ లేదన్న మాట. శూన్యం అన్న సంస్కృత పదంనుంచే సున్న అన్న తెలుగుపదం వచ్చింది. సుషిరం-అంటే రంధ్రం, ఖాళీ-అన్న సంస్కృతపదం అరబ్బీలో సిఫిర్ అయి, ఇటలీలో జాఫిరో అయి, ఫ్రెంచిలో సిఫ్రీ అయి, ఇంగ్లీషులో సైఫర్, జీరో అనే రూపాలు దాల్చింది. ఈ సున్నను కనిపెట్టడం ఏ విమానమో, టెలిఫోనో, టెలివిజనో కనిపెట్టడంవంటిది సుమండీ ! ఎంతో కాలం ఎందరో మేధావులు శ్రమపడి ఉంటారు.

ఈ సున్నను కనిపెట్టడం గవ్వలతో లెక్కపెట్టేటప్పుడో, కుప్పలను పోసి లెక్కపెట్టేటప్పుడో సంభవించి ఉంటుందేమో ! ఆ గవ్వల వరుసలను, కుప్పల వరుసలను చూచి ఒక చక్కని పద్ధతి స్ఫురించి ఉంటుంది. ఇది పాటీ పద్ధతి. పాటీ అంటే పలక. పలకపైచేసే లెక్కలపద్ధతిని పాటీపద్ధతి అంటారు. పాటీని గణక ఫలకం అనికూడ అంటారు. దీనిని పాశ్చాత్యులు "అబేకస్" అంటారు.

పాటీపద్ధతి నిదానంగా వినండి. నలుచదరమైన బల్లను తీసుకొని దాని మీద వరుసగా నిలువుగీతలు గీచేవారు. లేకపోతే వరుసగా ఇసుకపోసి లెక్కలు కట్టేవారు. లెక్కలు పూర్తయిన తర్వాత చెరిపివేసేవారు. ఈ మామూలు పాటి చూడండి. దీనిమీద వ్రాసిన సంఖ్య 193. కుడినుంచి వరుసగా మొదటిగీత ఒక్కట్లస్థానం! రెండవది పదులస్థానం; మూడవది వందలస్థానం. అలాగే లక్షవరకు ఆరు గీతలు. ఇంకా ఎన్నిగీతలైనా వేసుకోవచ్చు. మొదటి వరుసలో మూడు, రెండవ వరుసలో తొమ్మిది, మూడోవరుసలో ఒకటి.



పూర్వకాలంలో ఈజిప్టువారూ గ్రీకులూ, రోమనులు ఈలాగే పాటీ మీదనే లెక్కలు కట్టేవారు. రకరకాల పాటీలుండేవి. గ్రీకులు చదరపుగళ్ళున్న పాటీలు వాడేవారు. వాటిమీద అప్పటి పద్ధతి ప్రకారం సంఖ్యావాచకాలయిన అక్షరాలు-వర్ణమాలలోని మొదటి తొమ్మిదిఅక్షరాలూ-పేర్చేవారు. ఈ అక్షరాలను



గుండ్రటి చెక్కలపై వ్రాసేవారు. ఇలా స్థాన భేదంతో అంకెలు తెలిపేటప్పుడు కొన్ని స్థానాల్లో అంకెలు లేకపోవచ్చు. అప్పుడెలామరి? 102 కు మరి 2-3 చేర్చదలచారనుకోండి. 102 లోని పదుల్లో ఏ అంకే లేదు. కనుక అక్కడ ఖాళీ స్థలం వదిలేవారు. దానికే శూన్యం అనిపేరు. ఏమీలేదన్న మాట. చదరపు గళ్లో గీతలో ఉన్న పాటీ అయితే స్థానాలు తెలుస్తాయి. కనుక ఫలానా స్థానంలో ఏమీ లేదు అని తెలుసుకోవచ్చు. పాటీ లేకనే వ్రాశాడనుకోండి 1 2 అని ఒకటికి రెంటికి ఎడం వదలి; ఆ సంకేతం తెలియనివారు పన్నెండనో, నూట యిరవైయనో చదువుకోవచ్చు. లేక వేయిన్ని ఇరవై అనికూడ అనుకోవచ్చు. ఈ అనుమానం తీర్చుకొనడానికి వ్రాసినవారివద్దకే రావలసి వస్తుంది; అల్లుడి ఉత్తరం కథలాగ. ఈ అనుమానం పోగొట్టడానికి ఆ రెండింటికి మధ్యన ఉన్న ఎడంలో ఒక్క చుక్క పెట్టేవారు. అంటే 1. 2 వలె నన్నమాట. ఈ చుక్కను బిందువు అనేవారు. బాణునికి ఇవతలివాడైన సుబంధకవి నక్షత్రాలను శూన్యబిందువులని ఉత్ప్రేక్షించాడు. అంటే అప్పటికి సున్నను వట్టి చుక్కలాగే వ్రాసేవారనికదూ! ఈ చుక్క అస్పష్టంగా ఉండడంవల్ల, కనిపించకపోయి, సందేహాలకు తావిచ్చిందేమో ! ఈ చుక్కచుట్టూ గిరిగీచేవారు. మన ఠ ఒత్తు-⊙-లాగ అయ్యేది. ఇక సందేహమేమీలేదు. తర్వాత క్రమంగా కొత్త



నీరొచ్చి పాతనీరు కొట్టుకుపోయిందన్నట్టు గిరిలోని చుక్క మాయమై గుండ్రని గిరి మాత్రమే మిగిలింది. అంత పెద్ద గిరి-గుండ్రటి గిరి కనిపిస్తున్నదికాదా! అస్థానం నిండుగా ఉంటున్నదికాదా! అయినా సున్న అనే పేరుపోలేదు. నిజాని అక్కడేమీ లేదుగా !

పాటీ పద్ధతి ఎప్పుడో అంతరించిపోయింది. ఇతర సాధనాలమీదకూడ లెక్కలు కట్టడం అలవాటయింది. స్థానాల సంగతి నేడు అందరికీ కంఠాపాఠమే. కాని బళ్లలో మాత్రం మరీ చిన్న పిల్లలకు పూసలు గుచ్చిన పాటీలతోనే - అబేకస్‌లతోనే లెక్కలు నేర్పుతారు.

సున్నకు సున్న హళ్లికి హళ్లి - అన్న సామెతను మీరు వినే ఉంటారు. సున్న అన్నా హళ్లి అన్నా అర్థం ఒకటే. సున్నను పూర్ణాంకాలలో వాడుతారు. హళ్లిని భిన్నాంకాలలో వాడుతారు. హళ్లి కొంచెం విసురుగా రాసిన సున్నలాగ

౯- ఉంటుంది. పూర్ణాంకాలతోపాటు భిన్నాంకాలలో కూడా సున్న పెడితే తిక మకలు కలుగుతాయని భిన్నాంకాలలో మనవారు హళ్ళిని పెడతారు.

హళ్లి అనేది సున్నకు తెలుగురూపమే. సున్న అనేది శూన్యంనుంచి వచ్చిందని మీరు ఇంతకుముందే తెలుసుకున్నారుకదా. ఆ శూన్యం తొలుత చుక్కలాగ ఉండి తర్వాత నేడు మనం వాడే గుండు సున్నగా పరిణమించింది. ఇప్పుడు సున్న అంటే వర్తులం అని మనకు వాడుక అయింది. పూర్వం మన వారు ఈ వర్తులానికి అల్లి-హల్లి అనేవారు. మీరు చిన్నప్పుడు గోళీలు, బొంగ రాలు ఆడుకొనే ఉంటారు. గోలీలను ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో అల్లికాయ లంటారు. అల్లికాయలంటే గుండ్రని గుళ్ళు అని. బొంగరాల ఆటలో నేలమీద గుండ్రని గీటుగీచి దానిమధ్యన ఒక బొంగరాన్ని ఉంచుతారుకదూ. అలాగీచే గుండ్రని గిరిని అల్లి అంటారు. అలాగే పిల్లలు ఒకరిచేయి ఒకరు పట్టుకొని గుండ్రంగా పెండెం కట్టి నిలవడాన్ని కూడా అల్లి కట్టడం అంటారు. ఇప్పుడు అల్లి అంటే సున్నకు మారుపేరు అని స్పష్టమైంది కదా. రెండు వేర్వేరు పేర్లను ఒకేచోట వాడేటప్పుడు వాటి రూపాలుకూడా వేర్వేరుగా ఉండాలి. అందుకని గుండుగా ఉన్న సున్నకు పైని ఒక తోక చేర్చి మనవారు అల్లి-హళ్ళిని చేశారు. లెక్కలు చేసేటప్పుడు పూర్ణాంకాలలో సున్న, భిన్నాంకాలలో హళ్ళి వచ్చిందను కోండి. ఫలితం ఏం తేలుతుంది. సున్నకు సున్న హళ్లికి హళ్లి కదూ?



# తృతీయభాగం

## ప్రథమ ప్రకరణం

# శాశ్వత పుస్తకాలు

అక్షరాలు ఒకదేశంనుంచి మరొకదేశానికి, ఒకజాతినుంచి మరొకజాతికి, ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి ప్రయాణం చేస్తూనే మరొక పయనం కూడా సాగించాయి. మట్టి ముద్రలు, మట్టి పెంకులనుంచి రాతికి, రాతినుంచి ఆకులకు, ఆకులనుంచి లోహపురేకులకు, రేకులనుంచి గుడ్డ పేలికలకు-కడితాలకు, వాటినుంచి కాయితాలకు యాత్ర సాగించాయి: విదేశాలలోనయితే రాతినుంచి పెపైరసుకు, పెపైరసునుంచి చర్మానికి, దానినుంచి కాయితానికి. ఇసక నేలలో పెరిగిన చెట్టు బురదనేలలో పెరిగిన దానికన్నా ఎలా వేరుగా ఉంటుందో, అలాగే అక్షరాలు స్థానబలాన్నిబట్టి రూపం మారుతూవచ్చాయి. రాతిమీద నిట్ట నిలువున బిర్ర బిగుసుకున్నట్టు కనిపించాయి; మైనపు పలకలమీద, భూర్జ పత్రాలమీద ముడివేసిన దారాల ముక్కలలాగ తలబరువుతో కామాలు, సెమికోలనులవలె వంగుతూ, వ్రేలాడుతూ కనిపించాయి; మట్టిపలకలపైన అంచులు, నక్షత్రాలు, కోణాలు అయాయి; తాటాకులమీద, చర్మాలమీద, కాయితాలమీద గుండ్రంగా రూపు తీర్చుకున్నాయి. ఈ గుండ్రని రూపులోను భేదం లేక పోలేదు. ఎప్పటి కప్పుడు త్వరగా మారుతూ పోయాయి.

వివిధకాలాలలో, వివిధసాధనాలపైని వ్రాతల బొమ్మలను ఇదివరకు మీరు చూచారు. శిలాశాసనాల అక్షరాలు, తాటాకులమీది వ్రాతలు, లోహ శాసనాలమీది పంక్తులు వేరేవేరే వర్ణమాలలోనివా అన్నంత భ్రాంతికూడ కలిగిస్తాయి. లేఖన సాధనాలు మాత్రమే వేరు.

వ్రాయడానికి ఎన్నిసాధనాలు, పద్ధతులు ఉన్నాయి? పెన్సిలు, కాయితం మనకు చాల అలవాటయినవి. కాని ఇవి చాల ఇటీవలి సాధనాలు. ఐదువందల సంవత్సరాలక్రితం బడిపిల్లల పుస్తకాల సంచిలో పెన్సిలుగాని, కలంగాని, నోటుబుక్కులుగాని ఉండేవికావు. పాటీలపైన (చెక్కపలకలపైన) సుద్దముక్కలతో వ్రాసేవారు. విదేశాలలో మైనంవేసిన పలకలపై వాడిగా ఉన్న కర్ర ముక్కలతో వ్రాసేవారు వ్రాతకిది అంత అనుకూలమైన పద్ధతి అని చెప్పలేము.

వ్రాత అనాదికాలంలో గుహావాసుల చిత్రాలనుంచి విడిపోయి రూపు తీర్చుకుంటున్న ప్రారంభదశను పరిశీలించామంటే, మరీ ఆశ్చర్యమౌతుంది. అప్పుడు వ్రాయడం అంటేనే ఎంతకష్టమో చెబితే నమ్మలేము.



వ్రాత పరికరాలనేవే ప్రత్యేకంగా ఉండేవికావు. ప్రవాతిరూ తమకు తోచిన పద్ధతిని అనుసరించేవారు, వారిచేతిలో ఏవి పడితే, ఏవి వారికంటికి కనిపిస్తే అవే నోటుబుక్కులు; రాతి బండలు, తాటాకులు, భూర్జపత్రాలు, గొర్రెమూపుచర్మాల చెక్కలు, అడవి జంతువుల చర్మాలు, చెట్టుపట్టలు, తుదకు కుండపెంకులు- అవీ ఇవీ ఏమిటి? ఏదిబడితే అది తీసుకుని వాడిగా ఉన్న ఎముకలతోనో, రాతితోనో బొమ్మలు గీసేవారు.

ఈలాటి వ్రాతపద్ధతులు బహుకాలం ఉన్నాయి. మహమ్మద్ పైగంబర్ ఖురాన్ షరీఫ్‌ను గొర్రెమూపు చర్మాల ముక్కలపై వ్రాసేవారని ప్రతీతి. పూర్వం గ్రీకులు తమ వోట్లను కుండపెంకులపై వ్రాసేవారట. మనం ఈ నాడు కాయితంముక్కలపై వ్రాసినట్టు. ఈ కుండపెంకులకు "ఓస్ట్రక్"లు అని పేరు. మనదేశంలోని ప్రాచీన గణతంత్ర రాజ్యాలలో కర్రముక్కలమీద వ్రాసి గుర్తువేసి, తమ వోట్లు ఇచ్చేవారు. దీనిని శలాకా పద్ధతి అనేవారు. పాశ్చాత్య దేశాలలో పెపైరస్ కాయితాలు ప్రచారమైనతర్వాతకూడ పలువురు రచయితలు బీదరికంవల్ల వాటిని కొనలేక" కుండపెంకులమీదే వ్రాసేవారు. ఒక పండితుడు



పుస్తకాలు వ్రాయడంకోసం తన యింటిలోని కుండలను పిడితలను పగుల గొట్టాడని కథ చెబుతారు. ఒకప్పుడు ఈజిప్టులో పనిచేస్తున్న రోమను సైనికులు, అధికారులు పెపైరస్ దొరకనందున తమ ఖాతాలను, రసీదులను కుండ పెంకులపై వ్రాసేవారట. పెపైరస్ అంటే ఒకరకం తుంగచాపకాయితం. దానిని గురించి ముందు వివరంగా చదువుతారు.

కాని, తాటాకులు, భూర్జపత్రాలవంటి చెట్టుపట్టలు ఉత్తమమైన లేఖన సామగ్రి. మనదేశంలో వీటి వాడకం ఎక్కువ. విదేశాలలోను పెపైరస్ చుట్టలు ప్రచారంలోకి వచ్చేదాకా ఇవే వాడుకలో ఉండేవి. ఈ ఎముకలు బంక

మన్ను, తాటాకుల పుస్తకాలు మ్యూజియంలలోను, ప్రదర్శనాలయాల లోను మాత్రమే నేడు కనిపిస్తాయి. కాని ప్రాచీనమైన ఒక వ్రాతపద్ధతి మాత్రం మనమింకా మానుకోలేదు. అది రాతిపై వ్రాయడం.

రాతిపుస్తకం అన్ని పుస్తకాలకన్నా ఎక్కువకాలం మనేది. వేల సంవత్సరాలక్రితం మన దేశంలో బౌద్ధ స్తూపాలపై చెక్కిన గాథలు, శాసనాలు, ఈజిప్టులో సమాధులపైన, దేవాలయ కుడ్యాలమీద చెక్కిన కథలు నేటికీ మనకు దక్కాయి; చెక్కు చెదరకుండా. చిరకాలం ఉండాలనుకుంటే మనంకూడ నేడు శిలా ఫలకాలమీద చెక్కించుకుంటున్నాము. ఈ శిలా ఫలకాలలో మన దేశంలో దొరికిన వాటిలో ప్రాచీనమైనది మహాస్థాన్ శాసన శిలాఫలకమని అది క్రీస్తుకుముందు నాలుగవ శతాబ్దిది-అంటే ఇప్పటికి రెండు వేల నాలుగువందల ఏళ్ల కిందది - అని ఇదివరకే మీరు చదివారు. తర్వాత పేర్కొన దగినవి భట్టిప్రోలు, అశోక శాసనాలు.

నేడుకూడ రాతిబండలమీద వ్రాతవ్రాయడం ఉన్నప్పటికీ, అంత విరివిగా వ్రాస్తున్నామా ? లేదు. విరివిగా వ్రాయకపోవడానికి కారణమేమిటి ? మొదటి సంగతి : రాతిమీద అక్షరాలు వ్రాయడం-అంటే చెక్కడం-కష్టం. రెండవసంగతి అలాటి కొన్ని మణుగుల బరువున్న శిలాపుస్తకాన్ని ఒకచోటి నుంచి మరొకచోటికి తరలించడం కూడ కష్టం. 177వ పుటలోఉన్న ఈజిప్టు శిలా



పుస్తకాన్ని మోసుకుపోయి చదువుకోగలమా ! పోనీ ఈ గవిమఠం శిలా శాసనం చిన్నదిగా కనిపిస్తున్నదిగదా ! తీసుకు వెళ్ళుదామా అంటే దానిని అశోకుడు కొండపైన వేయించాడు. కొండ గుండుకే చెక్కించాడు. దానిని ఇంటికి తీసుకువెళ్ళడం పడుతుందా ! ఇలాటిదానిని టపాలో పంపడం ఎన్నటికీ సాధ్యమయ్యే పనికాదు.

రాతికన్నా తేలికగాను, అంత శాశ్వతంగాను ఉండగల వ్రాత పరికరాలు కనుగొనడానికి ప్రజలు ప్రయత్నాలు జరుపుతూనే వచ్చారు. రాగి కంచు మొదలయిన వాటిపై వ్రాయడం ప్రారంభించారు. కంచు పాశ్చాత్యదేశాలలో ఎక్కువగా వ్రాతసాధనంగా వాడుకయింది. ఏవో వ్రాతలున్న కంచు రేకులు నేటికీ ఉన్నాయి. వీటితో రాజప్రాసాదాలను, దేవమందిరాలను అలంకరించేవారు. ఒక్కొక్కప్పుడు ఈ రేకులు గోడంత వెడల్పైనవి కూడ ఉండేవి. ఇలాంటి కంచురేకును రెండువైపులా చెక్కేపక్షంలో, దానికి గొలుసులు కట్టి భవనం కప్పులోపలవైపు వేలాడ గట్టేవారు.

ఈచిత్రంలో కనిపించేవి కంచుతో చేసిన చర్చి తలుపులు. ఇవి పుస్తకం లాగానూ ఉన్నాయి. బ్లోయిస్ నగరవాసులతో ఎట్‌లీన్ ప్రభువు చేసుకున్న ఒడంబడిక ఈ తలుపుపై చెక్కి ఉంది. ఈ నగరవాసులు ఈ ప్రభువు



ప్రాసాదం చుట్టూ కోటకట్టాలి. దానికి ప్రతిఫలంగా ద్రాక్షసారాయిపై వేసే పన్నును నగర శ్రేయస్సుకు వినియోగించే హక్కు ప్రజలకు ఉండాలి. ఇది ఈ ఒడంబడిక సారాంశం. ద్రాక్షాసవం సేవించడం ఎంతోకాలంగా వస్తున్న వ్యసనం. అది త్రాగినవారు నేడు సమాధులలో దీర్ఘ నిద్రపోతున్నారు. రాజ ప్రాసాదం చుట్టూ కట్టినకోట నేలమట్టమయింది. కాని, అప్పటి ఒడంబడిక మాత్రం కంచు తలుపుల మీద నేటికీ ఆనాటి ఠీవితోనే నిలిచి ఉంది.



మనదేశం కంచుకన్నా రాగినే ఎక్కువగా వ్రాత సాధనంగా వినియోగించుకున్నది. కంచుగంటమీద, పాత్రలమీద మాత్రమే విరళంగా శాసనాలు కనిపిస్తాయి. రాగి అంటేనో వ్రాతసాధనంగా చాల వాడుకలోకి వచ్చింది. రాగిని మరే దేశమూ ఇంత విరివిగా వాడలేదేమో! రెండువేల సంవత్సరాల ముందునుంచికూడ రాగిరేకులపై రాజులు, మహారాజులు తమ శాసనాలు వేయించారు.

ఇలాటి తామ్రశాసనాల్లో అతి ప్రాచీనమని పండితులు చెప్పేది సోహ్‌గౌరాశాసనం. ఇది గోరఖ్‌పూర్ జిల్లా సోహ్‌గౌరా అనే గ్రామంలో దొరికింది. దీనిని ఇదివరకు ద్వితీయ భాగంలో చదివారు. ఇది క్రీస్తుకుపూర్వం 450 సంవత్సరాలనాటిది. ఇంచుమించు బుద్ధుని కాలందని అనవచ్చు. ఇది పాలీ భాషలో, బ్రాహ్మీలిపిలో ఉంది.

తెలుగు దేశంలోను, తెలుగు భాషలోను పాతకాలపు తామ్రశాసనాలు అసంఖ్యాకంగా దొరికాయి. వీటిలో అతిప్రాచీనమైనవి పల్లవులవి, బృహత్ఫలాయనులవీని. మధ్యకాలంలోని తామ్రశాసనాలలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి తిరుపతిలో వేంచేసివున్న తాళ్ళపాక అన్నమాచార్యులు, ఆయన కుమారులు పెద తిరుమలాచార్యులు చెక్కించిన సంకీర్తన రేకులు. ఒక్క అన్నమాచార్యులే ముప్పైవేల సంకీర్తనలను రచించారని మీరిదివరకే లిపిపరిణామం ప్రసంగంలో చదివారు. వాటిని ఏనాటి కానాడు రాగి రేకులపై చెక్కించేవారట. వాటిలో కొన్నివేల రాగిరేకులు నేడు తిరుపతిలోను, కర్నూలు జిల్లాలోని అహోబలమఠంలోను ఉన్నవి.

రాజులు తమ వైభవ ప్రదర్శనం కోసమో, ప్రజలు తమ భక్తి నివేదించడంకోసమో వెండి బంగారు రేకులమీదగూడ శాసనాలు చెక్కించేవారు. తక్షశిలలోని గంగూ స్తూపంలో ఇలాటి బంగారు శాసనం ఒకటి దొరికింది. ఇది ఖరోష్ఠి లిపిలో ఉంది. తక్షశిలలో ఒక వెండి శాసనమూ, మన భట్టిప్రోలులో ఒక వెండి శాసనమూ దొరికినట్టు ఇదివరకే మీకు తెలుసు. లంకాద్వీపంలో వెండి రేకులపై పాలీగ్రంథ మొకటి చెక్కి ఉంది. ఇది నేడు బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నది.

కృష్ణదేవరాయలు పోర్చుగీసు అధికారికి ఒక బంగారు రేకుపై లేఖ వ్రాయించి గోవాకు పంపాడట. ఇది 1514లో జరిగింది.

తంజావూరు ఆంధ్రనాయకుడు విజయరాఘవుడు ఒలాందులకు (డచ్చివారికి) వ్యాపార సాపారాల నిమిత్తం కౌలుపత్రం వ్రాయించి యిచ్చాడు. అది వెండిరేకుపై ఉంది. నేడు దాన్ని బటేవియా మ్యూజియంలో భద్రపరచారు. దానిలోని మతలబు ఇక్కడ పొందుపరుస్తున్నాను. దక్షిణాపథమంతటా ఒకప్పుడు రాజభాషగా వెలిగిన తెలుగునుడికారం ఎలా తీగలు సాగిందో చూడండి:

స్వామిసాక్షి తప్పేదిలేదు శ్రీరామ విళంబి సంవత్సర మార్గశిర శు॥ ౧౩ లు శ్రీమతు అచ్యుత శ్రీ విజయరాఘవ నాయనయ్యవారు వొలాందా రికులాప్పంగుసు అమరాల్కు యిచ్చిన కౌలునమ్మిక శాసనము. తమ కుంపినయ్య వర్తక ప్రవర్తకం నాగపట్నం రేవున నడిపించుకొనే మనిస్నీ అందుకు కౌలుకట్టళ్లు కట్టడశాయవలెనని చిన్నయ శెట్టివారు మాతో

చాలా మనవిరూపంగా విన్నపం చేసుకొన్నారు కాంబట్టి ఆ రీతున్నే తాము నాగపట్నానకువచ్చి వర్తక ప్రవర్తకం నడిపించుకొనేది తమకు పరంగివారి వశానవున్న కోటానుకట్టడ సేసి వారియిండ్లు ముంగిళ్లున్ను కట్టడిచేసినారము। ఇదిగాక పరంగివారి కాపితానికిన్ని వాయిర్‌పళ్లి గుళ్లకున్ను తోంటపరంగి వారికిన్ని నడచినగ్రామాలు పుత్తూరు గ్రామం ముట్టం గ్రామం పోర్చువాల్చేరి గ్రామం అంతోని పెంటగ్రామం కరువేప్పంగాడు గ్రామం అలిండిళమంగళం గ్రామం సంగమంగళం గ్రామం నిరుత్తిన మంగళం గ్రామం మంజెకొల్లై గ్రామం నరియంగుడ్డి గ్రామం అంతు గ్రామాలు ౧౦ ఈ పది గ్రామాలున్నూ తమకు కట్టడ చేసినారం గనక ఆ గ్రామాలు ఎంటిపేరింటకనే పుట్టాస్తికి నగరికి తాము ఎంటిపేరిట కానుక యిచ్చుక రాగలవారు। ఇదిగాక తాము నాగపట్నం రేవున ఎక్కించే సరకు సప్పట్లు కోంకదాకలు దివస ధాన్యాదులకున్ను దించే సరకు సప్పట్లకున్ను ఎగుమతి దిగుమతి తీరువ సర్వమాన్యంగా కట్టడ చేసినారము। తమ కుంపినీ వోడల్కు అడసాల మురిసాల లేకుండా తమదిగానే కట్టడ చేసినారము। తమ వర్తకులేమి మనుష్యమాత్రులేమి నిలువసెలువలు సొమ్ము సమ్మంధాలు ఎట్టుకొని నగరి గ్రామాంతరాల పారివచ్చి వున్నట్టాయనా వార్ని నీవార్ని సొమ్మున్నూ తమకే వప్పగించగలవారము। మాసీమలో తాము వర్తకప్రవర్తకం తమకు సరిపోయినదారిని నడిపించుకొనే తండ్లుకల్లో నగరి చిల్లరళ్ళు నడపకుండానున్నూ కట్టడ సేసినారము। తమకు ఇచ్చిన పరంగివారి గ్రామాల్లోవుండే కాంపుల పట్లనేమి నాగపట్నాన తమ వర్తకులైవుండే వారిపట్లనైతేనేమి నగరినుండిన్ని చిల్లరళ్ళు నడవకుండానున్నూ తమ మనుష్యులు నాల్గుదిక్కులకున్ను కమ్మగాళ్ళుకొంచపొయ్యేవార్ని సుంక సూత్రాలు లేకనున్నూ కట్టడ సేసినారము। యీ ప్రకారం కవులు కట్టడచేసినారము। గనక యీ బద్ధతినాంట పుత్రపౌత్ర పారంపర్యంగా నడిచేటట్టు కట్టడ చేసినారము। గనుక యిందుకు లేశమయినా తప్పక తమపట్ల నడిపించుక వచ్చేమని చిన్నన్న శెట్టివార్కి నమ్మికమాట పట్లున్ను యిచ్చినారము। అటుగనుక తామును నగరిపట్ల హితవిశ్వాసము గలిగి కరతౌరలున్నూ ఋజువు అయ్యేటట్టుగా నడిపించుకొని యీ కవులుకు నమ్మి ఆ చంద్రార్కస్థాయిగా వర్తకప్రవర్తకము నడిపించుకొని సుఖాన వుండేది. శ్రీ విజయరాఘవ !

ఈ శాసనపు రేకులు ఒకటికి మించివుంటే ఎడమకొనపై మధ్యన రంధ్రంవేసి కడియానికి గుది గుచ్చుతారు. ఆ కడియానికి ఆ శాసనం వేయించిన రాజు అధికార చిహ్నమైన ముద్రతాపటంచేసి ఉంటుంది. ఈ ముద్రలో రాజు పేరు ఉండడమూ కద్దు. అన్ని కడియాలకూ ఇలాటి ముద్ర ఉండాలనే నియమ



మేమీ లేదు. ఎక్కువ రేకు లున్నప్పుడు శిల్పి మొదటిరేకు పై భాగం వదలి రెండోపక్క శాసనం చెక్కడం ప్రారంభిస్తాడు అఖరునకూడ ఈ విధంగానే- అంటే శాసనం రేకు చివరి భాగం ఖాళీగా వదలుతాడు.

ఈ శాసనాలను శిల్పే రచిస్తాడనుకున్నారా? లేదు. మొదట రాజాజ్ఞలను భూర్జపత్రంమీదనో, తాళపత్రంమీదనో వ్రాస్తారు. వాటిని రాజోద్యోగులు భద్ర పరుస్తారు. వారు నేటి రికార్డుకీపర్లవంటివారు. వారిని అక్షపటలులు, అక్ష పట లికులు, దివిరపతులు అనేవారు. ఈ అక్షపటలికులకు రాజ శాసనం అమలుచేసే ప్రమాత, మహాసంధి విగ్రహికుడు, రాహసికుడు అనే అధికారులలో ఎవరో ఒకరు రాజాజ్ఞ వ్రాయించి పత్రం అందజేస్తాడు. దాని మరొక నకలు లిపి కారునికి అందుతుంది. లిపికారులంటే అక్షరాలుచెక్కే శిల్పులు. ఈ శాసనాల చివర రాజు చేవ్రాలు మొహరు గుర్తు ఉంటాయి. చేవ్రాలు వెనుక "స్వహస్తో మమ" ఇది నా దస్తూరీ-అని ఉండడం కూడ కద్దు. ఇది శ్రీ హర్షవర్థనుని చేవ్రాలు.

"స్వహస్తో మమ రాజాధిరాజ శ్రీ హర్షస్య" పేరు ఎంత సుందరంగా ఉందో చూశారా! అన్ని యుద్ధాలు చేస్తున్న హర్షునికి పత్రాలపై ఇంత అందంగా సంతకం చేసే తీరిక ఎక్కడిదో!

తెలుగు శాసనాలలో పేరు చివర స్వహస్తం అనే అర్థంలోనే వ్రాలు అన్న పదం చేర్చేవారు. ఇది నేటికీ అలవాటులో ఉంది. ఒకప్పుడు స్వహస్తో



మము అనిగాని, వ్రాలు అనిగాని లేక రాజు పేరు మాత్రమే చెక్కేవారు. విజయ నగర రాజయిన హరిహరరాయల శాసనంలో శాసనంచివర 'శ్రీ హరిహర' అని అతనిపేరు మాత్రమే ఉండేది. ఒకప్పుడు రాజు పేరుకూడ మానివేసేవారు. 'శ్రీ విరూపాక్ష' అని హంపీ విరూపాక్షేశ్వరుని పేరు మాత్రమే ఉండేది. అంటే రాజు విరూపాక్షుని వరంగా ధర్మకర్తగా వ్యవహరిస్తున్నాడన్న మాట.

ఇనుము కూడ వ్రాతకు కాయితంగా ఉపయోగపడిందంటే నమ్ముతారూ? అదికూడ ఉంది. ఢిల్లీలో కుతుబ్‌మీనార్ దగ్గర ఒక పెద్ద ఇనుప స్తంభం ఉంది. దీనిపైన ఒక శాసనం ఉంది. దీనిని ఇప్పటికి పదిహేనువందల సంవత్సరాల క్రితం ఢిల్లీని పాలించిన చంద్రుడనే రాజు వేయించాడు.



ఈ ముద్ర చూడండి. వరాహముద్ర. హిరణ్యాక్షుడనే రాక్షసుడు ఒకానొకప్పుడు మన భూమండలాన్ని చాపచుట్టుకొని పోయాడట. మహా విష్ణువు వానిని వెన్నాడి తరిమి సంహరించి భూమిని ఉద్ధరించారట. కనుక మన ప్రాచీన రాజవంశీయులలో పలువురు తమ రాజ్యాధికార లాంఛనమైన మొహరులో వరాహం బొమ్మను చిత్రించడం ఆచారం. పశ్చిమ చాళుక్యులకు, తూర్పు చాళుక్యులకు, విజయనగర సార్వభౌములకు వరాహమే రాజలాంఛనం. ఇది పశ్చిమ చాళుక్య రాజయిన వినియాదిత్యుని అధికార ముద్ర. వినయాదిత్యుడు క్రీస్తుశకం ఏడవ శతాబ్ది చివరకు ఉన్నవాడు; మహావీరుడు.

ఈ రాతి పుస్తకాలూ, రాగిరేకుల పుస్తకాలూ బరువెక్కువ. ఎక్కడ బడితే అక్కడికి తీసుకొని వెళ్ళలేము. ఇంతకన్నా చిక్కైన విషయ మేమిటంటే, వీటిపైన వ్రాయడం చాల కష్టంకావడం. నేటికాలపు రచయిత శిల్పిలాగ శాణం, సుత్తి తీసుకుని చెక్కడానికి పూనుకోవాలంటే కుదురుతుందా? ఇలా ఒక్క పుట తయారు కావడానికి రోజంతా పడుతుంది.

ఏమైనా మన ఇప్పటి వ్రాత పరికరాలే మంచివి. కాయితం చాలకాలం మనే వస్తువు కాదనుకోండి. అయితే రాయిలాగ శాశ్వతంగాను, కాయితంలాగ సులభంగాను ఉండే వ్రాత సాధనం మరొకటేదైనా ఉందా? ఆఁ! ఉంది.



మొహెంజోదడో మట్టి ముద్రికల సంగతి మీకు తెలుసు. ప్రజలు మట్టిపాత్రలపై ముద్రలు వేయడం ఎప్పుడు తెలుసుకున్నారో, అప్పుడే మట్టిబిళ్ళలు కూడ రాయిలాగ ఉంటాయని గ్రహించారు. ఈ మట్టి బిళ్ళలను, వ్రాతలున్న మట్టి ఇటుకలను విరివిగా ప్రచారానికి తెచ్చిన వారు బౌద్ధులు. వీరు తమ ధర్మ సూత్రాలను ఇటుకలపై వ్రాసి విహారాల గోడలలో తక్కిన ఇటుకలతోపాటు పెట్టి కట్టించేవారు. మథుర మ్యూజియంలో ఇలాటి ఇటుకలు కొన్ని భద్ర పరచారు. ఇవి రెండువేల మూడువందల ఏళ్ళ నాటివి. గోరఖ్‌పూర్ జిల్లా గోపాల్‌పూర్ అనే గ్రామంలో ఇలాటి ఇటుకలు మూడు దొరికాయి. వీటి పొడుగు పదకొండున్నర అంగుళాలు, వెడల్పు నాలుగున్నర అంగుళాలు. వీటిమీద పది పన్నెండు పంక్తులు చెక్కి ఉన్నాయి. ఇవి అంత ప్రాచీనమైనవి కావు; అంటే ఇప్పటికి పదిహేడువందల నాటివన్న మాట. నైనితాల్ జిల్లా ఉజ్జైన్ అనే గ్రామంలోను ఇలాటివి రెండు ఇటుకలు దొరికాయి. ఒకదానిమీద "తస్య రాజ్ఞో శ్రీ పృథివీ మిత్రస్య" అని, రెండవ దానిమీద "రాజ్ఞో మాతృమిత్ర పుత్ర...." అని చెక్కి ఉంది.

ఈ ఇటుకల పద్ధతిని విశేషంగా వాడుకజేసి, పెద్ద గ్రంథాలయాలనే నెలకొల్పినవారు ఒకప్పుడు మధ్య ఆసియాలోని టైగ్రిస్, యూఫ్రెటిస్ నదుల మధ్యప్రాంతంలో నివసించిన బాబిలోనియావారు, అస్సీరియనులూను, అస్సీరియా ప్రాచీన రాజధాని అయిన నినేవే శిథిలాలలోని కుయుంద్‌ఝిక్ అనే చోట ఒక ఆంగ్లేయ పండితుడు పరిశోధనలు జరుపుతుండగా, ఒక గ్రంథాలయం కనిపించింది. ఇది అస్సీరియా రాజు అసుర్ బనిపాల్ నెలకొల్పినది. గ్రంథాలయమంటే తాటాకులదో, మరొకపదార్థందో అనుకుంటారేమో! కాదు. ఇది చాలా విచిత్రమైన గ్రంథాలయం. ఒక్క కాగితం ముక్కైనా ఈ గ్రంథాలయంలో లేదు పుస్తకాలన్నీ బంకమట్టివి. అంటే బంకమట్టి పలకలు-పల్చని ఇటుకలు-అన్న మాట.

అసుర్ బనిపాల్ గొప్ప పండితుడు. కృషిశాస్త్రమంటే ఇతనికి చాల అభిమానం. మనదేశంనుంచి తన దేశానికి పెక్కు మొక్కలను తెప్పించు

కొన్నాడట. ఈయన గ్రంథాలయంలో 'సింధు' అనే పదం మనదేశంనుంచి తెప్పించుకొన్న ప్రతికి పర్యాయంగా ప్రయోగించబడిందట. 'సింధు' అంటే హిందూదేశమనే రూఢి తర్వాత ఏర్పడింది. ఇంతకూ ఈ అసుర్‌బనిపాల్ ఎప్పటివాడనుకున్నారు ? బుద్ధభగవానునికి ఎనభై ఎనిమిది సంవత్సరాల ముందున్నవాడు.



ఈ బంకమట్టి పుస్తకాలు ఎలా చేసేవారనుకున్నారు ? లేఖకులు తాము అనుకున్నంత మందంగాను, పొడుగ్గాను బంకమట్టి పలకలు తయారుచేసేవారు. ఒక కర్రపుల్లతో వడిగా వాటిమీద వ్రాసేవారు. ఈ కర్ర పుల్లను "స్టైలెస్" అని కొందరు, "లిఖుస్" అని కొందరు, "అలెఫ్" అని మరికొందరు అనేవారు. ఈ కాష్ఠలేఖినితో వడివడిగా వ్రాయడంవల్ల అక్షరాల పైభాగాలు ముద్దగాను, కిందిభాగాలు సన్నగా తోకలుగాను - మొత్తం మీద వైకుంఠపాళి [పరమపద సోపానపటం]లోని పాముల్లాగాను తయారయేవి. బాబిలోనియనులు, అస్సీరియనులు కాలువలు కాలువలుగా కనిపించే ఈలాటి అక్షరాలు ఇటుకలనిండా వ్రాసేవారు దీనిని కీలలిపి అనేవారు. కీల లిపిని గురించి మీకు ఇదివరకే తెలుసు. వ్రాసిన తర్వాత కుమ్మరికిచ్చి ఆవంలో కాల్పించేవారు. నేడు, మన కాలంలో పుస్తకాలు తయారు కావడంలో కుమ్మరుల ప్రసక్తిలేదనుకోండి. కాని, ఆ కాలంలో పుస్తకాలు కుండలలాగే ఆవాల్లో కాల్చేవారు.

ఇలా ఎండకు ఎండి, ఆవాలలో కాలిన ఈ పుస్తకాలు రాళ్ళలాగ కల కాలం ఉండేవి. ఇవి నిప్పులలో కాలిపోవు, చెమ్మకు చెడిపోవు, ఎలుకలు తినవు, చెదలు పట్టవు. కిందపడి పగిలిపోయే ప్రమాదం ఉందనుకోండి. కాని ఆ విరిగిన ముక్కలు ఒక్కటిగా మరల చేర్చుకుంటే సరిపోతుంది. నినేవేలో దొరికిన ఈ మృణ్మయ ఫలకాలలో ఎన్నో పగిలిపోయాయి. వాటిని విద్వాంసులు ఎంతో శ్రమపడి చేర్చి అతికించారు.

ఈ గ్రంథాలయంలో ఇలాటి ఇటుకలు 30 వేలదాక దొరికాయి. మన పుస్తకాలలో కొన్ని పుటలున్నట్టే, పెక్కు ఇటుకలు చేరి ఒక గ్రంథ మవుతుంది. ఇటుకలన్నిటినీ ఒకతట్టుచేర్చి మన ఇప్పటి పుస్తకంలాగ బైండు చేయడం మాత్రం సాధ్యంకాదు. కనుక ప్రతి ఇటుకమీద క్రమసంఖ్య, పుస్తకం పేరు వ్రాయాలి. జగత్సృష్టినిగూర్చి వ్రాసిన ఒక గ్రంథం "మొదట్లో మన పైన కనిపించేదాన్ని ఆకాశం అనేవారు కారు" అనే వాక్యంతో ప్రారంభ

మౌతుంది. ప్రతి ఇటుకమీద మొదట ఈ వాక్యం, ఒకటి, రెండు.... అని క్రమసంఖ్య కడపటివరకు ఉన్నాయి.

ఇంతేకాక ఈ గ్రంథాలయం ముద్రకూడ ప్రతి పుస్తకంమీద ఉండేది. ఆ ముద్రలోని సారాంశమిది. వినండి ఎంత తమాషాగాఉందో !

"నా వంశంలోని పూర్వరాజులకు సేవచేసిన నా రాజ్యంలోని రచయితల రచనలను గుర్తించడానికి నెబో దేవుడు ఎవరికి చురుకైన కళ్ళు, చురుకైన చెవులు ప్రసాదించాడో, ఎవడు వీరాధివీరులకు రాజో, ఎవడు దేశ దేశాలకు రాజో, అట్టి అసుర్బనిపాల్ అంతఃపురము. జ్ఞాన స్వరూపుడైన నెబో దేవుని ఎడ భక్తితో ఈ మృణ్మయ ఫలకాలతోపాటు నకళ్ళుకూడా తయారు చేయించి వీటిపై నా పేరు ముద్రవేయించి, నా అంతఃపురంలో పెట్టించాను."

అసుర్బనిపాల్ గ్రంథాలయంలో అన్నివిధాల గ్రంథాలు ఉండేవి, ఉన్నాయి. అస్సీరియా రాజులు లిడియన్, ఫినీషియన్, అర్మీనియన్ జాతుల



వారితో చేసిన పోరాటాలు వర్ణించే పుస్తకాలు; ఎద్దులాగ కొమ్ములు, కాళ్ళు, తోక ఉండే రాక్షసుని కృత్యాలు వర్ణించేవి, ఇష్తర్ అనే దేవత తన పతిని పిలుచుకొనిరావడానికి పాతాళానికి వెళ్ళిన గాథ; ఒకప్పుడు ప్రపంచాన్నంతా జలప్రళయం చేసిన ఒకనది కథ-ఇలాటివెన్నో !

రాత్రిళ్లు అస్సీరియారాజు నిద్రపట్టకపోతే బానిసలను అంతఃపుర గ్రంథాలయానికి పంపి, గ్రంథాలు తెప్పించుకొని, గట్టిగా చదివించుకుని వినేవాడు. తన దరిద్ర ప్రజలను కష్టపెట్టినట్టే తనను కూడ కష్టపెట్టే వ్యథలను మరచిపోయేవాడు.

అస్సీరియనులు బంకమట్టి ఇటుకలపై వ్రాయడం మాత్రమే కాదు మన మోహెంజోదడో పూర్వులవలె వాటిపైన అచ్చులుకూడ కొట్టారు. వారు అమూల్యమైన రత్నాలను వజ్రాలను గొట్టాలలాంటి మట్టిబిమ్మలపైన బొమ్మల ఆకృతులలోను, రకరకాల చిత్రాల ఆకృతులలోను పొదిగి ముద్రలు తయారు చేశారు. ఇతర రాజులతో ఒడంబడికలు చేసుకొనే పక్షంలో ఈ గుండ్రటి గొట్టందిమ్మను బంకమట్టి పలకలపై పొర్లించేవారు. దానితో వారి రాజముద్రిక స్పష్టంగా అచ్చుపడేది.

ఈ పద్ధతి నేడుకూడ గుడ్డల అద్దకంలో ఉన్నదంటే ముచ్చటగొలిపే విషయం కదూ? నేడు రోటరీ ముద్రాయంత్రం కూడ ఈ విధంగానే పని చేస్తుంది. తిరుగుతున్న సిలెండరుపైన అక్షరాలు అమర్చుతారు.

ఈలాటి ముద్రలున్న ఒప్పందాలు, రసీదులు, ఖాతా పుస్తకాలు ఎన్నో పరిశోధకులకు దొరికాయి. ఇలాటివాటిలో మొహరు పక్కన సంతకం కూడ తరచు కనిపించింది-సంతకమంటే పేరనుకునేరు ? కాదు. వ్రేలి గోటితో చేసిన వంకరటింకర గుర్తు. వ్రాత రానివారు ఇలా సంతకం చేసేవారట.



ద్వితీయ ప్రకరణం

# ఆంధ్ర కల్ప వృక్షం

తాటాకులు భూర్జపత్రాలు ఉత్తమమైన లేఖనసామగ్రిగా మన దేశంలో అనాదికాలంనుంచి వాడుకలో ఉన్నాయి. ఇంతేకాక మనదేశంలో తాటాకులు భూర్జపత్రాలు, నాటుకాయితాలు, లోహపురేకులూ అన్నీ ఒకదాని సరసన మరొకటి ప్రచారంలో ఉండేవి; వాటిలో ఎక్కువ ప్రచారం తాటాకులకు. తాటాకులు, భూర్జ పత్రాలు మనదేశంలో విరివిగా దొరుకుతాయి. వీటిని సులువుగా తీసుకొని వెళ్ళడానికి అవకాశం ఉంది. కనక ఇవి తక్కిన వ్రాతసాధనాలకన్నా ఎక్కువ ప్రచారం పొందాయి.

తాటిచెట్టంటే ఆంధ్రుల కల్పవృక్షమన్నారు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. వారిమాటలు కొన్ని తాటిచెట్టు ప్రయోజనాలను గురించి చెప్పినవి, ఇక్కడ పొందుపరుస్తున్నాను.

"మంచి పంటలు పండని, నీటి వసతిలేని ఎగుడు దిగుడు నేలలుగూడ తాటితోపులకు పనికివచ్చును. నాటిన తాటిమొలకలకు నీళ్ల పోయనక్కరలేదు. తక్కువ నేలలోనే దగ్గర దగ్గరగా ఎక్కువ మొక్కలు నాటవచ్చును. విత్తనము నాటినది మొదలుగా కాపుపట్టినదాకకూడ దానికై ధన వ్యయమేమియు చేయనక్కరలేదు. నాటిన తర్వాత రెండు మూడేండ్లనుండి ఆకులు, మట్టలు మొదలగువానివలన ఉపయోగములుండును. పూర్వకాలమున నొక గృహస్థుడు కొన్ని తాటిచెట్లు కలవాడైతే కట్టుబట్ట తప్ప తక్కిన జీవితావశ్యకత వస్తువులన్నియు తాటిచెట్లనుండి సేకరించుకొని జీవితయాత్ర గడుపుకోగలుగువాడు. కాపురమునకు నిట్టాడు గుడిసె వేసికొన్నచో తాడిదూలము నిట్టాడవును. గోడలుపెట్టి కట్టు ఇల్లైయినచో తనాబీలు, దూలములు స్తంభములు, కొమరులు గుజ్జులు, వాసాలు, పెండెము అన్నింటికి తాటిమ్రాను పనికివచ్చును. కట్లుకట్టుటకు తాటినార పనికివచ్చును. ఇంట పరచుకొనుటకు తాటియాకు చాపలు, సామానులు నిలువ చేసికొనుటకు నానావిధాల పెట్టెలు, బుట్టలు తాటియాకులతో చేయవచ్చును. నీళ్ళు చేదుకొనుటకు తాటియాకులతో

బొక్కెనలను చేయవచ్చును. త్రాటినార చేత్రాళ్లు మొదలగు త్రాళ్ళు పేనుట కుపయోగపడును. తాటి మ్రాకులను రెండుగా చీల్చి నీళ్ళు పారుటకు దోనెలుగ చేయవచ్చును. ఈనెలుతీసి, కోసికుట్టిన యాకులు విస్తళ్ళుగా నుపయోగింపవచ్చును. తాటిముంజెలు, తాటిపండ్లు తాచే (నిలువచేసిన పేసము) చాప, బుర్రగుంజు, తాటి తేగలు, తాటిబెల్లము, తాటి కల్కండ, తాటి పానకము, తాటికల్లు ఆహార పానీయముల క్రింద పనికిపచ్చును. తాటిపండ్లు శిష్టులు ఆహారముగా నుపయోగింపరాదని నేటివారు కొందరందురు. కాని దానికి ప్రమాణము నే నెరుగను. మున్యాశ్రమములలో మునులు తాటిపండ్లను ఫలాహారముగా నుపయోగించువారనుటకు కాదంబరిలోని యీ క్రిందివాక్యము నిరూపించుచున్నది. జాబాలిమహర్షి యాశ్రమ వర్ణనమున 'ఉటజాజిరప్రకీర్ణ శుష్యచ్ఛ్యామాక ముపసంగృహీతామలక లవలీ లవంగ కర్కంధూ కదళీ లికుచ చూతపనస తాళఫల మధ్యయన ముఖరవటుజన" ఇత్యాది

"తాటి మ్రాని తుండ్లు రాతిరోళ్ళపైకుందులుగా నుపయోగపడును. తాటి యాకులతో గొడుగులు గావింతురు. తాటియానెలు, జవటలు, జీబులు, చీపుళ్ళు గను, గులక చెండ్లు, ఎండు మట్టలు, జీబులు మొదలగునవియెల్ల వంటచెరకున కుపయోగపడును. ఈ పేర్కొన్న యుపయోగములెల్ల పామర నాగరక సాధారణమైనవి.

"ఇక తాటిచెట్టు ప్రాచీనాంధ్రుల నాగరకతకు జీవరక్ష. ఆంధ్రుల విద్యా విజ్ఞానములెల్ల తాళపత్ర గ్రంథ రక్షితములై యున్నవి.... జాబులను, భారత భాగవతాదిగ్రంథములను వ్రాయుటకు నీతాటియాకుల నుపయోగించువారు. శతాబ్దములదాక నీ తాటాకు గ్రంథములు చెడిపోక యుండెడివి. జాబుకు కమ్మ అను పేరు తాటియాకును బట్టి వచ్చినదే.... ఇవిగాక యింక నెన్నెని ప్రయోజనములను మన పూర్వులు తాటిచెట్టువల్ల బడయువారు. తాటిచెట్టు (నేడు కాకపోవచ్చును గాక) పూర్వకాలమున తెలుగువారికి కల్పవృక్షమనుట సంగతమేకాదా?"
—(తెలుగు మెఱుగులు)

తాటాకుపైన, భూర్జపత్రాలపైన వ్రాయడం అనాదిగా ఉందన్నాను! బుద్ధునికి ముందునుంచే-అంటే ఇప్పటికి రెండువేల ఆరువందల సంవత్సరాలకు ముందునుంచే-ఉంది. నిజానికి వ్రాతకని పెట్టినప్పుడే, తాటాకుపుస్తకాలు పుట్టాయేమో! దొంగఅప్పుపత్రాలు, అప్పుపత్రాలు(కూటరిణపణ్ణా, రిణపణ్ణా) ఆకులలో వ్రాసేవారని జాతకకథలలో ఎన్నో తార్కాణాలున్నాయి. జాతకకథలంటే మీకుఇదివరకే తెలుసు. బుద్ధుడు స్వయం తన శిష్యులకు చెప్పిన తన పూర్వజన్మ గాథలని.

కాశీలో ఒక శ్రేష్ఠి ఉండేవాడని అతనికొక జానిస ఉండేవాడని, అతని పేరు కటాహకుడని. అతడు 'కూటరిణపణ్ణ'-దొంగ ప్రామిసరీనోటు తయారు చేయడం కూడ-ఇదివరకే కటాహ జాతకమనే కథలో చదివారు. రురు జాతకమనే మరొక కథలోను రిణపణ్ణాల (ఋణపత్రాల) ప్రసక్తి చదివారు. తాటాకులు భూర్జపత్రాలు కూర్చి కుట్టుకొనడాన్నిబట్టే ప్రాచీనకాలంలోను, నేడుకూడ, పుస్తకాలను గ్రంథమని, దాని భాగాలకు సర్గ, పటలం, స్కందం, కాండం, శాఖ, వల్లి, స్తబకం, పరిచ్ఛేదం, పుట, పత్రం అని వృక్ష సంబంధమైన పేర్లు వచ్చాయి.

తాటాకును, భూర్జపత్రాన్ని జ్ఞానచిహ్నంగా పరిగణించారు మన పూర్వులు తాటాకు గ్రంథాలు పట్టుకున్నట్టు చెక్కిన శిల్పాలుకూడ మనకు చాల ఉన్నాయి. జ్ఞానం ప్రసాదించే దేవతలని మనం పరిగణించే బ్రహ్మ, శివుడు, సరస్వతి మున్నగువారి విగ్రహాలు తాటాకులో, భూర్జపత్రాలో పట్టుకున్నట్టు పూర్వం చెక్కేవారు. బ్రహ్మ విగ్రహం ఎప్పుడు చెక్కినా, ఎడమ చేత్తో తాటాకు పుస్తకం పట్టుకున్నట్టు చెక్కేవారు. బాదామి, ఐహొళె శిల్పాలలో ఇలాటి బ్రహ్మ విగ్రహాలు చాల ఉన్నాయి. ఎడమచేతితో పుస్తకం పట్టుకున్నట్టు చెక్కిన ఒక సరస్వతి విగ్రహం దొరికింది మన దురదృష్టవశాత్తు. ఇది భిన్నమై మొండెం మాత్రం దక్కింది. ఇది ఇప్పుడు లక్నో మ్యూజియంలో భద్రంగా ఉంది. ఎడమచేత్తో పట్టుకున్న తాటాకు పుస్తకం చుట్టూచుట్టిన దారంకూడ మనకు ముచ్చటగా కనిపిస్తున్నది చూచారా? తాటాకు పుస్తకం పట్టుకున్నట్టున్న శివ విగ్రహాలూ ఉన్నాయి. ఈ లక్షణాన్ని తర్వాతి తర్వాతి శిల్పులు బుద్ధునికికూడ అంటగట్టారు. కుడిచేత్తో ధర్మచక్ర ప్రవర్తన ముద్ర, ఎడమచేత్తో ఉత్తరీయం అంచులు పట్టుకున్నట్టున్న శిల్పాలు ఉన్నాయి. ఈ ఉత్తరీయం అంచులు తాటాకులలాగ కనిపించేట్టు మడతలు మడతలుగా చెక్కేవారు శిల్పులు.



తాటాకుల గ్రంథాలు తయారుచేయడం ఒక కళ. తాటి మట్టల నుంచి ఆకులు విడిపించి, సమానంగా కత్తిరించి నీడలో ఎండించేవారు. నీడలో

ఎండించడానికి సంస్కృతపరిభాష ఛాయాశుష్కం. నీడలో ఎండిస్తే పెళుసు బారదు. తర్వాత వాటిని నీటిలోగాని, ఆవుపంచితంలోగాని నానబెట్టేవారు. పిదప ఉడికించేవారు. ఆకులు బాగా మొత్తబడుతాయి వాటిమీద శంఖంతోనో, గవ్వల వంటి నున్నని వస్తువుతోనో రుద్దేవారు. దానితో ఆకు గరుకుదనంపోయి నునుపు దేరుతుంది. తర్వాత వాటికి రెండువైపుల కొంచెం ఎడంవిడిచి ఒకవైపునగాని, రెండువైపులగాని రంధ్రాలువేసి, దారాలు పోనిచ్చి కట్టేవారు. ఇదే గ్రంథం. గ్రంథ మంటేచేర్చబడింది. సూత్రమంటే దారం. ఈ తాటాకుల్లోని దారం-సూత్రం పూసల్లోదారంలాగ అన్నిటిలోనూ ఉంటుందికదూ! ఇలాగే పెక్కు విషయా లకు వర్తించే వాక్యం సూత్రమైంది. ఈ గ్రంథమే ప్రోతమై అంటే కూర్చ బడిందై పోథీ, పోధీ, పొత్తం అయింది. పోస్త్ అనే పార్శీశబ్దం నుంచి కూడ పుస్తకం అన్నమాట వచ్చిందంటున్నారు.



ఇలా చక్కగా తయారయిన తాళపత్రాలపై గంటం అనబడే ఇనుప దబ్బనంవంటి సాధనంతో వ్రాసేవారు. వ్రాయడ మేమిటి? గొకేవారన్నమాట. వ్రాసిన తర్వాత అక్షరాలు తెలియడానికి మసిబొగ్గుగాని కాటుకగాని పూసే వారు. కాయపసరు, ఆకు పసరు పూయడంకూడ కద్దు. ఇది మామూలు పద్ధతి. గంటమంటే ముల్లు-ఇనుపముల్లు అన్నమాట. ఇది కంటక అనే సంస్కృత పదం నుంచి వచ్చినమాట.

గంటంతో వ్రాయడం దక్షిణభారత పద్ధతి. ఉత్తరాదిన ఎరుపు నలుపు సిరాలతో కాకి వెదురు కలంతో వ్రాసేవారు. వ్రాసే గంటాలుకూడ రకరకాలుగా ఉంటాయి. వ్రాసేటప్పుడు తాటాకులను చెక్కడంకోసం గంటం పై భాగంలో అందే పైకొసకు - కత్తికూడ ఉంటుంది. కొన్ని కత్తులు అర్ధచంద్రాకారంగానూ ఉంటాయి.

గంటాలు పెట్టే ఒరలుకూడ తాటాకులతోనే చేస్తారు. ఎరుకులవారు తాటాకు బుట్టలను అల్లడం చూచారు గదూ? పసిపిల్లలు ఊదే పీకలనో, గిలకలనో అల్లినట్టు అల్లుతారు ఈ ఒరను. దానిలో గంటాలను భద్ర పరుస్తారు; ఒరలో కత్తులు పెట్టినట్టు. పై భాగంలో ఉన్న గంటం కత్తికొన కనిపిస్తూనే ఉంటుంది. నేటి ఫౌంటన్ పెన్‌లు, ఇంకి పెన్సిళ్ళు చూచినవారికి ఈ ఒరగంటం విచిత్ర వస్తువుగా కనిపిస్తుంది.

ఇంత పసందుగా తయారుచేసిన తాళపత్ర గ్రంథాలు భద్రంగా ఉండాలి కదా! కలకాలం ఉండ డానికేకదా ఈ శ్రమంతా! కనుక వీటిని భద్రం చేయ డానికి తాటాకుల కొలతలోనే పలకలు సిద్ధపలచి ఆకులు నలిగిపోకుండా రెండువైపులా పెట్టి దారం చుట్టేవారు. ఆ కర్రచెక్కల మీద రంగు రంగు చిత్రాలు గీచేవారు. ఇవి చూడడానికి అందంగా ఉంటాయి. తాటాకు పుస్తకాలకు కర్రచెక్కలకు మారు వెదురు బొంగులను చీల్చి దబ్బలు చెక్కి కట్టడం కూడ కద్దు. ఆ వెదురు దబ్బలమీద గంటంతో పేరో మరొకటో వ్రాయటంకూడ పరిపాటి.





వ్రాయని తాటాకులను - అంటే పైని చెప్పినట్టు వ్రాతకు పదను **చేసిన** **తాటాకులను-అలేఖాలంటారు.** అలేఖాలంటే ఒక తమాషా కథ గుర్తుకు వస్తుంది.

ఒక నవాబుగారికి తానొక కృతిభర్త కావాలనే ఆశ కలిగింది. దివాను సాహెబుకు తన వాంఛితం తెలియజేశాడు. ఆయన ఒక కవికి నవాబుగారి తమన్నా తెలియబర్చారు. "ఏమి కావ్యం వ్రాయమని సెలవండీ?" అని ప్రశ్నించాడు కవి. "భారతం" అని నవాబు దివానుకు సెలవిచ్చారు. ఆ కొంటె కవి 'సరే' నన్నాడు. కావ్య రచనకు అన్ని సౌకర్యాలూ కల్పించారు.

ఆరు నెలలపాటు కవి బాగా మేశాడు. సకల ప్రచారాలు జరుగుతున్నాయి. కృతి సమర్పణోత్సవం సమీపించింది. కవి తాటిమట్టలు కొట్టించి బాగాకత్తిరించి అలేఖాలు తయారుచేశాడు; బండ్లకు ఎత్తించాడు కృతి సమర్పణ దినం రానే వచ్చింది. ఆనాడు తాటాకు అలేఖాల బండ్లతో నవాబు దేవిడీ దర్వాజా చేరాడు.

కవికి ఘనస్వాగత మిచ్చాడు నవాబు. అలేఖాల బళ్లు దర్వాజా ముందు నిలబడ్డాయి. నవాబుతో పాటు కవి దర్బారు చేరిన పిదప స్రక్చందన తాంబూలాలు అందుకొని సవినయంగా నవాబుతో మనవిచేశాడు గదా- "జహాఁపనాహ్! కృతి అంతా తయారయింది. దర్వాజావద్ద బండ్లలోతయారుగా ఉంది. ఒక్కసందేహం వచ్చి తీర్చుకుని మీకు వినిపింపదలచినాను. అని "ఏమిటాసందేహం" శాయర్‌జీ? అన్నాడు నవాబు. "మరేమీ అంత పెద్దదికాదు. మా భారతంలో ధర్మరాజు నాయకుడు. మిమ్మల్ని ధర్మరాజుతో పోల్చాను. మీ భాయీ సాహబాన్‌లను భీమార్జున నకుల సహదేవులతో పోల్చాను. మీ మల్కా సాహెబా ద్రౌపది అయ్యారు. కాని భారతంలో ద్రౌపదికి ఐదుగురు భర్తలు. ఏమి చేయాలో తోచడంలేదు" అన్నాడు నీళ్ళు నములుతూ, చేతులు నలుపుతూ కవి.

నవాబు ఉగ్రుడైపోయాడు. "అరెరె! అలాటి గందీశాయరీ అక్కరలేదు. ఫౌరన్ కాల్చివేయి" అని హుకుంచేశాడు. కవి బ్రతుకు జీవుడా అని బయటపడి, బండ్లలోని అలేఖాలను అక్కడే పరశురామప్రీతి చేశాడు.

మనదేశంలో తాటాకులు వ్రాత సాధనంగా బహుకాలంగా ఉన్నవని మనదేశానికి వచ్చిన విదేశీయ యాత్రికులందరూ చెప్పారు. చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయబారిగా ఉన్న మెగస్తనీస్ తాటాకు పుస్తకాల సంగతి చెప్పాడు. త్రిపిటకాలను మొదట తాటాకులలో వ్రాసినట్టు హూఎన్‌త్సాంగ్ అనే చీనా యాత్రికుని శిష్యుడు హ్యూలే చెప్పాడు. మహాకాశ్యపుడనే బౌద్ధుడు త్రిపిటకాలను తాళపత్రాలలో వ్రాయించి దానంచేశాడట. మహమ్మద్ ఘజనీ వెంటవచ్చిన అల్బరూనీ అనే అరబ్బీ పండితుడు మనవారు తాటాకులపై వ్రాసేవారని తెలిపాడు.

తాటాకులను వ్రాత సాధనంగా వాడడం లంక, ఇండోచీనా, జావా బలిద్వీపాలలోను ఉండేది.

గంటంతో వ్రాసిన ప్రాచీన తాళపత్ర గ్రంథాలు దొరకలేదు. సిరాతో వ్రాసినవి దొరికాయి. వీటిలో అతి ప్రాచీనమైనవి ప్రజ్ఞాపారమితా హృదయ సూత్రం, ఉష్ణీష విజయధారిణీ అనే బౌద్ధగ్రంథాలు. ఇవి నేడు జపాన్‌లోని హోరియా మ్యూజియంలో భద్రంగా ఉన్నాయి. ఇవిరెండూ ఇప్పటికి పదిహేను శతాబ్దులనాటివి. తాటాకులలో తెలుగులిపి ప్రాచీన గ్రంథం 15వ శతాబ్ది నాటిది మాత్రమే దొరికింది.



భూర్జపత్రాల వాడుక ఉత్తరాదిని ఎక్కువ. ఇవి ఒక రకం కొండ రావి పట్టలు. వీటినికూడ తాటాకులధోరణిలో కత్తిరించి నీడను ఆరబెట్టి భద్రపరచు కొనేవారు. తర్వాత రంగు రంగుల సిరాతో రెల్లుకలంతో వ్రాసేవారు. ఈ భూర్జ పత్ర గ్రంథాలు చినిగిపోకుండా కర్రచెక్కలు రెండువైపులా పెట్టి కడతారు. తాటాకుల పుస్తకం కట్టినట్టు. ఈ భూర్జపత్రాలు చూడండి. ఇది గుప్తుల కాలం నాటి లిపిలో వ్రాయబడ్డాయి. మధ్య ఆసియాలో దొరికాయి.





భూర్జపత్రాలలో వ్రాసిన పుస్తకాలలో అతి ప్రాచీనమైన ధమ్మపద మనేది మనకు దొరికింది. ఇది బౌద్ధులకు గీతవంటిది. ఇది దొరికింది మన దేశంలో కాదు. మధ్య ఆసియాలోని ఖోటాన్ అనేచోట ఉన్న గోసంగ విహార మనే బౌద్ధవిహారం శిథిలాలలో. ఇప్పటికి పద్దెనిమిదివందల సంవత్సరాల నాటిది; ఖరోష్ఠీ లిపిలో వ్రాసినది.

దక్షిణభారతంలో భూర్జపత్రాల వాడుక తక్కువ అని ఇదివరకే తెలి పాను. ఉన్నవాటిలో అతి ప్రాచీనమైన భూర్జపత్ర గ్రంథం క్రీ. శ. 1428 నాటిదని పెద్దలంటారు.

తృతీయ ప్రకరణం

# పెపైరస్ - కవిలెచుట్టలు

ఇటుక పుస్తకాలు వింతే కదూ! వాటికన్నా అసాధారణమైన పుస్తకాలను ఈజిప్టు దేశీయులు కనిపెట్టారు. అలాటివి మనదేశంలో లేవనుకోండి. అయినా నేడు పాశ్చాత్య దేశాలన్నిటా 'పేపరు' (కాయితం) అనే పదానికి మూలమైన ఈ వింత పుస్తకాన్ని తెలుసుకొనడం అవసరం.

మీరు కవిలె కట్టలు చూచే ఉంటారు; చాపచుట్టలులాగ ఉంటాయి. ఈ పుస్తకాలు కూడ అలాటి కవిలెచుట్టలే. పొడుగాటి పట్టీ - కొన్ని వందల గజాలది ఉందనుకోండి. అదొక రకమైన కాయితంతో చేసింది-చాల తమాషా కాయితం. ఈత చాప చూచేఉంటారు. కొన్ని చిన్న చిన్న చాపపీలికలు మొదట అల్లి అన్నిటిని కలిపి పెద్ద చాపగా అల్లుకుంటారు. అలాటి చిటి చాపలాగా ఉంటుంది, పొడుగ్గా. చింపితే చినగదు నిజానికది చాపపీలికే. చూడడానికది పసువు పచ్చగా నున్నగా మెరుస్తూ ఉంటుంది. అయితే లక్క పలకలాగ పెళుసు.

ఈ పట్టీలపై పొడుగునా వరుసగా వ్రాయరు; విభాగాలు విభాగాలుగా వ్రాసేవారు. పట్టీ పొడుగునా వ్రాస్తే, చదువరులు పట్టీ ఈ కొసనుంచి ఆ



కొసకు వెనక్కు ముందుకు పరుగెత్తవలసి ఉంటుంది.

ఈ వింతకాయితం మరీ విచిత్రమైన మొక్కతో తయారుచేసేవారు. ఇది నైల్‌నదీ తీరంలోని చిత్తడి నేలలోను, నీటిలోను పెరిగే తుంగజాతి మొక్క. చాపలు అల్లే లావుపాటి తుంగమొక్కలు మీరు చూచే ఉంటారు. అలాటిదే ఇదీని. దీనికాడ నిటారుగా నిలువెత్తుగా పెరుగుతుంది. ఆకు, చివురు ఏమీ ఉండదు. కొసను కుచ్చులాగ ఉంటుంది. దీనిని ఈజిప్టువారు 'పెపైరస్' అంటారు. నేడు ఇంగ్లండులో "పేపర్" అని, ఫ్రెంచి, జర్మన్ భాషల్లో "పపీర్" అని, రష్యన్ భాషల్లో 'పప్యా' అని కాయితానికివాడే మాటలన్నీ ఈ పెపైరస్ వికృతులే.

నిజానికి ఈ వింత మొక్క ఈజిప్టువారికి అనుంగునెచ్చెలి. దీనితో వారు కాయితం చేసేవారు. దీనిని కూరగా వండుకొనేవారు; దీని పసరనుంచి సారాయి తీసేవారు; గుడ్డలు, పాదరక్షలు తయారుచేసేవారు; తెప్పలు కట్టి ప్రయాణం చేసేవారు. వండిన పెపైరస్‌కూర, తియ్యని పెపైరస్‌రసం, పెపైరస్ గుడ్డలు, పెపైరస్ పై బెరడుతో అల్లిన పాదరక్షలు, వీటి అల్లికతో తయారయిన దోనెలు-తెప్పలు—ఇవన్నీ ఆవుతోకలాగ అసహ్యంగా కనిపించే ఈ మొక్క ఈజిప్టు ప్రాచీన ప్రజలకు ప్రసాదించేది. మనకు తాటిచెట్టు ఎలా కల్ప వృక్షమో ఈజిప్టు వారికికూడ ఇది కల్పవృక్షం వంటిదనే చెప్పాలి.

పూర్వం ఈజిప్టువారు పెపైరస్ కాయితాలు తయారుచేసే కార్ఖానాను చూచిన ఒక రోమన్ రచయిత ఆ కార్ఖానాను ఎలా వర్ణించాడో చూడండి: వారు తుంగ దంట్లను సూదులతో సాధ్యమైనంత వెడల్పాటి పలుచని చెక్క



లుగా చీల్చేవారు. తర్వాత వీటిని పక్కనపక్కన పెట్టి అతికించి కాయితాలు తయారుచేసుకొనేవారు. ఈ అతికింపుపని నైల్‌నది రొంపినీటితో తడిసిన బల్లలపై జరిగేది. ఈ రొంపినీరు బంకలాగ పనిచేసేది. ఈ బల్లలను వాటిపై నీరు కొద్దిగా పారుతూ ఉండేట్టు కట్టేవారు.

ఈ పెపైరస్ చీలికలను ఒక వరుస పరచగానే కొసలు కత్తిరించివేసి, వాటిపై మరొక వరస అడ్డంగా పరిచేవారు-పడుగుపేక వేసిన గుడ్డలాగా నన్నమాట. పడుగు, పేకగా పేరుస్తూ వచ్చిన తరువాత వాటిపైన పెద్ద బరువుమోపి ఎండలో ఎండబెట్టేవారు. ఎండిన తర్వాత దంతంతోనో, శంఖంతోనో-మనవారు తాటాకులను నునుపుచేసినట్టుగా-రుద్ది నునుపు చేసేవారు.

నేడు కాయితాలలోను ఎన్నో రకాలున్నట్టు పెపైరస్‌లోను పెక్కు రకాలుండేవి. దంటు మధ్యభాగంలోని గుజ్జును చీల్చి తయారుచేసింది మేలి రకంది. దీనిని ఈజిప్టువారు మతగ్రంథాలు వ్రాయడానికి వాడేవారు గనుక "పవిత్రమైన కాయితం" అనేవారు. రోమనులు దీనిని తమ చక్రవర్తి అగస్టస్ పేరుతో గౌరవంగా "అగస్టస్ కాయితం" అనేవారు. దానికన్నా తక్కువదైన రెండవ రకం పెపైరస్‌ను అగస్టస్ భార్య లివియా పేరుతో "లివియా కాయితం" అన్నారు.

ఇంకా ఎన్నో రకాలు ఉండేవి. నాసిరకం పెపైరస్‌ను "వ్యాపారస్తుల కాయితం" అనేవారు. దీనిని బంగీలు మున్నగునవి కట్టడానికి, చుట్టడానికి వాడేవారు. కాని, వ్రాతకుకాదు. మంచిరకం పెపైరస్ కాయితాల కార్ఖానాలు అలెగ్జాండ్రియా నగరంలో ఉండేవి. అక్కడినుంచి రోమ్, గ్రీస్, తదితర దేశాలకు పెపైరస్ ఎగుమతి అయ్యేది.

ఇలాటి ఇరవై పెపైరస్ కాయితాలను పక్కన పక్కనే అతికించి ఒక పొడుగాటి పీలికను తయారుచేసేవారు. ఈ పీలికలు వందగజాలకు పైగాను ఉండేవి. ఇలాటి పుస్తకాన్ని మనం చదివేదెలా? ఆ చుట్టను ఇంట్లో తెరచామంటే ఇల్లంతా అల్లుకుంటుంది ఇంట్లో నేలమీద పరిచి, చదవడానికి అటూ ఇటూ పాకులాడడం కుదురుతుందా? ఏదైనా దడికట్టి దానిపైన గుడ్డలు ఆరవేసినట్టు దీనిని ఆరవేసి చదువుదామా అంటే, నేటి పఠనాలయాలలాగ, పఠనాలయాలలో పత్రికలను పరిచిపెట్టి ఉంచే స్టాండులులాగ "చదువుకునే దడులు" ప్రత్యేకంగా లేవు. అలా దళ్ళకు తగిలించి పెడితే వానకూ, ఎండకూ, గాలికీ చెడిపోవూ? మిడతలు, చిమటలువంటివి పుస్తకంపై ప్రాకి కొట్టివేయవూ? ఏ స్నేహితునైనా పిలిచి, "ఈ పుస్తకం కొసలు పట్టుకుని నిలబడవోయ్! చదువుకుంటాను" అని అందామన్నా కుదరదు. రోజూ కొన్ని గంటలసేపు పొడుగాటి ఈ పుస్తకాన్ని తెరచి పట్టుకొనేవాడు దొరకవద్దూ?

ఈ పెపైరస్‌ను నేటి కాయితాలలాగ పుటలుగా కత్తిరించి బైండు ఎందుకు చేయగూడదు? ఇది సులభంగానే ఇప్పుడు కనిపిస్తుంది. కాని మొదట్లో వారికి తోచలేదు. ఇంతకూ అలా బైండుచేయడంకూడా పడేదికాదేమో? ఎందుకంటారా? పెపైరస్ పెళుసు, వంచితే విరుగుతుంది. నేటి కాయితంవలె ఎటుబడితే అటు నలిపివేయడానికి వీలయ్యేదికాదు. మడిస్తే విరిగి ముక్కలౌతుంది.

కనుక ఈజిప్టువారు వీటిని భద్రపరచడానికి మంచి మార్గం ఆలోచించారు. పెపైరస్ పుస్తకం రెండు కొసలకు రెండు గుండ్రటి కర్రలను-మన రూళ్ళ కర్రలలాంటివి-కట్టి చాపలాగ ఒక కొసనుంచి చుట్టేవారు. ఈ కర్రల కొనలకు పిడులను-చదరంగపు బొమ్మలలాంటివి చెక్కేవారు. చదివేటప్పుడు ఈ చద రంగపు బొమ్మలను పట్టుకుని పుస్తకం చుట్ట విప్పేవారు. మ్యాపులను పెద్ద పెద్ద కాయితాలను మనం నేటికీ ఈలాగే చాపలవలె చుడుతుండడం చూస్తున్నదే; చేస్తున్నదే.

పెపైరస్ పుస్తకాలను చదవడానికి ఒక పద్ధతి ఉంది. ఎడమచేత్తో చదరంగపు బొమ్మ చెక్కిన పిడిని పట్టుకుని కుడిచేత్తో మరొకపిడిని పట్టుకుని పుస్తకం తెరిచేవారు. చదివేటప్పుడు రెండు చేతులకూ పని తగులుతుందన్న



మాట. దగ్గర ఉన్న కలం తీసుకొందామనో, కంటిమీద వాలిన ఈగను తోలడానికనో కుడిచేయి వదలిపెట్టామనుకోండి పుస్తకం యావత్తూ చుట్ట చుట్టుకొని పోతుంది. పుస్తకం చదువుతూ ఏదైనా గుర్తువేసుకొందామన్నా కష్టం. గుర్తు వేసుకొనడానికి ఇద్దరు - ఒకరు చెప్పేవారు, మరొకరు వ్రాసేవారు-కావలసివచ్చేది.

వెంటవెంటనే కొన్ని పుస్తకాలు తెరచి ఫలానావిషయం చూద్దామనుకునే వారికి మరీకష్టం. మరొక పెద్ద చిక్కుకూడ ఉంది. ఈ చుట్టలలో ఒక చుట్టలో గ్రంథంలోని ఒకభాగమే ఉండేదికాని, పూర్తి పుస్తకం ఉండేది కాదు. కనుక ఒక పుస్తకం వ్రాయడానికి ఎన్నో పెపైరస్ చుట్టలు కావాలి. ఈ పుస్తకాలు కూడా నేటిలాగ జేబులోనో బీరువా అరలోనో ఇమిడేవికావు ఒక గ్రంథం వెంట తీసుకుపోవడానికి ఎన్నో చిటిచాపల చుట్టలను గుండ్రటి పెట్టెల్లో పెట్టి, మోసు కొనో, మోయించుకొనో పోవాలి. ధనవంతులు తమకు కావలసిన పుస్తకాలను స్వయంగా తీసుకువెళ్లేవారు కారు. బానిసలతో మోయించుకొని వెళ్ళేవారు.

అలాటి పుస్తకాల దుకాణంకూడ గోడలకు అతికించే ప్రకటన కాయితాలు, మ్యాపులు ఉన్న గిడ్డంగిలాగ (గోదాము లాగ) కనిపించేదిగాని నేటి పుస్తక విక్రయశాలలాగ కాదు. ప్రతిచుట్టకు అది ఏ పుస్తకమో, ఏ పుస్తకంలోని భాగమో తెలిపే చీటీముక్క వ్రేలాడగట్టేవారు.



మన దేశంలోని ఉత్తరాదివారు భూర్జపత్రాలపైన, తాటాకులపైన, సిరాతో వ్రాసినట్టే ఈజిప్టువారు వీటిపైన సిరాతో వ్రాసేవారు. ఆ సిరా నేటి మన సిరావంటిది కాదు. పొగమసి నీళ్ళలో రంగరించి సిరా (మసి) తయారుచేసేవారు. సిరా కలంనుంచి వెంటవెంటనే జారిపోకుండా తుమ్మబంక కలిపేవారు. ఇప్పటి సిరాలాగా చాలకాలం మనేది కాదది. దేనితో రుద్దినా చెరిగిపోయేది. సిరాను చెరపడానికి వారు సముద్రపు పాచిని వాడేవారు. సముద్రపు పాచి దగ్గరలేనప్పుడు నాలుకలతోనే తుడిచి వేసేవారు. ఇలా నాలుకతో తుడిపివేయడం గురించి ఒక తమాషా కథ చెబుతారు. ఈజిప్టు చక్రవర్తి కలీగులా దర్బారులో కవితాస్పర్ధలు జరిగేవి. పోటీలో బహుమతి పొందని నిర్భాగ్యపు కవులు తమ రచనలను నాలుకతో నాకివేయాలని చక్రవర్తి హుకుం చేసేవాడట.

కలాలు కూడా ఇప్పటి కలాలవంటివి కావు. మనదేశంలో ఉత్తరపథాన తాటాకులమీద వ్రాసే కాకి వెదురు కలాలు. కాకివెదురును ఇప్పటి సీసపుకడ్డీ (పెన్సిల్) అంతపొడుగున కోసి, ఒకకొనను కోసుగా చివ్వి, ఆకొనను రెండుగా పాము నాలుకలాగ చీల్చేవారు. కొన చీల్చకపోతే కలం వ్రాయదు. కొన చీల్చ కుండా వ్రాసిచూడండి! సరిగా వ్రాయదు. రెండు చీలికలుంటే వ్రాసేటప్పుడు సన్నని కాలువ ఏర్పడి దానిగుండా ధారగా సిరా పారుతుంది. గీతను వెడల్పు చేయదలిస్తే కలం కొనను కొంచెంగా అదిమితేసరి. సిరా హెచ్చుగా పారుతుంది. కలం కొనను చీల్చా లని మొదట తోచినవాడు నిజంగా చాల తెలివైనవాడు.



ఈ కలాలతో, సిరాతో వ్రాసిన పెపైరస్‌ను చూడండి. మనం ఇదివరకు చదివిన చిత్రసంకేత లిపిగా కనిపించదే! ఈజిప్టు మందిరాల గోడల మీద, సమాధులమీద ఉన్న చక్కని బొమ్మల వ్రాతలాగను లేదు! ఏవో వంకర టింకర గీతలలాగ ఉన్నాయి.

దీనికి కారణం తెలుసుకోవడం అంత కష్టంకాదు. రాతిమీద చెక్కడం కన్న పెపైరస్‌పై వ్రాయడం సులభం. రాతిమీద చెక్కడానికి అరగంటపడితే,

పెపైరస్‌పైన వ్రాయడానికి నిమిషం అవుతుంది. పాత చిత్ర సంకేత లిపులు పెపైరస్ తమ అందమైన రేఖలను, వంపులను కోల్పోయి, వంకర గీతలు మిగిలాయంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. తొందరగా వ్రాయడం చిత్రాల వంపులను, అందాలను రూపుమాపి రేఖను మాత్రమే మిగిల్చిందన్నమాట. తీరికగా కూచుని వ్రాసే మతాచార్యులవంటి పై తరగతివారు పాత అక్షరాల అందచందాలను దృష్టిలో పెట్టుకొని, చక్కని దస్తూరి వ్రాసేవారు. ఈ తరగతికి చెందని సామాన్య ప్రజ త్వరత్వరగా వ్రాత ముగించి పనిగడుపుకొనేవారు. ఈ కారణంగా ఆఖరుకు ఈజిప్టువారిలో మూడురకాల వ్రాతలు - చిత్రలిపి, మతాచార్యుల సుందర లిపి, ప్రజాసామాన్యం వ్రాసే వంకరటింకర జిలుగు లిపి ప్రచారంలోకి వచ్చాయి.

పెపైరస్ ఈజిప్టు వ్రాయసంలో ఎంత విప్లవం తెచ్చిందో చూచారా?

చ తు ర్థ ప్ర క ర ణం

# కర్రపలకల పుస్తకం - మైనపుపలకల పుస్తకం

పలకలపై వ్రాయడం మనం చూస్తున్నాము దినమూ. కర్ర పలకలు కూడ మనకు తెలుసు. కర్రపలకల పుస్తకమంటే అపురూపం కదూ! నిజమే నేడు అపురూపమే. కాని పూర్వం ఉండేది.



ఇప్పుడు మనం వాడే బలపపు రాతి పలకలు రాకముందు కర్రపలకలపై వ్రాయడం ఉండేది. ఈ కర్రపలకలను 'పాటీ' అనేవారు. ఫట్టనుంచి వచ్చినమాట యిది. ఇది నేటికీ ఉత్తర భారతంలో వాడుకలో ఉంది. ఉత్తరభారతం వరకూ వెళ్ళడమెందుకు? మన తెలంగాణాలోనే వాడుకలో ఉంది. గ్రామ సీమలలో వీటిపైన తెల్లసుద్దతోగాని, ఎర్రసుద్దతోగాని వ్రాస్తారు. ఒకప్పుడు వీటిపైన తెల్లపూతపూసి, వాటిమీద దంటు కలంతో నల్ల సిరాతో వ్రాస్తారు.

అత్యంత ప్రాచీనకాలంలో న్యాయస్థానాలలోను ఇలాటి కర్రపలకలను వాడేవారట. వాదిప్రతివాదుల వాఙ్మూలాలను ఈలాటి కర్రపలకలపై గుర్తువేసుకొనేవారట. మనుస్మృతిని గురించి మీరు వినే ఉంటారు. అది మనువనే ఋషి రచించినది. అలాగే కాత్యాయనుడనే మరొక ఋషి రచించిన స్మృతి ఉంది. అది అతని పేరిటనే "కాత్యాయన స్మృతి" అని వ్యవహరించబడుతూ ఉంది. కర్రపలకలను న్యాయాధీశులు న్యాయవాదులు ఎలా వాడాలో ఈ స్మృతి తెలిపింది.

"పూర్వపక్షం స్వభావోక్తం ప్రాడ్వివాకో విలేఖయేత్,
పాండు లేఖేన ఫలకే తతః పత్రం విశోధయేత్."

"న్యాయధీశుడు విచారణ సమయంలో వాది వాఙ్మూలం పలకలమీద సుద్దతో చిత్తు వ్రాసుకొని తర్వాత దానిని అంతకుముందు చేసిన ఫిర్యాదుతో పోల్చిచూడాలి" అని దీని తాత్పర్యం.

జ్యోతిష్కులు దశలు, విదశలు మొదలయిన లెక్కలు కట్టడానికి ఈ పలకలను ఉపయోగించేవారు. ఉత్తరభారతంలో నేడుకూడ వివాహాది శుభాశుభకర్మలు చేయించే పురోహితులు ఈ ప్రాచీన సంప్రదాయానికి చిహ్నంగా చిన్న కర్ర పలక-పాటీ-సుద్దముక్కలు పెట్టుకుని లాంఛనంగా గణితం చేస్తారు. మొదట చిత్తులెక్కలు దీనిపైకట్టి తర్వాత జాతక చక్రంగల పత్రికలో చేరుస్తారు. ఈ చిత్తులెక్కలను పూర్వం ధూళీకర్మ అనేవారు. అంటే చిత్తులెక్కలు చేసిన పిదప తుడిచి సుద్ద పోవడానికి నోటితో ఊదేవారన్న మాట.

ప్రతి గణితశాస్త్ర గ్రంథంలోను-తెనుగు గ్రంథాలలోకూడ పాటీగణిత మనే అధ్యాయం ఉంటుంది.

గౌతమబుద్ధుడు కూడ ఈలాటి పలకలమీదే అక్షరాలు దిద్దుకున్నాడట. ఈ సంగతి లలిత విస్తరంలో ఉంది. లలిత విస్తరమనేది బుద్ధుని జీవిత చరిత్రలలో మెట్ట మొదటిదని మీకు తెలుసు. బుద్ధుడు అక్షరాలు, గుణింతాలు వ్రాసుకున్న పలకలు మామూలు పలకలనుకున్నారేమో! కాదు. మంచి గంధపు చెక్క పలకలు. ఆయన రాజకుమారుడు కదూ! ఆ ఠీవికి తగినట్టుగా ఉండవద్దూ. బౌద్ధమత గ్రంథాలయిన పిటకాలలో భాగమైన జాతక కథల్లోను, మహావర్గంలోను ఈ కర్రపలకల ప్రస్తావన ఉంది.

పూర్వం తెనుగునాడులోను ఈలాటి పాటీలు ఉన్నట్టు గాథాసప్తశతి సాక్ష్యమిస్తున్నది.

కారుమబ్బులు కమ్ముకొని వస్తున్నాయి. చంద్ర బింబంగాని, సూర్య బింబంకాని, నక్షత్రాలుగాని కనిపించడంలేదు. అప్పుడు తెల్లటికొంగల బారు మాత్రం కనిపిస్తున్నది. అది ఎలాగుందంటే, గ్రహాలు ఎక్కడ ఉన్నాయో లెక్కలుకట్టి తెలుసుకొనడానికి కాలుడనే జ్యోతిష్కుడు సుద్దతో గీచిన గీతలాగ ఉందట.

కత్థ గఅం రఇబింబం
కత్థ పణట్ఠాఓ చందతారా ఓ,
గఅణే వలాఅపంతిం
కాలో హోరం వ కడ్ఢే ఇ. (౬-౩౬)

మరొక హృదయ విదారకమైన భావాన్ని హాలుడు క్రవంకపై సుద్ద ముక్కతో వ్రాసి తుడిచివేశాడు.

"మనస్సు ఆశ అనే బలపంతో హృదయమనే పలకపైన ఏమేమి వ్రాస్తుందో, దాన్నంతా విధి పిల్లవాళ్లు వ్రాసింది తమాషాగా తుడిచివేసినట్టు, నవ్వుతూ తుడిచివేస్తాడు" అని ఒక ప్రేమికురాలు తలపోస్తుంది. ఎంత నిరాశతో అన్నమాట ఇది !

జం జం ఆలిహఇ మణో
    ఆసావట్టీ హి౯ హిఅఅ ఫలఅమ్మి,
తంతం బాలోవ్వ విహీ
    ణిహుఅం హసిఊణ పంహుసహి (7-56)

పాటీలపై వ్రాయడాన్ని శ్రీనాథుడు శృంగార నైషధంలో చాల చక్కగా వర్ణించాడు. నలుడు దమయంతితో ఇలా అంటున్నాడు.

"దేవి తమోమషీరసము తేటబొసంగగ గట్టిపెట్టి యం
కావళి వ్రాయగా దొడగె సంబర సంపుటకాంతరంబునం
బూవిలుకాని శౌర్యగుణముల్ హరిణాంకుడు ముత్తియంబులం
దావళముల్ రచించిన విధంబున రుక్పటికా ముఖంబునన్" (8-160)

ఈ క్రపలకపై ఎలా వ్రాసేవారు ? వివరించడం అవసరం. పలకలకు తెలుపురంగుపూసి ఆరబెట్టేవారు. ఎర్రరంగు కణికతో వ్రాసేవారు. నల్లరంగు పూసి, తెల్ల సుద్దముక్కతో వ్రాసేవారు. కొయ్యకలంతో సిరాతో వ్రాయడం కూడ కద్దు. ఈ కొయ్యకలాన్ని వర్ణకం అనేవారు. ఇలాటి వర్ణకాల ప్రసక్తి జాతక కథలలో ఉంది.

ఈ పలకలు దీర్ఘచతురస్రాకారంగా ఉండేవి. పైకొసకు దారం కట్టిగాని దారం కట్టనవసరం లేకుండాగాని మేకుకు తగిలించడానికి వీలుగా చెవిలాగా చెక్కి రంధ్రం వేసేవారు.

ఈలాటి పలకలు కొన్నిటిని చేర్చి గ్రంథం చేసుకోవడం కూడ కద్దు. పైకి అన్నీ పీటచెక్కలలాగా కనిపిస్తాయి. కాని మహా గ్రంథమన్న మాట.



బర్మాలో ఈ పలకలకు వెండి బంగారు నీరు పూసి నల్లటి మసితో వ్రాసేవారట. తాటాకు పుస్తకాలలో ఒక పత్రంపై వ్రాయదగినది ఈ ఫలక పుస్తకమంతా మింగివేస్తుంది. బర్మాలో తాటాకులు విరివిగా దొరుకుతున్నప్పటికీ భద్రత కోసం ఈలాటి పద్ధతి అనుసరించి ఉంటారు. ఇంతకుముందు పుటలో ఉన్న బొమ్మ కమ్మువా బౌద్ధ గ్రంథంలోని చెక్కపలకపై పాలీలిపి నమూనా.

మనదేశంలో కర్రపలకలు ఎంత వ్యాప్తిలో ఉండేవో పాశ్చాత్య దేశాలలో మైనపు పలకలు అంతవ్యాప్తిలో ఉండేవి. మైనమంటేనూ, మైనపువత్తులంటేనూ మనకు తెలిసిన వస్తువులు. కాని మైనపు పుస్తకాలంటే వింతే. మన దేశంలో అలాటివి అసలే లేవు. వెన్నవలె కరిగించివేయగల మైనపు పుస్తకాలంటే ఇంతకుముందు చెప్పిన రాతి పుస్తకంకన్నా, తాటాకు పుస్తకం కన్నా, పెపైరస్ పుస్తకంకన్నా విచిత్రంకదూ ! ఈ మైనపు పుస్తకాలను రోమనులు కనిపెట్టారు. యూరప్‌లో ఫ్రెంచి విప్లవం వరకు ఇవి వాడుకలో ఉండేవి.

మైనపు పుస్తకం ఎలా ఉంటుందో ఈ బొమ్మ చూడండి. జేబులో ఇమడదగిన నోటుబుక్కు కొలతలో చిన్నచిన్న కర్రపలకలు చేసి. వాటి మధ్యన దీర్ఘచతురస్రాకారంగా కొంతలోతు చెక్కివేస్తారు. దానినిండా మైనం నింపుతారు. పసుపుపచ్చ రంగుగాని, నలుపుగాని పూస్తారు. పలకల లోపలి అంచులకు రంధ్రాలువేసి దారాలు దూర్చి పుస్తకాకారంగా కట్టి ముడివేస్తారు; మన తామ్ర శాసనాలలో కడియం పోనిచ్చినట్టు. మొదటి పలక పైపక్క, తుదిపలక పైపక్క మైనం నింపరు. అంతా మన శాసనపు రేకులలాగే ననుకోండి.

ఈ పలకలమీద ఎలా వ్రాసేవారు ? సిరాతో మాత్రంకాదు. మైనంమీద సిరా ఎలా నిలుస్తుంది ? మన గంటంలాంటి ఇనుపకమ్మీతో వ్రాసేవారు. దీనిని 'స్టైలస్' అనేవారు. దీని ఒక కొన కూచిగాను, రెండవ కొన గుండ్రంగా ముద్దగాను ఉంటాయి మన గంటంలాగ. కూచిగాఉన్న కొనతో వ్రాసేవారు, గుండ్రని కొనతో తప్పులు పడితే కొట్టివేసేవారు.



ఆకాలంలో పాశ్చాత్య దేశాలలో మైనపు పలకలు చాల చౌక. వీటిని లెక్కలు చేయడం, రోజువారి మామూలు విషయాలు గుర్తుపెట్టుకొనడం వంటి వాటికి వాడేవారు. ఈజిప్టునుంచి దిగుమతి చేసుకొనే పెపైరస్ చాల ప్రియం గనుక దానిని పుస్తకాలు వ్రాయడానికి మాత్రమే వినియోగించేవారు.

వీటిని చాలకాలం వాడవచ్చు. తరచు వాడవచ్చు గనుక ఇవి మరీ మంచివి. ఒకరు మరొకరికి ఉత్తరం వ్రాసి పంపితే, దానిని అందుకున్న వ్యక్తి వెంటనే దాని వెనుక సమాధానం వ్రాసి పంపేవాడు. వీటిపైన ఎన్నిసార్లన్నా వ్రాయవచ్చు. స్టైలస్ మొద్దు కొసతో కొట్టివేయనూవచ్చు.

"స్టైలస్ మొద్దుకొనను బాగా వాడండి !" అని ఆకాలంలో యువ రచయితలకు పెద్దలు సలహా యిచ్చేవారు. అంటే కొట్టివేసినకొద్దీ రాత బాగుంటుందనివారి అభిప్రాయం. బాగా వ్రాసేవానిని "అతని స్టైల్ మంచిది" అని అనడం నేటికీ ఇంగ్లీషుభాషలో నానుడిగా మిగిలింది. 'స్టైల్' (శైలి) అనే మాట పూర్వం వ్రాతసాధనమై ఇప్పుడు మరుగైపోయిన స్టైలస్ వికృత రూపమే.

ఈ మైనపు వ్రాతలను సులభంగా తుడిచివేయడం ఒక్కొక్కప్పుడు ప్రమాదంగాను పరిణమించేది. కొన్నికొన్ని ముఖ్యమైన ఉత్తరాలు వ్రాసినవారి నుంచి అందుకొనేవారికి చేరేప్పటికి, వాటిని అందజేసే వ్యక్తులు దారిలోనే వాటిలోని ముఖ్యాంశాలను తుడిచివేసేవారట. కనుక రహస్యమైన సంగతులు వ్రాసినమీదట, వాటిమీద మరొక పచ్చని మైనపుపొర పోతపోసి, దానిమీద మరొక మామూలు ఉత్తరం "ఎలా ఉన్నావు? ఏమిటి సంగతులు ? ఈ రోజు మా యింటికి భోజనానికి రా !" అనే రీతిగా వ్రాసి పంపేవారట. ఈలాటి అసంబద్ధపు ఉత్తరాలు అందుకున్నవారు రహస్యం గుర్తించి, పై మైనపుపొరను జాగ్రత్తగా ఊడదీసి, కిందపొరమీద వ్రాసిన అసలు ఉత్తరాన్ని చదువుకొనేవారు. ఇలా ఆ కాలంలో యూరప్‌లోని ఉత్తరాలు మన ఇళ్లలాగ రెండంతస్తులవి, మూడంతస్తులవి ఉండేవి.

సీసపు పుల్లలు (పెన్సిళ్ళు), కాయితాలు కనిపెట్టేవరకు ఈ మైనపు పలకలు యూరపు అంతటా వాడుకలో ఉండేవి. కొన్ని వందల సంవత్సరాల క్రితం ప్రతి విద్యార్థి నడుముకూ ఒక మైనపు పలక వ్రేలాడుతూ ఉండేది. విద్యార్థులు వ్రాసిన ఈలాటి మైనపు పలకలెన్నో ల్యూబెక్ నగరంలోని సెయింట్ జేమ్సు చర్చిలో దొరికాయి. ఈ చర్చిలో స్టైలస్‌లు, చర్మాలు

చదునుచేసే కత్తులు, విద్యార్థులను శిక్షించే పేముబెత్తాలుకూడ దొరికాయి. ఆ కాలంలో అక్కడి ఉపాధ్యాయులు మన వీధిబడులలోలాగ విద్యార్థులపై బెత్తం బాగా ఆడించేవారు. "దండం దశగుణం భవేత్" నే సిద్ధాంతం ఉండనే ఉంది కదా! కనుక బడిలో చదివాను అనడానికి మారు "పేము దెబ్బలు తిన్నాను" అనే నానుడికూడ పాశ్చాత్యభాషలలో కద్దు, మనం "గురుశుశ్రూష చేశాము" అన్నట్టు.

పదమూడవ శతాబ్దిలో - అంటే ఏడువందల ఏళ్లనాడు - పారిసు నగరంలో ఇలాటి మైనపు పలకల దుకాణ మొకటి ఉండేదట. ఈ దుకాణంలో రకరకాల మైనపు పలకలు అమ్మేవారు. మామూలు ప్రజలకోసం పోకజాతి చెక్కపై కొంత మైనం కొంత కందెన కలిపి తయారుచేసినవి. మరీ శ్రీమంతుల వాడకంకోసం ఏనుగు దంతంపై తయారుచేసినవి - ఇలాటి రక రకాలు - అమ్మేవారట.

అప్పుడు వాడిన ఆ వేలకొలది పలకలు యేమయాయో! బహుశా కాలి పోయి ఉంటాయి. కాకపోతే, ఏ పెంటకుప్పలోనో చేరిపోయి ఉంటాయి. రెండువేల సంవత్సరాలనాడు రోమనులు వాడిన ఈలాటి పలకలు చాల అమూల్యమైనవి గదా ! వాటికి ఎంత డబ్బైనా ఇవ్వవచ్చు దొరికితే? కాని అలాటివి చాల కొద్దిగానే దొరికాయి. వీటిలో ఎక్కువభాగం పాంపేనగరంలో నివసించిన సీసిలియస్ జూకాండస్ అనే పెద్ద వడ్డీ వ్యాపారి యింట్లో దొరికింది. పాంపేనగరం, దీని పొరుగుననే ఉన్న హెర్కులేనియం అనే నగరం రెండువేల సంవత్సరాలక్రితం విసువియస్ అగ్నిపర్వతం బద్దలై లావా పొంగడంవల్ల మునిగిపోయి నేలమట్టమయాయి. ఈ అగ్నిపర్వత ప్రళయం సంభవించకపోయి ఉంటే ఈ మైనపు పలకలుకూడా మనకు దక్కేవి కావేమో! రోమనులు ఆ నాడు వాడిన పెపైరస్ చుట్టలుకూడా ఇరవై నాలుగు మాత్రమే దొరికాయి. ఇవి హెర్కులేనియం నగరశిథిలాలలో దొరికాయి. కాలంకన్నా ఘోరప్రళయం మరొకటిలేదు. కాలం ఎవరినీ కనికరించదు. కాలం మీరినప్పుడే స్టైలెస్ మైనపు పలకలమీదివ్రాతను చదునుచేసినట్టు మానవుని అపూర్వ కార్యాల స్మృతిని కూడ తుడిచివేసి చదును చేస్తుంది.

1485

పంచమ ప్రకరణం

# చర్మ పుస్తకాలు

నేడు బజారులలో రకరకాల అద్దకం పనిగల చర్మాలసంచులు, పట్టీలు, పెట్టెలు మీరు చూస్తూనే ఉంటారు. చర్మాలపై వ్రాయడం నేడేకాదు; మన దేశంలో రెండువేల ఏళ్ళనాటినుంచే ఉంది. బౌద్ధ గ్రంథాలలో చర్మాలపై వ్రాయడం గురించి ప్రస్తావన ఉంది. 'కాచ్చాయనక భూమికా' అనే గ్రంథంలో చర్మపుస్తకాల ప్రసక్తి ఉంది.

సుబంధుడనే కవి "వాసవదత్త" అనే తన కావ్యంలో ఆకాశాన్ని సరికొత్తగా ఉత్ప్రేక్షించాడు. విధాత విశ్వాన్ని లెక్కపెడుతున్నాడట. దేనిమీద ఈలెక్క? చీకటి అనే సిరాపూసిన ఆకాశమనే చర్మంపైన, చంద్రుడనే సుద్దముక్కతో. ఈలెక్కలో సంసారం శూన్యమని తేలిందట. ఆసున్నలే నక్షత్రాలు. ("విశ్వం గణయతో విధాతుః శశికఠినీఖండేన తమోమసీశ్యామే అజిన ఇవనభసి, సంసారస్య అతి శూన్యత్వాత్ శూన్యబిందవ ఇవ నక్షత్రాణి.") దీనినిబట్టి చర్మానికి నల్లటి సిరాపూసి సుద్దతో వ్రాసేవారని తెలుస్తుందిగదా!

కాని ఈ చర్మపుప్రాతలు మనదేశంలో అంత ప్రచురంగా లేవు. దీనికి కారణమేమిటంటే, మన ధర్మశాస్త్రాలలో కృష్ణాజినంతప్ప తక్కినవన్నీ నిషిద్ధం గనుక. జైసల్మీర్ గ్రంథాలయంలో ఒక చర్మపుస్తకం ఉందని పెద్దలంటారు.

కాని ఈ చర్మాలపుస్తకాలు యూరోపులోను, అరేబియాలోను, మన దేశంలో తాటాకు పుస్తకాలలాగ చాల వాడుకకు వచ్చాయి. దీనికి కారణం అక్కడ అప్పుడు వ్రాతసాధనంగా ఉన్న పెపైరస్ చాల ప్రియమైపోవడమే. ఎందుకు పెపైరస్ ధర పెరిగింది?

ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నగరంలో గొప్ప గ్రంథాలయం ఉండేది. దానిలో పదిలక్షల పెపైరస్ చుట్టల గ్రంథాలుండేవి. టాలమీవంశపు ఫేరో రాజులు ఈ గ్రంథాలయం అభివృద్ధి విషయంలో చాలా శ్రద్ధచూపేవారు. ఆనాడు ఈ గ్రంథాలయమే చాల పెద్దది. ఇది ఇలా ఉండగా ఆసియా మైనరు

లోని పెర్గమోస్ నగరంలో మరొక గ్రంథాలయం అభివృద్ధి కాసాగింది. అప్పటి ఫేరోరాజుకు ఇది కన్నుకుట్టింది. ఎలాగైనా పెర్గమోస్ గ్రంథాలయం అభివృద్ధి కాకూడదనే కసికొద్దీ ఆసియాకు పెపైరస్ ఎగుమతి చేయడం బందు చేయాలని ఉత్తరువు చేశాడు.

దీనితో పెర్గమోస్ రాజుకుకూడ పట్టుదల హెచ్చింది. పెపైరస్‌కు మారుగా గొర్రెతోలుగాని, మేకతోలుగాని వ్రాతసాధనంగా సిద్ధపరచ వలసిందని ఉత్తరువు చేశాడు. అప్పటినుంచి పెర్గమోస్ నగరం చాలకాలం దాకా యూరప్‌ఖండానికి, ఇతరదేశాలకు చర్మపుకాయితాలు సరఫరా చేసే ప్రధాన కేంద్రమైంది. చర్మపుకాయితం పెపైరస్‌కన్నా ఎన్నో విధాలా మెరుగు: కత్తిరించడం సులభం; పెపైరస్‌లాగ పేళ్లపేళ్ళుగా విడి పోతుందనే భయంలేదు. ఎంత వంచినా వంగుతుంది; పెపైరస్‌లాగ విరిగి పోదు. ఈ లాభాలన్నీ మొదట అక్కడి ప్రజలు గుర్తించలేదు. ఈ చర్మాలను కూడ పెపైరస్‌లాగే చుట్టలు చుట్టేవారు. కాని త్వరలోనే తెలుసుకున్నారు. చర్మాలను మడిచి పుస్తకాలుగా కుట్టవచ్చునని. విడివిడి తావులతో కుట్టిన తొలి పుస్తకం ఈ చర్మాలతో అవతరించిందన్నమాట.

ఈ పుస్తకాలు తయారుచేయడానికి ఒక పద్ధతి ఉంది. మొదట వారు పచ్చితోళ్ళను - మేకవో, గొర్రెవో, దూడవో - నీళ్ళలో నానబెట్టి మెత్తబరిచే వారు. తర్వాత దానికి అంటుకొనిఉన్న మాంసాన్ని కత్తితో చెక్కివేసి, ఉప్పు కలిపిన నీటిలో పడవేసేవారు. దీనివల్ల చర్మం మీది రోమాలు సుల భంగా చాకుతో తీసివేయడానికి వీలుపడేది. తర్వాత చర్మాన్ని సీమసున్నంతోను చిట్టెపు రాయితోను రుద్దేవారు. దీనివల్ల చర్మం రెండువైపుల పచ్చరంగుతో నునుపుదేరుతుంది. చర్మం పలుచనైనకొద్దీ ధర యెక్కువయ్యేది. ఒక చిన్న కాయ చిప్పలో ఇమిడిపోయేటంత పలుచని చర్మాలు తయారయేవి. ఇలియడ్ మహాకావ్యపు 24 ప్రతులు వ్రాసిన చర్మపు చుట్టను తను చూచినట్టు రోమన్ మహావక్త సిసిరో అన్నాడు. ఈలాటి చర్మాన్ని "పార్చ్‌మెంట్" అంటారు.

ఇలా పలుచగా తయారయిన చర్మం కొనలు సమానంగా లేకపోతే కత్తిరించివేసేవారు. ఈ చర్మపు తావును రెండుసార్లు మడిచేవారు. దీనితో నాలుగు చిన్నచిన్న తావులయాయి. ఈలాటి నాలుగు చిన్నచిన్న తావులను చేర్చి పుస్తకం కుట్టేవారు. తర్వాత నాలుగు, ఎనిమిది, పదహారుసార్లు మడిస్తే రకరకాల కొలతల పుస్తకాలు తయారు అయాయి.

పెపైరస్‌పైన ఒకవైపే వ్రాసేవారు. కాని, ఈ చర్మ పుస్తకాలపైన రెండు వైపుల వ్రాసేవారు. అయితే ఈ చర్మపు పుస్తకాలు చాలకాలానికిగాని పూర్తిగా పెపైరస్‌ను తొలిగించలేకపోయాయి. క్రమంగా ఈజిప్టు కార్ఖానాలు పెపైరస్‌ను

తక్కువగా తయారుచేయడం మొదలుపెట్టాయి. ఈజిప్టువారిని అరేబియావారు జయించిన తర్వాత పాశ్చాత్యదేశాలకు పెపైరస్ సరఫరా పూర్తిగా ఆగిపోయింది. చర్మపుస్తకాలదే పూర్తిగా రాజ్యమయింది.

ఈ చర్మ పుస్తకం చూస్తే ఏభోషాణమో, సందూకు పెట్టో అనుకుంటాముగాని, పుస్తకం అనుకోలేము. రెండువైపులా పెద్దపలకలు, ఈ పలకల పైభాగాన తోలు, లోపలిభాగాన గుడ్డ, వెనుకవైపున చిత్రాలు చెక్కిన రాగిరేకుపట్టీ-ఇవన్నీ చూస్తే భోషాణంగానే కనిపించేది. పైన రాగి కొక్కీలుగాని తాళాలుగాని ఉండేవి. పుస్తకం వంగిపోకుండా ఈ కొక్కీలన్నమాట.

ధనవంతులైతే మఖ్మల్‌తోనో (దీనికి సూర్యపటమని చేమకూరకవి అన్నాడు) జరీబుటేదారీ పనిగల గుడ్డతోనో బైండు చేయించుకొనేవారు. రాగి కొక్కీలకు మారు వెండి, బంగారు కొక్కీలుండేవి. ఈ కొక్కీలకు విలువగల రాళ్లు చెక్కడంకూడకద్దు. రాజులకోసము, వారిసర్దారులకోసము వ్రాసేపుస్తకాలబైడింగు



మాత్రమేకాక ప్రతిపుటా వెండి బంగారు రాళ్ల పనితనంతో మెరిసిపోయేది. వెండి, బంగారు అక్షరాలతో వ్రాసిన అలాటి చర్మ పుస్తకాలు నేడు కొన్ని ఉన్నాయి. వీటిరంగు ఆనాడు మెరిసిపోయే ధూమ్రవర్ణం; నేడది మడ్డి ఊదాగా మారిపోయింది. వెండి, బంగారు అక్షరాలు నల్లబడిపోయాయి. కాని, ఆ నాడీ పుస్తకాలు సుబంధకవి వర్ణించినట్టు సూర్యాస్తమయానంతరం నీలాకాశంలాగ మెరిసి ఉంటాయి.

ఎంతో చక్కగా బైండు చేసిన ఈ సుందర పుస్తకాలు ఒకరిచేతిమీద తయారయినవా? ఆరేడుగురి పనితనం ఇది. ఒకరేమో చర్మాన్ని ఒలిచారు, మరొకరు నున్నటి రాళ్లతో రుద్ది దానిని నగిషీపెట్టారు. మూడవవారు పుస్తకంలోని విషయాన్ని మరొక పుస్తకంనుంచి నకలుచేశారు. నాల్గవవారు

అందమైన అక్షరాలు వ్రాశారు. ఐదవవారు అక్కడక్కడ చక్కని బొమ్మలు గీచారు. ఆరవవారు మాతృకతో ప్రతిని సరిచూచారు. ఏడవవారు పుస్తకం బైండు చేశారు. దీనికి అపవాదమూ లేకపోలేదు. ఒకొక్కప్పుడు ఒక్క సన్యాసే చర్మాన్ని తీసుకొని పుస్తకంగా రూపొందించడం కూడ కద్దు.

షష్ఠ ప్రకరణం

# వ్రాయసంవారు

మనం తాటాకు మట్టలలోను, పైపైకసు తుంగలలోను, చర్మపుస్తకాల పుటలలోను చిక్కుకుని లేఖకుల సంగతే మరచాము. ప్రాచీనకాలంలో లేఖకుని ప్రాముఖ్యం అంతా ఇంతా కాదు. మహాభారతం రచించిన వ్యాసులవారికి గణాధిపతి లేఖకుడుగా ఉండేవాడని, ఆయన చెప్పి చెప్పకముందే తొండంతో గంటం పట్టుకొని వ్రాసివేసేవాడని పౌరాణికులు చెబుతూ ఉంటారు తిక్కనకు గురునాథు డనేవాడు లేఖకుడట; మాంచి శీఘ్ర లేఖకుడు. ఒకసారి తిక్కయజ్వ తన ధోరణిలో పద్యాలు చెప్పుతూ, ఒక కందం తుది పాదంలో అంత్యభాగం తోచక "ఏమిచెప్పుదును గురునాథా?" అని గురునాథుని ప్రశ్నించాడట. ఆ గురునాథుడది ప్రశ్నగా భావించక పద్యపాదంగానే గ్రహించి వ్రాసివేశాడట. "ఏమి వ్రాసినావు?" అని తిక్కన ప్రశ్నించినపుడు తను వ్రాసింది చెప్పాడట. ఆమీదట దానిని తిక్కన "ఏమి చెప్పుదును కురు నాథా" అనేరీతిగా సమర్ధించవలసి వచ్చిందట. ఇదికూడ పౌరాణికులు తమాషాగా చెప్పేదే.

అక్షరచణులే - బాగా అక్షరాలు చెక్కగల నిపుణులే - ఈ పనికి నియమించబడేవారు. ఎంతో శిక్షణ పొందినవారికిగాని అధికారపత్రాలు తయారుచేసే పని అప్పగించేవారు కారు. వీరికి సామాన్యంగా లేఖకులనేది రూఢినామం. రాచనగరులో రాజు చెప్పుచేతల్లో ఉండే లేఖకులు రాజలేఖకులు రాజవైద్యులలాగ. వీరిని 'రాజలిపికారులు' అనికూడ అనేవారు. స్వంతంగా వ్రాసుకొనే అలవాటు శ్రీమంతులకు ఉండటం కష్టం; అందులోను రాజులకు. కనుక ప్రతి రాజాస్థానంలోను రాజలేఖకుడు ఉండేవాడు.

నాగార్జున కొండలో ఒక శాసనం ఉంది. దానిలో ఒక రాజలేఖకుడు బోధిసత్వుని స్తూప నిర్మాణంలో తనుచేసిన సేవను వివరించాడు. ఆ శాసనానికి



కొంతదూరంలో అద్భుతమైన శిల్ప మొక టుంది. సిద్ధార్థుడు జన్మించాడు. శుద్ధోదనుడు జ్యోతిష్కులను పిలిపించాడు. వారు చెప్పిన శుభ ఫలాలను రాజలేఖకుడు తాటాకుపై గంటంతో వ్రాసుకుంటున్నాడు. ఎడమచేతులో పట్టుకున్నవి తాటాకులు. కుడిచేత్తో గంటం పుచ్చుకుని గబగబా వ్రాసివేస్తున్నాడు. అశో కుని సిద్ధాపురం శాసనంలో "చపడేన లిఖితే లిపికరేణ" అని మీరు ఇదివరకు చదివారు. చపడుడు రాజలేఖకుడన్నమాట.

లేఖనం వృత్తిగా అభివృద్ధిచెందిన తర్వాత కొన్ని కులాలే ఏర్పడ్డాయి - కాయస్థులు, కరణీకులు, కరణాలులాగ. దస్తూరి బాగలేకుండా చదవడానికి కాకపోతే, విషయం ఎంత బాగుంటే ఏమి ప్రయోజనం ? కనుకనే కరణీకులకు గిరాకీ. ఇంతకూ లేఖకుడు తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని కూడ చేయగలిగేవాడు. ఎవరో లేఖకులను గూర్చి ఈ చాటువును చెప్పాడు:—

మేదినినాథు డల్గినను
    మించిన కార్యము చక్కచేయ స
మ్మోద మెలర్పగా గణక
    ముఖ్యుని సఖ్యము లెస్స, యెట్లనన్ !
ఆదట కాలుడల్గియు గ
    తాయువటన్నను చిత్రగుప్తుడా
"గా" దొలగించి 'శా' మొదట
    గ్రక్కున వ్రాసి సజీవు చేయడే !

ఇలా తమకు ఇష్టంవచ్చినట్టు మార్చేవారని కొందరు దుమ్మెత్తి పోయకనూపోలేదు.

చేతికి గంటము వస్తే
క్రోతికి శివమెత్తినట్టు కొందరు మంత్రుల్
నీతి ఎరుంగక బిగుతురు
సీతారామాభిరామ సింగయరామా!

రాజుకు మంత్రి కావలసినవానికి ఇతర విషయాలతోపాటు చక్కని వ్రాతకూడ అత్యవసరం :—

వ్రాయసు చదువను వరుసతో మాటాడ
ఆవలీవలి పల్కు లాలకింప
పరదేశబాషలు ప్రభువుకు వినిపింప
సభ దుర్గుణంబులు సర్దుచేయ
.... .... ....
నేర్పుగలిగిన మంత్రులు నీతిపరులు.

లేఖకునికి అత్యవసరమైన లక్షణాలివి :—

తప్పు సవరించి వ్రాయు టుత్తమము లేక
ప్రతి సమానము వ్రాయుట యతిముదంబు,
రెండు విడిచియు వ్రాసెడి లేఖకుండు
గలుగ కవి సేయు భాగ్యంబుకాదె కృష్ణ !

ఇక లేఖకులు పలువురు తమ దస్తూరీని గూర్చి పొగడుకున్న సందర్భాలుకూడ చాల ఉన్నవి. భువనేశ్వరంలోని ఒక సంస్కృత శాసనంలో శివకరుడనే శిల్పి తన అక్షరాలు ముత్యాలకోవ అని చెప్పుకున్నాడు :—

సూత్రకారః శివకరః సద్వృత్తాం అక్షరావలీమ్,
నిచఖాన శిలాపట్టే ముక్తాఫలనిభామివ.

సోవరసి అనే కన్నడ శిల్పి తనతో ఎవరూ అక్షరాల శిల్పంలో పోటీ చేయలేరని చెప్పుకున్నాడు. తను అక్షరాల మధ్యన మృగాలు, పక్షుల బొమ్మలు అందంగా చెక్కగలడట. తనతో పోటీచేసే వైరిబాగులవారు ఎవరైన ఉంటారా ? - అని ప్రశ్నించాడు. ఆయన అక్షర శిల్పం చూస్తే ఆయన మాటలు

కోతలుకావని తేలుతుంది. పక్షుల్లాగ చిత్రంగా చెక్కిన అక్షరాలు చూడడానికి మహానందంగా ఉంటాయి. కంచిలోని కైలాసనాథ దేవాలయంలోని ఈ పంక్తిని చూడండి. ఇదివీమిటి? పల్లవరాజుల బిరుదు "శ్రీ కలంకరహితః" అనేది అక్షరాలు స్పష్టంగానూ ఉన్నాయి, సుందరంగాను ఉన్నాయి. నెమళ్లు ఆ బిరుదాన్ని మోసుకొనివస్తూన్నట్టు లేదూ ?

ఈ మరొక పేరు కూడ చూడండి. పిట్టలు వాలినట్టులేదూ ? ఇది "శ్రీ పూర్ణాదిత్యః" అనేది.

శివకరశిల్పిలాగే దస్తూరీని ముత్యాల కోవలాగ గుండ్రంగా వ్రాసే మంత్రులు, కరణాలు, లేఖకులు మనకు చాలమంది ఉన్నారు. జన్నయ కుమారుడైన సిద్దయశౌరి వ్రాయసం మహాచక్కగా ఉండేదని జక్కన విక్రమార్క చరిత్రలో పొగిడాడు:-



ఆణిముత్యముల సోయగము మించిన వ్రాలు
వరుసతో నిరుకేల వ్రాయనేర్చె
ఆత్మీయ లిపియట్టు లన్యదేశ్యంబుల
లిపులను జదువంగ నిపుణుడయ్యె....

వేమభూపాలుని మంత్రి అయిన అన్నయమంత్రి స్వదేశ లిపులేకాక ఫారశీ వ్రాస్తే కన్నుల పండువుగా అమరేదని శ్రీనాథుడు తెగపొగడినాడు:

అన్నయమంత్రి శేఖరు డ
హమ్మదు షా గుజరాత భూమి భృ
త్సన్నిధికి న్మదిన్ సముచి
తంబుగ వేమ మహీపతీంద్ర రా
జ్యోన్నతి సంత తాభ్యుదయ
మొందగా పారశిభాష వ్రాసినన్
గన్నులపండువై యమరు
కాకిత మందలి వర్ణపద్ధతుల్.

పాండురంగ సుకవి వర్ణించిన వేదాద్రిమంత్రి అక్షర శాస్త్రజ్ఞుడులాగ కనిపిస్తాడు:

పట్టి వ్రాటువయును బరిపుష్టి తలకట్టు
గుడిసున్న కియ్యయు సుడియు ముడియు
ఐత్వంబు నేత్వంబు నందం బమందంబు
గిలుకయు బంతులు నిలుపు పొలుపు

నయము నిస్సందేహతయు నొప్పు మురువును
ద్రచ్చి వేసినయట్ల తనరుటయును
షడ్వర్గ శుద్ధియు జాతి యోగ్యతయును
వృద్ధి ప్రియంబులు విశదగతియు
గీలుకొన వ్రాయసంబులు వ్రాయ వ్రాయ
గొంకు కొసరును జేతప్పు గొనకయుండు
లలిత ముక్తా ఫలాకార విలసనమున
మతి మరున్మంత్రి వేదాద్రి మంత్రివరుడు.

ఇక రాయని భాస్కరుని వ్రాయసం చాతురిని గూర్చిన చాటువులకు లెక్కేలేదు. ఆయన బంగారు గంటంతో వ్రాసేవాడట :—

కలయ బసింది గంటమున
గాటయవేము సమక్షమందు స
త్ఫలముగ రాయన ప్రభుని
బాచడు వ్రాసిన వ్రాలమోతలున్
గలుగలు గల్లు గల్లు రన
గంటక మంత్రుల గుండెలన్నియున్
జలు జలు జల్లు జల్లు రనె
సత్కవివర్యులు మేలు మేలనన్

ఆకులు వ్రాలు వ్రాయ సచి
వాగ్రణి బాచనకే ఘటిల్లు బ
ల్లాకి కుమంత్ర నందనులు
గంటము ముట్టి లిఖించినట్టి వ్రా
లాకులు రాటపాకులు చె
వాకులు బ్రాహ్మణ వీధిలోని పు
ల్లాకులు లంజెలిండ్ల పలు
గాకులు గాక నిజాన కాకులే!

వ్రాయు బసింది గంటమున
రాజ హితైక రహస్య కార్యముల్
వ్రాయు ధనార్థికోటి నిట
లంబున శోభన భాగ్య సంపదన్

వ్రాయు జకోర లోచనల
వ్రాటువ జన్నుల మన్మథాంకముల్
రాయని మంత్రి భాస్కరుడు
వ్రాసిన వ్రాత లసంఖ్యముల్ గదా!

రాజాస్థానాలలోని ఇట్టి బంగారు గంటాలవారిని, ముత్యాల కోవలవారిని చూచిన శ్రీనాథుడు వ్రాయసమే ప్రధాన వృత్తిగా ఊరూరా తిరిగే పడమటి వ్యాపారులను చూచి:

దస్త్రాలున్ మసిబుర్రలున్ గలములున్
దార్కొన్న చింతంబళుల్
పుస్తుల్ గారెడి దుస్తులున్ జెమట కం
పుం గొట్టు నీర్కావులున్
అస్తవ్యస్తపు గన్నడంబును భయం
బై తోచు గడ్డంబులున్
వస్తూ చూస్తిమి రోస్తిమిన్ బడమటన్
వ్యాపారులన్ గ్రూరులన్

అని రోతపడడంలో ఆశ్చర్యమేముంది?

ఇక శాసనాలలోను, తాటాకు గ్రంథాలలోను ప్రారంభంలోనే అది ఏ మతస్థులు వేసిందో, వ్రాయించిందో తెలిసిపోతుంది. శాసనాలలో విషయం ప్రారంభించడానికి ముందు పై వరుసలో ఎవరికి ఇష్టమైన దైవాలను వారు చెక్కుతారు. జైనులయితే ఏనుగులను, పద్మాలను, శైవ, వైష్ణవులయితే మధ్యన తమ ఇష్ట దైవాన్ని, దానికి ఇరుపక్కల సూర్యచంద్రులను చెక్కడం కద్దు. ఇక శాసనం స్వస్తి, మున్నగు మంగళపదాలతో ప్రారంభమౌతుంది. సాతవాహనుల శాసనాలలోను, ఇక్ష్వాకుల శాసనాలలోను 'సిద్ధం' అని, విష్ణు కుండినుల శాసనంలో 'స్వస్తి' అని విషయం ప్రారంభమౌతుంది. కొన్నిటిలో 'స్వస్తిశ్రీ' అని రెండూ ఉంటాయి. తాటాకు పుస్తకాలలో అయితే మొదటి 'శ్రీ' అనే అక్షరం చిత్రవిచిత్రంగా వ్రాయడం అలవాటు. సమాప్తిలో 'మంగళ మహా శ్రీశ్రీశ్రీం జేయును' అంటూ వరుసగా శ్రీకారాలు చుట్టడం అలవాటు.

శాసన సమాప్తిలో శిల్పులు, తాళపత్రాలలో లేఖకులు తమ సంగతి చెప్పు కొనడం మరీ తమాషాగా ఉంటుంది. ఒకరు ప్రథమ పురుషలో చెబితే మరొకరు ఉత్తమ పురుషలో చెప్పుకుంటారు. సంస్కృత శాసనాల సంగతే చూద్దాం.

"కుబ్జః స్వకావ్యమిదం అశ్మతలే విలేఖ"

(కుబ్జుడు తన కావ్యాన్ని రాతిపలకపై వ్రాశాడు అని కుబ్జుడనే లేఖకుడు మామూలుగా చెప్పుకున్నాడనుకోండి. మరొక కర్ణ భద్రుడు (అంటే లేఖకుడు) చేసుకున్న ఆత్మస్తుతి ఇది.

"కర్ణభద్రేణ భద్రేణ శిల్పినానాల్ప బుద్ధినా

తామ్రం వినయనమ్రేణ నిర్మితం సాధుకర్మణా"

"కరణీకకులోద్భవుడు, అనల్పబుద్ధి, వినయనమ్రుడు, సాధుకర్మపరాయణుడు అయిన భద్రుడనే శిల్పి ఈ తామ్ర శాసనం నిర్మించాడు" మరొక సూత్ర ధారుడు సాహిలుడనేవాడు (దారంతో అక్షరాల గుర్తులు వేసుకొని తర్వాత చెక్కే వారు కాబోలు) తన అక్షరాలు సరస్వతీ స్వరూపమన్నాడు.

"ఉత్కీర్ణా సూత్రధారేణ సాహిలేన స్ఫుటాక్షరా,

చిత్రాంగవాగ్వ్య గ్రవర్ణా సరస్వతీవ భాసతే".

బిల్హణుడనే మరొక కరణీకోద్భవుడు తను చిత్రగుప్తునితో సమానుడనని చెప్పుకుని తన శాసన లేఖనం ముగించాడు :—

"కరణీకోద్భవో విద్వాన్ చిత్రగుప్తోపమో గుణైః

యశసే బిల్హణః శ్రీమాన్ అలిఖత్ తామ్రకం ముదా"

తెలుగు శాసన శిల్పులు, ఆత్మస్తుతి చేసుకొన్నవారు అరుదు. వారి పేర్లుకూడ విడ్డూరంగానే ఉంటాయి. కొందరు తమ పేర్లు అచ్చతెనుగులో వ్రాసుకుంటారు; కొందరు సంస్కృతంలో వ్రాసుకుంటారు.

నెల్లూరుజిల్లా భైరవకొండ గుహాశాసనం "నేళుగుంత ఆచాఙ్లు పణికేసిరి" అక్కడి మరొక శాసనం "శ్రీ కుఱువది ఆచఙ్లు కేసినపణియు" పణికేయడం. ఏమిటని ఆశ్చర్యపడుతున్నారేమో! పనిచేయడమన్నమాట. చేసిరి అనే క్రియ పాతరూపం కేసిరి. ఆచాఙ్లు - ఆచఙ్లు శిల్పాచార్యులు. పూర్వం ఈ బిరుదాన్ని శిల్పాచార్యులు పెట్టుకొనేవారు. నెల్లూరుజిల్లా నలజనంపాడు శాసనం "వా (చో్చ) ళాళ కొడుకు పల్లవాచార్జస్య లికితం''. కడపజిల్లా ఇందుకూరి శాసనం, పోట్ల దుర్తి-మాలపాడు శాసనం "అసివైరువు లిఖితం", కడపజిల్లా రామేశ్వరం శాసనాన్ని "గట్టువిరిపటిటి కమ్మరి వినియణ వ్రాసె" పనికేయడం, లికితం, లిఖితం అయింది.

కందుకూరు శాసనాన్ని "ప్రభురాముణ్డుక్కొచె"నట. క్కొచడం అంటే క్రొచ్చడం - క్రుచ్చడం - చెక్కడమన్నమాట. కడపజిల్లా పెద్దముడియం శాసనం క్టొచ్చినవారు ఎవరో తెలుసునా? "క్టొచ్చినవాణ్డు వెన్నవడ్డచి....కున్

బ్రహ్మవడ్డచి" వడ్డచి అంటే ఎవరనుకున్నారు? చెక్కేవారన్న మాట: వడ్లవారన్నమాట. వర్ధకి అనే సంస్కృత పదం నుంచి వడ్డచి అనేపదం పుట్టింది పణికేసిరిలోని కకారం చకారంగా మారినట్టే, వర్ధకి శబ్దంలోని కకారం - సంస్కృతమైనప్పటికీ - తర్వాత చకారంగా మారింది. ఇది చాల అపురూపమైన ప్రయోగం.

వీరందరూ నన్నయకు పూర్వంవారు. నన్నయకాలంలో గండాచార్యుడు గొప్పశిల్పి. శిలాలేఖకుడూను. ఈ కాలం నుండే శాసనరచయితపేరు, శిల్పి పేరుకూడ చెక్కడం ప్రారంభించారు. రాజరాజు వేయించిన నందమపూడి శాసనంలో శాసనకర్త నన్నయభట్టు, లేఖకుడు గండాచార్యుడు. వేమభూపాలుని ఆస్థానంలో శాసనాధికారి, శాసనరచయిత శ్రీనాథుడు.

ద్రాక్షారామ భీమేశ్వరాలయంలోని ఒక శాసనంలోనిది "ప్రకాశభారతీ యోగి కావ్యం! పెద్దనార్య లిఖితం శ్రీ".

కావ్యాలలో పాల్కురికి సోమనాథునిలాగ

"ఆరూఢమతి మల్లికార్జున పండి
తారాధ్య చరిత మాద్యంతంబు వినిన
జదివిన వ్రాసిన సంగ్రహించిన స
ముదితాభిమత ఫలంబులు నొందుదురుదె
కావున నీ కృతి గారవించినను
వావిరి జదివిన వ్రాసిన వినిన
నరుదంద వారల కభిమతార్థములు
కరుణించు శివుడు మంగళ మహాశ్రీలు"

అని ఫలశ్రుతి చెప్పడం అలా ఉండగా, లేఖకులు పాఠకులను చక్కని పద్యాలతో మన్ననకోరడం, తాము మూలప్రతినుంచి ప్రతిక వ్రాసుకున్న తిథివారాలను వ్రాయడం సంప్రదాయం. ఒక లేఖకుడు నేను "చాల తప్పులు వ్రాశాను. దిద్దుకుని చదువుకోండి." అని సవినయంగా ఇలా కోరుతాడు :—

"వ్రాలా తప్పులు సెబ్రలు
చాలంగల వేను శబ్ద సంగతు లెరుగన్
గేలిం బెట్టక తిట్టక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా!"

తప్పులు ఎవరికైనా కలుగుతాయనే ధీమాతో మరొక నకలుదారు

"చేతప్పు నెఱుక మరపును
నేతెరగున నైన గల్గు నెవ్వరికైనన్
వ్రాతం దప్పులు గలిగిన
బ్రాతిగ దిద్దుకొనుడయ్య పండితులారా!"

అని అంటాడు.

మరొక పండితుడు అలుగకండీ-అని ప్రార్థిస్తాడు :

"వ్రాత తప్పువలన వాచకు లలుగక
తప్పు గల్గెనేని తగిన యెడల
వలయు నక్షరములు వర్ణించి నిలుపుడీ
సుకవులైనవారు సురుచిరముగ."

మరొక లేఖకుడు :

"ప్రతి చూచి వ్రాసినాడను
అతి సెప్రలు వ్రాలుచూడ నన్నియు దప్పుల్
యతియును ప్రాసయు నెరగను
మతిమంతులు తప్పుదిద్ది మన్నింపరయా."

అని మన్నన కోరుతాడు.

తలకట్టిత్వము కొమ్ము నేత్వమును నై
త్వం బౌత్వముం బొట్టులున్
బలు సంయుక్తపు టక్షరంబులు విరా
మప్రాస శబ్దాదు లిం
దుల జేతప్పున తప్పు నజ్ఞుడను నన్
దూషింప కాతప్పు లొ
ప్పులుగం జేయుడు పెద్దలార మిము నే
ప్రొద్దున్ బ్రశంసించెదన్"

అని ఒక లేఖకుడు అనగా, మరొకడు

"విసర్గ బిందుమాత్రాది పదపాదాక్షరాణి చ,
న్యూన మప్యతిరిక్తంవా క్షమస్వ పురుషోత్తమ"

అని ఒక దండం సమర్పిస్తాడు. "కరకృత మపరాధం క్షంతు మర్హంతి సంతః" అనే వాక్యం చాల ప్రసిద్ధమైనది.

పుస్తకాల పుత్రికలు - ప్రతులు వ్రాయించడం, వాటిని దానం చేయడం పుణ్యకార్యమనే భావన మనదేశంలో అనాదిగా ఉంది. లేఖనవృత్తి ఉత్తమ

మని, సుఖజీవన సాధనమని బౌద్ధయుగంలో భావించేవారు. ఈ సంగతి మీకు ఇదివరకే తెలుసు. అయితే, ఈ వ్రాతలు ఇతరులను నొప్పించేవిగా ఉండరాదు. నొప్పిస్తే దుక్కృతం- దుష్కృతం - వస్తుంది. అత్తిమబ్బె అనే కన్నడ మహిళ రన్నడనే మహాకవి రచించిన గదాయుద్ధమనే కావ్యం వేయి ప్రతులు వేయించి వ్రాయించి దానం చేసిందట.

కొందరు ఈ దానంచేసిన సంగతి దానమిచ్చిన గ్రంథం చివర తెలుపడం కద్దు :

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు అగు నేటి హేవిళంబి నామ సంవత్సర భాద్రపదశుద్ధ దశమీలు వంకదార వేంకటేశము నకు తాళ్ల మార్పూరు కరణము విరూరి చిన్న సూరప్ప ఆశీర్వచనంబులుచేసి తాంబూల జాంబూనదప్రియ పూర్వకంబుగా వ్రాసి యిచ్చిన భారతములోని యుద్ధ పంచకము."

రాజాస్థానాలలో రాజలేఖకులే కాకపుస్తకాల ప్రత్యంతరం వ్రాసే లేఖకు లుండేవారు. వారికికూడ చాల గౌరవం ఉండేది. సాహిత్యపోషణ విషయంలో నాయకరాజుల సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకున్న తంజావూరు మహారాష్ట్ర రాజులు ఆంధ్ర సంస్కృతాది గ్రంథాలను ఎన్నిటినో నకలు చేయించారు ఆలాటి నకళ్ల చివర

"భోసలాన్వయ సుధాంబోధి చంద్రునకు
అనఘసన్నుతికి శాహావనీ పతికి
నింబాజి వ్రాయించె నిఖిలార్థ వితతి
కంబోధియగుచుండు నట్టి భారతము
నిటలాక్ష పదపద్మ నిహిత ప్రసన్న
పటుచిత్తుడైన కుప్పయ మంత్రిచేత" ఉంటుంది.

నింబాజి అనే విద్యాధికారి కుప్పయ మంత్రి అనే లేఖకునిచేత ఈ పుస్తకం ప్రతివ్రాయించినాడన్నమాట.

కడచిన శతాబ్దిని కృష్ణా మండలంలో న్యాయాధికారిగా ఉన్న శ్రీ సి. పి. బ్రౌను తెలుగుబాష యెడల గల ఆదరంకొద్దీ పెక్కు గ్రంథాలను సేకరించి నకలువ్రాయించి మూలపత్రులతో సరిచూచి (తైఫారుచేసి)సంస్కరించి పెట్టాడు. ఆయన దర్బారులో జూలూరి అప్పయ్య, రావిపాటి గురుమూర్తిశాస్త్రి వంటి దిగ్గంతులైన పండితు లుండేవారు. బ్రౌనుకాలపు ఒక నకలుదారు ఉత్తరరామా యణం నకలు వ్రాసి చివర ఇలా వ్రాస్తాడు: "శృంగారకవి లింగన్న ఉత్తర రామాయణం బ్రోను దొరగారికి వ్రాసి యిచ్చెను."

బ్రౌను నకలు వ్రాయించి ప్రతికను మాతృకతో తైఫారు చేయించే వాడని ఇంతకుముందే చెప్పాను. తైఫారు చేసినదాని గుర్తుగా పుస్తకం చివర లేఖకులు ఆ సంగతిని వ్రాసి తమ సంతకాలు చేసేవారు:— "బ్రహ్మోత్తర ఖండం ది 29 నవంబరు 1831 మొకాబిలా చాయకమైనది. వారణాసి రామ స్వామి వ్రాలు, నండూరి వేంకటాచార్యుల వ్రాలు."

ఒక ప్రతి పాఠాంతరాలు ఎత్తివ్రాసుకున్న తర్వాత ఆ ప్రతితో అవస రం ఏముంది? "ఈ గ్రంథం చిత్తూరులో వ్రాయించుకొని యిందులో ఉండే ప్రతి భేదములు యావత్తు వేరే ప్రతిలో ఎక్కించడం అయినది గనుక దీనితో కావలసిన పని తీరినది" అని వ్రాసుకొనేవారు.

శ్రద్ధాళువులు తమకోసం వ్రాసుకున్నప్పుడు కూడ స్పష్టంగా గ్రంథాం తంలో చెప్పుకొనేవారు :- "ఈ పుస్తకం ప్రతినున్న క్రమానను మాదేటి సాలంకయ్య వ్రాసుకున్న కూర్మపురాణం. ఆనందనామ సం॥ మాఘ బహుళ ౫ శుక్రవారం వ్రాసినాము."

"నందననామ సంవత్సర భాద్రపద శుద్ధ ౫ వర్కు అంగర నరసింగన వ్రాసిన క్రమానను వుప్పు చాయన్న జైమిని భారతం సంపూర్ణంగాను వ్రాసెను."

అరుదుగా మొదట్లో వ్రాయడం కూడ కనిపిస్తుంది:- "ఇది నారాయణప్ప నాయడి స్వహస్త లిఖితం."



పాశ్చాత్య లేఖకులకు కూడ మనవారికున్నంత సరదాలూ ఉండేవి. అక్కడా లేఖకులూ, రాజలేఖకులూ ఉండేవారు. ఈజిప్టు పిరమిడ్ల గోడల మీద ఆనాటి ఈజిప్టు లేఖకుల బొమ్మలింకా ఉన్నాయి. వీరిలో చాలమంది యువకులుగా కనిపిస్తారు. నేలమీద కూచుని ఎడమచేత్తో పెపైరస్ చుట్ట, కుడిచేత్తో కాకి వెదురు [రెల్లు] కలం పట్టుకున్నారు. చెవుల్లో ఒక జతకాకి వెదురు కలాలు అదనంగా చెక్కుకున్నారు. వీరిలో పలువురు చాలదరిద్రావస్థలో ఉండేవారు. రాజలేఖకులకు మాత్రం మంచి ఆస్తీ, పాస్తీ ఉండేది; నగరాలలో ఇళ్లూ వాకిళ్లూ ఉండేవి. ఆ కాలంలో నహ్‌మత్ అనే ఒక రాజలేఖకుడు ఉండేవాడు. ఈయన రాచవారి ఉగ్రాణం అధికారి. ఇతడు రాచనగరు సామాను దొంగిలించి డబ్బు తీసుకున్నాడని అంటారు.

యూరపులో రోమన్ సామ్రాజ్యం పడిపోయిన తర్వాత ఎడతెగని పోరాటాలవల్ల, అనాగరకుల పరిపాలనవల్ల చదువంటేనే శ్రద్ధ తగ్గినప్పుడు, విద్యావంతుల సంగతి చెప్పాలా? చర్మం వ్రాత సాధనమైన కాలానికి కొద్ది మంది విద్వాంసులు మాత్రమే వాటిని వాడేవారు. అడవుల్లోను, కొండ కోనల్లోను ఉన్న క్రైస్తవ మఠాలలో మాత్రమే వ్రాత, చదువు కొంతంగా కొనసాగేవి. ఈ మఠాలలో సన్యాసులు తమ అముష్మికం కోసం ఆత్మార్థం మత గ్రంథాలను ప్రతివ్రాసుకొనేవారు. తన గదిలో పాతకాలపు ఎత్తువీపు పెద్దకుర్చీలో కూచుని ఈ సన్యాసి సెయింట్ సెబస్టియన్ జీవిత చరిత్రను నకలు చేసుకుంటున్నాడు. ఈయనకు యెలాటి తొందరా లేదు. ప్రతి అక్షరం జాగ్రత్తగా తీర్చి దిద్దుతాడు. ఇలా వ్రాయడంలో ఎన్నిసార్లు కలం సిరాబుడ్డిలో ముంచవలసి



వచ్చినా విసుగుపడడు. కాకివెదురు (రెల్లు) కలం తోనో, ఈక కలంతోనో వ్రాస్తాడు. ఈ కాలానికి బాతుఈక, కాకి ఈక, గద్ద, నెమలి ఈక బాగా వాడుకకు వచ్చాయి. సిరాకూడ రోమనులు, ఈజిప్టువారు పూర్వం వాడినదాని వంటిదికాదు. అప్పటి చర్మపుస్తకాలపై వ్రాయడానికి కలకాలం నిలిచే సిరా కూడా తయారయింది. ఈ సిరా చర్మంలోకి చొచ్చుకొని పోయేది; ఎంత తుడిచినా చెరగదు. సిందూరపుచెట్టు రసం, అన్నభేది తుమ్మబంకకాని, మరే బంకన్నాకాని కలిపి ఈ సిరా తయారు చేసేవారు.

సింధూరపుచెట్టు రసం చెట్టు బెరడుపై మొటిమలలాంటి బుడపలనుంచి తీసేవారు. ఈ బుడపలను "సిరాగింజలని" 'సిరాకాయలని' అనడంకూడ కద్దు. ఇవి గింజలుకావు. చెట్టు బెరడుపైమాత్రమేకాక ఆకులపైన, వేళ్లపైన పెరిగే మొటిమలలాంటివి, పులిపిరిలాంటివి. వీటిరసంలో అన్నభేది కలిపితే నల్లనిద్రవం తయారవుతుంది. బంక చేర్చడంవల్ల సిరా చెరిగిపోదు.

కాయితాలు కనిపెట్టినకాలం ప్రారంభదశలో ఒక రష్యన్ లిఖిత పుస్తకంలో సిరాచేసే యోగం ఉంది దానిని పరిశీలించండి.

"సిరా గింజలను రైను ద్రాక్ష సారాయిలో నానబెట్టి ఎండలో పెట్టాలి. లేకపోతే పొయిమీద వేడిచేయాలి. ఇది పసుపురంగు ద్రవంగా మారుతుంది. ఈ పసుపురంగు ద్రవాన్ని వస్త్రగాలితం చేసి పిండాలి. దానినొక సీసాలోపోసి అన్నభేది, కొంచెం పిండి కలిపి కొన్ని రోజులు వెచ్చని ప్రదేశంలో ఉంచాలి. అప్పుడప్పుడు గరిటెతో కలియబెడుతూ ఉండాలి. మంచి సిరా తయారవుతుంది.



"ఈ సిరాతో వ్రాసినప్పుడు నల్లగా కనిపించకపోతే కొంచెం బంక పొడిచేసి వేయాలి. కోరిన వ్రాత వ్రాసుకోవచ్చు."

సరే! మన సన్యాసి సంగతి కనుక్కుందాం. అతడు వ్రాసేముందు పుటపై జాగ్రతగా గీతలు గీచుకుంటాడు. సీసపు కడ్డీతో గీతలు గీస్తాడు. ఈ సీసపుకడ్డీయే మన పెన్సిలు అమ్మమ్మ. పుట ఎడమ పక్కన కొంతభాగం వదలి నిలువుగీత గీచి, తర్వాత అడ్డుగీతలు తేలికగా గీచుకుంటాడు. భగవంతుని అనుగ్రహం, ఆశీర్వాదాలు కోరుతూ మొదటిపంక్తిని ప్రారంభిస్తాడు. మొదటి వాక్యం మొదటి అక్షరాన్ని పెద్దగా చిత్రాలతో వ్రాస్తాడు. చిత్రాలు చేతకాకపోతే మరొకరు వాటిని వ్రాయడానికి కొంత స్థలం వదలి ముందుకు సాగిపోతాడు. ఎస్ (S) అనే అక్షరం వ్రాయదలచుకుంటే

రెండు కోడిపుంజులు పోట్లాడుకుంటున్నట్టు ఎస్ ఆకారంలో బొమ్మలుగీస్తాడు. కొందరు ప్రతి అధ్యాయం మొదటి వాక్యం మొదటి అక్షరాలకు పూర్తిగా బొమ్మలే గీస్తారు. రాక్షసులు, సింహాలు, మానవ శిరస్సులు, పక్షులు, చేప తోకలు. ఒకటేమిటి-ఏవో ఊహామృగాలన్నీని. ఈ అక్షరాలన్నీ రంగురంగు సిరాతో వ్రాస్తారు. తరచు ఎఱ్ఱసిరాతో వ్రాయడం ఆచారం. కనుకనే మొదటి పంక్తిని "రెడ్‌లైన్" (ఎఱ్ఱగీత) అనడం యూరోపులో నేటికీ అలవాటు-అన్ని పంక్తులూ ఒకే రంగులో ఉన్నప్పటికీ, మొదటిపంక్తి ఎఱ్ఱ రంగులో వ్రాయనప్పటికీ. మరొక విశేషమేమిటంటే, ఈ "రెడ్‌లైన్" తక్కిన పంక్తుల వలెకాక పుట మొదటినుంచి ప్రారంభమౌతుంది.

మన సన్యాసి ఇలా వ్రాసుకుంటూపోతే ఐదువందల పుటల పుస్తకం చూచివ్రాతకు కనీసం సంవత్సరమైనా పడుతుంది. పాపం! అతని వీపు నొప్పిపెడుతుంది. కళ్ళలో నీళ్లు కారుతుంది. అయినా వ్రాత వదలడు. అశ్రద్ధ చూపితే మహాపాపం, నరకానికి పోతాడు. కనుక సెయింట్ సెబస్టియన్‌ను ధ్యానం చేసుకుంటూ వ్రాతపనిలో నిమగ్నుడౌతాడు

ఈ విధంగా ఎన్నో నిద్రలేని రాత్రులు గడుస్తాయి. పుస్తకం ముగుస్తుంది. పుటలు రంగు రంగు చిత్రాక్షరాలతో నందనవనంలాగ కనిపిస్తుంది. చివరన ఈ మాటలు వ్రాస్తాడు: "బలిదానంచేసిన ఓ మహావీరుడా ఈ పాపిష్టిసన్యాసిని (హండోజినస్‌ను) జ్ఞాపకముంచుకో. ఈ సన్యాసి ఈ పుస్తకంలో నీ అద్భుత చరిత్రను వర్ణించినాడు. నేను స్వారాజ్యంలో ప్రవేశించడానికి తోడ్పడు. నా పాపాలకు పడే శిక్షనుంచి నన్ను తప్పించు."

తర్వాత తర్వాత లేఖకులు డబ్బుకు పుస్తకాలు నకలుచేసి ఇచ్చేవారు, వీరందరూ సన్యాసులే. వీరు పుస్తకం ఆఖరున మన లేఖకులలాగ తమను



గురించి కొన్ని పంక్తులు వ్రాసుకొనడం ఆచారమైపోయింది. పుస్తకం ప్రతులు వ్రాయడం పవిత్ర కార్యమని నమ్మిన వారే వీరంతా. కాని ఐహికమైన ప్రతిఫలం, అంటే నకలు కూలీకోరడం మాత్రం మరచేవారుకారు. ఒక వృద్ధలేఖకుడు పుస్తకం చివర వ్రాసిన తీరిది :

క్రీస్తు జననాంతరం 1745 వ సంవత్సరం సెయింట్ థామస్ జయంతి సెలవు తర్వాత 12 వ రోజున, జ్యూరిక్ నగరవాస్తవ్యుడు. లిచ్‌టన్ స్టీన్ మఠవాసి జోహన్నెస్ హేర్‌వర్ స్వహస్తంతో ఈ ప్రార్థనల పుస్తకం వ్రాసినాడు. నా సోదరుడు మార్టిన్ యజమాని అయిన పున్‌నాచ్ మఠాధిపతి ఆనతిప్రకారం ఆయన తలిదండ్రులకు,

ఆయన కుటుంబం వారికీ తోటి పౌరులకు మోక్షసిద్ధికోసం ఈ కార్యం చేయ బడింది. ఈ ప్రార్థనల పుస్తకం వెల 52 గుల్డెనులు. భగవంతుడు లేఖకుని అనుగ్రహించుగాక!

మరికొందరు లేఖకులు తమాషా ద్విపదలతో తమ పుస్తకం ముగించే వారు :

ఇదిగో పొత్తము ముగిసె; నికనేమి చెప్ప?
ఎది? తెండు లేకరి కిపుడర్థమొప్ప?

* * *

పొత్తమ్ము తీరె నిప్పుడ వేళకాక
విత్త మీ మధువు సేవింప లేకరికి

ఈ సన్యాసుల సంబరంలో మన దేశపు సిరాలసంగతి చెప్పడమే మర చాను, మన సిరావయసు దాదాపు బుద్ధునికాలం. ఇంతకుముందు పిప్రావా శాసనం సంగతి చదివారుగదా! ఆ పిప్రావా అస్థికరండం మూత లోపలి వైపున సిరాతో ఏమో వ్రాసి ఉందట. సాంచీ స్తూపంలో దొరికిన అస్థికరండాలమీద "సారిపుత్త, మొగ్గల్లాన" అనిపేర్లు చెక్కి ఉండడం మాత్రమేకాక మూత లోపలివైపు "సా" "మ" అని పొడి అక్షరాలు, నల్లసిరాతో వ్రాసినవి కని పించాయి. సారిపుత్ర మౌద్గల్యాయనులు బుద్ధభగవానుని శిష్యాగ్రణులు.

ఇక ఆంధ్రరాజులయిన సాతవాహనుల కాలంలో గుణాఢ్యుడనే కవి ఉండేవాడు. ఆయన వ్రాసినదే బృహత్కథ అనే అనేకానేక కథల పుస్తకం. ప్రపంచ కథాసాహిత్యానికి బహుశా ఇదే మూలమనవచ్చు. ఆయన తన కథ లను ఆదరించేవాడు లేడనే విచారంతో అడవికి వెళ్ళి మసి (సిరా) లేకపోవడం వల్ల తన రక్తంతోనే కథ వ్రాసినట్టు కథాసరిత్సాగరం చెబుతున్నది. (........ తాం కథా మాత్మశోణితైః అటవ్యాం మస్యభావాచ్చ విలేఖ స మహాకవిః) సుబంధుకవి మసిని ప్రస్తావించడం మీరిప్పుడే చర్మపుస్తకాల సందర్భంలో చదివారు. ఆకాశం తమో మసీశ్యామమైన అజినంవలె ఉన్నదన్నాడు సుబంధువు.

దక్షిణ ప్రాంతానికి మసిని మరాఠీలు ఇటీవల తెచ్చారని, వారినుంచే మసి వ్యాపించిందని కొందరు అన్నారు. కాని, మనకు శ్రీనాథుని కాలానికే మసి, కాయితం తెలుసు. "దస్త్రాలున్ మసిబుర్రలున్" అన్న పద్యం మీరు ఇదివరకే చదివారు లేఖకుల వర్ణన సందర్భంలో.

మన సిరాకు పాశ్చాత్య దేశాలలోలాగ సిందూరపు చెట్టు బుడపల రసంతో సంబంధంలేదు. మరి ఎలా చేసేవారు? లక్కతో తయారుచేసేవారు.

ఇది నీటికి చెరగదు. చాలకాలమైతే పెచ్చులుపెచ్చులుగా ఊడిపోయే ప్రమాదం మాత్రం ఉంది. ఉత్తరభారతంలో భూర్జపత్రాలపై వ్రాయడానికి ఈ లక్క సిరానే వాడేవారు. లంకలో సిరాకు హింగుళం వాడేవారట

లక్కసిరా చేసేపద్ధతి వినండి;

"టంకణం ద్విగుణంలాక్షా లాక్షా దశగుణం జలం
వహ్నినా పాచయే దర్ధం రసో దివ్యో భిజాయతే"

అంటే ఒకపాలు వెలిగారం, రెండుపాళ్ళు లక్క, పదిపాళ్లు నీటితో సగం ఇగిరేవరకూ కాచితే దివ్యమైన లాక్షారసం తయారవుతుంది. లక్కసిరా ముదురు ఎరుపుఛాయలో ఉంటుంది.

మరొకపద్ధతి కూడ ఉంది. బాదంకాయల బెరడును ఆవు పంచితంలో నానబెట్టి ఎండించి కాల్చేవారు. ఆ బొగ్గును నీళ్ళతో నూరేవారు. ఇది ఒకరకం సిరా. కాటుకను కాచునీటిలో కలిపి నూరి సిరా తయారుచేయడం ఇంకొక పద్ధతి. ఇది గట్టి పడడానికి తుమ్మబంక చేర్చేవారు. ఇవన్నీ మామూలు నల్ల సిరాలు. (కరక్కాయ సిరా కాయితాలు బాగా వాడకానికి వచ్చిన తర్వాతగాని తయారుకాలేదు.)

రంగు రంగు సిరాలు కావాలంటే అరదళం, మణిసిలవంటి గైరికాలు వాడేవారు. ఈ రంగు సిరాలను వాక్యవిరామ చిహ్నాల సూచనకు ముఖ్య ఘట్టాల సూచనకు వాడేవారు. బంగారు వెండి సిరాలు తయారుచేయడానికి సిరాలో బంగారు, వెండి వర్తకులు (రేకులు) నూరి కలిపేవారు. కాయితాలకు గాని, భూర్జపత్రాలకుగాని మొదట ఎరుపు, నలుపు రంగు పూసి, ఈ వెండి, బంగారు సిరాలతో వ్రాసేవారు. తర్వాత గవ్వలతోనో, శంఖంతోనో రుద్దేవారు. అక్షరాలు మిలమిలలాడుతాయి.



సప్తమ ప్రకరణం

# కాయితాల కథ

మనదేశంలో శాసనాలువోయి తాటాకులు, విదేశాలలో పెపైరస్‌పోయి చర్మ పుస్తకాలు ప్రచారానికి వచ్చినట్టే, క్రమంగా వీటన్నిటినీ మనకిప్పుడు సుపరిచితమైన కాయితం ఎక్కువ ప్రచారంపొంది తక్కినవాటిని తోసి రాజన్నది.

పెక్కు అపూర్వ వస్తువులకు మనమే సృష్టికర్తలయినట్టు కాయితానికి కూడ సృష్టికర్తలం మనమేనని నా అభిప్రాయం. మనదేశంలో రెండువేల సంవత్సరాలక్రితమే పత్తిని దంచి కాయితాలు తయారుచేసేవారు. దంచి, ఆ తడిలోనే పలుచని పొరలు చేసి ఒకదానిపై మరొకటి పేర్చి ఆరబెట్టేవారు. ఆరినతర్వాత దానిపై బియ్యపుపిండిగాని, గోధుమపిండిగాని కలిపి పూసేవారు. దానితో పత్తి కాయితంలోని సన్నని పీచులన్నీ కలిసిపోయి కాయితం సమానంగా అవుతుంది. తాటాకులను ఉడికించి రుద్దినట్టే వీటినికూడ శంఖాలతోనో, గవ్వల తోనో నున్నని రాళ్ళతోనో రుద్దేవారు. దీనితో కాయితం నునుపుదేరుతుంది. సిరా వ్యాపించకుండా ఉంటుంది.

ఇలాటి కాయితాలు మనదేశంలో అశోకచక్రవర్తి తాత చంద్రగుప్తుని కాలంలోనే ఉన్నాయి. అతని ఆస్థానంలోని గ్రీక్ రాయబారి మెగస్తనీస్, అలెగ్జాండరు సేనాపతి నియార్కస్ ఈ పత్తికాయితాల సంగతి చెప్పారు.



వీటిని జైనులు తమ మత గ్రంథాలకు ఎక్కువగా వాడారు. వీటిని తాటాకులలాగే కత్తిరించి ఒక వైపునగాని, రెండువైపుల గాని బెజ్జాలువేసి, తాటాకు గ్రంథాలను కట్టినట్టే కడుతారు. బెజ్జంవేసేచోట ఏవో బొమ్మలువ్రాయడం అలవాటు. అంతా తాటాకు అనుకరణ. మన దేశపు

వాతావరణానికి ఈ కాయితం చాల కాలం నిలవదు. ఇంతకూ దీనిని చేయడం కూడ సులభంకాదు. కనుక సులభంగా అనాయాసంగా తాటాకులు దొరుకుతున్నప్పుడు పత్తి కాయితాలకోసం ప్రయాస ఎందుకు ? ఈ కారణంతోనే కాబోలు మనదేశంలో పూర్వం కాయితాల పట్ల శ్రద్ధ కలుగలేదు.

మనకు ఈలాటి పాత కాయితాల లిఖిత పుస్తకం ఒకటి దొరికింది. ఇది ఇప్పటికి పదహారువందల సంవత్సరాలనాటిది. దీనిలో సంస్కృత నాటకాలున్నాయి. ఇది మన దేశంలో దొరికిందనుకున్నారేమో ! కాదు మధ్య ఆసియాలో యార్కండ్‌కు దక్షిణాన కుయిగర్ అనేచోట కేప్టన్ బేబర్ అనే సైనికాధికారికి భూమిలో దొరికాయి. ఇవి భూమిలో ఎప్పుడు పూడిపోయాయో!

దక్షిణాది పత్తి కాయితాలు మరీ మోటుగా ఉండేవి. ఇవి విడిగా ఉండక కుచ్చెళ్ళ మడతలలాగ, "బెల్లోస్" అనే సంగీత వాద్యంలాగ కనిపిస్తాయి. విప్పితే బారెడు వెడల్పు వరకు మడతలు మడతలుగా వస్తాయి. వీటిని కడితం అని అంటారు. ఉత్తరాదివారేమో పట్ అంటారు. పట్ అంటే గుడ్డ-పటం. ఈ రకం కాయితాలను పత్తితోనేకాక గుడ్డలతోను చేయడం కద్దు. కనుకనే దీనికి సంస్కృతంలో పట, కార్పాసికా అనే పేర్లు వచ్చాయి. దీనిని పత్తి, చింతగింజల గుజ్జు, బొగ్గు కలిపి తయారు చేస్తారు. చింతగింజల గుజ్జు పత్తి, విడిపోకుండా కలుపుతుంది. దీనిపై సున్నంతోనో, సుద్దముక్కతోనో వ్రాస్తారు. అతి ప్రాచీనమైన ఈ కార్పాసిక ఇప్పటికి ఏడువందల సంవత్సరాలనాటిది మనకు దక్కింది. ఈలాటి కడితాలు మైసూరు రాష్ట్రంలోని శృంగేరి శంకర మఠంలో చాల ఉన్నవట. అప్పటి లెక్కలు, రికార్డు వీటిపై ఉన్నాయి. ఇవి పైకి చూడడానికి పలకల మాలలా ఉంటాయి.

పాండురంగమహాత్మ్యం లోనికవితాన్ని చూడండి:

దక్కఁగ వ్రాసితి న్మును ప
    టమ్మున యందు సుశర్మపాపముల్
లెక్కఁ యెఱుంగరాదు లవ
    లేశము వానికి నట్టి వ్రాతయం
దక్కఁజ మిప్పు డొక్కటియు
    నక్షరరూపములేదు దేవనే
దక్కడితంబు గట్టియయి
    నట్టుల యున్నది కప్పు దేఱుచున్. (౬-80)

సుమత్రా, జావాలలో నేటికీ, ఈ కడితం వాడకం అక్కడక్కడ ఉందట.

కాయితాలు తయారు చేయడంలో కొత్తపద్ధతిని కనిపెట్టి విద్యా వ్యాప్తికి, ప్రపంచ నాగరికతా వ్యాప్తికి విశేషంగా తోడ్పడినవారు చీనావారు. రెండువేల సంవత్సరాలక్రితమే వీరు వెదురు, కొన్నిరకాల గడ్డి, పాతగుడ్డ పేలికలు




ఉపయోగించి కాయితాలు చేయడం నేర్చుకున్నారు. కనుక చీనావారే కాయితాలు కనిపెట్టినారనే కీర్తి వ్యాపించడంలో ఆశ్చర్యమేముంది? వీరు ముందు చెప్పిన వస్తువులను రోటిలో వేసి దంచి ముద్దచేసి, బండపై నాదేవారు. ఈ ముద్దనే కాయితంగా పోతపోసేవారు. ఈ ముద్దను జల్లెడవలె పట్టుదారాల అల్లిక ఉన్న వెదురు చట్రంలో చాపలాగ పరిచి అన్నివైపుల నుంచి కదిలించేవారు. దీనివల్ల ముద్దలోని పిప్పి మాత్రం మిగిలి నీరంతా పట్టుదారాల సందులగుండా కిందికి కారిపోయేది. ఈ రేకులను జాగ్రత్తగా తీసి పలకలపైపెట్టి ఎండబెట్టేవారు. ఎండిన రేకులను దొంతరగా ఒక బల్లపై పెట్టి పైన బరువైనపలక ఎత్తేవారు. ఈ చేతి కాయితాల పద్ధతి నేటికీ చీనావారు మానుకోలేదు.

చీనావారు అద్భుత వ్యక్తులు. కాయితపు రేకులనుంచి పుస్తకాలు తయారు చేయడంలోను, పింగాణి పాత్రలు తయారుచేయడంలోను వారెంతో నేర్పు, ఓర్పు కనబర్చారు. వీధి మొగలలో లాంతర్లో, విసనకర్రలో, దీపపు షేడులో అమ్ముతున్న చీనావారిని చూచినప్పుడల్లా, ఈజాతి, పింగాణీ, ప్రింటింగు (ముద్రణ) పౌడరు (తుపాకిమందు), పేపరు (కాయితం) ఎన్నో దేశాల కన్నా ముందుగా కనిపెట్టిందన్న సంగతి జ్ఞాపకం వస్తూ ఉంటుంది.

కాయితం ఆసియా ఖండం నుంచి పాశ్చాత్య దేశాలకు వెళ్లడానికి కూడ పెక్కు సంవత్సరాలు పట్టింది. క్రీస్తుశకం 704 లో మధ్య ఆసియాలోని

సమర్కండు అరబ్బులు జయించారు. వారు విజయంలో కొల్లగొట్టిన ఇతర వస్తువులతోపాటు కాయితాలను తయారుచేసే కిటుకుకూడ సంపాదించారు. తర్వాత తర్వాత అరబ్బులు జయించిన సిసిలీ, స్పెయిన్, సిరియా దేశాలలో కాయితాలకార్ఖానాలు లేచాయి.

ఈ కాయితాల కార్ఖానాలు యూరప్‌లో నెలకొనడానికి కొన్ని శతాబ్దాల కాలం పట్టింది. వాటిని "పేపరు మిల్లులు" అని అక్కడివారు వ్యవహరించేవారు. అలాటి మిల్లులు పదమూడవ శతాబ్దంలో జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు దేశాలలో బయలుదేరాయి. రష్యాలోని నొవొగ్రాడ్ నగరానికి వ్యాపారంకోసం వచ్చిన జర్మనీ వ్యాపారస్తులు ఇటలీలో తయారయిన కాయితాన్ని మొదటిసారిగా రష్యాకు తీసుకువెళ్లారు. తర్వాత రష్యాలోను - మాస్కోకు సమీపంలోని కాన్నినో గ్రామంలో - పేపరుమిల్లులు బయలుదేరాయి.

అంటే, కాయితం చీనానుంచి సమర్కండ్, సిరియా, ఇటలీ, జర్మనీల మీదుగా - చాలవరకు ప్రపంచ పర్యటనచేసి - రష్యా చేరిందన్నమాట. ఈ పర్యటనలో కాయితానికి వాడే మూల ద్రవ్యాలలోనూ మార్పు వచ్చింది. యూరోపులో కాయితం పాతబట్ట పేలికలతో తయారుచేయడం మొదలుపెట్టారు. మొదట కాయితం ప్రయోజనాన్ని వారు సరిగా గ్రహించలేదు. చాలకాలం ఉండనవసరంలేని విషయాలను మాత్రమే కాయితంపై వ్రాసేవారు. పుస్తకాల కోసం చర్మాలనే వాడేవారు. కాని కాయితం క్రమంగా చర్మ పుస్తకాలను తోసిరాజంటూ వచ్చింది. ప్రజలు కాయితాన్ని విరివిగా వాడడం తెలుసుకున్నారు. కొందరు కాయితాలతో పుస్తకాలనే తయారుచేశారు కాని ఆ పుస్తకాలు శాశ్వతంగా ఉండడానికి రెండు తావుల తర్వాత ఒక చర్మపు తావునుకూడ కలిపి కుట్టేవారు. మరొక వంద సంవత్సరాలు గడిచాయి. చర్మపుస్తకం అపురూపమైపోయింది.

మరొకవిధంగా జరగడానికి అవకాశమే లేదు. ముందులాగ క్రైస్తవ మఠాలలోని సన్యాసులు మాత్రమే చదువుకొనే కాలం పోయింది. ప్రతిచోట పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు బయలుదేరాయి. చదువంటే ఆసక్తిగల యువకులు ఈ విద్యాలయాలకు ఎగబడడం ప్రారంభించారు. వీరికి కాయితాలు, నోటుబుక్కులు కావాలి. వీరిలో బీదబిక్కి ఉండేవారు. వీరు వ్యయసాధ్యమైన చర్మ పుస్తకాలు ఎలా కొంటారు? వ్యాపారులు వీరికి చౌకగా వచ్చే ఈ కాయితాలు సరఫరా చేయడం ప్రారంభించారు.

విద్యార్థులు సన్యాసులలాగ శ్రద్ధగా పుస్తకాలు వ్రాసుకొంటారా? లేదు. సన్యాసులేమో నకలు చేయడమొక పుణ్యకార్యంగా భావించి శ్రద్ధగా చిత్రాలు

గిస్తూ అక్షరాలు చెక్కేవారు. కారణ మేమిటంటే, చర్మపుస్తకాలు చాల ప్రియం, ఒక్క అంగుళంమేరకూడ వ్యర్థం చేయడానికి వీలుపడదు గనుక. కాయితాలు చాల చౌక. ఇష్టంవచ్చినన్ని కొక్కెర గీతలు వ్రాయవచ్చు. విద్యార్థులు తాము చదివిన విషయాలు వ్రాసుకొనే ఈ పుస్తకాలలో వంకర టింకర గీతలు, మృగాల బొమ్మలు, తమ ఉపాధ్యాయుల వ్యంగ్య చిత్రాలు - ఒకటేమిటి? పరిసర ప్రకృతి అంతా ఉండేది.

ఈ సమయానికి ముద్రణకూడ కనిపెట్టడంతో కాయితాలకు గిరాకీ హెచ్చింది. ఏడాది కేడాదికి పుస్తకాలు హెచ్చుగా అచ్చు అవుతూ దుకాణాలకు వచ్చేవి. పుస్తకాల గిరాకీ హెచ్చినకొద్దీ, కాయితాలు తయారుచేయడానికి పాతగుడ్డ పేలికలు దొరకడమే కష్టమైంది. కాయితాలు తయారుచేయడానికి మరొక వస్తువు కావాలి? ఎన్నోనాళ్ల ప్రయోగాలు, పరిశీలనలు జరుగగా, జరుగగా, కఱ్ఱ గుజ్జుతో కాయితం తయారు చేయవచ్చునని కనుగొన్నారు. మేలురకం కాయితాలకు మాత్రమే గుడ్డపేలికలు వాడడం, తక్కువరకం కాయితాలకు కఱ్ఱ వాడడం ప్రారంభించారు. మన మిప్పుడు చదివే వార్తాపత్రికలు, వస్తువులను భద్రపరచడానికి పైన చుట్టే కాయితాలు కఱ్ఱతో తయారయినవే.

నేడు కాయితాలు ఎలా తయారుచేస్తారో తెలుసుకొనడానికి ముందు మన దేశంలో కాయితాలు ఎలా వ్యాపించాయో వినండి. మనదేశానికి చీనానుంచి 10వ శతాబ్దానికి పూర్వమే కాయితం వచ్చింది. కాని కాయితం వ్యాప్తి ముస్లిములవల్లనే జరిగింది. పదకొండవ శతాబ్దిలో ముస్లిములు మన దేశానికి కాయితం విరివిగా తెచ్చారు. తర్వాత రెండు మూడు శతాబ్దాలకుగాని ఇది దక్షిణ భారతానికి రాలేదు. అన్యమతస్థులైన విదేశీయులు తేవడంవల్ల, అపవిత్రమని భావించడంవల్ల దీనికంత వ్యాప్తి కలుగలేదు. రాజులు, వారి సామంతులుమాత్రం ఫర్మానాలు, దస్తావేజులు వ్రాయడానికి వీటిని వాడేవారు.

ఆంధ్రదేశంలో కాయితాలు ఆరువందల సంవత్సరాలముందు నుంచే ఉన్నాయి. శ్రీనాథుని పద్యాన్ని -కాయితమందలి వర్ణపద్ధతుల్ అని మీరు ఇదివరకే చదివారు. కాకితం, కాయితం, కాగదం అనేవి కాగజ్ అనే ఫార్సీ పదం వికృతరూపాలే. కాయితం ముస్లిములనుంచి మనకు ప్రచారమైందని ఈమాట చెప్పకనే చెబుతున్నది. పోర్చుగీసువారినుంచి దక్షిణాదిని కాయితాలు ఇంకా వ్యాప్తికి వచ్చాయి. మన రాష్ట్రంలో శాసనాలు, గ్రంథాలు సేకరించిన కర్నల్ కాలిన్ మెకంజీ, సి.పి. బ్రౌను వాటిని అప్పటి పీచు కాయితాలపై వ్రాయించి భద్రపరచారు. కొండపల్లిలో ఇలాటి పీచుకాయితాల కార్ఖానా ఒకటి ఉండేదట. దళసరిగా, గరుకుగా ఉండే కాయితాలను కొండపల్లి కాయితాలని అనేవారు. క్రైస్తవ మిషనరీల మూలంగా ముద్రణ మనదేశంలోను ప్రారంభం కావడంతో కాయితాల గిరాకి హెచ్చింది. తాటాకుల వాడకం తగ్గింది.

కాయితం చూస్తే కర్రలాగానో, గుడ్డపేలికలాగానో కనిపిస్తుందా? కాని నిజానికి వీటికి పోలికలు చాలా ఉన్నాయి. విరిగిపోయిన నిప్పుపుల్లనో, దారాలు వ్రేలాడే గుడ్డపేలికనో సదానించి చూడండి. సన్నని పీచు కనిపిస్తుంది. ఈ పీచునుంచే కాయితం తయారవుతుంది. ఏదైనా కాయితం తీసుకుని దానిని అడ్డంగా చింపి, ఆ ముక్కలను వెలుతురులో చూడండి. సులభంగా బోధపడుతుంది.

గుడ్డపేలికలను, కర్రముక్కలను పీచుగా తయారుచేసి, దానిలోని చెత్త చెదారం తీసివేసి, ఆ పీచును సరిసమానంగా పలుచని పొరలుగా పోయడమే కాయితం. ఈ పోయడం ఎలా జరుగుతుంది? మనం మరల మొదటికి వద్దాం. ఏ ఇల్లాలో పాతచీరనో, చొక్కానో పారేసిందనుకోండి. ఆ మర్నాడే పాత గుడ్డల పేలికలను జమచేసేవారు వచ్చి వాటిని ఏరుకుంటారు. వారు ఈ పాత గుడ్డలను, ఇంకా సేకరించిన పేలికలను ఒక గిడ్డంగికి తీసుకువెళ్ళుతారు. అక్కడ ఈ పేలికలను-పట్టువి ఒకచోట, నూలువి మరొకచోట, ఉన్నివి వేరొకచోట ఈ విధంగా-విడదీస్తారు. తర్వాత వాటిని బేళ్ళుగాకట్టి ఫ్యాక్టరీకి పంపుతారు.

అక్కడ ఈ పేలికలు ఆవిరిలోవేసి మెత్తబరుస్తారు. ఆవిరిలో వాటిలో ఉన్న రోగకారక క్రిములు నశిస్తాయి. మరి ఈ పేలికలు ఆస్పత్రులనుంచి, చెత్త తొట్లనుంచి, ఇంకా ఎంతో అసహ్యమైన స్థలాలనుంచికూడ వచ్చి ఉంటాయికదా! తర్వాత వాటిని ఆరబెట్టి దుమ్ముదులిపి శుభ్రంచేస్తారు. రోజూ వేలకొలది మణుగుల మురికి పేలికలను శుభ్రంచేసే ప్రత్యేక యంత్రాలు ఉంటాయి. యంత్రాలు లేకుండా కర్రలతో కొడుతూ దుమ్ముదులపడం ప్రారంభిస్తే, ఊరంతా దుమ్ము మబ్బులులాగ కమ్మేయదూ? ఈ విధంగా శుభ్రమైన ఈ పేలికలను మరొక యంత్రం సహాయంతో మరీ సన్నని ముక్కలు చేస్తారు. ఇంకా మిగిలివున్న మురికి పోవడానికి వాటిని పెద్ద బానలలో సున్నపు నీళ్ళలో వేసి ఉడికిస్తారు. తర్వాత ఈ పేలికలను రంగు పోగొట్టి చలవచేసి మరొక యంత్రంలో వేస్తారు. గుజ్జుగా అవుతుంది.

దీనితో సగంపని అయినట్టు. పేలికలు సన్నని పీచుగుజ్జుగా మారాయి. కష్టమైనపని - ఈ గుజ్జును కాయితంగా పోతపోయడం - ఇంకా ఉంది. ఈ పని మరొక పెద్దయంత్రం చేస్తుంది. పెద్దయంత్ర మనడం కన్నా ఎన్నో చిన్న చిన్న యంత్రాలు అనడం ఉచితం. పేలికలగుజ్జు ఈ కొననుంచి ఈ యంత్రసముదాయంలోకి వెళ్ళి ఆ కొననుండి కాయితం స్వరూపంతో మనకు ప్రత్యక్షమౌతుంది. మొదట ఈ గుజ్జు అడుగున జల్లెడలాగ ఉన్న ఒక పెట్టెలో



పడుతుంది. ఈ పెట్టెను "శాండ్‌బాక్స్" అంటారు. ఈ పెట్టె గుజ్జును జల్లించి వేయడంవల్ల గుజ్జుతో మిగిలిపోయిన ఇసకగిసక పెట్టె అడుగుకు చేరుతుంది. తర్వాత ఈ గుజ్జు చిల్లులున్న ఒక డ్రమ్ములో పడుతుంది. ఈ డ్రమ్మును "నాట్ క్యాచర్" అంటారు. ఇది ఎప్పుడూ గుజ్జును కుదుపుతూ ఉంటుంది. ఈ కుదుపులో మెత్తని గుజ్జు చిల్లులగుండా డ్రమ్ము అడుగున ఉన్న వలపై పడుతుండగా, గంట్లు, ముళ్లు డ్రమ్ములో నిలిచిపోతాయి. ఆ విధంగా ముళ్లను ఆపిపెట్టడంవల్ల "నాట్‌క్యాచర్" అనేపేరు దీనికి రావడం ఇప్పుడు స్పష్టమైంది కదా! ఈవల చీనావారి చేతికాయితం వలను జ్ఞాపకం తేవడంలేదూ ? ఆవలను చీనావారు చేతితో కదిపేవారు. ఇక్కడ ఆ పనిని యంత్రాలే చేస్తాయి. రెండు రోలర్లమీద పరచినట్టున్న ఈ వల డ్రైవింగ్ బెల్టువలె ఈ రోలర్ల చుట్టూ తిరుగుతూ కాయితం గుజ్జును జల్లిస్తూ, పరుస్తూ ముందుకు తోస్తుంది. ఈ పరచుకొనడంలోనే తడికాయితం తయారయిందన్నమాట.

తడికాయితాలు ఈ వలమీదినుంచి ఒక గుడ్డపట్టామీదికి వెళ్లుతాయి. ఆ గుడ్డ పట్టా తడికాయితాలను రోలర్లమధ్యకు చేరుస్తుంది. ఈ రోలర్లు ఆవిరికి వేడిగా ఉంటాయి. ఇవి తడికాయితాలను నొక్కి నీటిని పిండి, ఆర్చివేస్తాయి. తర్వాత యంత్రంలోని కత్తులే మనకు కావలసిన కొలతలకు కాయితాల తావులను కత్తిరించి పెడతాయి.

కాయితాల తయారినిగూర్చి ఇంతగాచెప్పడం మీకు విసుగుపుట్టించిందేమో కాని, మీరు స్వయంగా చూస్తే ఎంతమాత్రమూ విసుగుపడరు. ఈ చివరనుంచి ఆ చివరవరకు ఒక యంత్రం ఉందనుకోండి ! మనిషి పురుగైనా కనిపించదు, కాని పనిమాత్రం చక్కగా శరవేగంగా సాగిపోతూ ఉంటుంది. ఈవిధంగా

రోజుకు రెండులక్షలపౌనుల కాయితం తయారుచేసేయంత్రాలుకూడా ఉన్నాయి. ఈ యంత్రాలు ఒకరోజుకు ఫిలడెల్ఫియానుంచి హారిస్‌బర్గువరకు ఉన్నంత దూరంప్రయాణం చేస్తుంది.

కర్రతో చేసే కాయితం ఇలాగే తయారవుతుంది; మొదటమాత్రమే కొంచెం భేదం. కర్ర గుడ్డపీలికలవంటిది కాదు గదా! రకరకాల యంత్రాలు పనిచేస్తాయి. అడవుల్లో దేవదారు మానులుంటాయి చూచారా! వాటిని కొట్టి రెమ్మలు కొమ్మలు జివిరివేసి, నదుల్లోకి తోస్తారు. అవి ప్రవాహానికి కొట్టుకువచ్చి ఫ్యాక్టరీ ఉన్నచోటికి చేరుతాయి. ఫ్యాక్టరీవారు వాటిని గట్టుకు లాక్కుంటారు.

తర్వాత ఈ కలపకు యాతన ప్రారంభమౌతుంది. మొదట దీనిపై బెరడు చెక్కివేస్తారు. తర్వాత సన్నని ముక్కలు చేస్తారు. పిదప జల్లెడలో వేసి జల్లించి ఉడికిస్తారు. ఈ కర్రముక్కలను గుడ్డపీలికలలాగ సున్నపునీళ్లలో ఉడికించరు, తేజాబులో (సల్ఫ్యూరిక్ యాసిడ్‌లో) వేసి ఉడికిస్తారు. ఆ మీదట ఈ కలపముద్దను నీటిలో వేసి గలబరించి పీచును వేరుచేస్తారు. ఉంటలు, గంట్లు వేరుచేస్తారు. ఈ ముద్ద యంత్రాలను చేరుతుంది. అడవిలోని దేవదారుమాను ఒక యంత్రంనుండి మరొక యంత్రంలోకి వెళ్లుతూ తుదకు కాయితం అవుతుంది.

మన కాయితం అన్నింటికి మంచిదే. కాని, ఒక లోపంమాత్రం ఉంది. ఎక్కువకాలం మనదు. ఇది ఎక్కువకాలం మన్నికకు రాకపోవడానికి కారణం దీనిని శుభ్రంచేసేపద్ధతే. కాయితం తెల్లగాను, శుభ్రంగాను కావడానికి చాల తీక్ష్ణమైన చవుటినీళ్లలో నానబెడతారు. కాయితం అప్పటంగా గుడ్డపీలికలతో తయారుకాకపోతే కొంతకాలానికి పెళుసెక్కి పచ్చబారిపోతుంది. మన కాయితాలపుస్తకాలు ఇక వేయి సంవత్సరాలనాటి ప్రజలకు దక్కుతాయా? బహుశా ఏ చర్మపుస్తకమో తాళపత్ర గ్రంథమో ఎంతో బాగా అచ్చయిన కాయితాల పుస్తకం కన్నా చాల కాలం ఉంటుందేమో!

నేటి మనకాయితం, మొదటఅచ్చయిన పుస్తకాలకాయితం పూర్తిగావేరు. మనం నేడువాడే కలాలుకూడ పాతకాలంలో వాడిన కలాలవంటివి కావు. ఆపేరుమాత్రం మిగిలింది; కాని వస్తువు వేరు. ఇలా తరచు జరుగుతూ ఉంటుంది. మొదట్లో కొన్నింటికి సంకేతమైన పదాలు కలకాలం ఉంటాయి-ఆ వస్తువులు రూపుమాసినా. ఉదాహరణకు 'కలం' అనే పదాన్నే తీసుకుందాం. ఇది కలమ అనే సంస్కృత పదంనుంచి వచ్చింది. కలమ ధాన్యపు గడ్డిపోచ, రెల్లు (కాకివెదురు) అని దీని అర్థాలు. పూర్వం మనం రెల్లు కలాలను చాకులతో చెక్కి

కొని, కొనచీల్చి వ్రాసుకొనేవారం. ఇప్పుడు ఆ కలమాలు - కాకివెదుర్లు-పోయి కర్రకలాలు, ఇనప కలాలు, సిల్లలాయిడ్ కలాలు వచ్చాయిగదా. అయినా కలం అనే పేరు మారిందా? కనుకనే పదాలు వాటిమొదటి అర్థమైన వస్తువులు కనుమరుగైనా, కలకలాం ఉంటాయనటానికి కారణం.

కలం అనే మాటలాగే 'పెన్' అనే మాటకూడ అసలు అర్ధాన్ని కోలు పోయిన బాపతే. పేనా అని ప్రస్తుతం మనలో కొందరు వాడేమాటకూడ సంస్కృత శబ్ద వికారమే. పేనా ఏమిటి? సంస్కృతం ఏమిటి? అని నవ్వు తారుకదూ! శ్రీ తాపీ ధర్మారావుగారు ఇరవై ఏళ్ల క్రితం ఇలా నవ్వి ఆక్షే పించిన వారికి పేనా వ్యుత్పత్తి వివరించి సమాధానం చెప్పారు గట్టిగా.

పెన్ అనే ఇంగ్లీషుమాట పెన్నా అనే లాటిన్ మాటనుంచి పుట్టింది. పెన్నా అంటే ఈక, వెంట్రుక అని అర్థాలు. ఈక అనే అర్ధం వినగానే మీకు పర్ణ అనే సంస్కృతశబ్దం జ్ఞాపకం రావడంలేదూ! పర్ణ అంటే సంస్కృతంలోను ఈక అనే అర్థం ఉంది. రెక్క అంటే ఈకల సమూహమేకదా! సుపర్ణుడు గురుత్మంతుడు; మంచి ఈకలుగలవాడు. కనుక పర్ణ అనే సంస్కృత శబ్దం పెన్నా అని లాటిన్‌లో అయి, పెన్ అని ఇంగ్లీషులో మారింది. మనకు కొన్ని ప్రాంతాలలో పేనా అనే వాడుకవచ్చింది పేనా అంటే మనకు ఈక అనే అర్థం స్ఫురణకు వస్తుందా! ఈకరూపం లేకున్నా లేఖన కార్యం జరుపుతున్నది గనుక ప్రస్తుతార్థమే రూఢమై పాత అర్థం మరుగౌతుంది. కనుకనే అర్థాలు మారినా పదాలు వాటి ఛాయను అంటిపెట్టుకొని జనాన్ని వదలక కల కాలం ఉంటాయని అన్నాను.



ముప్పై సంవత్సరరాల క్రితం మనం ఉక్కుకలం శతవార్షికోత్సవం జరపవలసింది. ఎందుకంటే 1826 లో మ్యాసన్ అనే శాస్త్రజ్ఞుడు కలాల పోత పోసే యంత్రం కనిపెట్టాడు. ఈ కలాలు వెంటనే ప్రజాదరణ పొంది ఎన్నో శతాబ్దులుగా ప్రజలకు సేవచేసిన ఈకకలాలను, రెల్లు కలాలను తరిమి వేశాయి.

మన తాతలు ముత్తాతలు రెల్లు కలాలతోను, పిట్ట కలాలతోను అంటే ఈకకలంతోను ఎలా వ్రాసేవారా అనిపిస్తుంది! రెల్లుకలం, పిట్టకలం తయారు చేయడం ఒక యాతన. రెల్లు ముక్కను ఏటవాలుగా చెక్కి కొనను రెండుగా చాల పొంకంగా చీల్చాలి. ఈ పని నేడు మనం పెన్సిళ్లు చెక్కుకొనడంకన్నా చాల కష్టమైంది. ఉక్కుకలాలు కనిపెట్టడానికి ముందు ఒక మేధావి బాతు ఈకతో ఒక చిన్న కలం దానిని పెట్టడానికి ఒక ఒర తయారుచేశాడు. ఇది కలంపుల్ల-హోల్డరు, నిబ్బు (పాళీ) విడివిడిగా తయారు చేయడానికి దారిచూపింది.

నేడు మనం వాడే సీసంపుల్ల - పెన్సిలు - కలంకన్నా నూరేళ్ల పాతది. అంటే పాతకాలపు కలంకంటే కాదు; క్రొత్తకలం కంటే నన్నమాట, ఈ పెన్సిలును మొదట తయారుచేసినవాడు జాక్విస్ కాంటి అనే ఫ్రెంచి దేశీయుడు. ఈయన గ్రాఫైట్ పొడిని బంకమట్టిని కలిపి పెన్సిలు తయారుచేశాడు. గ్రాఫైట్ అనేది ఒకరకం బొగ్గు. దీనిని మనం సీసం అంటాము. పెన్సిలు లోని గ్రాఫైట్‌ముక్క పెళుసై విరిగిపోకుండా ఉండడానికి బంకమన్ను కలిపాడు. ఈ గ్రాఫైటును సన్నని కోపులుగా చేసి, కర్రచెక్కలలో గాడిచేసి ఒక చెక్కగాడిలో ఈ కోపుపెట్టి గాడిఉన్న మరొక చెక్కపైనపెట్టి అతికించి, ప్లానింగ్ మిషన్‌లోపెట్టి, కావలసిన కొలతలకు ముక్కలు చేస్తారు. అవే సీసం పుల్లలు-పెన్సిళ్ళు. పెన్సిళ్ళను కొన్ని ప్రాంతాలలో సీసం కడ్డీ అనడమూ ఉంది. తర్వాత చేయవలసిందల్లా వీటికి మెరుగు పెట్టి పెట్టెలలో నింపడమే,



ఇప్పటి పెన్సిలుగాని, ఉక్కుపాళీ కలంగాని, ఫౌంటన్‌పెన్‌కాని ముందున్న గంటంలాగో, రెల్లుకలంలాగో, స్టైలస్‌వలెనో చాలకాలం ఉండక పోవచ్చు. నేడు పెక్కు సంస్థలలో టైప్‌రైటర్ కలానికి స్వస్తి చెప్పింది. ముందు ముందు ప్రతి బడిపిల్లవాడూ తన జేబులో కలానికి మారుగా చిన్న టైపురైటరును పెట్టుకొని బడికి వెళుతాడన్నా ఆశ్చర్యపడనక్కరలేదు.

అష్టమ ప్రకరణం

# అచ్చు ముచ్చట

అచ్చు కనిపెట్టడంతో కాయితాల గిరాకీ హెచ్చిందని వెనుకటి పుటల్లో చదివారుగదా! అచ్చు ఎలా అభివృద్ధి అయిందనుకున్నారు?

నిజానికి మొహెంజోదడో ముద్రలు పోతపోసి కాల్చిననాడే, అస్సీరియా ఇటుక పుస్తకాలు, అసుర్ బానిపాల్ గ్రంథాలయంలో మట్టి ముద్రల దిమ్మలు కనిపెట్టిననాడే ఒక విధంగా అచ్చు ప్రారంభమైందనుకోవచ్చు. తర్వాత జనం కొయ్యదిమ్మలతోను, మర మేకులతోను, అచ్చువేయడం తెలుసుకొన్నారు. పిదప సీసపు అక్షరాలు తయారుచేయడం కనిపెట్టారు. కొయ్య దిమ్మల అచ్చు మొదట చీనాలోనే ప్రారంభమైంది. అంటే కాయితాలపై కర్ర దిమ్మచ్చుతో అచ్చుకొట్టి పుస్తకాలు తయారు చేయడం చీనావారు కనిపెట్టారన్న మాట. అక్షరాలను తలకిందుగా చెక్కి సిరాపూసి నేడు గుడ్డల అద్దకంలాగే కాయితాలపై అద్దేవారు. ఇలాటి దిమ్మచ్చులతో అచ్చువేయబడిన తొలి చీనా గ్రంథం త్రిపిటకమట.

ఇప్పటికి దాదాపు తొమ్మిదివందల యేళ్ల క్రితం చీనాలో ఒక కమ్మరి లోహంతో ఈలాటి దిమ్మలు చేయవచ్చునని కనిపెట్టాడు. అతడు ఎలా చేశాడనుకున్నారు? మొదట మట్టితో అక్షరాల దిమ్మలుచేసి, ఆవంలో కాల్చాడు. వాటిని ఒక పలకలో బిగించితే అచ్చుకొట్టడం సులభమని భావించాడు. ఒక ఇనుపపళ్లెంలో కరిగే సీసంవంటి లోహం పోతపోసి, దానిపైన ఈకాలిన మట్టి అక్షరాలను జోడించిపెట్టి, కింద మంటపెట్టి కరిగించాడు. లోహం కరగగానే, ఆ మట్టిదిమ్మలను దిగగొట్టాడు. లోహం ఆరిన తర్వాత అవన్నీ బిగుసుకుపోయాయి. వాటిపై కుంచెతో సిరాపూసి అచ్చుకొట్టాడు.

చీనానుంచి యూరోప్ వెళ్ళిన ఈ దిమ్మచ్చు పద్ధతి ఏడువందల ఏళ్ళ క్రితం జర్మనీలో పాకింది. మత గ్రంథాలను ఈ దిమ్మలతో ముద్రిస్తూ బీదలకు పంచిపెట్టేవారు. ఇలా ఈ ముద్రణ వందసంవత్సరాలుగా జర్మనీలో సాగుతూఉండగా, మెయింజో అనే పట్టణంలో ఒక మేధావి పుట్టాడు. ఈయన పేరు జోహన్ జెన్స్‌ఫ్లిష్ గూటెన్‌బెర్గ్. ఈయనకు చిన్నతనంనుంచే చేతిపనులలో ఆసక్తి ఎక్కువ. ఈయనకాలంలో హాలెండ్‌లో లారెన్స్ జాన్స్‌జోన్

కాస్టర్ అనే ఒకవ్యక్తి ఉండేవాడు. ఈయనకుకూడ అచ్చుపనులు చేస్తూ ఉండే వాడు. విడివిడి కర్ర అక్షరాలతో కొట్టేవాడు. అచ్చుపనులు చేయడమంటే ఆకాలంలో శత్రుత్వం కోరుకోవడం అన్నమాట. ఆకాలంలో లేకరుల ప్రాబల్యం ఎక్కువ. వారు తమ వృత్తిపోతుందనే భయంతో ముద్రణ పద్ధతి అంటే మండి పడేవారు. వారికి భయపడి కాస్టర్ రహస్యంగా పుస్తకాలు అచ్చుకొట్టేవాడు. గ్యూటెన్‌బెర్గ ఈ కాస్టర్‌వద్ద చేరి కర్ర అచ్చుపనులు నేర్చుకుని తర్వాత స్వగ్రామమైన మెయింజ్‌కు వచ్చి జోహాన్ ఫాస్టర్ ఆనే స్వర్ణకారునితో కలిసి పెక్కు పుస్తకాలు అచ్చువేశాడు. తర్వాత కొంతకాలానికి గ్యూటెన్ బెర్గ కర్ర అక్షరాలకు మారుగా లోహక్షరాలను తయారుచేసి, అచ్చువేశాడు. ఇదే లోహ క్షరాలతో అచ్చుకునాంది. గ్యూటెన్‌బెర్గ తయారుచేసిన లోహాక్షరాలు చేతివ్రాత అక్షరాలలాగే ఉండేవి. కాని సిధానించి చూస్తే ఎంతో భేదం కనిపించేది. అక్షరాలు విడివిడిగా జిలుగులేక ఉండేవి! చూడండి. అతడు తినుతొలిసారిగా



ముద్రించిన పుస్తకాన్ని చూస్తూ ఎలా మురిసిపోతున్నాడో! తర్వాత ఈ లోహాల ములుకులను అభివృద్ధి పరచినవాడూ పీటర్ షోఫర్ అనే జర్మనీ దేశీయుడే. ఈయన గ్యూటెన్‌బర్గు వద్దపనిచేసినవాడు. అటుపిమ్మట యాభై సంవత్సరాలలోగా యూరప్ అంతటా ముద్రాక్షరశాలలు తామర తంపరగా వ్యాపించాయి. 220 ముద్రాశాలలు పదిహేనవ శతాబ్ది ఆఖరుకు బయలుదేరాయి. గ్యూటెన్‌బర్గు 15 వ శతాబ్ది ప్రారంభంలో జన్మించి దాదాపు ఎనభై సంవత్సరాలు జీవించాడు.

ఆంధ్రదేశంలో ముద్రణ ఎప్పుడు ప్రారంభమైందనుకున్నారు? చాల ఇటీవల. కాని భారతదేశంలో మాత్రం ముద్రణయంత్రం ఇప్పటికి నాలుగు వందల ఏళ్ళక్రితమే - అంటే 1550లోనే స్థాపించబడింది. స్థాపించిన వారెవరో తెలుసా? మనదేశంవారుకారు. బుడతకీచులు. వారు గోవాలో ఈ ముద్రాక్షరశాల పెట్టారు. కాని తర్వాత పది సంవత్సరాలకు గాని మనదేశంలో పుస్తకాలు అచ్చుకాలేదు. అచ్చయిన పుస్తకాలూ మన భాషవి కావు; ఇంగ్లీషువి. అంతకుముందు స్పెయిన్, పోర్చుగల్ దేశాల పాదిరీలు విదేశాలనుంచే మత గ్రంథాలు తెప్పించేవారు. తర్వాత ఇక్కడే వ్రాసి ముద్రించడమే ఉచితమని భావించారు. గోవా అర్చిబిషప్ బాస్టర్ డీలీయో "ది స్పిరిచ్యుయల్ కాంపెండియం ఆఫ్ ది క్రిశ్చియన్ లైఫ్" అనే పుస్తకం ముద్రించాడు. ఇది ముద్రణ అయింది 1560లో. ఇదే మనదేశంలో అచ్చయిన మొదటి పుస్తకం. రెండవ పుస్తకం "డైలాగ్స్ ఆఫ్ ఇండియన్ సింపిల్స్ అండ్ డ్రగ్స్" అనేది. ఇది 1563 లో ముద్రితమైంది.

మరికొన్ని ఇంగ్లీషు పుస్తకాలూ అచ్చయాయి. కాని దీనివల్ల మత వ్యాప్తికి అంత ప్రోత్సాహం కలిగినట్టులేదు. కనుక దేశభాషలలో క్రైస్తవ గ్రంథాలు ముద్రించడం అవసరమని బుడతకీచుపాదిరీలు భావించారు. ఈ విధంగా మొట్టమొదట అచ్చయిన భారతీయగ్రంథం "సెయింట్‌పీటర్ చరిత్ర" ఇది మరాఠీభాషలో రచించినది. భారత భాషలో, భారతదేశంలో ముద్రితమైన మొదటి పుస్తకం ఇదే-1565 లో ముద్రితమైంది. తర్వాత 1577 లోను, 1598 లోను మలబార్ కోస్తాలో మతప్రచారం చేస్తున్న జేసుఇట్ మిషన్‌వారు రెండు తమిళ గ్రంథాలు ముద్రించారు.

ఒకవిధంగా చెన్నరాష్ట్రంలో తమిళంలో ఆ గ్రంథముద్రణ 1577 లోనే ప్రారంభమైనప్పటికీ, చెన్నపురిలో అచ్చు యంత్రాలు స్థాపించడం తర్వాత రెండువందల ఏళ్ళకు. హెన్రీకాటన్ అనే వ్యాపారస్థుడు 184 ఏళ్ళక్రితం- అంటే 1772 లో చెన్నపురిలో అచ్చు యంత్రాలు నెలకొల్పాడు. ఈయనే అంతకు ముప్పైనాలుగు సంవత్సరాల క్రితం లంకాద్వీపంలోను అచ్చు యంత్రాలు పెట్టాడు. ఈ యంత్రాలు పాత యంత్రాలకన్నా చాల మెరుగైనవి. తర్వాత ఆరేళ్ళకు- అంటే 1778 లో కలకత్తాలోను, తర్వాత పధ్నాలుగు సంవత్సరాలకు బొంబాయిలోను అచ్చుయంత్రాలు పెట్టారు. మొదట మన దేశంలో అచ్చయిన తెనుగుపుస్తకం ఏ రామాయణమో, భారతమో, మరొక భారతీయకావ్యమో అనుకుంటారేమో! కాదు. మొదగ అచ్చయినవి, క్రైస్తవ మతప్రబోధకాలయిన చిన్న చిన్న కరపత్రాలు అచ్చయిన మొదటి పుస్తకం తెలుగు వ్యాకరణం. ఇది 1807 లో అచ్చయింది. అటుపిదప అచ్చయిన

పుస్తకం బైబిలు న్యూటెస్టమెంట్. ఇది 1812 లో అచ్చయింది. ఇవన్నీ అచ్చు కావడం తెలుగునాడులో కాదు. వంగదేశంలో-కలకత్తాలో. మెత్తం మీద మన దేశంలోనే.

ఆంగ్లేయుల పాలన అప్పుడప్పుడే బలపడుతున్న రోజులవి. దేశభాషలు నేర్చుకుని పరిపాలన కట్టుదిట్టంగా సాగించాలనే భావం పరిపాలకులకు కలిగింది. వారు దేశభాషలెలా నేర్చుకోవాలి? వారికి సులభంగా తెలిసే వాచకాలు, వ్యాకరణాలు కావలసి వచ్చాయి. మరొకవైపు క్రీస్తు మతబోధకులు తమ మతం ప్రచారం చేయదలచారు. దానికి పుస్తకాలు అవసరమయాయి. తమ మత గ్రంధాలు దేశభాషలలో అచ్చువేయించడం ఉచితమనే భావం కలిగింది. కనుక కలకత్తా సమీపంలోని శ్రీరామ్‌పూర్ అనే ప్రాంతంలో ఇప్పటికి రెండువందల ఏళ్ల క్రితం-అంటే 1746 లో ఇంగ్లీషు పాదిరీలు ఒక మతప్రచార సంస్థను ఏర్పాటు చేశారు. దానిని శ్రీరామ్‌పూర్ మిషన్ అనేవారు. ఈ మిషన్‌లోని ప్రచారకులలో ముఖ్యులు డాక్టర్ మార్షమన్, డాక్టర్ క్యారీ. డాక్టర్ వార్డు అనే పాదిరీలు. వీరు తెనుగు, నాగరి, తమిళు, కన్నడం మున్నగు ఏడెనిమిది భాషల అక్షరాలు పోతపోయించారు. అయినా మొట్టమొదట తెలుగు పుస్తకాలు విదేశాలలోనే అచ్చయేవి. బెంజమిన్ షూల్జ్ (స్కుల్జియస్) అనే పాదిరీ 1746-47 లలో క్రైస్తవమత విషయాలను తర్జుమా చేసి, ప్రష్యాదేశంలోని మాగ్డిబర్గు మండలానికి చేరిన హ్యాలీ అనే పట్టణంలో ముద్రించాడు. ఈయన

దానియొక్క ఆశీర్వాదంగ వుండ్దండ్ని
వుపద్రవం అనుభవించ్ర్యందండ్లె దు
వాంఉ దానియొక్క సహాయముంత్తె
శ్రీంచ్ర్యె వాంఉంప్తె బయింకేమటునం
వుండ్డండ్ని

నాగు కప్తిక ౨బమయిక ర్తిచ్ర్యెవ
దా ఆశాకానె తగిన దుఖకాంత్తెన
ఆత్మకు కొంచెపడెటందుకు చెప్పాల
యయ్యెక వాగాంకంట్ల విహాయొక్క శ్రీ
మంచ్ర్యదిగో వుండిగాను నాయొ
ఆత్మ విహాయొక్క ప్రియం కప్తిక తెంటు వ
నాంప్తె రాహాయ్యలోకంయొక్క బప
౨ంప్తె ౨త్తె శపురియొక్క పంత్తెహాహాంప్తె
విహాదయయొక్క యంప్తుటాంప్తె గా
బింద్ర్యెటందుకుంన్ను నాయొక్క మెహా
గంభీరంచయకెవికెలబొాత దెవ
ంవాల హాగదెదనెది ఇతె

"సత్యమైన వేదంలో ఉండే జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం" "మోక్షానికి కొంచుపొయ్యే దోవ" మొదలయిన ఐదు పుస్తకాలు వ్రాశారు. ఇవి శ్రీ రామ్ పూర్ మిషన్ కళాశాల గ్రంథాలయంలో నేడు భద్రంగా ఉన్నవి. వాటిలో ఒక దాని చివరిపుట వెనుకటి పుటలో చూడండి.

బెంజమిన్ షూల్జ్ వ్రాసినవి ప్రార్థనలు, క్రైస్తవ విధులు తెలిపే బైబిలు సారాంశం మాత్రమే. కనుక శ్రీ రామ్‌పూర్ మిషన్‌వారు బైబిలునే వివిధ రాష్ట్రభాషలలో తర్జుమా చేయించి అచ్చు వేయించ దలచారు. నాగరి మొదలయిన లిపులు తయారుచేయించారు. 1804 లో వీరు నాగరి లిపిలో హితోపదేశమనే పుస్తకం అచ్చు వేయించారు. సంస్కృతంలో మొదటి అచ్చుపుస్తకం ఇదే.

ఈ ముద్రణ పరిశ్రమను అప్పటి భారత ప్రభుత్వం బాగా ప్రోత్సహించింది. అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్‌మింటో, ఆయన మంత్రులలో ఒక్కరైన ఎడ్మాన్-స్టన్ ముద్రణ పరిశ్రమకు చాల సహాయపడ్డారు. డాక్టర్ క్యారీ శ్రీరామ్‌పూర్ కళాశాలలో ఉపాధ్యాయుడుగా ఉంటూ పండితులను ప్రత్యేకంగా రప్పించుకొని తెనుగు నేర్చుకొని, తెనుగు వ్యాకరణం రచించారు. బైబిలు-న్యూటెస్టమెంట్-తెనుగు తర్జుమా చేశారు. తెనుగులో అచ్చు అక్షరాలను కూడ కొత్త పద్ధతిని తయారుచేశారు. ఈ అక్షరాలతో వ్యాకరణాన్ని, "దేవునియొక్క సమస్తమైన వాక్యము" అనే పేరుతో న్యూటెస్టమెంటును ముద్రించారు. ఈ వ్యాకరణం 1807 లో ముద్రితమైంది; రెండవది 1812 లో. ఇవి శ్రీరామ్‌పూర్‌లో అచ్చయాయి.

డాక్టర్ క్యారీ తర్వాత చెన్నపురి, విశాఖపట్టణం, బళ్ళారి పట్టణాలకు మత ప్రచారకులను పంపి, ముద్రణ శాలలు నెలకొల్పారు. పిదప 1817 లో సి.పి. బ్రౌన్‌గారు తెనుగు వ్యాకరణం వ్రాసి దానికి ఉదాహరణంగా పంచతంత్ర కథలు సరళమైన వచనంగా ఇచ్చారు. ఇది దాని మొదటిపుట.

ఉపాయముచేత|సాధింపతగినదో|అదిపరాక్రమముచేత సాధింపతగనిదికా
దు|ఏలాగంటే చెట్టుమీదకాకిగుడ్లుపెట్టినప్పుడల్లా|ఆకింద పుట్టలో వుండేకృష్ణసర్పం తిని
పోతూవుండేది|యీశత్రువిరోధంయేలాగునివర్తింపస్తుందాఅని కాకిఆలోచన
చేసుకుంటూవుంది|వకరోజున ఆ దేశపురాజభార్యస్నానం చెయ్యబోయేటప్పు
డు|తనసొమ్ములుయావత్తూతీసి అక్కడవుంచిన సమయంలో|అందులో వొకబంగార
పునాను ముక్కున కరుచుకునిపోతూవున్నంతల్లో|ఆమెకావలివాండ్లుచూచి వెం
టనాదా వెళ్లిన మీదట వాండ్లుచూస్తూవుండగా|ఆపుట్టలో వేసినది||అంతట వాం
డ్లుఆపుట్టత్రవ్వించినంతల్లో|ఆపాముకనుపించినందున|దాన్నిచంపి|ఆనాను పట్టు
కునిపోయి|రాజభార్యకుయిచ్చినారు||

రెండు అచ్చుపత్రాలూ చూచారుగదా! మార్జ్ పుస్తకం అచ్చయిన తర్వాత డెబ్బై సంవత్సరాలకు అచ్చు ఎంత అభివృద్ధి పొందిందో! మొదటి అచ్చులో పేరాగ్రాపులు ఉన్నా, విరామ చిహ్నాలు లేవు. ఒకే రోకటిపాట. బ్రౌనుగారి పుస్తకంలో కామాలకు బదులు ఒంటి నిలువుగీత, ఫుల్‌స్టాపుకు రెండు నిలువు గీతలు ఉన్నాయి చూడండి.

ఇలా రెండు వందల సంవత్సరాల క్రితం ఆరంభమైన తెనుగుముద్రణం నేడు చాల అభివృద్ధి పొందింది. అభివృద్ధి అంటే సామాన్యమైన అభివృద్ధి కాదు. లోహాక్షరాలు చేత్తో పేర్చుకొనే అవసరం లేకనే, ఇంగ్లీషులోలాగ మోనోటైప్ యంత్రాలతో టైప్‌లాగ కొట్టేవరకు అభివృద్ధి పొందింది. దీనిలో కొన్ని అక్షరాల ఆకారాలు కూడ మారాయి. కొన్ని జారిపోయాయి. ముందు అచ్చు ఇంకా ఎంత అభివృద్ధి చెందుతుందో!

నవమ ప్రకరణం

# పుస్తకాల భాగ్యా భాగ్యాలు

"....పురుషస్యభాగ్యం దేవో నజానాతి కుతో మనుష్యః" అన్నారు పెద్దలు. మనుష్యుల విషయంలోనే కాదు; పుస్తకాలభాగ్యంకూడ యింతే. "ప్రతి పుస్తకానికి, భాగ్యాభాగ్యాలు ఉంటాయి" అని లాటిన్‌లో ఒక్కనానుడి ఉంది. మనుష్యుల భాగ్యంకంటే పుస్తకాల భాగ్యం మరీ విచిత్రంగా ఉంటుంది. ఆ మధ్యన కొందరు పరిశోధకులు ఏదో తవ్వుతుండగా, కొన్ని భోషాణాల వంటివి దొరికాయి. వాటిలో భద్రంగా పెట్టిన వందలకొలది భూర్జ పత్ర గ్రంథాలు, పాత పత్రికాయితాల గ్రంథాలు దొరికాయి. మన ప్రాచీనులు ఏవైనా అనాహూతాలు ఏర్పడినప్పుడు తమ పుస్తకాలు పాడయిపోకుండా భూమిలో భద్రంగా దాచిపెట్టేవారు. అవి అపాత్రుల చేతుల్లోపడి ధ్వంసం కాకుండాఉందనీ! ఏ పుణ్యాత్ముని చేతుల్లోనన్నా పడనీ! వారు ఉపయోగించు కోనీ! అని వారి ఉద్దేశం. బౌద్ధగ్రంథాలు చాలవరకు ఈ విధంగా దొరికినవే. పెక్కు శాసనాలు కూడ ఈ విధంగా దొరికినవే.

పుస్తకాలు సరస్వతీ స్వరూపాలు గనుక, తాటాకులు విరిగిపోయినా మన పూర్వులు కాల్చివేసేవారు కారు. ఆ ముక్కలను కట్టకట్టి గంగార్పణం చేసేవారు. ఆ విధంగా కొట్టుకువచ్చి మనకు దొరికినవి కూడ చాలా ఉన్నాయి.

గ్రీకు కవి ఆల్క్‌మన్ రచనలన్నీ పాతిపెట్టగా దొరికినవే. ఈయన



వ్రాసిన పెపైరస్ చుట్టలను అప్పటివారు పూడ్చిపెట్టారు. ఈ విధంగా పూడ్చి పెట్టకపోయివుంటే, అవి మనకు దక్కేవేకావేమో! ప్రాచీనకాలంలో ఈజిప్టు వారిలో ఒకవింత ఆచారం ఉండేది. ఎవరైనా చనిపోతే, ఆ శవాన్ని ద్రావకాలు,

సుగంధతైలాలు పూసి దానితోపాటే ఆ వ్యక్తికి సంబంధించిన పెపైరస్‌కాయితాలు, పుస్తకాలు, తదితరవస్తువులు అన్నీ పూడ్చిపెట్టేవారు. ఈ విధంగా పూడ్చిపెట్టిన శవాన్ని "మమ్మీ" అనేవారు. మమ్మీ అనేమాట మోమాయి అనే పదంనుంచి వచ్చింది. ఈమాట అర్థం తేనె, తేనెమైనం అని. మొదట్లో ఈ శవాలకు తేనె, తేనెమైనం పూసేవారట. తర్వాత ద్రావకాలు కనిపెట్టుకున్నారు. వేల సంవత్సరాలక్రితం మరణించిన ఈజిప్టువారి గ్రంథాలన్నీ ఈలాటి మమ్మీల మీద సమాధుల్లో దొరికినవే.

పెద్దపెద్ద గ్రంథాలయాలలో లేని అరుదైన పుస్తకాలు ఎన్నో ఈజిప్టులో సమాధుల్లో దొరికాయి. అలెగ్జాండ్రియా నగరంలో పెద్ద గ్రంథాలయం ఉండేది. జూలియస్ సీజర్ సైన్యాలు అలెగ్జాండ్రియాను పట్టుకొన్నప్పుడు ఈ గ్రంథాలయాన్ని కాల్చివేశాయి. కాలిపోయిన ఆ పెపైరస్ చుట్టల్లో ఎన్ని అపూర్వ గ్రంథాలు ఉండేవో! అన్నీ కాలిపోయాయి. నేడు ప్రపంచానికి దక్కిందల్లా ఈ గ్రంథాలయంలో ఉన్న గ్రంథాల జాబితామాత్రమే. పాఠకులను, శ్రోతలను నవ్వించి, కవ్వించి, బేలించి, లాలించి, ఏడ్పించి, మోడ్పించి ఆనందింపజేసే గ్రంథాల పేర్లుమాత్రమే మిగిలాయి. సమాధులపైన, స్తూపాలపైన చెక్కిన మనుష్యుల పేర్లలాగ.



మనదేశంలో కులమత ద్వేషాలవల్ల ఒక మతంవారి పుస్తకాలు మరొకరు కాల్చివేయడం తరచు ఉండేది. బౌద్ధులు వ్రాసిన గ్రంథాలలో అమరకోశంవంటివి మినహా పెక్కు బౌద్ధ గ్రంథాలను పూర్వం కొందరు అన్యమతస్థులు కాల్చివేశారట. వాదంలో ఒక మతంవారు మరొక మతం వారికి ఓడి

పోతే మత గ్రంథాలన్నిటినీ కాల్చివేసి విజేతలకు శిష్యులయ్యేవారు. సరే ! మన ఆదికవి నన్నయ్య తనకు ముందున్న జైన గ్రంథాలను కాల్పించివేశా డనే అపవాదు ఉండనేఉందికదా ! కనుకనే బౌద్ధులు, జైనులు తమ గ్రంథా లను ధ్వంసంకాకుండా పూడ్చిపెట్టేవారు. బౌద్ధులంతా తమ స్తూపాలను, విహా రాలనుకూడ మట్టిదిబ్బలలో పూడ్చిపెట్టేవారు. వాటిని తవ్వితే అపూర్వ వస్తు వులు, కట్టడాలు బైటపడడం నేడు చూస్తూనే ఉన్నాము.

కొన్ని పుస్తకాల భాగ్యం మరీ అపురూపంగా ఉంటుంది. వాటిని ధ్వంసం చేయడానికి ఎంత ప్రయత్నించినా తప్పించుకుపోయి తమాషాగా దొరి కాయి. ధ్వంసంచేయడమంటే పుస్తకాలను పాడుచేయడంకాదులెండి ! వాటి వ్రాతలను పాడుచేయడంమాత్రమే. ఇలాటిది పాతకాలపు పత్తి కాయితాలలో ఎక్కువగా కనిపిస్తుంది. కాయితాలను పాడుచేయడం ఇష్టంఉండదు. దానిపైనే మరొక పల్చని కాయితం అతికించిగాని, తెల్లటి రంగుపూసి కాని వ్రాసేవారు. దీనితో అంతకుముందున్న గ్రంథం తుడుచుకుపోయినట్టేకదా !

దేవాలయాల గోడలమీది చిత్రాలలో ఇలాటిది మరీ యెక్కువ. ఒక రాజు కాలంలో వ్రాయించిన బొమ్మలు తర్వాతిరాజుకు ఇష్టంలేదనుకోండి ! వాటిపై సున్నమో, మరొకరంగో పూయించి వేరే చిత్రాలు వ్రాయించేవారు. ఈలాగే మూడునాలుగుపొరల చిత్రాలు అయ్యేవి. ఈలాటివి తంజావూరు బృహ దీశ్వరాలయంలోను, కంచి దేవాలయాలలోను కనిపిస్తాయి. ఇలాటి పొరల పొరల చిత్రాలున్నట్టు ఎలా తెలిసింది ? గోడమీద పెచ్చులు రాలిపోయి ఏవో బొమ్మల గుర్తులుకనిపించినప్పుడు పండితులు ఆశ్చర్యపడి, పరిశీలించి జాగ్రత్తగా అలాటి పెచ్చులు తీయించి భద్రపరచారు.

విదేశాలలో చర్మపుస్తకాలు చాల ప్రియంగా ఉన్న రోజులలోనే లేఖ కులు పాతవ్రాతలను చాకులతో గోకివేసి, వాటిపైన తనకు ఇష్టమైనవాటిని- ఏ మహాత్ముల చరిత్రో, మరొకటో - వ్రాసుకొనేవారు. ఈ గోకివేయడంలో నిపుణులు ఉండేవారు. ఈలాటి గ్రంథాలరక్షణకు, కొత్తపద్ధతి తెలిసి ఉండక పోతే అవి దక్కేవికావు. ఈ విధంగా ధ్వంసమైన పుస్తకాలను "ప్యాలింప్ సెట్స్" అంటారు.

చర్మపుస్తకాలలో సిరా బాగా ఇంకిపోయి ఉంటుంది. ఎంతగా గోకి వేసినా వ్రాతగుర్తులన్నీ పోయేవికావు. ఇలా గోకివేసిన చర్మపుకాయితాలను కొన్ని రసాయనద్రవాలలో నానబెడితే గోకివేసిన వ్రాత లీలగా పైకి కనిపి స్తుంది. కాని ఈ నానబెట్టడంలో ఒక ప్రమాదంఉంది. నానబెట్టిన తర్వాత క్రమంగా చర్మం నల్లబారి కనిపించిన మొదటి వ్రాతమాత్రమే కాక ఉన్న

వ్రాతకూడ మంకుపట్టినట్టు అయ్యేది. కనుక చదవడానికి వీలయ్యేదికాదు. ఇలా రెండు మూడుసార్లు చచ్చిబ్రతికిన చర్మపుస్తకాలు పాశ్చాత్యదేశాలలోని గ్రంథాలయాలలో ఉన్నాయి. ఈలాటిబాధలు అవసరంలేకనే మరుగైనవ్రాతను కనుగొనడానికి కొంతకాలం క్రితం ఒక రసాయనద్రవ్యం కనిపెట్టారు. ఇది చర్మపు కాయితానికి పూయగానే గోకివేసిన వ్రాత కొంచెంసేపు కనిపిస్తుంది. వెంటనే దానిని ఫొటోతీసి రసాయనద్రవ్యం కడిగి వేస్తారు. ఇటీవల ఇంకా మంచి పద్ధతి కనుగొన్నారట - ఎలాటి రసాయనద్రవ్యంతో నిమిత్తంలేకనే, పూయకనే ఫొటో తీస్తారట.

పుస్తకాలకు శత్రువులున్నట్లే మిత్రులు కూడ ఉన్నారు. పుస్తకాలంటే అన్నిరకాల వ్రాతలూనన్నమాట. ఈ పుస్తకమిత్రులు సమాధులు, విహారాలు, మఠాలు, శిథిలాలు వెదికి వాటిని సంపాదించి, భద్రపరచి మనకు అందిస్తారు. ఇలాటివారి కథలు వింతగా ఉంటాయి. ఇలాటివారిలో మనకు చిరస్మరణీయులు వెంకటరావు, నారాయణరావు. వీరు బహుభాషావేత్తలు, బహు లిపివేత్తలు, నూటయాభైఏండ్ల క్రితం వీరు అప్పటి సర్వేయరు జనరల్‌గా ఉన్న కర్నల్ కాలన్ మెకంజీ వద్ద ఉద్యోగులు. వీరిద్దరూ దక్షిణాపథమంతటా తిరిగి పెక్కుశాసనాలు, తాళపత్ర గ్రంథాలు సేకరించకపోయి ఉంటే ప్రపంచంలోనే పెద్దదిగా నేడున్న మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయం వంటిది పుట్టేదేకాదు.

భాసమహాకవి నాటకాలు మనకు దక్కిన పద్ధతీ ఇలాంటిదే. భాస నాటకాలనుగూర్చి మన సాహిత్యంలో కాళిదాసునికాలంనుంచి ప్రశంస కనిపిస్తుంది. కాని, అప్పుడెప్పుడో దాదాపు రెండువేల సంవత్సరాలనాడు వ్రాసినా ఇంతకాలమూ ఎవరికీ దొరకక ఒకతరంక్రితం మనకాలంలో దొరకాలంటే ఎవరి భాగ్యమంటారు ? నాటకాలదా ? వాటిని కనిపెట్టినవారిదా ? మనదా ? ముగ్గురిదీని. ఆ నాటకాలు కేరళంలో గణపతిశాస్త్రి అనేవారు ఏవో చెత్త చెదారం గాలిస్తుండగా దొరికాయి. ఇలాటివి దొరికాయంటే, మొదట ఎవరూ నమ్మలేదు. తర్వాత తర్వాత నమ్మారు.

ఇరవైయయిదు సంవత్సరాలక్రితం ఇంతకన్నా విచిత్రమైన సంగతి మన తెలుగుదేశంలో జరిగింది. మరెక్కడోకాదు, తిరుమలమీద. తిరుమలమీద వేంకటేశ్వరుని సన్నిధిలో అన్నమాచార్యుల సంకీర్తన భండాగారమనేది ఉంది.



దీనిని అక్కడివారు తాళ్ళపాక అర అనికూడ అంటారు. అన్నమాచార్యులు ఎవరో మీకు ఇదివరకే తెలుసు. ఈయన, ఈయనకుమారుడు పెద తిరుమలాచార్యులు కొన్నివేల కీర్తనలు రచించి ఏనాటికానాడు రాగిరేకులపై చెక్కించేవారట. ఒక్క అన్నమాచార్యులే ముప్ఫయివేల కీర్తనలు రచించారట. ఆ రాగిరేకులలో కొన్నివందలుమాత్రమే ఆదివరకు దొరికాయి. సంకీర్తన భండాగారంలో రేకులున్నాయని అందరూ చెప్పడమేకాని, దానిలోకి ఎవరూ వెళ్ళి చూచినవారు కారు. ఎలా వెళ్ళుతారు ? అదొక గుహలాగ, పాడుపడిన బావిలాగ కనిపించేది. ముందు వెనుక చూడక ప్రవేశిస్తే లోపల పాములే ఉన్నాయో, తేళ్లే ఉన్నాయో ! ఎవరు ధైర్యంచేసి వెళ్లుతారు ? సాహిత్యంకన్నా రసవంతమైంది జీవితంకదా !

అట్టి సాహసం ఒకరు చేశారు. ఆయన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. ఆయన తిరుపతిలో పనిచేస్తున్నప్పుడు శిష్యవర్గంతో కొండమీదికి వెళ్ళి, సంకీర్తన భండాగారాన్ని గాలించాలని నిర్ణయించుకున్నారు. సాహసులైన కొందరు శిష్యులతో సంకీర్తన భండాగారం చేరి, టార్చిలైట్లతోను, దివిటీలతోను వెలిగించి చూచారు. లోపల గాఢాంధకారం, గబ్బిలాల కంపు దుమ్ము, చెత్తచెదారం కప్పిన దిబ్బలలాంటివి కనిపించాయి లీలగా. ఒకరిద్దరు శిష్యులను లోపలికి వెళ్ళి గాలించి రమ్మని ఆజ్ఞాపించాడు ఆయన. చూచిరమ్మంటే కాల్చివచ్చేరకం శిష్యులు ! శ్రీ అర్చకం శ్రీనివాసాచార్యులనే ఒక శిష్యుడు మొదట ఆ అరలో దూరి, బావిలోపడిన వస్తువులను తీయడానికి నీటిలో మునిగినవాడు గుక్క తిప్పు కోకుండా లోపలివస్తువులను జవురుకొని పైకి తేలినట్టు, చేతికి దొరికిందల్లా జవురుకొని బయటపడేవాడు. రెండుమూడుసార్లు ఇలాజవురుకొని వచ్చాడు. కొన్నివేల పదాలున్న ఎన్నో రేకులు వచ్చిపడ్డాయి. ఈ శిష్యగణం సాహసించక పోయి ఉంటే, ఈ రేకులు ఇంకా ఎన్నివందల ఏళ్ళపాటు ఆ అరలోనే గబ్బిలాలతో కాపురం చేసేవో !

సరిగ్గా ఇలాటిదే ఇటలీలోని వెరోనానగరంలో ప్రాచీన గ్రంథాలయం బయటపడిన గాథకూడాను. దీనిని కనుగొన్నవాడు సిపియో మ్యాఫీ అనే పండితుడు. వెరోనాలో ఒక గ్రంథాలయం ఉందని. దానిలో అమూల్యమైన లాటిన్ పుస్తకాలు ఉన్నవని మాత్రమే అంతకుముందు యాత్రికులు వ్రాసిపెట్టిన



యాదాస్తులనుంచి తెలుసు. మ్యాఫీకి ముందు ఇద్దరు గొప్పపండితులు ఈ గ్రంథాలయం కోసం ఎంతగానో గాలించారు. కాని వారి ప్రయత్నాలు ఫలించలేదు. ఈ సంగతి మ్యాఫీకికూడ తెలుసు. అయినా, పట్టుదలతో వెదకడానికి పూనుకున్నాడు. ఈయన గొప్ప అక్షరశాస్త్రజ్ఞుడు కాకపోయినా లిఖితపుస్తకాలు బాగా చదవగలడు. తనకు ముందు పండితులు వెదికి వేసారినచోటే వెదికాడు. ముందు పండితులు విసుగెత్తి విడిచిపోయిన వెరోనాలోని మఠంలోనే ఈ గ్రంథాలయం దొరికింది. మ్యాఫీకి ఇంత సులువుగా కనిపించిన గ్రంథాలయం అంతకుముందు వెదికినవారికి ఎందుకు కనిపించలేదని అనుమానిస్తారేమో! ఈ గ్రంథాలన్నీ మామూలుగా వాటినిపెట్టే సొరుగుల్లోలేవు. అంతకుముందు వెదికినవారంతా గ్రంథాలయం సొరుగులకు అనించిన కర్రెనిచ్చెనని ఎక్కినపాపాన పోలేదు. అది ఎక్కి సొరుగులపైభాగం చూద్దామన్నమాటే వారికి తట్టలేదు. ఇంతకూ ఆ పుస్తకాలు సొరుగులో ఉండక, సొరుగులమీద బూజుపట్టి పడి ఉంటాయని ఎవరనుకుంటారు? ఈ నిచ్చెన ఎక్కి చూద్దామని మ్యాఫీకి తోచింది; ఎక్కిచూచాడు. పెపైరస్ కవిలె కట్టలు! ఆశ్చర్యంతో లాక్కొని దుమ్ము దులిపిచూచాడు, అన్నీ లాటిన్‌గ్రంథాలే. ఆనందపారవశ్యంతో మూర్ఛపడినంత పనయింది.

పుస్తకాలు పూడ్చిపెట్టడమంటే వీరబ్రహ్మంగారి కథ చెప్పడం మరచాను ఆయన పెద్ద సంస్కర్త. హిందూ, ముస్లిం సామరస్యంకోసం పాటుపడి రామ్, రహీం ఒక్కరేనని చాటినవారు. ఇలా చేస్తుండగా బనగానపల్లిలో శత్రువర్గం ఏర్పడింది. అక్కడ ఉండడం సాధ్యంకాలేదు. తాను రచించిన పెక్కుగ్రంథాలు ఒక్కచోట పూడ్చిపెట్టి బనగానపల్లి వదలి కడపజిల్లాకు వచ్చారు. నిర్యాణసమయంలో ఫలానాచోట తాను గ్రంథాలు పూడ్చిపెట్టినట్టు శిష్యులకు చెప్పారు. ఆ శిష్యులు అక్కడ తవ్వగా పెక్కుగ్రంథాలు దొరికాయి. వాటిలో ఒకటి కాలజ్ఞానమనే ఉద్గ్రంథం: దీనిలో ప్రపంచ భవిష్యత్తంతా ఉందని బ్రహ్మంగారి శిష్యుల విశ్వాసం.

మరొకనాడు మీకు పుస్తకాల పయనం, మతోద్రేకానికి పుస్తకాల ఆహుతి, విహారాలలో, గురుకులాలలో, మఠాలలో పుస్తకాలమాయం, యుద్ధాలలో పుస్తకాల ఖైదు-ఇలాటి సంగతులు చెబుతాను.

ఎంత చెప్పినా అంతులేని వింతైనలిపిని గూర్చి ఇంతకన్నా ఎక్కువ చెప్పలేకపోయాననే అనే విచారంతో ఈ పుస్తకం ముగిస్తున్నాను.

## అ ను బం ధ ము

# సంస్కరణకు సూచనలు

ఇది యంత్ర యుగం. అన్ని యంత్రాలతోపాటు ముద్రణ యంత్రం కూడ ఎంతో అభివృద్ధి చెందింది. కాని తెనుగు ముద్రణ మాత్రం అంతేమీ ముందుకు పోలేదనవచ్చు. ప్రపంచంలోని అన్ని భాషల ముద్రణ ఒకఎత్తు, తెనుగు ముద్రణే ఒక ఎత్తు. ఇదొక గారడీ. తెనుగు అక్షరాలు కూర్చడానికి కంపోజిటరు 700 దిమ్మలు, గళ్ళు జ్ఞాపకం వుంచుకోవాలి. ప్రతి కంపోజిటరు శతావధాని, సహస్రావధాని కావలసివుంటుంది. ఈ చిక్కును తొలగించుకొనడానికి ఏ రోమన్ లిపినో అనుసరిస్తే అచ్చు సౌకర్యం కలుగుతుందనుకుంటే అనూచానంగా వచ్చిన ఈ లిపిని వదులుకోడం ఎలా? ఇక అచ్చు స్వరూపం మార్చుకోడంఅన్నా కష్టం. ఈ సంకేతానికి ఈ అక్షర ధ్వని-అని అలవాటు పడ్డాము. కొత్త స్వరూపాలు తెలుసుకోడానికి కొన్నితరాలు పడుతుంది. పూర్వం ఉన్న అక్షరాలు ఇప్పుడున్నాయా? మారుతూనే వచ్చాయిగదా! మరి మార్పులకు ఒప్పుకొనక పోవడమేమిటి?- అనవచ్చు. ఏదైనా క్రమ పరిణామం అయితేనే జనం ఇష్టపడుతుందిగాని, అకస్మాత్తుగా మార్పులుచేస్తే ఒప్పుకోదు. సంస్కరణ ఫలితం కూడ ఉండదు.

ఈ చిక్కు తొలగించడానికి పలువురు పండితులు లిపి సంస్కరణలు సూచించారు. కాని, ఆ సంస్కరణలు ముద్రణ దృష్టితోను, టైపురైటరు దృష్టితోను ఉత్తమమైనవి కావు. ఇప్పటి లిపి స్వరూపం చెడకూడదు. ముద్రణలలోను, టైపురైటింగులోను త్వరితగతి ఉండాలి. ఈ ఆలోచనతో శ్రీ మద్దాలి రాఘవ రామచంద్రరావుగారు ఉత్తమమైన సూచనలు చేశారు. వాటిని వారి మాటలతోనే తెలుపుతాను.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | | |
| ఎ | ఏ | ఐ | ఒ | ఓ | ఔ | | |
| క్ | క | కా | కి | కీ | కె | కే | ్క |
| ఖ్ | ఖ | ఖా | ఖి | ఖీ | ఖె | ఖే | ్ఖ |
| గ్ | గ | గా | గి | గీ | గె | గే | ్గ |
| జ్ | జ | జా | జి | జీ | జె | జే | ్జ |
| చ్ | చ | చా | చి | చీ | చె | చే | ్చ |
| ఛ్ | ఛ | ఛా | ఛి | ఛీ | ఛె | ఛే | ్ఛ |
| ఝ్ | ఝ | ఝా | ఝి | ఝీ | ఝె | ఝే | ్ఝ |
| ఘ్ | ఘ | ఘా | ఘి | ఘీ | ఘె | ఘే | ్ఘ |
| ట్ | ట | టా | టి | టీ | టె | టే | ్ట |
| ఠ్ | ఠ | ఠా | ఠి | ఠీ | ఠె | ఠే | ్ఠ |
| డ్ | డ | డా | డి | డీ | డె | డే | ్డ |
| ఢ్ | ఢ | ఢా | ఢి | ఢీ | ఢె | ఢే | ్ఢ |
| ణ్ | ణ | ణా | ణి | ణీ | ణె | ణే | ్ణ |
| త్ | త | తా | తి | తీ | తె | తే | ్త |
| ద్ | ద | దా | ది | దీ | దె | దే | ్ద |
| ధ్ | ధ | ధా | ధి | ధీ | ధె | ధే | ్ధ |
| న్ | న | నా | ని | నీ | నె | నే | ్న |

"మన తెలుగు కంపోజింగ్ గళ్ళల్లో దాదాపు 700 దిమ్మలున్నాయి. వీటిని తగ్గించవలెనంటే లిపిని చాలవరకు మార్చుకోడం గాని, వాటిని ముక్కలు ముక్కలుచేసి కూర్పులో తిరిగి అతుకుకోవటంగాని అవసరం. లిపిని మార్చుకోవడం అంటే చాలమందికి నచ్చదు. కాబట్టి రెండవ పద్ధతే అనుసరణీయం. గళ్ళు తగ్గించడంవల్ల రెండు ఉపయోగాలున్నాయి. ప్రింటింగ్ ప్రెస్ పెట్టేవారు అచ్చులు కావలసి వచ్చినప్పుడు పౌన్లలెక్కను కొంటారు. కాబట్టి అవసరంలేని దిమ్మలు తూకంలో ఎక్కువగా రావచ్చు. ఇది లేకుండా చేయాలంటే ఏదో సాధనం ఆలోచించాలి. ఏ అక్షరం పూర్తి స్వరూపాన్నైనా అనేక ముక్కలుగా చేసి తిరిగి ఆ ముక్కలను అదే క్రమంలో అతికినప్పుడు దాని పూర్తిస్వరూపం అలాగే ఉంటుంది. ఈ పద్ధతిలో మన తెలుగు అక్షరాలను అనేకభాగాలుగా విడగొట్టవచ్చు. అయినప్పటికి కంపోజ్ చేసేటప్పుడు వేగంలో మొప్పం రాకూడదు. అక్షరాల దిమ్మల సంఖ్య తక్కువైనప్పుడు అచ్చులు కూర్చేవారికి ఎక్కువ ప్రదేశాన్ని ఉపయోగించవలసిన అవసరం తప్పుతుంది. కాబట్టి వేగంకూడా ఎక్కువవుతుంది.

"మన తెలుగులో సాధారణంగా ఎక్కువగా వచ్చేవి తలకట్టు గల అక్షరాలు. ఒక్క కన్నడం తప్పించి దాదాపు ఇండియాలోని లిపులలో ఇతర అచ్చు గుర్తులను వ్రాయవలసివచ్చినప్పుడు తలకట్టుగల అక్షరానికే జేర్చడం జరుగుతుంది. తెలుగులో కూడా ఇదే పద్ధతిని అనుసరించవలెనని అనేకమంది అనేకమైన సూచనఇచ్చారు. కాని అవన్నీ ప్రజలలో ఎక్కువమంది హర్షించనికారణం

ప్ ప పా పి పీ పె పే

ఫ్ ఫ ఫా ఫి ఫీ ఫె ఫే

బ్ బ బా బి బీ బె బే

భ్ భ భా భి భీ భె భే

య్ య యా యే

ర్ ర రా రి రీ రె రే

ల్ ల లా లి లీ లె లే

వ్ వ వా వి వీ వె వే

శ్ శ శా శి శీ శె శే

ష్ ష షా షి షీ షె షే

స్ స సా సి సీ సె సే

హ్ హ హా హి హీ హె హే

ళ్ ళ ళా ళి ళీ ళె ళే

ఱ్ ఱ ఱా ఱి ఱీ ఱె ఱే

క్ష్ క్ష క్షా క్షి క్షీ క్షె క్షే

ఝు ఝూ పు పూ ఫు ఫూ

వు వూ

ం ః

చేత అక్షర స్వరూపం చెడకుండా వ్రాతలోకాని, నేటి అచ్చులోకాని స్వరూపాలకు దగ్గర సంబంధ ముండేలాగ అచ్చు దిమ్మలను సూచించాను. దీనివల్ల కలిగిన మార్పు ప్రజలు గుర్తించ లేరు కూడా. పెట్టుబడి పెట్టడంతక్షుపై అచ్చుల కూర్పు వేగంగా జరిగి నప్పుడు పుస్తక ప్రచురణ కూడా సులభమౌతుంది. కాబట్టి ప్రక్కన సూచించిన మార్పులవల్ల ఆ ఆశ యం నెరవేరగలదు. ఇలాచేయడం వల్ల అక్షర ముద్రల సంఖ్య 300 లకు తగ్గుతుంది. ఇవి కాక సంఖ్యలు, విరామపు గుర్తులు కలిపి మొత్తం 350 వరకు అవుతాయి. ఇందులో (ఒత్వము) వ్రాతలో ఉపయోగించేది తీసుకోబడినది. ఈదిమ్మల సంఖ్యను ఇంకా కూడా కుదించవచ్చు. అయినప్పటికి 700 అచ్చు ముద్రలను వేగంలో తేడా రాకుండా తగ్గించటం, లిపి స్వరూపం చెడకుండా వుండడం ముఖ్యంగా ముద్రణ సంస్థల యజ మానులకు హర్షదాయకమైన విష యమని భావించవచ్చు."

"అక్షరాల పౌనః పున్యం" అనే సూత్రం ఆధారంగా ఈసూచ నను శ్రీ రామచంద్రరావుగారు చేశారు. వీటివల్ల ఇప్పటి అక్షరాల స్వరూపం చెక్కుచెదరదు. ఖరువు సగానికి సగం తగ్గుతుంది, కనుక ఏ విశాలాంధ్ర ప్రచురణాలయం వంటి సంస్థో ఈసూచనలను ఆచ రణలో పెట్టి దారి చూపించవలసి ఉంది.

మీ విజ్ఞాన వికాసాలకు

మంచి పుస్తకాలు చదవండి !

విశాలాంధ్ర బుక్ రీడర్స్ క్లబ్బులో

మెంబరుగా చేరండి ! !

# 20% ప్రత్యేక తగ్గింపు

విశాలాంధ్ర మరియు సోవియట్ పుస్తకాలపై పొందండి.

సభ్యత్వ రుసుం :

సంవత్సరానికి రూ. 10-00   3 సం॥లకు రూ. 20-00

దరఖాస్తు కొరకు మీ సమీపంలోని

**విశాలాంధ్ర బుక్ హౌస్‌లో**

సంప్రదించండి.

లేదా

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, హైదరాబాదు-500 001 కి రాయండి.

---

"చినిగిన చొక్కా అయినా తొడుక్కో

కాని ఓ మంచి పుస్తకం కొనుక్కో"

- కందుకూరి వీరేశలింగం

మన లిపి పుట్టుపూర్వోత్తరాలు —డా॥ తిరుమల రామచంద్ర రావు

## మావద్ద లభించు
## భాష, సాహిత్య, విమర్శ, సిద్ధాంత గ్రంథాలు

| | | |
|---|---|---|
| సాహిత్య తత్వం | ఆర్.వి.ఆర్. | 13.00 |
| గౌతమ వ్యాసములు | పింగళి లక్ష్మీకాంతం | 20.00 |
| నవలా శిల్పం | వల్లంపాటి వెంకటసుబ్బయ్య | 17.00 |
| తెలుగు పత్రికల సాహిత్య సేవ | డా॥ తిరుమల రామచంద్ర | 5.00 |
| ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగములు | డా॥ సి. నారాయణరెడ్డి | 80.00 |
| తాపీ ధర్మారావు జీవితము-రచనలు | డా॥ ఏటుకూరి ప్రసాద్ | 80.00 |
| విజయ విలాసం (హృదయోల్లాసవ్యాఖ్య) | తాపీ ధర్మారావు | 80.00 |
| రచయితా : శిల్పమూ | ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ | 6.00 |
| రాముడికి సీత ఏమవుతుంది | ఆరుద్ర | 12.00 |
| తెలుగు భాషా తత్వము | కొమర్రాజు వేంకట లక్ష్మణరావు | 25.00 |

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞానభవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**
విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం, తిరుపతి,
అనంతపురం, గుంటూరు, హన్మకొండ, కాకినాడ

ISBN : 81-7098-167-0

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-20.

258